# మా బడి

(మధురస్మృతులు)

రచయిత:

శ్రీ తెన్నేటి కోదండరామయ్యాగారు, బి. ఎ.

ప్రతులకు:




అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# మనవి

నేటి విపరీత-విపత్కర ఆర్థికజగత్తులో విఖ్యాత రచనలను పఠించడానికే తీరిక, ఓపిక, కోరిక, లేక కొట్టిమిట్టాడుతున్న ఖ్యాతనామప్రాణులను పనిచెరిపి కూర్చోబెట్టి 'మాబడి' బాపతువారి కుర్రకబుర్లు చెప్పబోతే కానీకల్సిరాని యీవ్యర్థవ్యాపకం ఎవరికానందం, తెలిటల్లో క్షస్సుమని కరశకలరు. కరువుఅంటే ఏరికైనా వెఱపే కాబట్టి, వార్లను దూరాన్ని చూస్తేనే తప్పుకుపోతా.

ఊహాప్రపంచంలో గాలితిరుగుళ్ళ కాలక్షేపంచేస్తూ, కించిత్తు అయినా సాధిస్తూన్నది లేకపోగా, యావత్తు భూభారం తమ భుజస్కంధాలమీదే యున్నట్టుగా, పెద్దెత్తున, సాముదాయిక, సార్వజనీన, జాతీయాంతర్జాతీయ సమస్యాపరిష్కార పర్యాలోచనా నిమగ్నులై, ఎక్కడో పెనామా కాల్వమీదో, డాన్యూబు నదిమీదో, ఎవరిపడవలు నడవాలి, ఉత్తరకొరియన్లు అసలెందుకు 38th పారలల్ దాటాలి అన్న బెంగతో తీరికూర్చుని యిక్కడ మనవూళ్ళో ముఖానికి ముడతలుపైచుకునే భావుకులకు ఈ అల్పవిషయప్రసంగం అప్రస్తుతమని తోచగలదు. నాపై గుడ్లుఱుమగలరు. ఉఱుమంటె నాకెపుడూ బెదురే.

కించిత్తు వేదాంతపరిభాషను ముక్కునకరచి, బ్రహ్మజ్ఞానోపార్జన చేస్తిమన్న భ్రాంతితో, ఎక్కడో ఎత్తుననిల్చి కళారాధనను పిల్లలగోళీకాయలాటగను, సాహిత్యోపాసనను ఉబుసుపోక వేడంబరంగాను జమకట్టేసి, తమకర్థమయ్యే విషయాలను లోతుచాలనివాటిగా మొదట్లోనే విలియావేసి, స్వాతిశయం పెంచుకొని, సహనం చంపుకొని, అన్యకృషిని 'సారమతిం' చూడ నేర్వని సంకుచిత స్వభావులు సైటయితే, దుశ్శకున దోషనివారణార్థం పెనకాళ్ళమీదతగ్గి కాళ్ళుకడుక్కుంటా.

ఉద్యోగానికి పుస్తెకట్టినట్టుగానే సమస్త చరాచరప్రపంచాన్ని విస్మరించి ఏపుస్తకపఠనకీ కాస్త వ్యవధి విడత్రొక్కుకోలేక ఎక్కడా నిన్న రేపు లేని వర్తమానంలో ఉక్కిరిబిక్కిరి అయిపోతో బిగుసుకు పోయిన అథస్మారకుల ఇనప్పెదిమలను కథలు నవ్వించగలవా, కావ్యాలు కవ్వించగలవా, ఆ దుఃఖభాగులకు రచయితలీయగల్గింది ఒక్క బాష్ప కణమే.

పనీలేక, విశ్రాంతీగానక 'వాసరముల్ ద్రోసెడి' జరుగుబడి వింత పురుషుల నిశ్చింతజీవితాలకు, నా రచనరూపేణా చింతఒకటి అంటించి వారి సంతృప్తికి, సాక్షీనడకకు అంతరాయం కల్పించే పాపానికి యెప్పుడూ వడిగట్టలేను.

తరుణవయస్కులైన ప్రేయసీప్రియుల పరిణయకథాశ్రవణ కుతూహాలంతో పెదిమలు తడుపుకొని, చెవులుకోసుకొనే రసికజను లీశృంగార రహితబ్రహ్మచర్యాశ్రమ ప్రసక్తుల కాశాభంగమునొంది, వీటిని నిస్సార నీరసప్రసంగాలుగా ఏప్పరించవచ్చును గాన, వారివద్ద వీటిని విప్ప సాహసింపను.

జీవితసమస్యనందుకుని, పోజుచేసెడిది ఓ ప్రోబ్లం కాని, ఎట్టెంప్టు చేసెడిది ఒక సొల్యూషన్ కాని, లేని సమస్యా రహితమయిన యీ బాల వ్యాసంగాన్ని, గభీరపర్యాలోచనా ప్రౌఢవులయిన శాస్త్రవేత్తలసన్నిధి బెట్ట ధైర్యస్థైర్యాలు చాలవు.

పోనీ, కవి కావాలంటే, కందంకట్టనక్కరలేని యీ కాలంలో బంపర్ క్రాప్పులా పైబడ్డేరుతూన్న బాలకవిపతాలంతో, యేదో అంటీ ముట్టని ప్రసంగమేఅయిన, చంకనెట్టి కదుంద్రొక్కుదామా అంటే, ఇంత వరకు ఒక భావగీతమో, పిట్టకథో వ్రాసి మావీధిసంచికకయినా యిచ్చిన పాపాన్నిపోని అనభ్యస్తుడనైన కారణంగా, క్రొత్తప్రియునివేళ్లలా, సందేహిసూ పడుతోంది అడుగు.

సుఖానికి సుఖం, అర్ధజీవితం పరభాషావ్యామోహంలో గడవబెట్టి తిథివారనక్షత్రాలు యిప్పటికి కుదిరినట్టు తెరయెక్కడంచేత—వయస్సు పైబడ్డకొద్దీ పురుషులకసహ్యం స్త్రీలకు అపహాస్యం అయ్యే స్త్రీవేషధారి పగిది — నిరతాంధ్రసాహితీసేవాతత్పరులయిన కళాతపస్వుల కళ్లపడ భిడియపడుతూన్నా.

ఈడొచ్చిన పెళ్లికూతురుమాదిరిని సిగ్గు మనసు యింతచేటుగా వుంటే, అసలీరచన యెందుకు సంకల్పించాల్సివచ్చిందీ, సారస్యబ్రహ్మశ్రీ కామేశ్వరరావుగారి పరిచయవాక్యంలో వారు పొందుపరచిన నాలేఖ భాగంలో విస్తృతమయే ఉంది. అంతరప్రేరణ అంటారా, నన్నీసాహసాని కొడిగట్టించింది, విద్యార్థిజీవితమన్న నాకున్న తన్మయానందమే కాని యితరమేసాహిత్యసంపదా కాదని పండితాఖండులకు సవినయంగా విన్నవించుకుంటూన్నా. ఇప్పటికి, విద్యార్థ్యాశ్రమ దినాలు జ్ఞప్తికివస్తే, త్యాగరాజకీర్తన హృదయతంత్రులను స్పందింపచేస్తూన్నట్టే చెకితుణ్ని అవుతా. జీవితంలో మధ్యాహ్నంతిరిగినతరవాత, ఏలాంటి సంక్లిష్టవ్యవహారాల్లో, ఏలాంటి విశాలపరిధుల్లో, యెంతలెంతలుగా, ఉత్థానపతనాలను అనుభవించండి, యెంతలెంతలుగా సంపద్విపద్విశేషమహత్తరఘట్టాలు సంప్రాప్తం కానీయండి, మీరు మరువనివీ, మీహృదయఫలకంమీద చెక్కియున్నవీ, చెరగనివీ, మీవిద్యార్థిదశనాటి అనుభవాలే. మిమ్ము పులకపటలపరికలిత దేహులనుచేసేవి, బాల్యజీవితంలోని మాధుర్యమహనీయత్వాలే. ఈనాడు జీవితంలో పొంగుగ్రుంకులు ఉక్కబెట్టేస్తూంటే మనస్సు చల్లగాలికి షికారు బయలుదేరి, సేదతీర్చుకువచ్చే విశ్రామాశ్రయం మీ నిర్మల, నిష్కల్మష, ప్రతిఫలవాంఛారహిత, ప్రేమపూరిత, విద్యార్థిజీవితమే. అంచేతనే ఆంగ్ల వ్యాసరచయిత హాజ్లిట్టు (Hazlitt) నామనసొచ్చినమాట అన్నాడనుకుంటా.

"Later impressions come and go and serve to fill up the intervals; but scenes of boy-hood are my standing resource, my true classics".

మరోటీ, విద్యార్థుల ఉత్తేజం, ఉత్సాహం, ఉపజ్ఞ, యస్ పిరిట్ డీకోర్ ఇత్యాది ఉన్నతలక్షణాలు — ముమ్మరంగా అభివ్యక్తమయ్యే ఉత్తమసాధనం నాటకప్రదర్శనం. అంచేత విద్యార్థిజీవితంలో నాటక ప్రదర్శన తయారీతతంగం పంచి రసవద్ఘట్టం, యీరసప్రధాన కార్యకలాపాన్ని ప్రోత్సహించిన బడిని, బాలురు, తొడపైకూర్చోబెట్టుకొని, ఆట, మాట, పాట గఱపిన మాతృశ్రీసదృశంగా ప్రేమించి అనురాగబంధులవుతారు. అది నా స్వానుభవం.

బడులలోను, కాలేజీలలోను కమ్మర్షియల్ ఔట్ లుక్కు లావైన కొద్దీ, నాటకప్రదర్శనాలు సన్నగిలినై. నాటకప్రదర్శనాలు సన్నగిలిన కొద్దీ, విద్యార్థుల్లో కండ, కళ, కాంతి తగ్గినై. శక్తిచచ్చిన జాతికి మహాజీవవంతమైన సంస్థలు వెగటనిపిస్తా యన్నారు విశ్వనాథవారు. చిననాడు బడిని ఆరాధ్యదేవతగా భావభువనమందు నిలపజాలని నింద్యులు పెద్దనాడు దేశాన్ని హృదయపీఠిని నెలకొల్పజాలని నికృష్టజీవనులు కాగలరు. అంచేతనే, 'ఆల్మామేటరు', 'భారతమాత' యీ రెండుశబ్దాలు, వాస్తవికత వొలికిపోయిన ఉపన్యాసవేదికావాగాడంబరాలుగా ధ్వనిస్తోన్నా యీనాడు.

బడిపై నాకలవడిన భక్తిరసమే ప్రధానంగా, విద్యార్థి జీవిత స్మృతులునింపే ఆనందమే నిధానంగా, నాట్యకళాభిమానమే ఆసరాగా నా అనుభూతుల నివేదించా. తదాశ్రమ దినాలు స్మృతిపథంలోకివస్తే, తీగెకు లేజిగురుదయించినట్టు, మనసు పునర్వికాసం చెందే, సౌరభ్యం, సంస్కారవాసనలు ఉడుగని సహృదయసంపన్నులు పఠితృలోకంలో గుప్పెడున్నా, వారే నాకు పదికోట్లు. వారివారి వృత్త్యుద్యోగవిహిత కృత్యనిర్వహణానంతర సమయాల్లో, వారికీబాలవ్యాసంగం, ఏపదినిమిషాలపాటు, విశ్రామసమయపఠనోపయుక్తమైనా, నాయీకృషి, సత్ప్రయోజనకారి అయినట్టే భావిస్తా. మరి విద్యాజగత్తులో, ఏపదిమందివిద్యార్థుల కీరచన, క్రమనిష్ఠాభినివేశచిత్తత, సోదరవిద్యార్థులపట్ల సుహృ

ద్భావం, ఆచార్యులపట్ల సద్వినయసౌశీల్యం, బడిపట్ల భక్తిప్రపత్తులు, ఉద్బోధించగల్గినా నేను సార్ధకజన్ముణ్ని అయితినని సంతసిస్తా.

నా యీరచనకు కారకులైన Dr. మలపాక రామమూర్తిగారికి, నేవ్రాసినమట్టుకు ఎప్పడిదప్పుడు వింటూ అమూల్యమైన సూచనలుచేస్తూ, నన్ను ఉత్సాహపూరితుణ్ణి చేసిన శ్రీ కోట పుల్లయ్య, శ్రీ ఆలమూరి శ్రీనివాసరావు, శ్రీ సారంగు నరసింహారావు ప్రభృతులకు నావందనములు. ఈరచన సాంతంగా విని దీని ముద్రణకు ముఖ్యకారకుడై, తద్విషయంయావత్తు మీదపెట్టుకొన్న మిత్రుడు, దగ్గరబంధువు అయిన శ్రీ నాదెళ్ళ కృష్ణమూర్తికి, లాభనష్టములు సరకుగొనక 'మాబడి' వ్రాతప్రతి ఎంతగజిబిజిగాయున్నా దారిచేసికొని ఎంతో ఆదరాభిమానములతో శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి తరఫున ప్రచురింపించిన శ్రీముళ్ళపూడి తిమ్మరాజు జమీందారుగారికి నావందనములు.

ఈరచనకు పరిచయవాక్య సంపద్వర్షం కురిపించిన త్రిమూర్తులు, చిరకాలంగా నాహృదయపీఠిని అధివసించియున్న పూజనీయులే. ఆసుప్రసిద్ధ సాహితీపరుల, కళోపాసకుల పరిచయవాక్యభాగ్యం లభించినందుకు పరమధన్యానముకుళితనయనుణ్ణి అయ్యాను. వారు తీరికచేసికొని నారచనను సాంతంగా చదివి, నాకోరిక మన్నించి నన్నాంధ్రలోకానికి పరిచయం చేసినందుకు వారికి నావందనశతాలు.

రచయిత.

# రెండు మాటలు

తణుకు (అప్పుడు) శుద్ధపల్లెటూరు. "మహామహా పట్నాల్లోనూ, నగరాల్లోనూ వున్న హైస్కూళ్ళకే చాలావాటికి నామరూపాలు లేవే, తణుకు హైస్కూలు కింత ప్రశంసా, దాన్ని గురించి యింత గ్రంథమూనా?" అనిపించింది మొదట; కాని, మొగమోటంతో తప్పనిసరి అయి తీరా చదివాను గదా "ఇది చాలదు" అనే తోచింది.

దీనికి సన్నికృష్టకారణం శ్రీ కోదండరామయ్యగారి రచనా వైచిత్రి. విప్రకృష్టకారణం హెడ్మాస్టరు వి. ఎస్. కృష్ణారావుగారూ, కృష్ణపాత్రధారి అయిన విద్యార్థిన్నీ.

తమ హైస్కూలు పరిధిలో, శ్రీ కోదండరామయ్యగారు, మరుపు వస్తున్న ఒకానొక కాలమూ, సజీవమైన లోకవృత్తమూ లెస్సగా యిమిడ్చి, ప్రౌఢంగా విపులపరిచి చూపించారు.

గొప్పచాతుర్యం యిది.

సాకాంక్షగా మహాగ్రంథాలు చదువుతూ, సవిమర్శగా లోకవృత్తం పరిశీలిస్తూ, నిరవధికంగా మననం చేసుకుంటూ రచన సాగించే వారికే సాధ్యపడే చాతుర్యం యిది.

అయితే, కోదండరామయ్యగారిది సరసచమత్కారరచన. ముఖ్యంగా, కృష్ణారావుగారిని గురించీ, ఆయెత్తున కాకపోయినా, కృష్ణపాత్రధారి (పేరుతో) నిగురించీ, గంభీరరచనతో మరొక గ్రంథం రావలసే వుంది.

నిజమే, తప్పకుండా రావాలి; కాని దీని కుండే జనప్రియత. మాత్రం దాని కుండదు. ఏమంటే? కోదండరామయ్యగారి రచన, చనువిస్తూనే అందీ అందకుండా వుంటూ కూడా చేరతీస్తుంది. గిలిగింతలు పెడుతూనే చపేటికలు తగిలిస్తూ కూడా నవ్విస్తుంది. అవగాహన అవు

తూనే ముచ్చెమటలూ పోయిస్తూకూడా వ్యామోహపెడుతుంది. మాధుర్యం మరిగిస్తూనే చేదు మింగిస్తూకూడా ఆరోగ్యం కలిగిస్తుంది.

కోదండరామయ్యగారిని నే నింతవరకూ వకీలుగామాత్రమే యెరుగుదును. నిశితదృష్టిగల సాహితీప్రియులనిన్నీ ఎరుగుదును. ఆయన రచయిత అని దీనివల్లనే తెలిసింది ఉత్తమశ్రేణికి చెందిన ఉజ్వలరచయిత అనిన్నీ తెలిసింది.

గ్రంథకర్తకు నిశితదృష్టి మాత్రమే వుంటే చాలదు. కథన సామర్థ్యం వుండినా చాలదు. భాషలో మంచి ప్రావీణ్యమున్నూ వుండాలి. అప్పుడు గాని సృష్టించే పాత్రలకు ఔజ్వల్యం అంకితం కాదు. ప్రవచించే భావాలకు ఆప్యాయత సిద్ధించదు.

ఈగ్రంథం ప్రతీవాక్యమూ కోదండరామయ్యగారి భాషావైదుష్యం యెత్తిచూపుతోంది. దానికి మూలం కవిత్రయంవారి భారతపఠనం అనిన్నీ వొత్తి చెబుతోంది. నిజమే, భారతం వాచోవిధేయం కానివారికి, భాషను ఇంత లేఖినీవిధేయంగా మలచగలగడం సాధ్యపడదు.

ఈగ్రంథం నేను రెండుమాట్లు చదివాను. గ్రంథం యెక్కడ విప్పినా బుద్ధి చమత్కృతం అవుతూనే వుండేది. హృదయమున్నూ ఆనందముగ్ధం అవుతూ వుండేది. ఆరెండుమాట్లూకూడా "ఆయ్యో, అలాంటి హైస్కూలులో చదివే యోగ్యత మనకు పట్టలేదే" అన్న పరితాపమున్నూ కలుగుతూవుండేది.

కోదండరామయ్యగారికి విద్యావిషయమైకూడా నిష్కృష్టాభిప్రాయాలున్నాయి. వారు, వాటిని, గ్రంథంలో బహుచక్కగా ఉల్లేఖించారు. ఈకారణంవల్లకూడా గ్రంథప్రాశస్త్యం బాగా హెచ్చుతోంది.

ఒకానొక రచనలో వ్యగ్రుణ్ణయి వుండిన్నీ యిది రెండుమాట్లు చదివాను. అందుకు గుర్తుగా నే నీ రెండుమాటలూ రాశాను, అంతే.

రాజమండ్రి

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

# పరిచయం

శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారు 'మాబడి' అనే తమ గ్రంథాన్ని పరిచయం చెయ్యవలసిందిగా కోరారు. పరిచయంలేని సంపర్కం ఉండబోదు గనుక పరిచయాభావం బొత్తిగా ఇదిగా ఉండి ఎట్లానో ఊరుకుంటుందని ఆయన నమ్మకం. కాని, అనవసర పరిచయం పానకంలో పుడక. అందులోనూ సుదీర్ఘ పరిచయం నోటికీ చేతికీ అడ్డు. అయితేం, ఆయనమాట నేను తీసెయ్యలేను. కాబట్టి, ఈ గ్రంథంలోని రచనావస్తువులూ, రచనావస్తు విశేషమూ, రచనావైచిత్ర్యాలూ, ఆయనే సూచించిన రచనా కారణమూ ,కొంచెం కొంచెంగా అంటాను.

కోదండరామయ్యగారు తణుకులో ప్లీడరు. ఆయన విద్యాభిలాషి, వేత్త. భాషాసక్తుడు, భాషి. ఆంగ్లాంధ్రసారస్వతాభిమాని, సారస్వతుడు. చమత్కారి, సారస్యుడు. నటుడు, వక్త. ఆయనకి వార్ధక్యంలో కలిగిన మానసిక సంతానం 'మాబడి' అనే ఈ రచన. తొలి కానుపేగాని, సంతతి కవలలు. మొదటిభాగంలో - గుర్వారాధన, ధీరపూజ, మహాత్మ్యప్రశంస, సజ్జనప్రతిభాచ్ఛాదనం యత్నించడంలో దౌర్జన్యమార్గచర్యావైఫల్యమూ సోదాహరణంగా వర్ణించి ఉన్నాయి. రెండోభాగంలో — పురాణ పాత్రల నామధేయాలు నాటకసమాజ సభ్యులికి ఆరోపించి, నాటక రంగంమీద పాడుకొయ్యలుగా తయారైన ఆ పాత్రలకి ఒక విశిష్ట చైతన్యం కల్పించి, పాత్రధారుల అసలుపేర్లు మాటుపరచడంలో వ్యక్తి స్మరణావసరం తప్పించుకుని, జీవితనాటకప్రమేయాలు రెండూ రంగరించడంలో నాటకరంగస్థలంమీద ప్రదర్శింపబడే నాటకానికి వెయ్యిరెట్లు జీవితరంగస్థలంమీదా లక్షరెట్లు మానవాంతరంగస్థలాలలోనూ నడిచిపోతూ ఉంటుందని చాలా సరసంగా చిత్రించి, ఈపని నిర్వహించడంలో సందర్భించే రాజకీయ, సాంఘిక, నైతిక, సారస్వత ప్రమేయాలే కాక

నిత్యకృత్య సర్వసాధారణ వ్యవహారాలు ఎన్నెన్నో హాస్యప్రధానంగా అవసరమైన పట్లల్లో మెత్తటి చెంపపెట్లతోనూ ముగ్గిన మొట్టికాయలతోనూ స్పృశించి. అమాయికులైన అర్భకులు ఆవేశంతో కూడిన ఆశయాలతో అర్థానర్థాల ఆలోచనేలేక అరువుతెచ్చో అప్పుచేసో ఆతురుగా లెట్టో హైరానపడి అప్రమత్తులై అభ్యాసంచేసి అన్యత్వారోపణ ఆచరించిన యత్నాలు రచయిత విపులీకరించారు. ఈ రెండుభాగాలకీ బాంధవ్యం ఏర్పరుస్తున్నవారు విద్యార్థులు. అదీకాక, ఈ రెండుభాగాలూ వేర్వేరై పోకుండా గట్టితాళం కోదండరామయ్యగారే వేశారు. రెండుభాగాల్నీ కలిపే తాటిపట్టె వంతెనలాంటిది, 'తాడిబాదు' ఉదంతం!

మొదటిభాగంయొక్క ప్రధానవిషయం సార్థక ప్రధానోపాధ్యాయుల్లో ఒకరైన వి. యన్. కృష్ణారావు. రెండోభాగంయొక్క ముఖ్యవస్తువు విద్యార్థుల నాటక ప్రయోగతృష్ణ. ఈరెండు సంగతులూ నాదృష్టిలో ఎట్లా ప్రాముఖ్యం వహించి ఉన్నాయో టూకీగా మనవిచేస్తాను. అది 1927 సంవత్సరం అని జ్ఞాపకం. కృష్ణారావుగారి గర్జన తణుకులో ఇంకా వినిపిస్తూనేఉంది. స్నేహసముద్రులు కీ.శే. ఈమని సత్యనారాయణగారి యింట్లో వి.యన్. కృష్ణారావుగారి బస. ఒకనాడు నేను ఈమని సత్యనారాయణగారితోనూ వారి కుమారుడు వెంకటాామయ్యగారితోనూ వారివాటాలో కూర్చుని ఇష్టాగోష్టి మాట్లాడుతున్నాను. మధ్యరంగంలో ప్రక్కవాటాలోంచి, "Venkataramaiah! you will escort the gentleman you are speaking to into my room, will you?" అని వినపడింది. ఆమాట్లాడేది ఎవరు అని నేను సత్యనారాయణగారిని తగ్గుస్వరంలో అడిగాను. 'వి.యన్. కృష్ణారావుగారండి, హెడ్ మాస్టర్ అని ఆయన అన్నారు. నాఒళ్ళు కొద్దిగా కంపరం పుచ్చుగుంది. ఆయన ప్రతిభగురించి చాలా వినిఉన్నానేగాని, తత్పూర్వం ఆయనదర్శనం నేను ఎన్నడూ చేసిఉండలేదు. అప్పటికప్పుడే నేను మేష్టరీలో దిగబడే ఉన్నాను. ఏదోగ్రంథంఉంది, ఏదో అవాంతరం తప్పదు అనుకున్నాను. కాస్సేపటో నన్ను ఆయనఎదట దాఖలుచేశారు. వెంటనే ఆయన ఒక

కుర్చీ చూపిస్తూ, "Welcome, sir. Take your seat. I expected in you an old fossil like myself", అన్నారు. ఆయన ఇల్లా ఎందుకంటున్నారో నాకేమీ బోధపడలేదు. ఆయన అంతటితో ఆగక తన సహజ అద్వితీయ ఆంగ్లప్రసంగ నైపుణ్యంతో నన్ను మెచ్చడం కూడా సాగించారు. నాకు అప్పటిదాకా పల్చపల్చగా ఉన్నభయం పేరుకోవడం మొదలెట్టింది నావల్ల ఏమీ అపరాధం లేదనిన్నీ నేను వారివంటి గురుదేవుల్ని ఆరాధించేవాళ్ళల్లో ఒకణ్ణనిన్నీ. ఒప్పేసుగుంటే మరి తకరారు ఉండదనుకుని నేను మొరపెట్టబోయేసరికి ఆయన, "what I refer to is your article on the Teacher's profession - మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా! on going through it, I thought it should be the fruit of your long experience. But you look green. What struck me was this- there are points, in it pertaining to my life and experience. I wonder how you could get at them," అన్నారు. అప్పుడు నేను శ్రీ అంబాఠాణా జయరామరావుగారిదగ్గిర చదువుకున్నట్టూ, వారికింద మేష్టరీ కూడా చేసినట్టూ, అప్పట్లో శ్రీ జయంతి గంగన్నగారి సహోపాధ్యాయుణ్నిగా ఉన్నట్టూ, ఆవ్యాసం వారివంటిపెద్దల్లో సంప్రతించి రచించినట్టూ అన్నమీదట, ఆయన 'There you are' అంటూ సంతోషించి ఆవ్యాసంలోని ఘట్టాలు జిల్లాబోర్డు సంఘ సమావేశ సందర్భంలో తాను విద్యార్థులచేత చదివింపించినట్టు చెప్పగా నేను వారికి నమస్కరించి వారి మన్నన నా ఉపాధ్యాయత్వానికి శిఖరప్రాయం అని మనవిచేసుగున్నాను చెప్పొచ్చేదేమంటే, భరతవర్షంలోని పూర్వపు మునుల్నీ, ఋషుల్నీ, ఆచార్యుల్నీ, దేశికుల్నీ, గురువుల్నీ గురించి విన్నాం. జగద్విఖ్యాతి గడించిన హెడ్ మేష్టరు- బోధనలో మొదటిమెట్టు erligious principle రెండోమెట్టు gentlemanly conduct, మూడోమెట్టు intellectual ability అని నిర్ణయించుగున్న- డాక్టర్ ఆర్నాల్డ్ గురించి ఎరుగుదుం. ఆంధ్రదేశంలో ఇరవైయో శతాబ్దపు ప్రధానోపాధ్యాయ శిఖామణులు :

వెంపటి నరసింహం, కూచి నరసింహం, రామస్వామిఅయ్యర్, శ్రీనివాస అయ్యర్, సి. కె. గోవిందరావు, తంజావూరి సుబ్బారావు, శివకుమార శాస్త్రి, మద్దిరాల రామారావు, వి. యస్. కృష్ణారావు మొదలైన కీర్తి శేషుల్ని స్మరించి తీరతాం. అంబాఘానా జయరామారావు, ముడియం శీతారామారావు, జయంతి గంగన్న మొదలైన కీర్తివృద్ధుల్ని గురించి యోగ క్షేమం కనుక్కొని తీరతాం. ఆకోవలో చేర్చతగ్గ పేర్లు దొంతర్లుగా దొర కనూదొరకవు, దాకొన్నూ దాకొవు. ఆజాతి ప్రధానోపాధ్యాయులు సుడితిరిగి కొట్టుకొచ్చిగాని, వెలిసిగాని, మొలిచిగాని పదవించిన బాపతూ కారు; కాళ్ళట్టుగుని ఈడ్చిపారేస్తున్నా చూరట్టుగుని వేళ్ళాడుతూ తమ నోటంట ఏంమాటవస్తే ఇంతోటి మహోద్యోగానికి ఏంప్రమాదం ఘటిల్లు తుందో అనే భయంతో గంగిగోవుల్లాగ తల ఊగిస్తూ ఏయెండకాగొడుగు పడుతూ ఎవరిముఖంఎదట వారిమాట అడుతూ బానిసమతం ఆచరిస్తూ పరమ బానిసల్ని తయారుచేసేరకమూ కారు. వాళ్ళు మానసిక స్వాతంత్ర్య వాతా వరణంలో తమ సహజ ఆధ్యాత్మిక ప్రభావం ప్రసారంచేసి స్వతంత్రుల్ని సృజనచేసినజాతి. ఆజాతి అంతరించిందని ఎవరేనా రాసిస్తారు. అటువంటి వాళ్ళల్లో చెప్పతగ్గ ప్రధానోపాధ్యాయత్వం కలిగిఉండి, అంతే కాక అసూయతో కుళ్ళిపోయి అపస్మారపు ఎత్తులువేస్తూ మాఅంతవాళ్ళు లేరని రొమ్ము సాచుగుంటూ ప్రజాప్రాతినిధ్యం మాదేఅని భుజాలు ఎగరేస్తూ తీరా పట్టువచ్చేసరికి గుణశీలాలు కొరతపడి తుంటరికములులేవదీసే దుష్టులికి పక్కలో బల్లెమై వాళ్ళని హితమార్చడానికి తగ్గ యోగ్యత్వంకూడా కలిగి పాలకవర్గ ప్రధానోపాధ్యాయ పరస్పర వైషమ్యాల సందున లేగవిద్యా ర్థులు నలిగిపోకుండా వాళ్ళమీద తనకుండవలసిన పవిత్ర వాత్సల్యానికి తరుగుగాని, కళంకంగాని లేకుండా చూసుగుంటూ వాళ్ళచేత ఆరాధింప బడుతూనే ఉండగలిగిన వి. యస్. కృష్ణారావు గురించి తెన్నేటి కోదండ రామయ్యగారు రచన చెయ్యడం ప్రధానోపాధ్యాయత్వానికీ బోధనకళకీ ఉపాధ్యాయ ధర్మానికీకూడా విజయమే, సత్యానికీ, ధర్మానికీ, సహజ ప్రతిభకీకూడా ప్రతిష్ఠే!

## V

ఇక రెండో భాగపు కీలకవిషయం విద్యార్థిబృందం, నాటకం ఆడడం, విద్యంటే ఆసక్తి, విద్యార్థులంటే ఆప్యాయమూ ఆంగ్లాంధ్ర నాటకాలలో పరిశ్రమా, ఆడడంలో చాకచక్యమూ గల కోదండరామయ్యగారు ఈభాగం రచించడం ఎంతో ఉచితం. కళలన్నీ జీవితానికి కొంతకొంత దివ్యత్వం కట్టబెట్టేవే అయినా జీవితానికి మిక్కిలి సన్నిహితమైఉండేది నాటకకళే! ఎటొచ్చీ జీవిత సంభవాలు యథార్థాలని నమ్మి మనం నవ్వి, ఏడ్చి జాలిపడుతూంటాం; నాటక సంభవాలు కల్పితాలని ఎరుగుండీకూడా నవ్వి, ఏడ్చి జాలిపడుతుంటాం. అసలు నాటకం భావించడంకంటె, రచించడంకంటె, లిఖించడంకంటె, దర్శించడంకంటె ప్రదర్శించడం మహోత్కృష్టం. తత్రాపి, ఎంతలాభం వస్తుందనికాని ఎటువంటినష్టమూ, చిక్కులూ ఉంటాయనికాని ఏంసాధనాలు మనికిలేవని గాని ఆలోచన కించిత్తూ లేకుండా సంకల్పమాత్ర సంతోషులైన వ్యక్తులు కలుసుగుని తథాస్తూ అనుకుని ఆవేశానికి సరిపడగా ప్రజ్ఞాప్రకటన లేక పోయి అసందర్భాలు పుట్టినా హృదయపూర్వకాచరణతో సంకల్పసిద్ధి కోసం ఆశిస్తూ తమ సమాజంపేరుమీదకూడా ఈగ వాలనియ్యక దాని గౌరవం నిలబెట్టాలని పాటుపడుతూ చివరకి లభించే పారితోషికం అప్పట్లో తిట్లూ తరవాత దెబ్బలూ అయినా స్వీకరించేటంత ఏవా, కసీ, నాటక ప్రయోగంమీద కలిగిఉన్నట్టు రచయిత చిత్రించడం చాలా సమంజసం. నాటకప్రయోగం చెయ్యాలనే కాంక్ష ఉండడం మానవత్వం. నాటకప్రయోగం నిర్వహించాలనే కుతూహలం లేకపోవడం మానవేత రమూ జీవితవిరుద్ధమూ అనాలి. మరొక జీవిలాగ ఉంటేచాలని శరీరం ధారపోసే వ్యక్తియొక్క జన్మ తరించినట్టేగా! అటువంటి వ్యక్తియొక్క స్వార్థరాహిత్యమూ, పదార్థ హితతత్వమూ సర్వసమత్వమూ గురించి వేరే అడగాలా! ఇదీ రెండోభాగ విషయంలోని విశేషం.

కోదండరామయ్యగారి రచనలో ప్రత్యేకత చాలా దృక్పథాల నించి కనిపిస్తుంది. అయన నాబోట్లని కొంతకాలంకిందట 'మీరింత un-natural గా తెలుగురచనలో ఎట్లా పడగలిగారండీ?' అనగలిగినంత

ఆంగ్లరచనాపేక్షా అసాధారణాంగ్లరచనా నిర్మాణకౌశలమూ గలవారు అయినా ఈ రచనలో తెలుగుజాతీయం ఆయన పిలిస్తేపలికి చెప్పినపనల్లా చేసిపెట్టింది. సాధారణ రచయిత అనుభవించి అందుకోలేని తెలుగు పలుకుబడి ఈరచనలో ఉంది. ఒళ్ళువిరిచింది, పట్టించుగోలేరు, మసిపూసి, మొదలైనవి తగిలేపట్లలో భాష ధ్వనించింది. ఆయనకి చాలా నాటకాలు జిహ్వాగ్రమందు ఉండడంనించి రచనలో సంస్కృత సమాసం కొన్ని చోట్ల అల్లా అల్లా తీగెసాగింది. కాని, సమాసాలన్ని అపూర్వంగా అవతరించినవే కాని మరోచోటా మరోచోటా ఉత్తరించి అంటెట్టి ఇస్త్రీచేసి పారేసిన మడతలు కావు. మొదటిభాగంలోని క్రిమినల్ ఛార్జీల తతంగంలో పడవలసినంత కోర్టుపరిభాష పడినా రచయిత ప్లీడరైనా సారస్యుడు కావడంచేత దస్త్రం విప్పినట్టూలేదు, రథం తోలినట్టూ వేదు. అనేకాంగ్ల కవుల వాక్యలేశాలూ మహాభారతవచనఖండాలూ ఆంధ్రనాటకరచనల్లోని పద్యపాదాలూ ఈరచనలో మిలమిలలాడుతూ బిలబిలలాడుతున్నాయి. కాని వాటిల్లో ప్రతిదీ తల్లోనాలికలాగా నీటిలో పంచదారలాగా ఉండే కాని పెరుగూ వడ్లూ కలిపిన ధోరణిగాలేదు. ఏదేనా రచన సాలోచితం అని నిర్ణయించడానికి అందులో జీవితసత్యాలు తారసిల్లాలి. అవి రచయిత యొక్క అనుభవాన్ని ప్రతిఫలించడమేకాక అనేక సందర్భాలు పరీక్షించి పరిశీలించినమీదట అనుమితిచేత సూత్రింపబడ్డ జ్ఞానబీజాలై జనహృదయాల్లో నాటుగుంటాయి. అటువంటివి ఈ రచనని సారవంతం చేస్తున్నాయి. మొదటిభాగంలో ప్రధానపాత్ర పేరు అట్లానే ఉంచి, తక్కిన పేర్లన్నీ రచయిత తెరచాటు చెయ్యడంతో పూర్వచరిత్ర తెలిసినవాళ్ళకి కోపం తమాయించేలాగానూ కొత్తగా గ్రహించేవాళ్ళకి చరిత్ర వాసన కొట్టకుండానూ పనిజరిగిపోయింది. అల్లాగే, రెండోభాగంలో 'నేను' తప్ప తక్కినవాళ్ళందరూ - అనగా, కృష్ణుడూ, పంచపాండవులూ, కర్ణుడూ, నారదుడూ, కౌశికుడూ, జయవిజయులూ, గయుడూ, ధౌమ్యుడూ, శంకరుడూ, శిశుపాలుడూ, అభిమన్యుడూ అవసరాన్నిబట్టి అంగదుడూ పాపం ఆడకూతురు సుభద్ర - సమూలంగా పురాణపాత్రల పేరింటిగాళ్ళు

కావడంచేత పాత్రధారుల్లో కొందరికి రంగం ఎక్కగానే ఎంత ప్రతిష్ఠ పోయిందో వాళ్ళు రంగంమీదనుంచి దిగి యదార్థప్రపంచంలో పడగానే పురాణపాత్రలకి అంత ప్రతిష్ఠా ముదరా వచ్చేసింది. రచన అంతటా కూడా ప్రసంగవశాత్తూ పొటకరించే అవాంతర విషయాలు - కవిత్వం మొదలుకుని నిప్పురాజెయ్యడందాకా - అనుభవసిద్ధంగానూ గాంభీర్యయుతంగానూ ఆనందదాయకంగానూ సుబోధకంగానూ ముచ్చటింపబడ్డాయి. ఈ రచనయొక్క శైలీ, మాటసొంపూ, సారస్యమూ కూడా రచయితయొక్క ప్రత్యేకత్వాన్ని ప్రకటిస్తున్నాయి. శైలి అనేది ఒంటికి తొడుక్కునే చొక్కాలాంటిది కాదు, ఒంటికి చర్మంలాంటిదే అన్నాడు ఒక చరిత్రకారుడు. ఆకృతికంగా ఉండే హృదయపూర్వక భావవాదకంచేసినప్పుడుగాని వ్యక్తిని ద్యోతకంచేసే శైలి జనించదు. అప్పుడుగాని, రచన, హృదయప్రతినిధి కాజాలదు. ఈ రచనలోని ఏ రెండు మూడు వరసవాక్యాలు చదివిచూసినా కోదండరామయ్యగారు స్ఫురిస్తారు. వర్ణన కానీండి, కథనం కానీండి, సంభాషణ కానీండి ఆ అనడం సొంపు ఆయనదే కాని మరోరిది కాదు అనిపిస్తుంది. కొన్నిచోట్ల తరిచినదాకా అభిప్రాయం దాక్కునే ఉంటుంది, మరి సారస్యం. సారస్యం అనగా గంభీరాలోచన తేలికగామాట్లాడేసెయ్యడం లేక ప్రకటించడం అన్నారు. అందుకే రచనలో చాలాభాగం దృష్టాంతం. అదీకాక, హాస్యాస్పదత్వం జనించడానికి ముఖ్యసందర్భాలు మూడే అని చెప్పబడింది. మొదటిది - దుష్టవ్యాపారం ఎదురుతిరగడం. రెండోది - ఒకేమాటగాని చేష్టగాని సంభవంగాని వెంటవెంటనే మళ్ళీమళ్ళీ తటస్థిస్తూండడం. మూడోది - సుదూరసంప్రదాయాలు సంకరం కావడం. దొంగాడికే తేలు కుట్టినట్టు మొదటిభాగంలో మాయావి మొదటి ఎత్తు వ్యర్థం కావడంతో హాస్యఘట్టాలకి అంకురార్పణ జరగడం మొదటివిధం. రెండోవిధంకింద 'కాగ్నేట్ ఆబ్జెక్టు, కర్ణం అల్లుడు, కచ్చిగలు, ప్రతి ప్రశ్నకీ ప్రకృతిశాస్త్రంలోంచి సమాధానం' మొదలైనవి హాస్యకారణాలు. మూడో విధం అయిన సంప్రదాయ సాంకర్యం రెండోభాగం యావత్తూనూ!

ఏమంటే, జీవితవిషయాలూ కల్పితమైన నాటకప్రమేయాలూ అందులో కలగలుపైపోయాయిగనక! ఇవి కాక, అల్పవిషయాన్ని గొప్పగా వర్ణించడం (మహిషాసురమర్దనం, పరామర్శకళ, సైకిలెక్కడం, పొయ్యి ఊదడం లాంటివి.) కథపట్టులోని ముఖ్యవిషయాన్ని మరుగుపరిచేసి చివరికి యాదాలాభంగా ఆవిష్కరించడం (మసాలాకిల్లీ ఉమ్ము, రబ్బరుపాము వసూలుకి అల్లరి లాంటివి), అన్యాపదేశం (వేశ్యలాంటి సుగంధరొట్టె వర్ణన, చంద్రదూషణ) మొదలైన ఒడుపులు అనేకం హాస్యోత్పత్తికి దోహదం చేశాయి. ఉన్నపరిస్థితుల్నే యథాతథంగా సూక్ష్మాతిసూక్ష్మాలతో సహా వర్ణించడంలోనే ఉండవలసిన పరిస్థితిని అందరికీ స్ఫురణకి తెచ్చే రచన సారస్యరచన అనేమాట మనం ఒప్పుగున్నా ఈరచన సారస్యమే అనిపిస్తుంది.

ఈగ్రంథానికి 'పరిచయం' వ్రాయవలసిందిగా నన్ను కోరి అడ్వాన్సు కాపీ పంపుతూ కోదండరామయ్యగారు లోగడ నాకు ఒక ఉత్తరం వేశారు. ఉత్తరంలోకూడా ఆయన సారస్వతప్రేమ ఎట్లా ప్రతిఫలిస్తుందో చూపించాలని కాదు, అందులో ఆయనకి వచ్చిన ఒకానొక సందేహం గురించి ఆ ఉత్తరంలోని మొదటి ఘట్టం ఇక్కడ ప్రచురిస్తున్నాను.

Tanuku

1—6—50

"Dear Mr. Kameswara Rao"

తోచీతోచనమ్మ తోడుకోడలి చెల్లెలి పెళ్ళికి వెళ్ళిందట వెళ్ళివెళ్ళి. అలాగ ఉండుండి, తీరికూర్చుండి, యిందులో పంపిన గొడవనుపడ్డా, ఇక యిప్పుడు ఏమిఅనుకొంటే ఏం లాభంగనుక. నేనే చెప్పాలన్న సందేశమేదో నాతోటే పోయిపోతుందేమో అని దిగులు కలిగీ కాదు, అంతరప్రేరణ ఏదీ ఎగతన్నీ కాదు, మొదట్లో కలంపట్టిన కారణం. మిత్రుడు డాక్టర్: మలపాక రామమూర్తిగారు చేర్చిన ఒకసభలో, నన్ను మాట్లాడ

వలసిందిగా అప్పటికప్పుడు లేవదీస్తే, అచ్చటి చర్చనీయ విషయ పరిజ్ఞానం ఏ కొంచెం లేక, ఏదో కాలహరణానికి, పదినిమిషాల పాటు, పిట్టకథ ఒకటి చెప్పి గౌరవం కాపాడుకోవలసి వచ్చింది. శుద్ధ అప్రస్తుతమైన ఆపిట్టకథ రామమూర్తి గారికి ఎందుకు నచ్చాలో నాకిప్పటికీ బోధపడదు. ఓ అబ్బాయికి ఓ అమ్మాయిని చూస్తే ఎందుకు వైకంకమ్మాలో వైవాళ్ళకు తెలుస్తుంది కనక నా.

వెంటనే ఆయన, పోయెపాయె అన్నట్లు, అయ్యో, అయ్యో ఆలాంటి కథలు నాలుగు కాస్త కాగితంమీద పెట్టరాదటండీ అన్నానను కోక — అంటూ జాలిగా ముఖం పెట్టాడు. నాశక్తి నేను కానక అజ్ఞాతంలో ఉండిపోయి, పాఠకలోకానికి నేనేదో ఉపకృతి చేస్తోన్నట్లు.

అయితే, 'కాస్త కాగితంమీద పెట్టడం' అనేది, అంతమాటలమీద ఉందా! దానికెంత సంచికట్టు కావాలి! ఎక్కడ కూర్చుని మాత్రం చేసేదేముంది, పోనీ సభలోనే కూర్చుని పోదాం పావుగంటో అరగంటో, అని కాలక్షేపార్థం సఫలము చేసే బుద్ధిమంతులకు నిశితంగా ఏ విషయాన్ని ఆలోచించవలసిన అవసరం ఉండదని వక్తను తెల్సిన విషయమే కాబట్టి, కొట్టుకుపోతాడు. అక్కడ ఉప్పనిమాట, చప్పనిమాట చెలామణీ అయాయికదా అని, యిక ప్రెస్సుకు ఎగబడితే మర్యాద దక్కుతుందా? కాని, మంచో చెడ్డో, రామమూర్తిగారు నాకోశక్తి ఆరోపించినప్పుడు, ఊరకట్టితే పోయీ దానికి, పనిగట్టుకు అసమర్థత వెళ్ళబెట్టుకోవలసిన పొత్తుడు ఏమంతవచ్చిందని, స్వాభిమానం రేగి, అనువూ మినువూ అనకుండా ఊరుకున్నా. అక్కడనుంచి ఆయన రోజూరోజూ తద్విషయం ఆడుగుతోంటే, ఆయనకు బాకీ పడ్డట్టయిపోయి, ఆయన్ను తప్పించుకు తిరగలేక, చిన్నపట్టణం అవడంచేత రోజుకు అధమం అరుసార్లేనా కలుస్తోంటూండడానూ, పిట్టకథ కోదానికి పాళ్ళేసి, వ్రాతకు దొరబడితిని కదా! ఆలోచించినకొద్దీ కథరూపమే మారిపోతే, చివరకు కథా కాదు, వ్యాసం కాదు, నవల కాదు, ఏ accepted literary form కాని, యీ అష్టావక్ర వికార స్వరూపం ఉద్భవమైంది. దీని యీజనన వృత్తాం

తానికి అష్టావక్ర జననగాథతో కొంత సాదృశ్యంలేకపోలేదు. తల్లి గర్భంలో అర్భకుడై యుండగా, తండ్రిగారు శిష్యులచే వేదంచదివిస్తూంటే 'ఎడబడక యహోరాత్రులు వడిగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్, కడు నిద్రలేమి నెంతయు జడమతులై చదువు దప్పజదువుచు నుండన్' అని ఆ అర్భకుడు పలికాడని, తండ్రికోపించి 'నీ వధ్యయనంబునకు వక్రంబుగా బల్కితివి గాన నెనిమిది వంకలు గల శరీరముతో జన్మింపు'మని శపించినందున, అష్టావక్రు డుదయించాడని చదువుతాం. తద్రీతుగానే, మన చిననాడు 30, 35 సం॥ రాలు క్రితం అమలులోనున్న భట్టీయబ్బుడు విద్యావిధానాన్ని యీ పుస్తకం 139-145 పుటలలో నేను అవహేళన చేసియున్నందున, ఏదో శాపఫలంగా దీనికి అష్టావక్రత వచ్చియుండ వచ్చునేమో. యిది దీని జనన వృత్తాంతం...

'మాబడి' యొక్క అవతార జననక్రమాలు ఈ ఉత్తరంలో చాలా విస్పష్టంగా చెప్పిఉన్నాయి. రచయిత సందేహం ఏమనీ అంటే, ఈరచన ఏప్రమాణ సారస్వత రూపమూ అని. అదే సారస్యనిర్మాత సమస్య. నూతనంగా ఏదేనా గాథ లేవదియ్యడం ఒక కళ. ఏ రకంఅయినా సారస్యం కల్పించడం కూడా కష్టసాధ్యమే కాక — ఫలించిన తరువాత అనుకోవలిసిందే గనక — దైవాధీనం కూడానూ! అటువంటప్పుడు సారస్యప్రధానమైన గాథ నిర్మించడం చాలా ఒరకం, కథాగమనం కోసం చూస్తూన్నప్పుడు సారస్యమూ సారస్యశిల్పం చేస్తూన్నప్పుడు కథా మాయంకావచ్చుగనక. పైగా, రచయితయొక్క పాండిత్యానుభవ సంస్కారాల్ని బట్టి ఉపవిషయాలలో ఉండగల హాస్యాస్పదత్వం — పండూరారి మామిడి పళ్ళల్లోనూ శాంతమ్మ సైనులోనూ పరామర్శల సోమయ్యలోనూ వొరకేబాపతు హాస్యాస్పదత్వం — మొలకెత్తి, నక్కి, విజృంభించి రచయితని అటకాయించి ప్రక్క దార్లల్లోకి ఈడ్చుగుపోతూండడమూ, రచయిత అట్టెట్టె అని నిలదొక్కుగుని మళ్ళీ మార్గంలో పడుతూండడమూ జరుగుతూంటుంది. సారస్యం అన్నిరకాల రచనా రూపాల్నీ ఇముడ్చుగుంటుంది. ఈ రచనలో సారస్యానికి సారస్యమూ

కథకీకథా సిద్ధించాయని సూక్ష్మదృష్టికి బోధపడుతుంది. సారస్య నిర్వచనమూ ఈ గ్రంథంలో దాని నిర్వహణమూ చెప్పనే చెప్పాను. మరి, ఈ గ్రంథముయొక్క రెండుభాగాల సంగతుల సారమూ తీసి, పిన్నా పెద్దా పరిమాణాలలో ఉన్న ఉపాఖ్యానాలలో ఉక్కిరిబిక్కిరి కాకుండా గమనిస్తే, రెండింటిలోనూ కూడా కథా సూత్రం స్పష్టంగా గోచరిస్తుంది.

రాజమండ్రి. భమిడిపాటి కామేశ్వరరావు.

The work named as'Mabadi'(మాబడి) in Telugu written by Sri T. Kodhandaramiah, Pleader, Tanuku, consists of two parts — the first part dealing with Education and the second part dwelling on Art — then and now. The Rasa of the work is satarical humour which is kept up, maintained and exhibited in exquisite delicacy and impresses the reader as though the author is born gifted with it. One is apt to put the question "what is the subject matter" in each section, but one always can find that the entire world is the subject matter, as line after line of the work with its high strung tempo is read.

The language used throughout is soremarkably inde pendant that it looks as though the author never even cared to bestow a thought over it, but allowed his inspired pen to run as best it could in the outpour of samasams admixed with classical and modern usage with intertwining appropriate English words. The run of the style is so healthy and vigorous that it compells the reader to run through the work while reading it. And, if one has to criticise Mr. Kodandaramiah, for the liberity he has taken in making a seening Bhasha Sankara, one has also at the same time got to admit and appreciate for the appropriate Bhasha used at the potent Bhavam.

Through this work, we can see in Mr. Kodandaramiah an Emporium of literature East and West and I personally feel, that this work of 'Mabadi' should be highly useful to any brain from teens to tens in acquiring and accumulating a lucid knowledge in his own walk of life.

**Dr. C. S. Raju,**
S. J. R. Nursing Home,
Factory Medical Officer,
D. S. & A. Co. Ltd., **Samalkot.**

మాతృశ్రీ

మా తణుకు బోర్డుహైస్కూలుకు

అంకితము.

# తొ లి మా ట

"ఏం చదువులోయి, యీ కాలం, ఒక్క విషయం సిష్ఠకృత్తుగా తెలియదు. ఏవిషయంలోయినా, dim apprehensions and glimmering notions' మాత్రమే. పోనీ రెండు వాక్యాలు సందర్భ శుద్ధిగా అనగల రేమో అంటే, అదీ కనిపించదు". అన్నా యీమధ్య క్లబ్‌లో ప్రసక్తాను ప్రసక్తంగా. దగ్గరున్న యువకమిత్రులకు నా అభిప్రాయం కాస్త చురుకు తగిలింది. వారిలో చాలా మంది కాబోలు, బుద్ధిమంతులు కాబట్టి పైకి అనకపోయినా, నన్నేదో బూజు పట్టి రంగుచెడిన పాత ఉసిరిపచ్చడి ఛాందసవ్యక్తిగానూ, యీ కాలపు వెన్నెల నా కాలపు వెన్నెల కీడురాదని కళ్ళుమూసుకునే సనాతనుని'గాను భావించి యుంటారు. చల్లచల్లగా వారిఅభిప్రాయాలు, ఆక్షేపణలూ కానీనే రానిచ్చారు. వాటి సారాంశమేమిటంటే: విద్యావిధానంయొక్క ఆదర్శమే మారిపోయిందనీ, రెండు మూడు వాక్యాలు సందర్భ శుద్ధిగా అనడం నేర్పే విద్యావిధానం వట్టి గుమాస్తాల తయారీ విధానమనీ, పూర్వపు చదువులు చిలక చదువులనీ, విద్యార్థులు పంజరంలో చిలకల్లాగాక స్వేచ్ఛగా, స్వతంత్రంగా విషయావగాహనం చేసికోవడాన్ని నేర్పడమే ప్రస్తుత విద్యావిధాన లక్ష్య మనిన్నీ, వారి అభిప్రాయం.

అదినేను కాదనను. విద్యార్థి తెల్సుకొన్నది ఒక్క విషయమే అయినా దానిలో ఘనాపాఠీ కావాలా? లేక అతడు Superficially omnicient అవడం హితమా? అనేవిషయ నిర్ధారణ నేనిచ్చట చేయబూనుకోలేదు. మరి విద్యావిధానంలో మార్పు వచ్చిందని అందరూ గుర్తింపకలరు. జీవితవిధానంలో మార్పు వచ్చినపుడు అన్నీ మారవలసిందే. కాని పాఠశాలల లక్ష్యం, విద్యార్థ్యుపాధ్యాయుల అన్యోన్య సంబంధం—వీటిలో

మార్పు ఎప్పుడూ రాకూడదు. ప్రాచీన గురుకులాలనాటినుంచి యిప్పటి వరకూ, యికముందుకూడా ఉపాధ్యాయుని నిరంతర సాహచర్య ఫలితమే శిష్యుని బుద్ధిసంపద. వ్యాసులవారివలె పుట్టుకతోనే సకల విద్యాపారంగతులమై యీ లోకంలో అవతరించడం మనకు చేతకానంతవరకు, విద్యాసాంప్రదాయం యిల్లాగే ఉంటుంది. కాని యిప్పటి పాఠశాలల వాతావరణంలో యీ సాంప్రదాయం ఊపిరాడక మృత ప్రాయమై పోయింది. ఈ పరిస్థితులకు కారణాలనేకం ఉండవచ్చు. విద్యార్థులసంఖ్య విపరీతంగా పెరగడంచేత విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ మునుపటిఅన్యోన్యతల కవకాశంలేదనవచ్చు. స్కూళ్ళలో చెప్పేవిషయాలూ పెరిగిపోవడంవల్ల మునుపటి ఏకాగ్రతకు తావులేదనవచ్చు. విద్యావిధాన నేతృత్వము, తత్సంస్థా నిర్వహణము అనధికారులహస్తగతమై విద్యాధికులు ధృతిసెడే దుర్యోగం కూడా ప్రాప్తించి యుండవచ్చు. ఎవరిపనులమీద వారికి లక్ష్యంవుంటే ఈ విపరీతపరిస్థితులను కొంతవరకైన ఎదుర్కొందురని నాఅల్పబుద్ధికి తోస్తుంది.

మాబడి నిన్న మొన్నటిది. యీశతాబ్ది ప్రారంభంలోనే దానిజన్మం. కొన్నియితరపాఠశాలల లాగ traditions నిర్మించుకొనే వయస్సు లేదు మేంచదివేటప్పటికి. అయినా బళ్ళోమేముగడిపినరోజులు, అప్పటి విద్యార్థి జీవిత సన్నివేశాలు స్ఫురణకువచ్చి యిప్పటివిద్యార్థి జీవితాలతో పోల్చి కొన్నప్పుడు విద్యార్థులఆంతరంగిక సర్వతోముఖవికాసానికి పాఠశాలవాతావరణమెంతగా దోహదమయ్యేదో ద్యోతకం అవుతూవుంటుంది. దీనికి ముఖ్యకారణం మా హెడ్ మాష్టరుగారు. మాస్కూలు పుట్టకపూర్వం ప్రధానోపాధ్యాయుడు కేవలం యిప్పటివలె పాఠశాలావ్యవహార పర్యవేక్షకుడు మాత్రమే కాదు. విద్యార్థి లోకానికి జ్ఞానతేజస్సులను ప్రసాదింపగలసూర్యభగవానుడు. బాలుర ధీప్రబోధనా చతురుడగు సవితృదేవత. పాఠశాలా జీవితోచ్ఛ్వాస నిశ్వాసములకు తగినవాతావరణం ఆయననుండే ప్రసరించేది. మాస్కూలు స్థాపించేటప్పటికి ఆతరహా హెడ్మాష్టర్లు గతించిపోయారు. ఉన్నవాళ్ళు వృద్ధులై వెనుకటి హుంకరింపు స్మృతిరేఖలతోనే

తమపనులు నిర్వర్తింప చేసుకొనేవారు. కాని వారి లక్ష్యమంతా తాము నేర్చుకొన్నది తమ విద్యార్థులకు వచ్చేటట్టు చెయ్యడమే. నిజమైన కులపతి ఆదర్శ మదికాదు. విద్యార్థుల సర్వతోముఖ వికాసమే విద్యా విధాన లక్ష్యం. కాబట్టి అట్టివికాసానికి అనువైన వాతావరణ నిర్మాణమే హెడ్మాష్టరు ఆదర్శమైయుండాలి. ఆ నిర్మాణ దక్షత మా హెడ్మాష్టరుగారి విశిష్టత. ఐతిహ్యంగల పాఠశాలలన్నీ యిట్టిప్రధానోపాధ్యాయులను బట్టియే పేరుపొందాయి.

కాని పరిస్థితులన్నీ తారుమారై, పరీక్షల్లోమార్కులు ఏలాగైనా తెచ్చుకోవడం చదువులపరమావధి అయినప్పుడు అట్టి హెడ్మాష్టర్ల కవకాశం లేదంటే నేను నమ్మను. 'Circumstances do not create a man, man creates his own circumstances'. ఈ సూక్తికి మా హెడ్మాష్టరుగారే తార్కాణం. వారిపాలనలో మాబడి, అప్పటివిద్యార్థి జీవితం నిన్న మొన్నటివే అయినా, యిప్పటివారికి చెప్పడం అవసరమని నా అభిప్రాయం. ఆతరంవారికే ఆరోజులు విస్మృతమై పోయాయి. అట్టి హెడ్మాష్టర్లు, అట్టి విద్యార్థిజీవితాలు ఉన్నట్టు ఈతరంవారికి తెలియనే తెలియదు. అందుకే నాజ్ఞాపకాలను వ్రాయడానికి యీనాప్రయత్నం. అప్పటికి విద్యార్థులు పుస్తకాల పురుగులనీ హెడ్మాష్టర్లు బెత్తంపుచ్చుకొని భయపెట్టే 'బూచాళ్లు' నీ అభిప్రాయంకూడావుంది యిప్పటివాళ్ళకి. మా కాలపువిద్యార్థులు అల్లరిచేసేవారే. మూతిబిగించుకొని కూర్చునేమునిముచ్చులు కారు. అన్నీ ఉన్నవి ఉన్నట్టుగానే చెప్తాను. కాని నాజ్ఞాపకాలన్నీ విద్యార్థిసాముదాయక జీవితాశ్రయం కావడానికి కారణం మా హెడ్మాష్టరుగారి విద్యార్థిలోకచిత్తాకర్షణ సామర్థ్యమే. కాబట్టి వారి చిత్రణతోనే కథప్రారంభిస్తాను:

# మా బడి

## మా హెడ్మాష్టరు

### హుందా (Personality)

మా హెడ్మాష్టరుగారు ఆరవఫారం బి లో నుంచి వస్తోన్నారని అలజడి ప్రారంభమై అంతలో బడి రెండోకొస క్లాసులకంటా ప్రాకింది. ఏ D. Y. S. P. యో పెరవలిమొగలో ఉన్నాడన్నా వస్తోన్నాడన్నా పెరవలినుంచి వచ్చే కార్లవాళ్లు ఎదరకారు డ్రైవర్లతో 'వస్తూన్నాడు జాగ్రత్త'అంటో చెప్పి తమ పరోపకార పారీణతను ప్రదర్శించుకుంటో వచ్చేటట్లు 6వ ఫారము బి ప్రక్కనుంచి వచ్చే విద్యార్థులు "వస్తోన్నాడ్రోయి" అంటో ఉప్పందించుకుంటో పోయిదూకుడుగా తమ క్లాసురూములు దూరుతున్నారు. వరాండాల్లోను School square లోను తచ్చాడుతోన్న ఏర్బాయికుర్రాళ్లు ఎక్కడవాళ్లు అక్కడే అంతర్థాన మవుతూన్నారు. ఉపాధ్యాయులుకూడా ప్రక్క ప్రక్కలకు తప్పుకుంటూ తమ తమ క్లాసుల్లోకి వెళ్తూన్నారు. సర్వేజనాః, స్కూలందరికీ ఆయనయెదుట బడడమంటే సింహస్వప్నం. సెకండుఫ్యాను సూరిగాడు పరుగునవచ్చి, పరుగు ఆయాసం పెదవులపైకి రాకుండా దిగమ్రింగుతో, గతగంటనుంచి హెడ్మాష్టరుగారి గదిగుమ్మాన్ని అంటిపెట్టుకున్నట్టుగానే అగుపిస్తోన్నాడు. అవును. అదిగో! చంద్రికాధవళంగా, చిక్కగానున్న దాక్షిణాత్య బొద్దంచులధోవతీ, దానిపై నల్లనిపొట్టి క్లోజుడుకోటూ ఆకోటుపై జేబు ప్రక్కనుంచి దిగజారి వక్షస్తలంమీద చెంగలిస్తోన్న వెండి అష్టకమ్మి వాచీగొల్సు, కొసలుతేలని గ్లాస్కోమల్లు గుండ్రపాగా, చూపులకు కొద్ది

మాత్రం వలంగానే కన్పిస్తోన్న ఆ వామనచాయమనిషి హెడ్మాస్టరుగారే. వామహస్తం కోటుజేబులోనికి గెంటి, రెండోచేత్తో సన్నటి పేపజూక త్రిప్పుకొంటూవచ్చే గమనగతి లక్షణాలావారిదే. ఆనాటికి అచ్చొత్తిన వివిధ సాహిత్య, శాస్త్ర, యితిహాస ఆంగ్ల గ్రంథాలన్నీ పఠించి సేకరించిన విద్వద్భారంతో, Browning's picture of Napolean (as if to balance the prone brow oppressive with its mind) స్ఫురణకు తెస్తో కుడిభుజంపై ప్రకు కాస్త వంచిన పెద్దశిరస్సు, బింక మొలుక్కతోన్న మోము, పట్టుదలను సూచిస్తోన్న పెదవులు, జీవితంలో తిన్న ఢక్కామొక్కీలను స్ఫురణకు తెస్తోన్న ధృఢమైన నుదిటిరేఖలు, అసమాన మేధాసంపన్నతను సాక్షాత్కరింపచేస్తోన్న సువిశాలఫాలం, విజ్ఞానవికాసాన్ని ప్రతిబింబిస్తోన్న విశాలమై లోతైన కాటుక కళ్లు, కండతేరిన మెడభాగం, ఆయన్ని వినిగాని యెన్నడును కని యెఱుగని వారికిసహితం వారే హెడ్మాస్టరుగారని చెప్తోన్నాయి. దానికిదాఖలాగా పీరియడ్ అయిందని గంట కొట్టడం తర్వాయిగా బిలబిల్లాడుతో తమతమ క్లాసు గుమ్మాల వెలుపలకు వస్తూన్న విద్యార్థి సంఘాతాలు ఎక్కడి వక్కడ 'ceased chattering and made way for him. హెడ్మాస్టరుగారితో మాట్లాడ వలసినపనిఉండి -వ్యవహారమేమో తెలిసుకు- హెడ్మాస్టరుగారి గుమ్మం ప్రక్కగా కుర్చీలో కూర్చునియున్న ఆజానబాహు పెద్దమనిషి ఒకరు, Sprang up instantly as though the seat had been charged with electricity.

కథను అడ్డొచ్చానని కన్నెర్రచేయకండి. కథకు అవసరమూ నేమో పైవర్ణితవిషయం. ఒక సర్వసామాన్య హైస్కూలు ఉపాధ్యాయుడంటే, ప్రధానోపాధ్యాయుడే కానీండి, ఉపాధ్యాయశ్రేణికి, విద్యార్థులకు, పౌరులకు, అధికారులకు భయసంభ్రమాలు ఎందుకుకల్గాలని శంకిస్తున్నారా? సందేహవిచ్ఛేదమునై వినండి. విధిప్రాతికూల్యంచేత ఆయన శక్తిసామర్థ్య ప్రదర్శనము బహుసంకుచితరంగంలో, ఒకబోర్డుబడిలో జరిగిపోయింది. కాని ఎంతెంతటి ఉన్నత సువిశాల రంగాల్లోనూ ఏలాంటి Spheres of

human activityలోనూ యీ ప్రతిభా పాండిత్యాలే కావు, యీ పరాక్రమ విక్రమాలు కూడా కనం, వినం. నిజంగా ఆ ప్రఖ్యాతపురుషుని అస్తమయం-అది విద్వజ్జగత్తులో ఒక మహత్తర యుగానికి భరతవాక్యం.

"There was a Caesar once;
When comes another?"

Tennyson's 'Morte D' Arthur, లోని పంక్తులు వ్యాఖ్యానిస్తో Knights of the round table యొక్క వీరగాథలను ప్రశంసిస్తో ఆయన, 'Sir Bedivere' 'the last of his race' అని ఎత్తి చెప్పిన ప్రసక్తి యీనాటికి చెవిలో గింగురుమంటున్నది. వారు, the last of the old race of headmasters అనిపిస్తుంది.

## గ్రంథపఠన కౌతుకం

ఆ కాలం ప్రధానోపాధ్యాయుని చూచిన కళ్ళతో, ఆధునికుల్ని చూస్తే, వీరు Olympian ముందు వాలఖిల్యుల వైఖరిని కన్పిస్తారు. పిఠాపురం కూచి నరసింహం పంతులు గారనండి, నర్సాపురం రామస్వామి అయ్యరనండి, తణుకు వి. యస్. కృష్ణారావు గారనండి, రాజమండ్రి ట్రయినింగు కాలేజీ తంజావూరి సుబ్బారావు పంతులుగారనండి, ఏలూరు ర్యాలి సుబ్బారావు గారనండి ఎంతెంత విఖ్యాత విద్వత్సంపన్నులు! ఏలాంటి శేముషీధురంధరులు! సమస్తేతిహాసకథా రసికులు, శాస్త్ర సాహిత్యాలను సాంగోపాంగంగా మననం చేసిన ఉత్తీర్ణులు! వారికి శిష్యులు కాగలగడం, ఆతరం విద్యార్థులు, తమ పూర్వజన్మకృత సుకృతాతిశయంగా భావించేవారు. మా హెడ్మాష్టరు గారికి శాస్త్రజ్ఞానంలో ఎయిన్ స్టీను మొదలగు పండితోత్తముల గ్రంథాలు మంచినీళ్ళ ప్రాయం. ఆయన జ్ఞానపిపాసకు ఆ శాస్త్ర మీ శాస్త్రమని హద్దులేదు. ఆయన ధీకిరణం పెక్కు-

శాస్త్రములపై ప్రసరించెడిది. మా జాగ్రఫీ మాష్టరుగారు రాక, దైవికంగా హెడ్మాష్టరుగారు ఆ క్లాసుకు వస్తే జాగ్రఫీమోడు చిగిర్చేది. ఆగంట బోధనలో, మాకు Peeps at Many Islands series చదివే అభిలాష జనించేది. హిష్టరీ క్లాసుకు వస్తే, Source books పఠించాలని కౌతుకము అంకురించేది. ఆనాటి పాఠానికి సంబంధించిన, రాజులు, రాణులు, మంత్రులు, దుండగీండ్రు, అంతా సజీవులై వచ్చి, నాటక ప్రదర్శనంలోవలె, ఆగంటలోను తమతమ పాత్రలనిర్వహించుకుపోయేవారు. చరిత్రలను ఎక్కడికక్కడ నాటకం వలుగా రసవంతం చేసేవాడాయన. ఆయన హిష్టరీ గ్రాడ్యుయేటున్నూ కాదుసుమండీ. లెక్కల క్లాసయితేమాత్రం కాళీగాయున్నను అడుగుపెట్టేడి వాడుకాడు. వచ్చెబో, Lamb's 'Roast pig', Merchant of Venice (Trial Scene) యిత్యాదులేవో చదివి మమ్మల నాగంటా తన్మయులను చేసేవాడు. అందుచేతనే కాబోలు మాలో చాలామందికిప్పుడు లెక్కలంటే సవతితల్లిప్రేమ. వాణి ఆయనకు నిజంగా రాణే. 18, 19 వ శతాబ్దాల ఆంగ్ల సాహిత్యం ఆయన జిహ్వాగ్రమున నుండెడిది. Addison's 'Sir Roger', Dicken's 'Winkle' లాంటి పెక్కురను మాకు ప్రసక్తానుప్రసక్తంగా పరిచయం చేస్తే, Inter లో వాళ్ళు మాకు పాతస్నేహితులైనారు. Unto this last మొదలు Fors Clavegira వరకు Ruskin యావత్తూ ఆయనకు కంఠోపాఠం. Lamb's Essays of Elia ఆమూలాగ్రంగా ఆయనకు హృద్గతం. ఆంగ్లేయ రచయితలకు సంబంధించిన బోలెడు anecdotes ఆయనకు నాలుక చివర ఉండేవేమో. ఏ కాస్త పాఠం బోధించినా, దాని రచయిత వ్రాసిన యితర గ్రంథాలను చదువాలనే మమకారం ఆరచయిత పట్ల కల్గించేవాడు. 5 వ ఫారం క్లాసు కుర్రాడొకడు ప్రక్కకుర్రవాడిని అల్లరి చేస్తో కంటబడితే, తక్షణం లైబ్రేరియనుకు చీటీ వ్రాసి Reynord the fox అనే పుస్తకం తెప్పించి, సందర్భానుసారమైన పుట త్రిప్పి Reynord the fox యొక్క Tricks, క్లాసు అంతావిర

గబడి నవ్వేటట్లు చదివి వినిపించి సోమవారం నాటికి అది చదివి తీసుకు రావలసిందని శాసించారు. అది వాడి కొంటెతనానికి శిక్షో, బహుమానమో తెలియలేదు. ఆ పుస్తకము 5 వ ఫారం క్లాసు కుర్రాళ్ళు కనీసం పాతికి ముప్పై మందివాకా చదివారు. ఆకుర్రాడిని ఆనాటి నుంచి ఎంతమందిలోయున్నా ఎక్కడ కన్పించినా Reynord అని పిల్చేవారు. వాడు మాస్తోంటే పెద్ద హీరో అయిపోయాడు. 5 వ ఫారము బి. 6 వ ఫారము ఎ కుర్రాళ్ళేదో కలహపడి స్కూలు గ్రౌండులో ముష్టియుద్ధందాకా వచ్చి కొట్టుకు చచ్చిపోతోన్నట్లు కబురువస్తే వెళ్ళి వాళ్ళను చూచి మురిసిపోయాడు. మరునాడు మొదటిగంట Laboratory hall లో 5 వ ఫారము బి. కి 6 వ ఫారము ఎ కు, కంబైండు క్లాసు ఉంటుందని ప్రచురణచేసాడు. ఆ క్లాసులో Tom Brown's school days లో విద్యార్థుల fight ఘట్టం ఫాట్ ఫాట్ మని కుర్రాళ్లు కొట్టుకోవడం కళ్ళకు కట్టినట్టుగా చదివి వినిపిస్తో, తన కుర్రాళ్ళతో వాళ్ళకున్న బేధసాదృశ్యాలు మధ్యమధ్యతాను విమర్శిస్తోంటే పులకితులమైనాము. ఆదభా Tom Brown's school days, మాకు పాఠ్య గ్రంథముకాకపోయినా, 5, 6 ఫారము క్లాసుల్లో దాన్ని చదువని వాళ్ళు లేరని చెప్పవచ్చు. అక్కడనుంచి హెడ్మాస్టరుగారు 5, 6 ఫారు విద్యార్థులను ఆగ్రంథంలో వచ్చే వీరుల పేర్లతో పిలవడం పరిపాటయింది. వాళ్ళంతా గొప్ప వాళ్ళైపోయారు. గిడుగు పిడుగు కాదు. ఆ పేరింటివాడు ఒక B. A., L. T. అసిస్టెంటుగా వచ్చాడు. ఆయన నడక, మాటతీరు, పట్టాడో కుర్రాడు. సోదర విద్యార్థుల దగ్గర ప్రదర్శన మిస్తూన్నాడు. ఎక్కడనుంచి చూస్తూన్నారో హెడ్మాస్టరుగారు వాడిని, వాడు వెళ్ళిన క్లాసుకు వెళ్ళి, ఆ ఉపాధ్యాయుని అనుమతి తీసుకుని The Mocking Bird అనే poem ఎంతో శ్రావ్యంగా చదివివినిపించి 'Have we a mocking bird here boys?' అని అడిగారు. అప్పుడు 'ఎవరినో మాడుస్తున్నారోయి' అని గుసగుసలు బయల్దేరాయి. 'Yes, I see it is perched on the 3rd bench' అన్నారు. ఆ కుర్రాడు వాడంతట వాడు లేచి

నుంచుంటే బ్రహ్మానంద భరితుడై, ఆ గ్రంథం వాడికిచ్చి తర్వాత రోజా క్లాసులోకి వెళ్ళేముందు తనకా లైన్సు అప్పగించి వెళ్ళాలని శాసించినారు. తరువాత మేము కూడా వాడిని Mocking bird అనే వాళ్ళం. వాడెంతో అతిశయ పడేవాడు. యాతావాతా చెప్పొచ్చేది-మా అల్లర్లకు సాహిత్య వాసనకల్గేది. ఆయన బోధనతో బాల హృదయం చేతనోల్లసితమయ్యేది. వారి ప్రసంగాలు అమృతధారాపాతంవలె ఎంతో హృద్యంగా ఉండేవి. ఆగురుని స్నేహం ముఖ్యంగా బహుగ్రంథ పరిచయ భాగ్యం, పఠనాకుతూహలం కల్గించేది. 'ఈనాడు ఏ బడిచూడండి బీరువాల్లో బంధింపబడి మూల్గుతోన్న గ్రంథాలన్నీ ఆశకంవారి హయాంలో సాధితమైనవే. ఇటీవల ఆధ్వర్యంవహించిన ప్రధానోపాధ్యాయులకు బహుగ్రంథపఠన పిపాసా విశ్వాసాలు లేకనో, విద్యాశాఖాధికారులు గ్రంథవృద్ధి విద్యార్థ్యభ్యుదయనిరోధకమని భావించారో మరి క్రొత్త గ్రంథం చేర్చిన పాపాన్ని పోవటంలేదు. అప్పటిగ్రంథాలేవీ పోనూపోవు. వారు స్వర్గస్థులైన నాటినుంచి, తాళాలు తుప్పుపట్టిన కారణంగా పడడంలేదు, విడడమూలేదని వినికిడి. ఏ బడిలోనో చీకటిపడ్డ తర్వాత లైబ్రిరీ ప్రాంతాలవద్ద నుంచి భూతాలైన యుగయుగాల మృతాత్మల మూల్గులు వినిపిస్తాయనీ, రెండు మూడు సంవత్సరాల క్రితం కాస్త గుండెజబ్బు కుర్రవాడొకడు ప్రమాదవశాత్తూ చీకట్లో ఆపరిసరాలనుంచి వస్తో ఊష్మం తగిలి నాలుగులంకణాలు చేసాడనీ, తదారభ్య Safety first సూత్రానుసారంగా, 'విద్యలమాట తర్వాత చూచుకోవచ్చును ముందు బాలురు బ్రతికి బాగుండాలికదా' అనే అవ్యాజానురాగంతో బాలురా పరిసరాల్లో మసలకుండా లైబ్రేరియన్ కడుంగడు శ్రద్ధ తీసికొంటోన్నాడని ఆ గ్రామస్థులెంతో హర్షిస్తోన్నారు. కాలపరిణామంలో ఏ ఫ్రెంచి విప్లవంలాంటిదో వచ్చి పడితే, వరదలు పొంగేటప్పుడు ఆనకట్టలాగనట్టు, కొండలు కదలేటప్పుడు మొండిమాట సాగనట్టు, యీ బీరువాల baltille బద్ధలై ఆఖైదీలకు విముక్తి కల్గాలికాని మరి గత్యంతరం కన్పించదని తోస్తుంది రచయి

తలకు.'ఈ రాత్రి అంతమెపుడో! తెలుగుల వసంతమెపుడో?' అంటున్నాడో బాలకవి. మా బడి కా దుస్థితి పట్టలేదని భావిస్తాం.

♦

## వ్యా క ర ణ బో ధ నా వి ధా నం

ఆయన వ్యాకరణబోధనా విధానంలో ఒకవిశిష్టతుండేది. కొందరు పంతుళ్ళు ఇంగ్లీషు పాఠం పేరెట్టి, ఉలీ, చాబాడితా పట్టుకొస్తారు క్లాసుకు. పొడుగాంటివాక్యాన్ని ఓదాన్ని వెతకిపట్టి యికదాన్ని ముక్కకి ముక్కా, చెక్కకుచెక్కా, పేడుకుపేడూ, తాటకుతాటా క్రింద కొట్టేసి, వల్చేసి, ఎక్కడా నామరూపాలు లేకుండా హత్యాకాండ నడిపించడం కలదు. అదేమంటే ఎనాలిసిస్ అని మాదడతారు. దానికి పరీక్షలో 15 మార్కులంటారు. అందుచేత యీహత్య నిత్యవిధిలాగ క్లాసులో జరిగితీరు తోండాల్సిందేనంటారు. ఎనాలిసిస్ అంత కసాయిపనిలా చేయనక్కర లేదనుకొంటూ. చూడండీ, ఏలాంటి వాక్యమైనాసరే, చిన్నైనా, పెద్దైనా

చివరికి తేలేసారాంశము: వ్యాకరణభాషలో మాట్లాడితే సబ్జెక్టు అనబడే ఒకమనిషియొక్క, జంతువుయొక్క, వస్తువుయొక్క, వస్తువు కాని మరో జడంయొక్క ప్రిడికెట్ అనబడే కార్యకలాపం. పెక్కు క్లాజులున్న వాక్యముంటే, కొన్ని క్లాజులు ఆ సబ్జెక్టుయొక్క గుణగణాలను లక్షణలక్ష్యాలను వర్ణిస్తాయి. దిగబడినక్లాజులు ఆకార్యకలాపం ఏ ఏ రీతుల్లో ఎప్పుడెప్పుడు, ఎందుకెందుకు జరిగిందోచెప్తాయి. అంతేగా చివర మాట? మొత్తం వాక్యంగొడవ ఏమిటన్నమాట? ఈలాంటి సకలగుణాభిరాముడైన సబ్జెక్టు యీలాంటి వివిధరీతుల్లో సంచరించాడుసుమా, జనమేజయా అని. కాబట్టి ఎనాలిసిస్ అంటే అగుణగణాలను, యీ కార్యరీతులను వేర్వేరుగా చెప్పడమే. ఇకల్లా క్వాలిఫై అని మాడిఫై అని క్వాస్టులక్కపట్టువేసి వ్యాకరణరూపం యియ్యాలి. అయా క్లాజులకు ఎడ్జక్టివ్

క్లాజులనో, ఏడ్వెర్బ్ క్లాజులనో నామకరణం చేయాలి. మా హెడ్మాష్టరు గారు ఏదైనా ఒకవాక్యం ఎనాలిసిస్ చేయించదలచుకుంటే ముందు మా చేత పుస్తకాలు మూయించి ప్రక్కనెట్టించి, తాను తనచేతిలోది మూసి ప్రక్కనెట్టేవాడు. ఎనాలిసిస్ యజ్ఞం జరుగబోతోందని ఒక్కళ్ళమూ ఎరుగం. ఎక్కడా వ్యాకరణపదప్రయోగం లేకుండా, ఆవాక్యంలోని కథా నాయకుడు చేసిన ముఖ్యకార్యం లెక్క మూడుమాటల్లో చెప్పి, ఏదోకథ చెప్తోన్నట్టు మమ్మల్ని మధ్య పెట్టేవాడు. వ్యాకరణభాషానుసారంగా, ప్రిన్సిపల్ క్లాజు విడదీశారన్న మాట మేమనుకోకుండా. అక్కడనుంచి ఆకథా నాయకుడు ఏలాంటిగుణోపేతుడో, కథపెంచుకొచ్చేవాడు. అంటే ఎడ్జక్టివ్ క్లాజు చెప్పాడు. పేరెట్టకుండా తదుపరి ఆకథానాయకుడు నిర్వహించిన ఘనకార్యాన్ని జ్ఞాపకం చేసి, అది ఏఏ పరిస్థితుల్లో, ఎప్పుడెప్పుడు ఎందుకెందుకు చేశాడో, 'ఆ' అనేట్టు ఆతడి కార్య నిర్వహణ దక్షతను, కార్య కారణ సంబంధాన్ని విపులంగా చెప్పేవాడు. అంటే క్లాజెస్ చెప్పేసన్న మాట. చివరకు కథానాయకుడి గుణగణాలను, కార్యరీతులను అన్నిటినీ నుడివి, సింథసిస్ క్రమంలో, కథపూర్తి చేసేవాడు. దానితో వాక్యం చెక్కుపూటయ్యేది. సింతసిస్ ఆయనమీద పెట్టుకోవడం చేత, ఎనాలిసిస్ మాకుమంచినీళ్ళ ప్రాయమయ్యేది. అంతేకాని ప్రిన్సిపల్ క్లాజు అనేదొంగ, వాక్యంలో ఏమూలో తచ్చాడుతో వుంటాడు ముందు వాడిబుర్రకు అడ్డంగా పెట్టాలని కాని, వాక్యం నడుం విరగొయ్యాలని గాని క్రోధమాత్సర్యాలతో మేం నడుం కట్టడం లేదు. **Who** ముందొచ్చినవన్నీ ఎడ్జక్టివ్ క్లాజులని, **when, as** వగైరా ముందొచ్చినవన్నీ ఏడ్వెర్బ్ క్లాజులూ నంటో ఆలాంటి ఘోషాయిచిటికలు ఆయన క్లాసులో ఎప్పుడూ వేయలేదు. వ్రాయడంలోకూడా ఎనాలిసిస్‌ను శుభ్రంగా వాక్యరూపంలో వ్రాయించేవాడు. అంతేకాని బద్దలుగీయించి ఆవాక్యం మొండాలు, ముడుసులు ఓదొడ్లోను, పేగులోదొడ్లోనూ పోగుపెట్టించేవాడు కాడు. ఆలాంటి భీభత్సం చేసి మేము పేగులు మెళ్ళో వేసుకు తిరగలేదు, మేమెన్నా ఎనాలిసిస్ చేసామంటో. వాక్యం ప్రాణం తీసేయకుండా, దాని అర్థా

సౌష్ఠవం చెడకుండా, మా చేతులు రక్తసిక్తం కాకుండా, శుచిగా, నవ్వుతుంటో యిళ్ళకెళ్ళేవాళ్లం. ఒకపుడు ఒక అసిస్టెంటు మాచేత ఎనాలిసిస్ చేయిస్తే తల్లంటి పోసుగోవలసివచ్చింది. హెడ్మాస్టరుగారి క్లాసులో వ్యాకరణం యిలో నారాయణమ్మలాగ, పెడసరంగా, దుశ్శకునంలాగ, పీడాకరంగా ఉండేది కాదు. మంచినెన్ని హాసౌమనస్యాలతో సాహిత్యసేవ చేసేది. ఆనాడు వ్యాకరణావశ్యకత, బోధనావిధాన విషయానికి ఎట్టి పిత్థాభిప్రాయ ఆచారసాంప్రదాయాలుండెడివో గమనిస్తే, మా హెడ్మాస్టరుగారు వ్యాకరణబోధనావిధానంలో ఎంతముందంజె వేసిరా అని అబ్బురపడ్డాం. మా విద్యార్థి దశరోజులలో George Barrow నుడివినసలహా (if you are anxious for the success of your son in life, for the correctness of his conduct and the soundness of his principles, keep to Lily's grammer. Induce him by any means, either fair or foul to get by heart Lily's grammer) రోజులను తలపుకు తెస్తాయి. ఆ సనాతనకాలంలో మా హెడ్మాస్టరు గారవలంబించిన విప్లవ విధానాన్ని మొన్న నవంబరు 1949 లో మైసూరులో జరిగిన UNESCO సభలో UNESCO experts ఏలాసమర్థించారో చూడండి: (Human beings perceive the whole before the parts, the total before the details, the approach should therefore be synthetic not analytical.)

ఇంతకు ఆయనకు తనశిష్యులు వ్యాకరణ వ్యాయామకర్కశులు కావాలనే కాంక్ష ఉన్నట్లు కన్పించదు. సరససంభాషణా కుశలులూ, యుక్తియుక్తంగా, గంభీరమైన విద్యాప్రౌఢితో ఉపన్యసించే వాగ్విభవులూ కావాలని కోరేవారు. సంవత్సర ప్రారంభంలో సెక్షనులు చేసిందే తడవుగా స్కూలు లిటరరీ అసోసియేషన్ స్థాపనజరిగేది ఆయన హయాంలో. ఈకథా కాలంలో మా నాటకసమాజ కృష్ణపాత్రధారి అసోసియేషన్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. లిటరరీ అసోసియేషన్ మీటింగుల్లో ఉపన్యసించే వక్తలను శిరసావహించేవాడు. వారికి ఉపా

ధ్యాయులతో సమానప్రతిపత్తి, పలుకుబడి ఉండేది. మిగతా విద్యార్థులకన్న ఒక్కొ జానెడు ఎత్తుగా అడుగేసేవారు వాళ్లు. వాళ్ల మోముల్లో, యీ బడి తమదనే భావం ద్యోతకమయ్యేది. పురమాయింపు యావత్తూ హెడ్మాస్టరు గారిదే. అయినా కార్యదర్శి ప్రతిశుక్రవారం సభకు గ్రామంలోని ఒక విద్వత్సంపన్నుని అధ్యక్షునిగా ఆహ్వానించుకొచ్చేవాడు. హెడ్మాస్టరుగారు మీటింగుకు పార్లమెంటరీ ప్రొసీడింగ్సు శోభతెచ్చేవారు. మేము సభావేదిక ఎక్కి చేతులూపుతో వచ్చీరాని విద్దాలు చేస్తోంటే హాస ప్రఫుల్లవదనంతో మమ్మల వీక్షిస్తో మురిసిపోయేవాడు. ఈరేడుజగాల్లోనూ హెడ్మాస్టరుగారి ఉపన్యాస దక్షత మరెక్కాడా లేదని నమ్మేశాం. కాబట్టి, ఆయన మమ్మ అభినందిస్తోన్నట్టు ఆయనచూపు కన్పించేసరికి సభా వేదికపై మాచేతిఊపు ఎక్కువయ్యేది. మరెక్కడ ఆయన కంటబడితే హడలి పోయినా, లిటరరీ అసోసియేషన్ మీటింగుల్లో మాత్రం మదర్ ఈగిల్ ప్రక్కనున్న ఈగ్లెట్సు వలె ఆయనఊతం చూచుకొని ఎగిరేవాళ్లం. ఆయన ఉపన్యసిస్తోంటే మాకు శుభ్రంగా అవగాహన కావడంచేత, ఆయనలా మాట్లాడడం అట్టేదూరంలోదికాదని ఒక భ్రమ మాలో కొంతమందికి అంతర్లీనంగా ఉండేది. అజ్ఞాన జనితమైన భ్రమ అని అప్పట్లో ఎరుగం. ఎంతహాస్యాస్పదమైన భ్రాంతీ, అనుకుంటాం యిపుడు.



## వక్తృత్వం

విద్వజ్జనులు ఆయన ఉపన్యాసాలను ఉత్తమ సాహిత్యంలా పరిగణించేవారు. బహుగ్రంథపఠన సాధ్యమైన పాండిత్యంతో, మనోహరవచన రచనా చమత్కారాలతో, శుచిశుభ్రతలకు పేర్వడ్డ నుడికారంతో, జడ్జి, కలెక్టరు యిత్యాది ఆంగ్ల ఉన్నతాధికారులే అబ్బురపడే ఉచ్చారణతో, ఉత్తమ నదీప్రవాహ ధోరణితో, గంటలతరబడి మాటాడినా, మాతృభా

ఆర్నాల్డు శాసించిన the same high seriousness మైన్ క్రైన్ చేస్తో, హైస్కూలు విద్యార్థులకు సహితం అవగాహన అయ్యే ప్రసాద గుణంతో, సర్వజన సుబోధకంగా, కంఠధ్వని తేనెలూర బహుశ్రావ్యంగా, వారిచ్చిన ఉపన్యాసాలు బీసెంటు సతిని తలపుకు తెస్తాయని ఆయమ పరి చితులు చెప్పగావిన్నాను.

Cramming కూ Caning కూ ఆయన విముఖుడు. విద్యార్థుల కౌతు కము రేపేవాడు. నూరిపోసేపద్ధతే కాదు. Solace and profits ను కల్గించే భాగాలను పాఠ్యప్రసంగాల్లోను, ఉపన్యాస సందర్భాల్లోనూ, నిత్యసంభా షణ సమయాల్లోనూ, కథారూపంలో కొద్దికొద్దిగా విద్యార్థులకు పరిచయం చేసే బోధనావిధానం శాశ్వత ఫలదాయికాదా? అది సామాన్య ఉపా ధ్యాయులకు సాధ్యమా? ఆ స్తవనీయుని బోధనావిధానోత్కృష్టతను గ్రహించలేని సంకుచిత స్వభావులు, పూర్వాచార పరాయణులు, చివరకు ఆయన చెప్పింది తక్కువ అని యీసడించేవారు. ఎవరేమనుకున్నా మాకు మాత్రం ఆబడిజీవితం ఎంతో వుషారుగా ఉండేది.

♦ ♦ ♦

## ఉత్సవ కార్యాలు, క్రీడలు

కరిక్యులమ్ దృష్ట్యా ఫలితాలెట్లాయున్నా ఆయన హయాంలో మేము తణుకు బోర్డుహైస్కూలు విద్యార్థులమని గర్వించే మనస్తత్వం మాకు కల్గించారు. పరిపరి విధాలుగా మధ్యమధ్య జిల్లా కలెక్టరునో, పెద్ద జమీందారునో ఉన్నత విద్యాశాఖాధికారినో బడి కాహ్వా నించో లేక ఇంటర్ స్కూలు ఆటలపోటీలు పురమాయించో ఉత్సవ కార్యాలు కల్పించేవారు.

ఆ వుత్సవకార్యాలన్నీ స్కూల్ గ్రౌండ్‌లో చేసేవారు. మా స్కూల్ గ్రౌండ్ అంటే అప్పట్లో నర్సాపురం వగైరా స్కూళ్ళకున్న

దిబ్బాలమ్మ్రల్లాంటిది కాదు. ఇంగ్లీష్ ప్లేగ్రౌండ్స్ చిత్రరూపుల నమూనా సాంతో రమణీయంగా తయారుచేశాడాయన. నిర్ణీతమయిన ఒక ఎత్తు మించి పెరక్కుండా కెలకోసారి కత్తిరింపు వేస్తోండే ఒత్తయిన పచ్చిక తివాచీని పరిచాడా స్కూలుగ్రౌండుమీద. చుట్టూ చిక్కగా సంగీతపు చెట్లు పెంచి సౌందర్యశోభితంగా చేశాడు. దానికి తగినట్లుగానే చుట్టూ పచ్చగా తోటపంపులుండేవి అప్పట్లో. బాల్యక్రీడలకు ఆలాంటి సౌందర్యమయ, కళామయ వాతావరణం లభించింది. ఉత్సవముల సందర్భాలలో బాల బలగాన్ని వెంటబెట్టుకొని రాత్రికిరాత్రి ఆటస్థలం వంచలనున్న ఖాళీస్థలాల్లోని కంటక పాషాణ శల్య శకలాలను ఏరేసి శుభ్రపరచిన వెనుక యీకొసనుంచి ఆకొసకు ఆ సమీకృత నిమ్నోన్నత ప్రదేశాన్ని చూస్తే కన్ను చెదరేది. తదుపరి, సున్నపుబద్దెలతో శాస్త్రవిహిత పరిమాణోపేతంగా పెక్కురకాల క్రీడలకు రంగస్థలాలు ఏర్పాటుచేసేవాడు. మరో రాత్రి ఆటస్థలంలో సమస్తాధునిక పరికరాలు నెలగొల్పి అఖిల సంపదల కాలవాలమై నిఖిల సౌఖ్యములకు నిలయమైన గొప్ప పట్టణపు రూపం తెచ్చేవాడు. ధనురాకార ముఖద్వారాలు, పెద్ద రోడ్లు, పిల్ల రోడ్లు క్యాంపులు,ప్రత్యేక పోస్టాఫీసులు, పోలీసుస్టేషన్లు, భూతద్దాలు, సిగ్నల్సు ప్రేక్షకుల గ్యాలరీలు, ముఖ్యమార్గము నుంచి స్కూలు ఆవరణకు అడుగడుగునా అతిథులకు మార్గదర్శులుగా యుండే అట్టలతో చేసిన చూపుడువ్రేళ్ళు, అతిథులకు అవసర ఉపచారాలు చేసే సేవాదళాలు, గంభీరంగా ప్రక్కలకు తలతిప్పకుండా ప్రత్యేకించిన దుస్తులతో పొంకంగా అడుగువేసే బాలభటుల కవాతునడకల శాంతి భద్రతలను కాపాడే సాయుధ సిబ్బందీ, నానాధ్వజ నవపల్లవ తోరణ చందన మాల్యాలంకృత ద్వారదేశాలు, సంగీతపు చెట్లపై పక్షుల కలధ్వనులు, వాటి చిగురుకొమ్మల వింజామరలు, యింకా ఏమేమో వీధి రోడ్డు మదుపు తిరిగి లోపలకడుగిట్టినవారికి క్రొత్త శోభతో, క్రొత్త సంతోషముతో, క్రొత్త కుతూహలముతో, క్రొత్త యుత్సాహముతో కళకళలాడుచున్న కనులకైకుంఠం ప్రత్యక్షమయ్యేది. ఇదంతా తన బాల్యర

స్వయంకృషి అని సగర్వంగా ఆహ్వానితులకు హెడ్మాష్టరుగారు చెప్తూ ఆయన మాకుపెట్టిన పేర్లతో మమ్ముల్ని ఒక్కొక్కరినే కేకేసి పరిచయంచేస్తూంటే ఉబ్బి తబ్బిబ్బైపోయేవాళ్ళం. ఆ చెహల్ చైతన్యాలు మరేపంతులు విద్యార్థుల కీయగలడండీ? బుద్ధివికాసానికనువైన ఆలాంటి వాతావరణం మరేఉపాధ్యాయుడు కల్పించగలడండీ? మా హెడ్మాష్టరు గారి నిర్మాణ కౌశలమునకు, బుద్ధిసూక్ష్మతకు సర్వతోముఖ పాండిత్య పటిమకు సుప్రసిద్ధ న్యాయవాదులే ప్రశంసావాక్యాలు చెప్పేవారు. హైకోర్టు బెంచినో, రవెన్యూబోర్డునో, ఏ గవర్న్మెంటు కాలేజీ ప్రధానాచార్యస్థానాన్నో అలంకరించదగ్గ వ్యక్తిఅని మనసా అనుకొనెడివారు, పైకి అన్నా, కారణాంతరంచేత అనకపోయినా.

♦ ♦ ♦

## సాహిత్య సమరాంగణ సవ్యసాచి

సహజ ప్రతిభాధురంధరుడు మా హెడ్మాష్టరుగారు. సాహిత్య సమరాంగణ సవ్యసాచి. Always on the gallop, sabre in hand, reckless of odds, reckless of consequences but only of Victory! ప్రాచీన ఎథీనియన్ మాదిరి తాను విశ్రాంతి ఎరుగడు, పగతుర కిచ్చినవాడు కాడు. సమరక్రీడాసన్నాహవ్యసనుడనీ, బోధనా సంభాషణ శయనాసన సమయాల్లోకూడా, ఏనిమిషమందైనా, ఒకప్రక్క ఆయన సూక్ష్మశరీరం సమరసరణిలో తిరుగాడుచుండెడిదని ప్రతీతి. రాత్రిందివములు జయాపజయ పర్యాలోచనా ధురంధర ధిషణా సముత్సాహుడై, కయ్యానికి కాలుద్రువ్వేవాడట. ఇరువదినాలుగుగంటలూ, ఆయనహృదయాంతరాళంలో వేడిపొంగులు నురుగులలాడుతూండెడివట. With him the barometer stood at 'Stormy' always. ఆయనకు కయ్యం, తుష్టినిచ్చే షడ్రసోపేత భోజనమని వినికిడి.

He loves the smoke of battle. శక్తిచాతుర్యశౌర్యధైర్యాస్త్రవీర్య సమగ్రుడని ఖితాబు. The three 'Hs' of gunnery: hit first, hit hard and keep hitting వారికి ఆర్టికిల్సు ఆఫ్ ఫెయిత్ అని చెప్పుకునేవారు. లోకమంతయు ద్వేషించినను, బంధుమిత్రులు విడనాడినను యుద్ధభూమిలో వైరివీరులకు వెన్నిచ్చి ఎరుగడు. He stood like a block of granite foursquare to all the winds that blew. ఆయన శరీరంలో దాక్షిణ్యకోశమే లేదనెడివారు. 'He delivered smashing blows. విశ్రాంతి ఎరుగడు. శాంతి కోరలేదు.

కయ్యమే కాంక్షించే అధికారైతే, కంచయే చేనుమేస్తే, వారి ప్రత్యేక జీవితానికే కాకుండా, వారి అర్బిట్టు లోనికి వచ్చిన పెక్కు జీవితాలకు విపరీతాలను కలుగచేసే విపత్కరవిషయమది. కొంతమందికా ప్రతిభాశాలి సత్ఫలితాల నొసంగలేదా అన్నది సాకు కాదు. మొత్తం లెక్కకడితే బాగుకన్న ఓగే యెక్కువ అన్నారు బుధులు. దివ్యశక్తులను దుర్వినియోగం చేశాడన్న అపకీర్తి పాలైనాడు. పురాణాల్లో ప్రతిపేజీలోనూ, దైవం అపారావకాశాలిచ్చి అపహసించిన సర్వశక్తిసంపన్నులను చూస్తాం. పాశుపతానికి అసాధ్యం బెద్దియు లేదని, అల్పులయందు ప్రయుక్తంబైన జగత్సంక్షోభ కారణం కాగలదని విన్నాం. ఆయన జీవిత మానూక్తికి తార్కాణం.

◆ ◆ ◆

## బడిలో అంతర్యుద్ధాలు

విద్యార్థులప్రమత్తులై విద్యనభ్యసించుటకు కావలసిన ప్రశాంత వాతావరణము కఱవై, పైగా హెడ్మాష్టరుగారి స్వపక్ష విపక్ష అంతర్యుద్ధాలతో విద్యాసంస్థ కళంకితమై కల్లోలసంక్షుభితమైంది. ఆయాపార్టీలు ఒండొంటితో పెనంగి పోరుచుండెడివి. మధ్యన లేగల కాళ్ళు విరిగేవి.

ఎక్కడో మరీ సత్వగుణసంపన్నులైనా, సంఘజీవితం మనసుకెక్కని విరాగులైనా, సర్వకాల గ్రంథపఠనానిమగ్నులైన విపరీతజీవులైనా, వ్యాధిగ్రస్తులైనా, ఏమో కాని కాస్త కండపట్టోన్న కుర్రాళ్లు కీర్తికాములై, అటో యిటో పడి పార్టీలను బలపరచేవారు. పార్టీముఖ్యుల అడుగు జాడల్లో, కనుసన్నల్లో మెలుగుతో, తమ నిరంతర సేవానిరతికి రుజువిచ్చేవారు. అదను దొరకినపుడు జొమ్మిచ్చి పోరిపోరి పోటుమానిసుల చించి చెండాడెడి పేరు ప్రఖ్యాతులు గడించిన గండరగండలుండెడివారు. పార్టీజనంలోని సాహసోపేతులను సెబాస్ సెబాస్! అంటో పార్టీనాయకులు అక్కున చేర్చుకొనెడివారు. వీరతా శూరతా ధీరతలు ప్రదర్శించబడని దినముండెడిదికాదు. పార్టీలు బలపడ్డకొద్దీ కలహసంఘటనలు పెచ్చొచ్చి

'Then every morning brought a noble chance
And every chance brought out a noble knight.'

అన్నట్టుగా కాలం కళపెళ్లాడుతోండేది. సంఘర్షణలులేని వ్యవధుల్లో వీరకార్యాన్వేషులై యుండెడివారు. భావిని విస్మరించి, గ్రంథాలనుమరచి వీరగాథలను స్మరిస్తో యువకహృదయం ఉద్రేకపూరితమైంది. పార్టీకే కించెత్ సేవ చేసినా కర్పూరమాలలు పడేవి. ఒకలేతవర్వ గుండెలుకముక్కుంటో వచ్చిపడి పరపక్షం ఫలాని ఫలానివారేవో రహస్యాలోచనలు చేస్తున్నారని చెప్పేసరికి, ఆ బాలభటునికి పార్టీముఖ్యులు నీరాజనమెత్తేవారు. వాడిక సార్థకజన్ముడనని సంతుష్టాంతరంగుడై, పుస్తకం ముట్టకుండానే శేషజీవితాన్ని పార్టీసేవకంకితం చేసేవాడు. పార్టీలో చేరిన మూడ్రోజులకల్లా చిగురుకొమ్మైనా సరే చేవదేరేది. తయార్ తినిపించేవారు. పరపక్షంవాడు కారణవశాత్తు మతంమార్చుకొని వస్తే వాడికి బ్రహ్మరథం పట్టేవారు, తమవాడు పరపక్షంలో అడుగిడితే క్షమార్హుడు కాడు. హంతవ్యుడు. ఈబడిలో చదివినరోజుల్లో హెడ్మాష్టరుగారి శిష్యకోటిలోవాడే, ఒకవిద్యార్థి రాజమండ్రి యింటరుక్లాసులోకి వెళ్ళినతరవాత— అచ్చట కాలేజీ లెక్చర్లను విన్నమీదట హెడ్మాష్టరుగారి ఉదాత్త మేధాసంపన్నతను గ్రహించుకొన్నాడో, కాక యితరబడులనుంచి వచ్చిన

విద్యార్థులసమక్షాన్ని, ఒక తాత్కాలిక వాగ్వాదోద్రేకంలో తనబడినితాను నిరసించుకోలేని స్థితిలో చిక్కుకుపోయినాడో, ఆసందర్భమేమో తెలియదు- పిలకామంగమ్మగారి హోటలులో భోంచేస్తో, 'తణుకు హెడ్మాష్టరుగారి వాగ్ఝరి ఆంధ్రావని అంతలోను మరెక్కడా కనిపించు' నని ప్రశంసించాడట. అక్కడవిన్నవాడెవడు వింతనేర్పుకూర్పులతో యీ ఉదంతాన్ని హెడ్మాష్టరుగారి శత్రుపక్షానికి అంచెలమీద అందిచ్చాడో, పాపమూ యింటరు శనివారాదివారాలకు తణుకొచ్చి; రానున్నకీడు గానక, స్కూలు గ్రౌండులో కొచ్చేసరికి తనపార్టీ చుట్టేశారు. వారి చూపులు సోర్ధుత్రిష్టులగుతున్నాయి. నెమ్మదిగా ఒక పార్టీముఖ్యుడు 'స్కూలుపైనలు ప్యాసైతే కళ్ళుకనిపించవురా?' అని అలపించాడు. మిగతావాళ్ళు దానికి రాగం, తాళం, స్వరకల్పనా అమర్చి 'కళ్ళుకన్పించకపోవచ్చు కాని మతి పోతుందంటావుటా?!' అని 'మతిపోతేఏమిరా, బోలెడుమందికి పోవచ్చును పాపం అనుకొంటాం. కాని బుద్ధిగడ్డితింటేమాత్రం' అనీ, 'యిక ఊరుకోండి రా పాపం మాడువాసనవస్తోం' దని కంటతడిపెట్టించి 'పొరపాటు ఆపాప కార్యం యిక యెన్నడూ చేయ' నని అనిపించి పంపించారు. వెడ్తోంటే వెనక్కిపిల్చి Solemn league and Covenant మీద తిరుగసంతకం చేయించి ఆ తేదీవేయించారు.

పార్టీముఖ్యులు నత్తా రామేశ్వరం, ఉండ్రాజవరం సుబ్బారాయుడి షష్టితీర్థం సముచితానల్పపరివారసహితులై వెళ్ళాల్సివచ్చేది. ఈ ఉభయ పార్టీలు అక్కడ తలపడడంకద్దు. దూరప్రాంతాల్లో సంఘర్షణలు కలిగినట్టు ఎడ్జిహిల్ వద్ద ఒకపక్షం జయం సాధిస్తే మార్స్టన్ మూర్ వద్ద మరొకరు సాధించినట్లు వర్తమానాలు తణుకు వచ్చేవి. ఆయా విద్యార్థులు సురక్షితంగా యిళ్లుచేరేవరకు యిచ్చట పార్టీజనం ఆందోళనాయుత మనస్కులై బొటన వేళ్ళమీద వేచియుండేవారు. వాళ్ళొచ్చి గోరంతలను కొండంతలుగా చెప్పి సభలుచేసి తమతమ పార్టీజనాన్ని ఆవేశపరులను చేసేవారు. బహుభంగుల పార్టీలుసజీవంగా దినదినప్రవర్ధమానంగా యుండే

టట్లు కల్పనలుచేసి పార్టీముఖ్యులు ప్రశంసా పాత్రులయ్యేవారు. పరీక్షా ఫలితాలమూలంగా పార్టీల వ్యక్తులు ఉన్నా పోయినా, పార్టీలుమాత్రం నూతనసభ్యులను చేర్చుకొంటూ సుస్థిరంగా చెక్కుచెదరకుండా ఉండేవి. అజీవనసదస్యుడుగా సమితిలోచేరి పార్టీసేవానిమగ్నుడై మెట్రిక్యులేషను విధానంలో ప్రారంభించి స్కూలుఫైనలు మూడుసంవత్సరాలు తప్పిపోయిన స్వార్థత్యాగి ఒకడు ఈస్కూల్లోనే గుమాస్తాగిరీసాధించి తెచ్చుకొని తనపార్టీకి విజయోత్సవం చేసాడు. మరోపార్టీముఖ్యుడు కూడా లైబ్రేరియన్ పదవి నాశించి పార్టీపూజలు అవిరామంగాచేస్తూ, పరీక్షలుతప్పి వ్రతఫలితంపొంది సంకల్పసిద్ధుడై విపక్షులను అవమానభరితులను చేశాడు. ఆపార్టీవిజయాలకు రెండోపార్టీలో పరీక్షలుప్యాసైన కుర్రాళ్లుకూడా ఖిన్నులై తల్లొంచారు. స్వసౌఖ్యములసరకుగొనక, సమస్తైశ్వర్యములనూ కాలదన్ని కామసంకల్పాది స్థానమైన హృదయాన్ని పార్టీకంకితంచేసి, తదీయసేవానుభవానందంలో మునకలుగొట్టే పరమభాగవతోత్తముల కానాటిపార్టీలు ఆటపట్లు.

◆ ◆ ◆

## చారుల చాక చక్యం

ఈ భాగవతోత్తములకు కార్యసాధనే పరమలక్ష్యం. విధానాల ప్రసక్తి పెట్టుకునేవారుకారు. పైగా విధానవిమర్శనను, చేతకానితనంగా భావించేవారు. అతి గర్హితమార్గావలంబనకు వెరచేవారుకారు. నైతిక దృష్ట్యా నీచములైనవి పార్టీదృష్ట్యా స్తవనీయాలే అయ్యేవి. అంచేత రణభూమిలో పగతుర దునుమాడిన వీరశిఖామణులతో, పరమర్మాభిజ్ఞులకు తంత్రజ్ఞులకు పార్టీలో సమాన ప్రతిపత్తి ఉండేది. కలానికి కత్తికి సమాన పలుకుబడి యుండేది. కాకలుతీరిన యోధులు; రాచకార్యధురంధరులు సమానంగా కేంద్రమంత్రివర్గాన్ని నింపేవారు. ఆ రెండువర్గాలకు గుండె కాయ చారులే కాబట్టి; పార్టీ మెషీనరీ కదలికకైనా, కార్యసాఫల్యాని

కైనా ప్రధానావశ్యకులు చారులే. కాబట్టి, కేంద్రమంత్రివర్గం అత్యంత శ్రద్ధతీసుకొని, మంచి పరిశీలనాదక్షతతో, దూరదృష్టితో, చారులను నిర్ణయించి, క్రమశిక్షణయిచ్చి నల్దిక్కులకు వదలేది. ఆ సకలదేశ సంచారులు చారులు, సత్క్రియారంభ సాహసంతో, ప్రభంజనాద్భుతజవంతో, నిర్విచారంగా రెక్కలు కట్టుకుపోయి, ధర్మద్రోహులైన ప్రత్యర్థుల గృహాంతరాళాల్లోని రహస్యాలను, కేవలం ప్రేవులు తోడుకొచ్చినట్టుగానే గోక్కొచ్చేవారు. రాజ్యతంత్ర పరిణామంలో పక్వానికివచ్చినదని, చారిత్రాత్మకమైందని తణుకు స్పైసిస్టం వేనోళ్ళ ప్రస్తుతింపబడిందంటే, తణుకుపార్టీలు దానికిచ్చిన ప్రాధాన్యత, చూపిన శ్రద్ధా కారణం. ఒక అర్భకుడు ఒక చిన్నమాట చేగవేసినాడుకదా అని మరోమాటకు వాడిని పంపించే అపామాక్షీపని ఎప్పుడు చేయలేదు. కౌటిల్యార్థశాస్త్రంలో చారులకు పేర్కొనబడ్డ లక్షణాలు అన్నీ మూర్తీభవించినవారిని మాత్రమే రహస్యసేకరణకు నియోగించేవారు. వృత్త్యానుసారంగా, చారులు కుస్తీ పట్టనక్కరలేకపోయినా, యీ చారులు బహువిధ సమరకర్కశులు. రహస్యార్థియై వెళ్ళిన చారుని శత్రువులుపట్టుకుంటే, వాళ్ళ గుప్పిట్లోనుంచి ముంజికన్ను జారినట్లు జారి, వెనక్కాళ్ళమీద పల్టీలుకొట్టుకొంటో క్యాంపుకొచ్చిపడే యాక్రోబాట్ అయియుండాలి. విధిబలంచేత పట్టుబడ్డా, తోడపాశంపెట్టి రక్తంపిండినా, బాబోయి అనకూడదు. బాధ కన్పించనీయకూడదు - కర్ణునిలా! వాతపెట్టినా కంఠంలో గురకశబ్దం రావచ్చుకాని, తన రహస్యం ఊడిపడకూడదు. ఏ తల్పుసందుచాటునుంచో పొంచి వింటోన్నపుడు ఖర్మవశాత్తు ప్రత్యర్థులు తల్పుతీస్తే ఏలుగుపాములా సందుపొడుగునా సాగడానికి అవసరమైతే ఆమట్టునే కుదించుకుపోవడానికి, కాకపోతే బల్లిలా ఆధారంలేకుండా గోడనేపట్టి ససాకల్యంగా రహస్యం వినడానికీ వలయు అవయవలాఘవం కల్గియుండాలి. ముఖ్యంగా పిల్లినడక, పాముచెవ్రలు, పూర్వపుణ్యాలబ్ధంగా ఉన్నవాడై యుండాలి. స్కూలు ఫాన్సీడ్రెస్సు పోటీల్లో వివిధవేషధారణా చతురతను రుజువిచ్చిన వాడైయుండాలి. ఒక్క మాటలో చెపితే తణుకు చారుడు చలిపిడుగన్న

మాట. వెల్తురు లేకుండా కాల్చుకుపోయే సమర్థుడు అయియుంటేనే చారుల లిస్టులో పేరేసేవారు.

♦ ♦ ♦

## పార్టీ కార్యకలాపం

ఈలాంటి సిద్ధహస్తులైన వివిధశాఖల సిబ్బందీతోటీ, కేంద్రమంత్రి వర్గం ముద్రారాక్షస యుక్తి తంత్రాలు పన్ని పార్టీవిజయాలు చేకూర్చేవారు. భేదము పుట్టింప కొన్ని రహస్య కార్యముల తెలియజేసి విపక్షులతో సావాసం చేయించేవారు. ఆపక్షంకూడా అవులిస్తే ప్రేవులు తోడే వాళ్ళే గనుక తత్ప్రయత్నం కత్తిమీది సాములాగుండేడిది. మారువేషములు దాల్చి పరపక్షంలో ప్రవర్తిల్లుతోన్న వృత్తాంతముల నరసిరా కొంతమంది చతురులను నియోగించేవారు. కేంద్రమంత్రివర్గము నాజ్ఞ నొదలదాల్చి వల్లెయని సాధారణంగా భిక్షుకపాత్రతో పోయివచ్చేవారు. పాములవాని వేషంలో వెళ్ళిన ఒకకుర్రాడికి బుట్టలో పాములేకపోవుటచే, గుసగుసలు బయల్దేరి ఉపాయం అపాయహేతువైంది ఒకపర్యాయం.

తలములుగా యీలాంటి పార్టీకార్యకలాపం లావై చదువులు సన్నగిలడం సహజం. హెడ్మాస్టరుగారి పక్షం అన్నవాళ్ళు మాకేమి జయం నిశ్చయ మనుకొని పుస్తకంముట్టకపోతే, ఫేలైనచో హెడ్మాస్టరుగారు కక్షపూని ఫేలుచేశారని చెప్తే చెల్లేకారణం నిఖారసుగా సిద్ధంగానేయుందికాబట్టి రెండోపక్షం పుస్తకాలవంకనైనా చూడనక్కర లేకుండా పార్టీకర్తవ్య పాలనాధ్యేయ నిష్ఠలో మునిగి ఉండవచ్చు. పార్టీలు విద్యార్థులసందునే ఉంటే సర్దుకుపోను యీ తగాయిదాలు పార్టీలూ సమసిపోను

## ఉపాధ్యాయుల పార్టీ కృషి

కాని, స్కూలుస్టాఫ్ (ఉపాధ్యాయులు) కూడా ఫెడీలున రెండు బ్రద్దలుగా మయానికి-చీలుకుపోయి చెరోకక్షకు అతుక్కుని విద్యార్థుల అవిధేయతకు ఊతంయిచ్చింది. విద్యార్థుల తాత్కాలికోద్రేకావేశాలకు అనుభవశాలురైన ఉపాధ్యాయులు స్థాయీభావం యిచ్చిప్రణాళికలను తీర్చి దిద్దేవారు. స్టంట్సును లేవదీసి, నినాదాలను ఉత్పత్తిచేసి, పొరుగూళ్ళలోను, పెద్దకూటాల్లోను (circles) కచేరీలుచేసి, జనావళిపాడుకునే పాటలు తయారుచేసి, శక్తివంచనలేకుండా శ్రమించేవారు. ప్రచారం వివిధరీతుల్లో చెక్కుకుపోతోండేది. చిరస్మరణీయుడైన ఒకఉపాధ్యాయుడు ఫోర్తుఫిప్తు ఫారాలలో ఫేలైన రామలక్ష్మణుల్లాంటి కుర్రాళ్ళను వెంటపెట్టుకొని సెలవుదినాల్లో కృష్ణాజిల్లా పర్యటించి "హెడ్మాస్టరుగారు చేసిన జోగు"లంటూ ఆబాష్పజలపూరిత లోచనులను సభల్లో చూపుతో, పార్టీకి అమోఘమైన సేవచేసి బదిలీ అయ్యాడు. ఆయన బదిలీ కాపార్టీ దురపిల్లారు. ఆపార్టీసభ్యుల కాయన పోకతో, విద్య అంటేనే వైరాగ్యం పుట్టి, పుస్తక సన్యాసంచేశారు. పదిహేనురోజులపాటు నిజంగా ఆయనే బదిలీకాకుండాయుంటే, మరుసంవత్సరం తోడిమాస్టర్నుపట్టి, ఆరామలక్ష్మణులను ప్యాస్చేయించి, హెడ్మాస్టరు కుత్సితపైశాచికప్రయత్నాలను ప్రతిఘటించి, విజయంచేపట్టిన బాలజోదులు, "జోగులుకారు వీరేనని ఊళ్ళు త్రిప్పుతో, దారినే జనకునింట్లోనో శివధనస్సును విరిపించి, సీతాకల్యాణ మహోత్సవంకూడా చేయించి యుండెడివాడుకదా" అని వాపోయారు. రచయితలు, వ్యక్తిగత అభిరుచులనుబట్టీవ్యక్తిగతకృషినిపట్టీ ఒకవిషయాన్ని ఒకరూపంలో చెప్పగలిగినట్టు మరోరూపంలో చెప్పలేకపోవచ్చు. ప్రతిభావంతు లొక్కతోవ త్రొక్కరు. కార్యసాధన వివిధవిధానాల్లో చేస్తారు. మరోపంతులుగారు పార్టీసభలో, దుర్మార్గకర్మపరుడు హెడ్మాస్టరుగారి నీబడినుండి బదిలీచేయించి, రాక్షసోపద్రవం పరిహరించి లోకముల రక్షింపుమని నూతనభావానుబంధబంధురంగా ఒకతీర్మానం వ్రాయించాడు.

శనివారాదివారాల్లో గ్రామాలంట నిష్కృతుగా సాపాటులు సంచారాలు చేస్తో, ఆయాప్రదేశాల్లో గజ్జెకట్టి, చిరుచిరతలు చేతపట్టి, శ్రవణీయమైన కచేరీలుచేసి, కథరక్తిగట్టినతర్వాత, దక్షిణపూర్వకంగా పార్టీతీర్మానంపై గ్రామీణుల వ్రాళ్ళు పెట్టించి పుచ్చుకొనేవాడు. తానొకటి తలచిన దైవ మొకటి తలచునట్టు ఆ లక్షసంత కాల (millianary) పిటీషనుమీద సంత కాలు సాంతమయ్యేలోపల తనకే బదిలీవచ్చింది. ఆర్యులకు విహీనతయు, అనార్యులకు ఉన్నతియుచేసి అవినీతికి పాల్పడ్డ విధాతృధర్మవు నాక్షే పిస్తో సెలవుపెట్టి కొంతకాలం యింటివద్ద ఏకాంతవాసంచేసాడు.

## భావోన్మాదుడు

పార్టీపరిణామంలో ఉత్థాన పతనా లుంటోంటాయి. కష్టాలు కాపురం చేయవు. సర్వకాలం కృష్ణపక్షమే ఉంటుందా? పిడుగులా వచ్చిపడ్డ సద్గురు వియోగదుఃఖంలో దరిగానక కొట్టుకుపోతోన్న పార్టీ, ఆయనస్థానేవచ్చిన అసిస్టెంటు ప్రథమప్రసంగంతోటే ఉత్సాహదీప్త మైంది. నిల్దొక్కుంది. రావడంలోనే లా లా లా అంటో రంగంలోకురికిన విచిత్రవ్యక్తి. వచ్చిందితడవుగా తెగినకొస లందుకొని నిమిషాలలో పార్టీని చిక్కగా పేనేశాడు. అచిరకాలంలోనే పార్టీనాయకత్వ పీఠం మైన సుప్రతిష్ఠితుడైనాడు. తొలి సంభాషణలోనే 'యీాయనబాగునూడ వేలు' అని బాలకులు భావించారు. విన్నంతలో, కన్నంతలో అచ్చంగా బాలుర బాణీలోనే, మాటతీరు, చేతివిసురూ ఉన్నవాడు ఆయనే. 30, 40 సంవత్సరాల వయసువాడైనా, ఆగ్రహావేశ సంజనిత ప్రసంగాల్లో 13, 14 వత్సరాల బాలుర మాటవైఖరి, వికారాన్ని పుణికిపుచ్చుకొన్న ట్టుగానే మాట్లాడేవాడు. ఎలుగెత్తి మాట్లాడడం పరిపాటు. ఆయన బిక్కగాత్రమూ పదిగాత్రాలపెట్టు. ఒకరాత్రి వాకట్లో సోదరునితో

సర్వసామాన్య కాలక్షేప సంభాషణచేస్తోంటే, వారింట్లో ఏదో కలహం రేగిందని జనంమూగితే ప్రక్కవాటూవాళ్ళు చెప్పి పంపించారు. దానికి తగినట్టుగానే ధోరణి బహుదురితం. ఢక్కీవాయిద్యశబ్ద సదృశవాగ్ధ్వని. మా ప్రాంతాల్లో అంతచప్పుడుచేసి వెళ్ళిన ఉపాధ్యాయుడు నాటికి నేటికీ రాలేదని ప్రఖ్యాతి. శరీర శాస్త్రరీత్యా ఒక్కనాలిక చేయగలిగిన మాక్సిమం చప్పుడు తణుకుతాలూకాలో పెక్కుగ్రామాల్లో ప్రదర్శించి వెళ్ళాడు. ఒకవిద్యార్థి వివాహసమయంలో, పెళ్ళివారికి పని తోచకుండా హెడ్మాష్టరుగారి విషయంతో పెళ్ళిపీటలదగ్గర ఊదరగొడ్తోంటే సూత్రధారణవేళ 'భజంత్రీలు' అంటో పురోహితుడికి కేక వెయ్యక్కరలేకపోయిందో లేక ఆయన కేకవేసినా ఎవరికీ అందలేదో వయినం జ్ఞప్తిలేదు- ఒక్కటిమాత్రం జరిగింది. బోలెడు డబ్బోసి తెచ్చిన భజంత్రీలమేళం వేళకు వాయించలేదని తర్వాత పెళ్ళిపెద్ద సాదించాడు. ఖర్మంచాలక ఎవరైనా బడి ఊసెత్తితే, ఎదరమనిషి హెడ్మాష్టరు అయినట్టే ఫూనేసి, వాడెటు తిరిగితే అటుతిరిగి తప్పుకోడానికి వీల్లేకుండాపట్టేసి ఊదరగొట్టేవాడు. ఆయెదరమనిషి నిశ్చేష్టితుడయ్యేవాడు. నీరసం వచ్చేది. పాప మో వెర్రిబాగులవాడు యీాయన సంభాషణతో హింసపడిపోయి, పట్టలేక, 'నేను హెడ్మాష్టరుగారు మంచివాడని అనలేదండోయి,' బాబోయి' అంటో బారుమని సందుచూచుకు పారిపోయాడు. ఆయన ముందు, యీాయన వెనకగా తరిమి తరిమి 'హెడ్మాష్టరు దుర్మార్గుడు' అని వాడిచే అనిపించి వచ్చి భోంచేసాడు. అంత నిర్మలహృదయంతో ఒళ్ళు దాచుకోకుండా పార్టీసేవచేసాడు. ఇదేకూడా ఆయనచేసిన పార్టీ సేవ.

ఆ ఉపాధ్యాయుడు గ్రామాల్లో చేసిన అయిదు, ఆరువందల ప్రసంగాల యితివృత్తమైనా, వాటిని సంక్షేపిస్తే తేలే సారాంశమైనా, తూచాలుతప్పకుండా ఆయనమాటల్లోనే చెప్తే యిది "అబ్బో! మాకు తెల్సు మేమేంజడ్సుకోలేదు. ఈయనమాత్రం ఇంగ్లీషు మేమూమాట్లాడగలం. మేమూ యల్. టీ. లమే. ఈయనే బయల్దేరలేదు. ఏమనుకుంటో

న్నాడో. చెప్పండి మేమేంగాజులు తొడిగించుకు కూర్చోలేదని చెప్పండి. ఏమనుకుంటున్నాడో ఆయన యెత్తులు వేస్తే యెత్తుపైయెత్తులు మేంవేస్తా మని చెప్పండి. అబ్బో! మా కూ తెల్సు" అల్లరిబాలురకీధోరణి కేవలం తాము మాట్లాడుతోన్నట్టే ఎంతో హృద్యంగా ఉంటుంది. కదిపినవాడిమీద యీ మాటలుఅన్నీ దులిపేసి, మరోరిని ఆపేలోపలదారంటపోతూ "మూడే నెల్లకి హెడ్మాస్టరుకు ఉద్వాసం చెప్పిస్తా, వీరణ్ని, రాగణ్ని మన్నూ సేయిస్తా" అంటో ఛెడేల్ ఛడేల్ పాడుకుంటో పోయేవాడు.

"ఆయనఒక ఉన్మత్త భావశాలి
ఆగికోలేడు రేగునూహలనొకింత"

అన్న కృష్ణశాస్త్రిగారి గేయం స్ఫురణకు వస్తుంది.

ఈహడావుడి, ధరకెంధూళులరేపి విద్యార్థుల పుస్తకపఠనకు కించిద భ్యంతరంకల్గించిన సామాన్యసుడిగాలిమాత్రమే. చిన్న గాలిదుమారం; ప్రమాదోల్లికాదు. చెప్పదగ్గ ఎగ్గొనరించిందికాదు. కాని **1913—14** సం॥ రంలోనో, **14—15** లోనో పెనుగాలివీచింది. పెనుగాలి, లేబచ్చికను నిరపాయంగా వదలేసినా, చెట్లను, పెద్దమొక్కలను వేళ్లతో పెల్లగించి పారేస్తుంది. ఆనాటి భీషణఝంఝామారుతం, ఏసంస్థకైనా తేజఃకాంతుల చేకూర్పగల వేవుర స్తుతి పాత్రులను మాబడినుంచి పెకలించి, అన్యస్థలా ల్లోకి విసరివైచింది. బడి కదోతీరనిలోపం ఘటించిన విషాదఘట్టం. పాడ డిన మోళ్ళు విరగడైతే బెంగటిల్లం. కాని ఏర్భాయియాలతోపాటు, కొంత మంది ప్రతిభావంతులూ, ధీశాలురూ, కుత్సితులతోపాటు కొంతమంది ఉదారమనస్కులూ అమృతహృదయులూ బడినివీడినందుకు ఎంతోచిం తించాం. గ్రంథవిస్తరభీతిచే, ఒక్క ఉదహరణనే పేర్కొంటున్నా. **Inter school sports** లో బడిప్రతిష్ఠ నూలుపోగుపై వ్రేలాడుతోన్న ప్రమాదసంభరిత సమయాల్లో, బడిబాలురందరూ క్షుభితమనస్కులై, లజ్జావినమ్రవదనులై యున్నతరి, ఎత్తివచ్చిన గంధర్వులను పారదోలి బడికి విజయలక్ష్మిని చేకూర్చి, విద్యార్థులకు ప్రాణంపోసి, దిగంతధవళకీర్తిని గడించిన స్ఫారోదారభుజాంతరుడు, సింహకిశోరసదృశుడు, సమర్థ్యస్త

శస్త్రాస్త్రవిద్యావిభవుడు, మాబడికి పెట్టనికోట నాబరగు కోటవంశ వరనందనుడొండు, భీష్మించి, వికటభ్రూకుటిఫాలభాగుడై, వెంటబడు బాంధవశ్రేణిని సరకుగొనక, ఎదురాడలేక, విడలేక విడలేక వీడ్కోలు నిచ్చు మిత్రుల కన్నెత్తిచూడక, దృఢనిశ్చయుడై హేలాపురోన్ముఖుడై, పదఘట్టన నీధర చలించ అడుగిడునరికి హెడ్మాస్టరుగారు విస్మయావిభ్రాంతుడై పరుగున వచ్చి, వగచి 'అనార్యుల అల్లరి మాకల పొందుకూడ' దని చెప్పి, చెప్పించి, విఫలుడైనాడు. "నన్ను బలవంతపరపకుడు, పార్టీ నాభుజములపై ఆశ పెట్టుకొనియున్నది. విశ్వాసద్రోహం చేయజాలను. మీ మాటవినలేనని ఆగ్రహింపకుడు" అని సజలజలదగంభీరభాషణముల వల్ల వెడలునప్పుడు ఆగురుశిష్యుల అన్యోన్యానురాగమునకు, దైవదుర్విపాకమునకు కళ్ళు చెమర్చనివారులేరు. విప్లవసమయాల్లో, స్వప్రయోజనపరుడైన కుట్రదారు Cassius తో, బాధ్యతారహితుడైన Casca తో, సత్ప్రయోజనమేదో సాధిస్తున్నానని మోసపడి సంక్షోభకారకుడయ్యే ఒక తత్వారాధకుడు, స్వాప్నికుడు బ్రూటస్సూ, ఉంటాడు. Thou too Brutus అనిపించుకున్న విద్యార్థులావిప్లవంలో నల్గురైదుగురున్నారు. అప్పట్లో. నాకుమినహాయించి మిగతాపటాలం మరేఅతిశయం చెప్పుకో దగ్గదిలేక, హెడ్మాస్టరుగారి శత్రులమని పేరేసుకోవాలన్న కీర్తికాములూ chaos లో మాత్రమే రెబ్బటిల్లే స్వపక్ష విపక్ష వినాశకులూ, అర్థం శుభం ఎరుగని అల్లరిపిల్లకాయలున్నూ. హెడ్మాస్టరుగారిని బదిలీచేయించాలనే రహస్యోద్దేశంతో తుదియత్నంగా యీతిరుగుబాటును రేపి శిశుహృదయాలను రెచ్చగొట్టి, వాళ్లను మాతృస్తన్యంనుంచి చీల్చే పైశాచికవృత్తికి పాల్పడ్డ తాంత్రికులు విఫలులైనారు. అమాయకబాలుర చేతికి ట్రాన్సుఫర్ సర్టిఫికెట్ యిప్పించిరేకాని, హెడ్మాస్టరు గారికి ట్రాన్సుఫర్ తెప్పించలేకపోయారు. ఆయన కదలలేదు. వారిప్రాణానికి ఆయన యెప్పుడూ కదపరానికొయ్యే అయ్యాడు.

హాలాహలంలోకూడా అమృతపుజీర లభ్యమవుతుందట. తణుకు బడి విప్లవం యితరబడులను మిరుమిట్లు కొల్పింది. వెళ్ళినచోట్లల్లా యీ

విప్లవకారులు, బాలురు, వీరాగ్రేసరులుగా ప్రశంసాపాత్రులైనారు. వీర్లనుచూచి ఆయూ బడివిద్యార్థులు పక్కబెదురుగా యుండెడివారని వినికిడి. రాజభక్తిపరాయణులకు దేశం పుట్టిల్లయిన కాలమది. అధికారులకు ఎటుచూచినా అడుగులకు మడుగులొత్తే అంధకాలంలో ఈ అధికారధిక్కారబీజాంకురం పరీక్షాపీడిత విద్యార్థిప్రజలకు ఆశలుగొల్పి ఆకర్షణీయమైంది. అందులోనూ Revolt of the Tartars dimensions లో విద్యాలోకాన్ని ఊపేసిన చారిత్రాత్మక సంఘటన కాని ఒకడూ యిద్దరూ కుర్రాళ్ళు బడివదలిపోవడమా? గుండెనిబ్బరం, స్థిరసంకల్పంలేని విద్యార్థులు కొందరు దారిలో పశ్చాత్తాపచిత్తులై విషాద మేఘాచ్ఛాదిత ముఖములతో యింటిదారిపట్టి తణుకు — తాడేపల్లిగూడెం రోడ్డంట వస్తోంటే అదంతా Retreat of the Ten-Thousand లాంటి విషాద దృశ్యాన్ని తలపుకుతెచ్చిందట.

మాబడి సంఖ్యకు, సమస్యలకు, సామంతానికి, స్థాయికి కృష్ణాజిల్లా మొత్తంమీద పెద్ద. విగ్రహాల్లో కొలాసస్సు వంటిది. వాహనాల్లో ఐరావతం, వైవాహికాల్లో సదశ్యవతు. ప్రసంగవశాత్తూ విద్యార్థులిద్దరు మాబడితో తూగే బడి ఉందా అని అనుకుంటూంటే వెళ్ళి, వెళ్ళి, ఎరుగని రగ్బీ యీటన్ బళ్ళవరకు పోవల్సివచ్చింది. దారిలో మరేబళ్ళూ యీపోలిక కందలేదు. కాబట్టి అనుభవరహితులైన బాలుర అతిశయోక్తి అనుకుంటున్నారా వచ్చి చూచుకోవచ్చు. ఇటు బడీ, అటు క్లబ్బూ మానగరముఖానికి రెండూ రెండుకళ్ళలాఉన్నాయి. మరెక్కడా కనరు యీతీరు, తవురూ. ఆకాలంలో మాస్కూలు ప్రభావమేమో కాని మాపార్టీ సమస్యలే మానగర పరమసమస్యలైనాయి. మా కక్షలు మా నగర నైనందిన జీవితంలో అంతర్నిహితమైనాయి. మాస్కూలుపెట్టిన వగవడిలో తణుకు రాజకీయజీవితం దిద్దుకొని రూపొందివికసించింది.



♦ ♦

## బడిఅంపం గ్రామాన్ని చీల్చేసింది

బడిలో బయల్దేరిన అంపం కొత్తొట్టుకుంటో గ్రామం మీదపడి, ఏ వృత్తిని ఏ వర్గాన్ని, ఏకుటుంబాన్ని intact గా పెట్టకుండా సరాసరి చీల్చేసుకుపోయింది. ప్లీడరు, డాక్టరు వర్గాలు, మునసబాది సివిల్ ఆఫీసర్లు మేజస్ట్రేటాది, రెవెన్యూఆఫీసర్లు, పి. డబ్ల్యు. డి. ఒంటాలు దేఖీలా అందరు యీ అంపంవాతను పడ్డవారే. చివరకు గ్రామ మునసబు ఒక పక్షానికి పట్టుకొమ్మ అయితే, మణీదారు మునసబు రెండోపక్షానికి గుండె కాయ. గ్రామకర్ణం ఒకపక్ష ప్రతిష్ఠకు అవసరమై ఫస్తు అరచేతులమీద ఆధారం దాకా పెడితే, అసిస్టెంటు కరణం పాలకొల్లు దాకా రెండోపక్ష గౌరవం కాపాడడానికి తలమీదే పోతాడు. పౌరోహితు డొక పక్షాభిమాని కావడంతోనే రెండోపక్షం పొరుగూరు నుంచి మరో పురోహితుణ్ని తెచ్చి వసతి ఏర్పరచింది. ఈలా అఖిల బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యశూద్ర వివిధ వర్ణజనులు యిరుపార్శ్వాలా సర్దుకొన్నారు. కాశీమజిలీ కథా కాలమైతే, రాజు గారి పెద్ద భార్య హెడ్మాష్టరు గారి పార్టీ అయినచో చిన్న భార్య ఎదగ పార్టీ కావలసిందే. పాపం రాజు ఆయిరువురు అమ్మనార్ల యిరుకునబడి నలగి చావవల్సిందే! ఏక కాలమందే బయల్దేరిన రెండు బళ్ళల్లో ఖర్మంచాలక చెరోపక్షంవాడు ఉండడం తటస్థిస్తే బళ్ళల్లో ఉన్నమిగతా పాసింజర్లు హరి నామస్మరణ చేసికొంటో ప్రాణాలు అరచేతిలో పెట్టుకుండేవారు. సురక్షితంగా దిగడంకల్ల. ఏ పార్టీ వాడు కూర్చున్న బండి వెనకబడితే ఆ పార్టీపరువు ఆరోజు తోనే బుగ్గిఅయినట్టయిరి. బడిలో జీతాలు కట్టేటప్పుడు క్లార్కు ఏ పార్టీ కుర్రాడి జీతం ముందుపుచ్చుకొన్నది, సంతపేటలో, నీలాటి రేవుల్లో అప్పడికపుడు చెప్పుకొనే ముఖ్య విషయం. స్కూలుకు ధనమన సాయ సంపత్తులు చేసిన ఒక పుణ్యపురుషుని తైల చిత్ర ఆవిష్కరణ ఒక పార్టీ పూనుకొని చేయించడం వల్ల రెండవ పార్టీ, ఆప్రాంతాల్లో 10 సం॥ రాలులోపల చనిపోయిన ముసలమ్మల దేఖిలా చితరవుల తెప్పించి

స్కూలును గోళీల దిబ్బచేసి తీరతామని శపథం పట్టారు. విద్యార్థులు ప్రస్తుత అవసరాలకు కాని పురోభివృద్ధికాని చేసుకునే సౌకర్యాల విషయంలో ఎంతో శ్లాఘనీయమైన తర్జన భర్జనలు జరిగేవి. అనాలోచితంగా, అహేమాషీగా ఏ స్వల్పకార్యం జరిగేదికాదు. బడిలో మంచితీర్థపు సౌకర్యం చేయించవలసిందిగా ఒకపక్షబాలురు విద్యా శాఖాధికార్లకు విన్నపం పంపినదితడవుగా రెండవపక్షం వెంటనేమేల్కొని, నీళ్ళకావిళ్ళు బడిలోకిచారేసి, బడినిచలివేంద్ర చెర్వుచేసి విద్యాసంస్థయొక్క గౌరవ ప్రతిష్ఠలను రూపుమాపే వినాశకర యతనాలను తలెత్తకుండా త్రొక్కేయవలసిందని వేయిసంతకాలతో విజ్ఞప్తిపంపించుకున్నారు. గ్రామంలోవ్యవహారాలు, వైవాహికాలు, వాహకత్వాలు సర్వస్వం పార్టీబే సిస్ మీదే విజయవంతంగాజరిగేవి. ఒకపార్టీ వీరుని అవసానకాలంలోఆపార్టీ జనమంతామూగిక్రిందపడేయడం తర్వాయిగా, పార్టీ పలుకుబడి ప్రదర్శ నార్థం, ఓంబాయిపట్టేసిఅరలిస్తకాలంలో Partyslogansతో సిద్ధేశ్వరస్వామివారిఆలయప్రాంగణంలో అంటెంచివున్న కాష్ఠంలోగిరాటేసారు. రెండవ పార్టీ తమకంత బలసంపత్తులేదన్నట్టుగా తెల్లపోయారు. నిశ్చయంచేసుకున్న వివాహ సంబంధాలు, మూడుముళ్ళూపడేదాకా నమ్మకాలుండేవి కావు. ఈలోపున Party dispositions లో ఏకొంచెం వ్యత్యాసం కల్గినా నిల్వనాతోరణాలు తెంపేసి పందిళ్ళు పీకేసుకొని, జీవితంలో తాము పార్టీకి ఆపాదించుకొన్న ప్రాధాన్యతకు ప్రబల నిదర్శన మిచ్చుకొనేవారు. ఒకపర్యాయం వధూవరులు ఒండొరులకు బహుదూరప్రాంతాల వాళ్ళయిన కారణంగా, మధ్యగాఉంటుందికదా అని తణుకు సత్రంలో పరిణయ కార్యం జరుపుకున్నారు. మా గ్రామస్థులు పరోపకార పారీణులు. హెడ్మాష్టరుగారి పార్టీమనుష్యులామగపెళ్ళివారికేవో కించిత్ సాయ సంపత్తులు చేస్తోన్నట్టు రెండవ పార్టీ గూఢచారులు పసిగట్టి, తక్షణం, రెండవ పార్టీ ఆడపెళ్ళివారిని కాగిలించుకొంది. రెండు పార్టీలు యిరు పార్శ్వాలాచేరి చెక్కభూటుచేసేసరికి ఆవివాహానికి అనుకోనిశోభవచ్చింది. గ్రామస్థుల అవ్యాజానురాగాన్ని ప్రశంసిస్తో, పెళ్ళివారు వడ్డనలు సాగించిన

పదినిమిషాల్లో పప్పుముద్దల యుద్ధం చెలరేగింది. పెళ్ళి వారికిదేమో అర్థం కాక ప్రక్కకు తప్పుకొని, తమకు పార్టీల బలాబలాల తిలకిస్తూ నిర్విణ్ణులై నారు. సాయంత్రం లోపల కారణమూ తెల్సింది. గత మాసంలో ఒక పార్టీ సభ్యుడింట్లో శుభకార్య సందర్భములో రెండవ పార్టీ రసాభాసం చేసారట. దానికిక్కడ సమాధానం చెప్పడమయింది. ఎదర పార్టీకి వ్యవహారాలదాకా అక్కర లేకుండగనే వ్యవహారి స్థలాలు కూడా రొండవరికి వారివి వేరే. ఒకరు పెరవలి రోడ్డు వరిస్తే,దుష్టులకు దూరంగా ఉండమన్నారని రెండవపార్టీ పయిటిపద్రు ప్రక్కకుపట్టేవారు. 365 రోజులూ సమానపట్టుదలతో పార్టీ ప్రాబల్యంచూపేసంస్థకాని స్థలంకాని మరోటుండదని ఘంటాపథంగా చెప్పగలం.

## పార్టీ నామ నిర్ధారణ

ట్యూడరు యుగమునకు ముందు ఇంగ్లాండులో పూలరంగుల వైవిధ్యానికి పార్టీ రంగుల వ్యత్యాసాలకు, స్టూవర్ట్ ఇంగ్లాండులో జుట్టు కత్తిరింపులకు పార్టీక త్తిరింపులకు ఏదో అర్థరహిత, అవ్యక్తానుబంధం ఉండివున్నట్టు విన్నాం! మాతణుకుపార్టీల కేబాహ్యఅప్రస్తుతవస్తువులతోటీ అనుబంధంలేదు. ఫక్తు విభేదసిద్ధాంతజనితాలు. మా పార్టీలు ఓ బ్లాక్ షర్టులను వరించలేదు, రెడ్ షర్టులను ధరించలేదు. గుండెల్లో అగ్నిహోత్రం రగుల్తోంటే, అభినయాలంకారప్రసక్తి ఎందుకు కావాలి కనుక! విశాల వ్యాప్తికల్గిన భ్యాలి పార్టీలకుండడంచేత, పెక్కు వ్యావహారిక విషయాలు అనునిత్యం రేగుతోండడంచేత, పోర్టబుల్ గా ఉండే పొట్టి పేర్లు వ్యవహార సౌలభ్యతకు అవసరం. కాబట్టి తదవసరం కొంబడిని పార్టీలకు నామకరణం జరిగింది. స్టూవర్టు కాలం పార్టీలను **Roundheads, cavaliers** అనీ, **Pickwick's Eeatenshill** పార్టీలను**Blues and Buffs** అని పిల్చుకొనేవారు.

మా పార్టీలకుంచుకొన్న నామాలు అంతకన్న Spirit stirring denunciations లా, క్రొత్త చెవులకెంతో కఠోరంగా వినిపించొచ్చు. కాని అవి మా పార్టీలకు చెక్కిపెట్టినట్టు, అతకడం వల్ల నైతేనేం, చిర కాలాభ్యాసంవల్ల నైతేనేం, ఏలాంటి ఎబ్బెరికం లేకుండా నిజనామాలవలెనే, నిశ్చింతగా స్వీకరింపబడ్డాయి. కాకినాడట. రిటైర్డ్ తహసిల్దార్ తణుకులో సోదరుని మేనల్లుళ్ళను చూడవచ్చాడు. రెండో మేనల్లుడు వాకట్లో ఉంటె 'అన్న ఏడిరా' అన్నాడు. వాడు 'పూజారి ఎక్కడకు వెళ్ళాడే అమ్మా' అని తల్లినడిగివచ్చి 'ఫుట్ బాల్ గ్రౌండుకు వెళ్ళా' డని చెప్పాడు. పూజారి ఏమిట్రా అన్నను పట్టుకొని, అని అప్పుడే అడుగును కాని, కూర్చున్నది నల్లుల మంచం కావడంచేత, వచ్చేమతీ, పోయేమతిలా మనస్థిమితం లేకపోయింది. అందుచేత అంతలోనే ఆవిషయం మరచాడు మామ.

పెద్దాడొచ్చిన తర్వాత కాస్త కుశలప్రసంగం చేసుకున్నారు ఉభయులున్నూ. నిమిషానికోసారి అడుగున నల్లులు రక్తమాంసాలు పీల్చేస్తో, ఆయన తేలికైనకొద్దీ ఏకంగా ఆయన్ను పైకెత్తేయడం మొదలెట్టాయి. యిట్టే లేచిచూచాడుకదా పట్టెల సందున ఒక నల్లులపుట్ట ఉంది. వరేయ్ చాకో కంపాస్ బాక్సు డివైడరో తక్షణం యీలా అందుకో. ఏంచంపేశాయిరా నాయనా, అన్నాడు, తన 30, 40 ఏళ్ళ సర్వీసులోను యింత దుర్భరమైన బాధ ఎప్పుడూ పడలేదన్నట్టు. పెద్దాడు 'అమ్మా కేడీ చాకు ఎక్కడపెట్టాడే ఒక్కటీ ఉన్నది ఉన్నచోట ఉంచడు,' అంటో డివైడరును మామకు యిచ్చాడు. డివైడరుతో ఓ గుప్పెడు నల్లులను నిర్దాక్షిణ్యంగా పొడిచేసి, కోటుతీసి గోడనెట్టి తమాయించాడు మేనమామ ప్రక్కనున్న చాపమీద. ఇక మతివచ్చిందేమో, మతితోపాటు, 'పూజారీ - కేడీ' జ్ఞప్తికివచ్చాయి. రాత్రి మామ పడక్కి మంచం కావాలి కాబట్టి, నల్లులను నిరవశేషంగా హతం చేసొద్దామని పెద్దాడు మంచాన్ని తీసుకొని దొడ్డిగుమ్మంకేసి పోయాడు. తహసీల్దారు చెల్లెలుతో మాట్లాడుతో, "ఏమే అమ్మాయి! వీళ్ళు సఖ్యంగా ఉన్నట్టు కన్పించదేమే ఖర్మం. ఒకడిని ఒకడు తిట్టుకొంటోన్నట్టు

కన్పిస్తారు!'' అన్నాడు. "పల్లెత్తుమాట అనుకోరు అన్నయ్యా నీకెందుకు తోచిందో'' అంది ఆమె. "యింకా ఏం అనుకోవాలే, ఏకంగా బూతులే తిట్టుకోవాలా, కలబడి కొట్టుకోవాలా స్కూల్ ఫైనల్ యీడొచ్చిన కుర్రవాళ్ళు అల్లా ఫెడీ ఫెడీ ఒకడిని ఒకడు అసభ్యంగా పూజారనీ, కేడీ అని అంటూంటే'' అన్నాడు. ఆ మాటల్లో తిట్టెక్కడుందో ఆవిడకు తెలియదు. అపట్నంలో ప్రతియింటా, నిత్యప్రసంగాల్లో వచ్చే మాటలేఅవి. అందరికీ జీర్ణించిన మాటలు ఈయన్ని ఎందుకు వికారం పెడుతున్నాయో ఆవిడ గ్రహించలేకపోయింది. ఇంతలో పెద్దాడు వాకిట్లోకొచ్చాడు. మామకు వాటి వ్యుత్పత్త్యర్థం చెప్పాడు. సంకేతితార్థం విప్పిచెప్పి, మామను సంతుష్టాంతరంగుణ్ని చేసాడు మరుసటినెల్లో మామకూతుర్ని చేసుకున్నాడు.

ఆనాటి తణుకులో పూజారి, దేవుడి లిటరల్ పూజారి కాడు. యీనాములు అనుభవించే పెత్తందారు కాడు. తణుకుపూజారి మెటఫర్. తణుకులో పూజారి నామం మిగతావూళ్ళ పూజార్ల నామంవలె సంకుచితం కాదు. సువిశాలం. మిగతా గ్రామాల్లో దేవుడిగుళ్ళో నిత్యధూపనైవేద్యాలు చేసే పాతపొత్తుపంచి ముసెచార్యులుగారే. పూజారిగాని, ఆయన అభిమానులు, స్నేహితులు, ఆయన పెట్టిన చిట్టిగార్లు కరకరలాడించేవాళ్ళూ పూజార్లుగారు. తణుకులో పూజారి నామధేయునితో సంపర్కాత్సంపర్కాత్సంపర్క అన్నట్లు, పదిపండ్రెండు వేళ్ళు విడచిన స్నేహితులూ, స్నేహితుల స్నేహితులూ పూజార్లక్రిందే జమ. పూజారి నామానికి యిలా వ్యాప్తి ఎక్కువైనకొద్దీ ప్రపంచం దాని సంకేతితార్థాన్ని మరచింది. అంచేతనే లాంగ్వేజి ని డెడ్ మెటఫర్ అన్నారుగా. ఆదిలో ఏ భావాల్ని ఏలాంటి అనుభవ మూసలో పోస్తే యీ శబ్దాలొచ్చాయో మరచేస్థితికొస్తాం, శబ్దాలు వారపారగావాడ్తో.

హెడ్మాస్టరుగారి గృహం కృష్ణాలయమనీ, ఆ గర్భగుడిచుట్టూ ఆలయ ప్రాంగణంలోయున్న కొట్లలోనే నివసిస్తూ, బహుజన్మ పరంపరా కలుషనివారితమగు గోస్తనదీతోయంలో కృతస్నాతులై, భక్త్యావేశంతో, శుశ్రూషాశాశలంతో, విద్యల విసర్జించి హరిపాదాంబుజ సేవచేస్తో, పర

మానందంతో ఆ దేవదేవు దివ్యతీర్థప్రసాదముల నందుకొంటూ, అయ్యావి వంటబట్టినకొద్దీ క్రొవ్వి, కన్నూ మిన్నూ గానక సాధుజనుల సోదర విద్యార్థుల హింసింప సమకట్టి, మాయావేషంలో వారి రహస్యసంభాషణల సేకరించి, మాటలు చేరవైచి, స్వామి సాన్నిధ్యమున వారిని క్షుద్రదేవతల సేవిస్తోన్న దుష్టక్రియాలోలురుగా నిందించి, ఆ ధర్మవిఘాతుల దండించి తమ్ము రక్షింపమని ప్రార్థించి, అభిమతార్థసిద్ధికై స్వామిని "సమస్తంబు గల్పింప, బాలింప, దూలింప నీవ సమర్థుండవు. నీ కసాధ్యంబెయ్యది, నీవు ఉపేక్షించిన శిష్టజనోపద్రవంబు ఘటించు దయాద్యలంకృత దివ్యమంగళ విగ్రహా! ఆపద్బాంధవా! కృపామయలోచనా! కృష్ణా" అని ఏప్రొద్దు ప్రార్థించే విద్యార్థులు పూజార్లు అనబడేవారు. యిట్లుండక, అల్లరకు మరగి, మొఱకుతనంతో గొప్పకు బడిలో తిరుగుబాటుచేసే బ్యాచ్‌కు ప్రారంభంలో ఒక కేడీ ఆచారి శరణ్యం కావడంవల్ల హెడ్మాష్టరుగారి వైరులను చిల్లరీ, మల్లరీ, మంచీ చెడ్డా యావన్మందినీ పూజార్లు, కేడీలని పిలుచుకొని తమ ప్రేమ గుమ్మరించేవారు.

♦ ♦ ♦

## యుద్ధం - బడిలో

1912లో జార్జిచక్రవర్తిగారి దర్బారుదినాలు మా హెడ్మాష్టరు గారి జీవితంలో అంధకారావృతమైన అమావసనిశి. విపక్షులకో, సంపూర్ణ పూర్ణిమాచంద్ర చంద్రికనొప్పు రమణీయ శారదరాత్రులు. పూజార్లు కింకర్తవ్యతా మూఢులై యున్నారు. కేడీలు సంతోషస్తోకుల వైఖరి పెచ్చు పెరిగి, విచ్చలవిడి తొడగొట్టి వీరవిహారం చేస్తోన్నారు. అపక్షం ఉన్నతోద్యోగులు, పలుకుబడిగల గొప్పకుటుంబీకులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, ఒక్కపెట్టున ఏకమై హెడ్మాస్టరుగారికిస్తోన్న అంతిమ పోరాటం. పాంపే ప్రాణానికి ఫిలిప్ లా, నెపోలియన్ కు వాటర్ లూ లా

హెడ్మాస్టరుకిది అంత్యయుద్ధమని, ఆయన అంతంచూడగలదని, గ్రహ బలంచూచి దైవజ్ఞశిఖామణులు చెప్పగావిని, కేడీలు సంగరోత్సవ సంభ్రమోత్సాహులై యున్నారు. కొద్దివారాల్లో హెడ్మాస్టరును మద్రాసుకంట తరిమి, బడికి పుణ్యాహవచన కార్యం, నూతన శకప్రారంభోత్సవం జరుప సంసిద్ధులై యున్నారు. 'విజయము మందేరా భారతవీరకుమార' అని కేడీలు ప్రభాతభేరీలను నిత్యం పాడ్తోన్నారు. ఓడినట్లో, హెడ్మాస్టరు అభేద్యుడు అచ్ఛేద్యుడు అని నిండుసభలో వప్పుకొని, ఆయనకు ఏకచ్ఛత్రాధిపత్యం వదలేసి తాము తపోవనాలకు తరలిపోనిశ్చయించే, యీ అంతిమపోరాటం చేస్తోన్నామని యుద్ధప్రారంభదినాన్ని కేడీనాయకులు పలికారట.

కేడీ నాయకులింత ఘోరప్రతిన పూనుటకు కారణంలేకపోలేదు. నెగ్గితే దురాగ్రహం, ఓడితే సత్యాగ్రహం చేస్తామంటో ఆగ్రహాసత్యాగ్రహాలను రెంటిని కరగి పోతపోసిన కలుకు ప్రతిన కారణం గతమాసంలో వారిని గాయపరచి, ఎముకెముక సందునాదూరి కొరికి వార్ని వేధిస్తోన్న పరాభవవిషయం తెల్సినవారికి సుగ్రాహ్యమే. ఎందరెందరో వూళ్ళంట తిరిగి సొంతంగా సంతకాలు చేయించుకొచ్చిన మిలినరీ పిటీషను విద్యాశాఖాధికారులకు అందిన ఉత్తరక్షణంలో నోటీసు యీయకుండా హఠాత్తుగా ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు మేనాలో బడిగుమ్మంలోదిగారు. వారు గరిగిపాటి సుబ్బారాయాగ్రణి. ప్రఖ్యాతోద్యోగి. మన ప్రాంతాల్లో 1 st B. A. అని ఖితాబు. ప్యాసయి మదరాసునుంచివచ్చినరోజునవారిని రాజమండ్రీ పౌరులు బాజాభజంత్రీలతో కాగడావేసి, అమ్మవారి జాతర విధాన అమితోత్సాహంగా ఉత్సవం చేస్తో గ్రామంలోకి తోడితెచ్చి నాల్గువీధులమొగనునిల్పి కొబ్బరికాయలుకొట్టి నీరాజన మిచ్చారని ప్రతీతి. ఆ ప్రథమాహ్వాన దినాన ఆయనకు గారెలువండి పెట్టారనో, లేక గారెలు వారికి అభిమాన భోజ్యమో కాక, వారింటిపేరు ప్రారంభంలోని గరి, పిండివంటల్లోని గారి హృద్యంగా Rhyme అగుటచేతనో, అల్లరి పిల్ల కాయలు ఆయనవెళ్ళిన తర్వాత 'గరిగిపాటి సుబ్బారాయ, గార్ల దొంత రాయ' అంటో చాటువులు చేప్పేవారు.

మహమ్మదుస్మాన్ గారి పన్నాని అతిగారాబంగా పెంచిన శరీర ధారి. కాని పెద్దశిరస్సు, సువర్ణచ్ఛాయ. తేజస్వి, మల్లెపూవులాంటి తెల్లని లాగు, కోటూ. క్రోపధారిఅయినా ధర్మకర్మపరతంత్రుడని ప్రఖ్యాతి. మేనాలోనుంచి కాళ్ళు యివతలకొచ్చిన అయిదు పదినిమిషాలకు నెమ్మదిగా వారి ఉత్తమాంగం బయటపడేదాకా ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు 'ఆ' వచ్చిందని ఎవరూ ఎరుగరట. వస్తూనే హెడ్మాష్టరుగారు ఇంగ్లీషు బోధి స్తూన్న ఆరవ ఫారం ఎ. వద్దకు వచ్చి 'నీవేనా హెడ్మాష్టరు' వని సింహ గర్జనచేసి తన రెండువందలపౌన్లనీ హెడ్మాష్టరుగారి కుర్చీలో చేరవేసి కర కరలాడుతో కారాలు మిరియాలు నూరుతున్నాడు, పాత్రం సన్నికల్లూ అవసరంలేకుండా. ఎన్నడూ ఈశ్వరుని హంకార హుంకారములకుకూడా జడియని మా హెడ్మాష్టరుగారు 'చిత్తం' అంటో కించెత్ సేవాధర్మం చూపారు. అప్పుడు హెడ్మాష్టరుగారు క్లాసులో 'character of a happy life' అన్న poetry peace బోధిస్తోన్న సమయం.

"How happy is he born and taught
That serveth not another's will
Whose armur is his honest thought
And simple truth his utmost skill.
Whose passions not his masters are,
Whose soul is still prepared for death,
Not tied unto the world with care
Of public fame or private breath."

మొదటి నాల్గుపంక్తులూ చెప్పడమైంది, మిగతా నాల్గులైన్లు చెప్తోన్నారు. హెడ్మాష్టరుగారు ఏమిటిసెలవు అన్నట్లుగా ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు వైపుకు తిరిగారు 'తొందరపడకు చెప్పడానికేవచ్చాగానీ, కానీ చెప్పే పాఠం కానీ' అని ఉటిమాటాయన. హెడ్మాష్టరును కొరతవేయడానికే వచ్చాడని ఆ కఠోర కంఠధ్వని కేడీలకు విశ్వాసంకల్గించింది. గ్రామంలోకి హెడ్మాష్టరు అవస్థపడిపోతున్నాడు, అఖరిఘుళ్ళల్లో ఉన్నాడని అంచల

మీద టపాలందేస్తోన్నాయి. హెడ్మాస్టరు పతనం స్వయంగా చూచి ఆనందించాలని బడిసరిహద్దుల్లో పార్టీజనం చేరుతున్నారు. 'ఏమి ఎగిరి పడ్డాడురా' అంటో 'యిప్పుడెక్కడికి వెడతాడురా' అంటో మూకల సహజధోరణిలో చెప్పుకుంటోన్నారు. 'పిటీషన్లు పెట్టినవాళ్ళూ ఉన్నారు. కాని మన పిటీషను అందం దేనికి రాదులేరా. మా గొప్పసాకంలో పడిందిలే' అని సంతకాలు చేయించిన ఆసాములు ప్రగల్భాలుకొడ్తోన్నారు. 'సిద్ధాంతిగారు శుభంచెప్తే ఏమోకాని అశుభంచెప్తేమాత్రం అమోఘంగా జరిగితీరవలసిందే. గ్రహబలం బాగాలేదు. ఈయనకిపుడు ఉద్వాసం తప్పదు అన్నాడుగా. చూచావా ఏలా దాఖలాయిచ్చిందో' అంటోన్నాడో జ్యోతిషశాస్త్రాభిమాని. పాక్షికులు ఎవరిపార్టీముంగం వారు బార్ రూమ్ వద్ద చర్రున కల్సుకొని వారివారి కేసుల్లో వాయిదాలు ప్రయత్నం చేసికొంటోన్నారు, ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు వచ్చను నాల్గు గంటలలోపల డిప్యుటేషన్ వెళ్ళడానికి. ఈవాళ పరీక్షచేసి మందు మారుస్తామన్నారు' అంటో 'వెంకమ్మా' అని ఒక పేషెంటు కేకేసేసరికి ఆవెంకడు డాక్టరుగారి ఆఫీసు టేబిలుమీద పెడ్తోన్నాడు – మూత్రంసీసా గాబోలు. డాక్టరుగారు దాన్ని చూచి చీకాకుపడి కాంపౌండరును కేకేసి 'వీరికీవాళకూడా నిన్నటిదోసే. పరీక్ష రేపూ. యీసీసాకూడా నాఆఫీసు టేబులుమీదకేనా ఖర్మం?' అంటో వంకినున్న కోటుతీసి ధరించుకుంటోన్నారు. 'అయితే యీసీసా యిక్కడ జాగ్రత్త పెడతారా నే జాగ్రత్తపెట్టి రేపు తీసికురానా' అని రోగి అడిగాడు. 'ఎవ్వరూజాగ్రత్త పెట్టనక్కరలేదు-యింతోడి ఘనపదార్థం. వలకపోసి రేపు మళ్ళాపట్టి తేమనవోయి కాంపౌండరు యివికూడా ఎక్కడచెప్పనోయి పేషెంటులకు.' 'చిన్నమూతి సీసాలో చచ్చిపట్టానండీ ఖర్మం మళ్ళా రేపంటే ఏ-ఏ-' అంటో నసుక్కుంటో పోయాడు పేషెంటు. వెనకాల సీసానూరేగిస్తో వెంకడున్నూ. యింత రుసరుసలకీ కారణం డాక్టరుగారికి ఎప్పుడుపోయి పార్టీడాక్టరులను కల్సుకొని పార్టీ కార్యనిర్ణయంచేతునా అన్నతొందర. 'హెడ్మాస్టరుగారు యీవాళతో యీవూరినుంచి వెడతారుష, మాఆవిడ

చెప్పింది. ఇంతకు శాస్త్ర చదువుకోవాలన్న బుద్ధి ఉన్నవాళ్ళను ఆయన ఏంచేసాడయ్యా సుబ్బన్నశాస్త్రుర్లూ- తెలియకడుగుతాను?' అన్నారు రామావధాన్లుగారు భోజనమయింది కాబోలు తేన్చుస్తూ. 'మీవాడంటే ఆయనకు యిష్టంకాబట్టి నీవు అలాగే అంటావయ్యా. ఎంతమంది ఆయన ప్రాణానికి ఏడ్చిపోతున్నారో నీకేం తెలుస్తుందిలే.? తిన్నఅమ్మకి ఎదర ఆకలి తెలుస్తుందా!' అన్నాడు సుబ్బన్నశాస్త్రుల్లు గామంచా పిండుకుంటూ భోజనానికి లేవబోతో. ఆయన మేనల్లుడు ఆసంవత్సరం పరీక్షతప్పాడు కూడా. బడినౌకర్లలో సూరిగాడు తిరపతిగాడ్ని చూచి, 'యీపాటికి వడి తగ్గించు మదేలూ'అన్నాడు యెద్దేవాగా. తిరుపతిగాడు పూజారీ; సూరిగాడు కేడి. ఈవాళ అజమాయిషికి వస్తానని ఎరుగుండి పాలాల కర్ణం ఎక్కడికి పోయాడు' అని చిందులు త్రొక్కుతున్నాడు రెవిన్యూ ఇన్సెపెక్టరు. యీలా నాల్గుప్రక్కలా ఊరు అంటుకోంది అరగంటలో.

క్లాసువిషయం ఇన్స్పెక్టరువారు పాఠం కానీమన్నారుకదా అని హెడ్మాష్టరుగారు 'క్యారక్టర్ ఆఫ్ ఎ హేప్పీలైఫ్' లో తరువాయి నాలుగు పంక్తులు చెప్పారు. ఆరోజు హెడ్మాష్టరుగారి బోధనాక్రమం అత్యున్నతస్థాయీ నందుకోంది. వీణాదక్షుడగు ఉత్తమవైణికుడు - సంగమేశ్వరశాస్త్రిగారి కచేరీలా ఎంతో శ్రావ్యంగా, ప్రశాంతంగా, గంభీరంగా విద్యార్థులను తన్మయులను చేసింది. పూజార్లకు కూడా రోజూ యీయనమీద పిటీషన్లుపెట్టినా దోషంలేదనిపించింది. ఒక్కసారైనా అలాంటి బోధన చెవినిపడ్డేగాని విద్యార్థిజీవితం సఫలంకాదని తలచాం. రక్తాంతలోచనుడైన ఇనస్పెక్టరుగారి కళ్లల్లోనుంచి ఒక్కొక్క యర్రజీరే మాయమగుతోంది. ఆయన నుదుటిని క్రమ్మిన ఒక్కొక్క చిరుమేఘమూ దూదిపింజలా ఎగిరిపోతోంది. తిరుపతిగాడు రెండుగంటలు కొట్టాడని ఒక్కళ్ళం ఎరుగం. హెడ్మాష్టరుగారే ఎరుగరు. ఇనస్పెక్టరుగారికి తెలియనే తెలియదు. మూడోగంటలో

'Not tied unto the world with care
of public fame or private breath'

అన్న పంక్తులు చెప్తోన్నారు. అయ్యా ఆపంక్తులు చెప్తోంటే ఏతం పోతను ప్రతిపాదిత్యాలు గుమ్మరించారు కాని తాము వ్రాసుకున్న నోట్సు లోనుంచి మిళ్ళిగరిటె పనియా? రససముద్రం జాలువారిందంటే నమ్మండి. ఇనస్పెక్టరుగారి ముఖకమలం వికసించింది. అదేం ప్రసాదగుణమో కాని గానక చేరీలోవలెనే చిన్నకుర్రాళ్ళము. అప్పైసంగతి తాముసగలమన్నట్టు కన్పించనా? పబ్లిక్ ఫేమ్‌ను వ్యాఖ్యానిస్తో ప్రపంచ కళ్యాణార్థం, జీవితాలను త్యాగంచేసిన కీర్తికాయుల్ని ఎందరిని ఎన్ని 'ఏస్పెక్ట్స్ ఆఫ్ లైఫ్' లోనుంచి ఎత్తి చిన్న చిన్న కథలుగా చెప్ప యువకహృదయాన్ని ఉద్దీప్తం చేసారు! మా హెడ్మాష్టరుగారి కళాకౌశలం, రాచకార్య ధురీణతా ప్రదర్శనాలకి ప్రైవేట్ బ్రత్ యొక్క వ్యాఖ్యానం వినియోగించుకొన్నారని తోస్తుంది. పబ్లిక్ ఫేమ్ గడించిన మహామహులుకూడా స్కాన్డల్ కు గురి అవుతారు. కాని ఆ ఫేమ్ ను కాని ఈ స్కాన్డల్ ను గాని సరకుకొనరని చెప్తో ఔచితి చెడకుండా యుక్తియుక్తంగా మంచి నేర్పుకూర్పులతో రథాన్ని నెమ్మదిగా తన స్వీయచరిత్రా ప్రకృతఘట్టంలోకి త్రిప్పారు. స్కాన్డల్స్ కు జన్మస్థానం 99% Inferiority complex అనీ Inferiority complex దట్టంగాపట్టిఉన్న నేలలో విరివిగా ఫలపుష్ప సమన్వితంగా scandal mongering పెరుగుతుందని ఒక రచయితను ఎత్తిచెప్పాడు.

ఇక పైనచూపింది కేవలం చాణక్యప్రతిభయే. అనన్యసామాన్యం. గ్రీసియన్ హిష్టరీలోనుంచి ఏరిస్టైడిస్ ను ఎత్తి కరుణారసం ఉట్టిపడేట్టు బాలుర హృదయాలు స్రవించేలాగ 'Popularity is rarely the reward of the gold of character but of it's alloy. The Athenians who made a popular hero of Alcibaedes banishes Aristides because they got tired of hearing him called the just' అని చెప్పారు. అప్పుడు బాలుర నుద్దేశించి, 'Boys, if you have any love left for your headmaster, never call him a good man in this town'

అన్నారు. చూచారో లేదో పిల్లలు కథ వింటోన్నంతసేపు ఆ కథావిషైక ఘటనలలో కలిగే క్రోధ, విషాద కరుణారసాలు ఆపిల్లల ముఖములలో ప్రతిబింబిస్తోన్నట్టుంటుంది. హెడ్మాష్టరుగారిని గ్రామస్థులు పెడ్తోన్న బాధకు ఆయనపై జాలి ఒకప్రక్క, గ్రామస్థులపై ఆగ్రహం ఒకప్రక్క విద్యార్థులకు కల్గుతోన్నట్టు విద్యార్థుల ముఖాలు సూచించాయి. అలా ఫినిష్ యిచ్చి హెడ్మాష్టరుగారు వాచీతీసి చూచుకొన్నారు. ఇన్స్పెక్టరు గారుకూడా వాచీచూచుకొని 'మూడుగంటలు కూర్చున్నామా! అంటోనే లేచి హెడ్మాష్టరుగారిని కౌగిలించి, 'Ah! Mr. Krishnarao, it has been a regular treat to me for these three hours. I'm reminded of Mrs. Besant in every turn of your phrase and that accent. You have imbibed her diction and accent in full. Have you been to England any time. Sorry, this is too small an institution for your scholarly attainments. These petitioners do not seem to know what they are about, what good fortune they are frittering away' అన్నారు. హెడ్మాష్టరుగారు దేనికి దానికేగ్రంథసాంగులుగా! ఇక ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుని చంటిపిల్లాడిని చంకనేసుకొని తిరిగినట్లు నవ్వుతో కబుర్ల చెప్పుతో క్లాసులమ్మట తిప్పా డాయన్ను. 'ఇంకేముందిరా తర్వాతా. ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ నే బుట్టలోవేసుకొన్నాడురా' అంటో లబాయిలుదిబాయిలు బయల్దేరాయి కేడీపార్టీలో. అసలు ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ కౌగలి యిచ్చినప్పుడే నడుములు విరిగాయి పిటీషనులకు. 'హెడ్మాష్టరును తీసెయ్యాలని తీసి కొచ్చినవాడు ఆయన్నిముద్దుపెట్టుకొని పరిష్వంగముచేసి చక్కా వెళ్ళినా! కాటుకఅని కంట్లోపెట్టుకుంటే కారం కానా' ఇక ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ మీద ఎవరికి పిటీషన్లు కొట్టాలో కనుక్కోడానికి మంచం పట్టునివాళ్ళు, పార్టీ క్లీడర్లవద్దకు వెళ్ళారు.

గత మాసంలో పార్టీకి కల్గిన అవమాన వ్యధయిది. ఆ పరాభవ ఫలితంగా ద్వేషవహ్ని ప్రజ్వరిల్లి, 'ప్రేమలతన్ దహించు పగ వేడి పొగల్'

అలుముకున్నాయి. ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సునె కట్టేసాడు కాబట్టి యిక ఆ డిపార్టుమెంటును నమ్మి లాభంలేదు. అందుచేత కేడీ అష్ట దిగ్గజాలు, నైచ్యానికి పాల్పడి, ఉచ్చులొగ్గి హెడ్మాష్టరును రచ్చకీడ్చించి క్రిమినల్ కోర్టులో శిక్షింపించుటకు అభియోగాలు పన్నారు.

♦ ♦ ♦

## మాయావి - మంత్రాంగం

ఆదిలో, ఈ అభియోగోపాయం ఉపాధ్యాయుల ఉపజ్ఞాఫలితం కాదు. అందు ప్లీడర్ల రాచకార్య కౌశలమేమీ లేదు. డాక్టర్ల మాత్ర కట్టూ మంత్రాంగం కాదు. 'దైవం ప్రతికూలిస్తే పురుషకారం వ్యర్థం' అని సరిపెట్టుకొని, తమతమ నిత్యజీవితంలో నిమగ్నులై పార్టీగొడవ మరచారు నిజానికి కొంతకాలం. ఈ దభా పూజార్ల నోళ్ళు రెచ్చాయి. కేడీ అన్న వాడు కంటబడితే అవహేళనా నిందాప్రసంగం, నడివీధిని చేయడం మొదలెట్టారు. మనిషి శరీరంలో మాట్లాడడానికి అమర్పబడ్డ అవయవాలు బహు ప్రమాదకరమైన వనిన్నీ, వాటిని అదుపులో పెట్టుకోలేకపోతే అవి భస్మాసుర హస్తాల్లా పరిణమించగలవని యీ మధ్యనో రచయిత వ్రాశాడు. ఆసూక్తి పూజార్లపట్ల నిజమయింది. కేడీ పార్టీ ఉపాధ్యాయులు, ప్లీడర్లు, డాక్టర్లు, తక్కుంగల పెద్ద మనుష్యులు యీ పూజారి పీడ, వీరి తిర స్కార పరిహాసోక్తులు భరించలేకపోయారు. వారి కొందు ఉపాయాన్వే షణము ఆవశ్యకమైంది. కాని జరిగియున్న అవమానంతో ఏ కొంచం సతోత్సాహాలూ లేకుండా మంచంపట్టి యున్నారు. అందు వల్ల యావన్మందీ కట్టకట్టుకొని పోయి, గోస్తనదీతీర పరిసరాల్లో వసి స్తోన్న ఒక మాయావి, ముసలిమల్లు, వికలాంగుని యిల్లుచేరి, అతడికి సర్వాంగాలింగిత భూతలంబుగ ప్రణమిల్లి, సబాష్ప నిమీలిత లోచనులై పూజార్ల హింసాకాండా వృత్తాంతం, తమ దుస్థితీ ససాకల్యంగా చెప్పి

తరుణోపాయం కోరారు. 'నిన్నటివరకు తేతలిక్షత్రియుల హతమారుస్తోన్నా, ఇంక హింసాకర్మకురోని మునివృత్తి నున్నాడ. అయినా మీపార్టీకి సాకలయు సాయంచేయ బద్ధకంకణుడ' నని వారిని సజీవులను చేశాడు. నిమిషమాత్రమాలోచించి 'వెఱుగుపాటు తెఱుగు కాదు. ధైర్యంవహించండి. అనవద్యమగు విద్య, అవక్రమగు విక్రమం కల్గిన అశత్రుని పిటీషను విధానాలతో విద్యారంగలో ఎపుడూ జయించలేరు. ఉపాయంచే నేయది శక్యంబు నాయది పరాక్రమశతం చేతనయినా శక్యం కాదన్న పంచతంత్రి వాక్యం వినలేదో? ఉద్యమం నాకువదలి, నాకేకకు వేచి ఉండు'డని వార్లనిళ్ళకు పంపించాడు. తాను, ఊరిచివర పూరిగుడిసెలో జరాభారంతో బక్కచిక్కియున్న చప్పిదవడల వేశ్యమాతను రప్పించాడు.

## కోర్టులో — మంగ

మూడోరోజు మధ్యాహ్నం హెడ్మాష్టరుగారు పెరవలిరోడ్డునున్న క్లాసులు చూడబోతో వంతెనెక్కారు. కేడీ ముఖ్యు లయిదారుగురు అచ్చట యాతాయాతజనంగా తచ్చాడుతున్నారు. మరి పదిగజాల దూరం సాగేసరికి– మాయావి పంపున వచ్చియుండాలి– వేశ్యమాత జాన్నంటి ఒక నిషాద స్త్రీ వస్తూన్నది హెడ్మాష్టరుగారి కెదురుగా. ఆ నిషాద స్త్రీ తరుణవయస్కురాలు. ఆపైపై మెయినిండ పూయబడిన మంచిగంధపుపూత, పాముకుబుసంవంటి మార్దవంకలిగిన కట్టుపుట్టం కన్పిస్తోన్నాయి. కొప్పులో గన్నేరుపూలు, పంచరంగుల బంతి కుసుమస్తబకం, లోచనమోహనంగా ఉన్నాయి. శరీరవర్ణదృష్ట్యా, రూపంకోయిల. సన్ననేతనూర్తుల నడికరలో యొన్నడూ ధరించియుండలేదో, లేక కందర్పబాధిత అయియున్న స్వచ్ఛందజీవియో, అడుగడుగునా చీర పైటకొంగును జొడ్డదగ్గర దులిపి భుజాలమీద వేసుకుంటోంది. పూరిగుడిసెలో యువతిక

ఆ గూడెం అంతా గుబాళించిందేనట ఆ మంగ సౌందర్యం. ఆమె పేరు మంగ. శ్రీహరికి కూతురు కాదు మంగ. మాయావివద్దనుంచి వెళ్ళిన తర్వాత శ్రీహరి మంగతో మంతనాలు చేసి, మంగకు తల్లిపాత్ర ధరించింది. ఉభయులు హెడ్మాష్టరుగారి దరిదాపులకొచ్చారు. కాని కొంచెం రసభంగం కల్గింది. మాయావి, శ్రీహరి నేర్పిపెట్టిన వియోగవేదనా లక్షణాలు వేళకు మంగ మరచిందో, భయవిహ్వలతనొందిందో వంతెనకమ్మీలు పట్టుకొని సుడిగుండం చూస్తో కార్యం మరచినట్టుంది. అంచేత శ్రీహరి మాట సుతిలేనిపాట, పెళ్ళికుమార్తెలేని పెళ్ళి అయి యూరుకొన్నాయి. శ్రీహరి వయస్సులో ఎన్ని ఆటుపోట్లలో గడ్డకట్టి, కాకలుతీరిందో, అది మాత్రం నసుగు బెసుగులేకుండా మాయావి చెప్పిన మాటలన్నీ వల్లించింది. అనురూపవయశ్శీల, సంకల్పగుణాకర, భర్తృవాంఛాపరయైన దేవహూతిని తండ్రిచూపినట్టుగానే మంగని చూపి తరుణీభిక్ష పరిగ్రహింపుమని హెడ్మాష్టరుగారిని కోరింది. ఆలయం కీర్తన ఒకటి అభినయ యుతంగా బోసి నోటినే పాడిందంటారు.

"మనసుకే కనుగప్పి మధ్యపరచ ఫలితమేమిరా" అన్నదో.

కాక సారంగపాణిగారి శృంగారగీతమో.

"దానికెవ్వరుసాటీ – ఆవెలది నీకేతగురా రాజకిరీటీ
మానితవరగుణపేటీ నీపై – మరులుకొన్నదిరా మాబోటీ."

ఇంతలో వంతెనమీద బళ్ళు తప్పుకోటంలో శ్రీహరి, దేవహూతీ వెనకపడిపోయారు. హెడ్మాష్టరుగారు తప్పుకుని క్లాసుకు వెళ్ళిపోయారు. తర్వాతరోజు పదిగంటలకు మేజస్ట్రేటుగారి ఆఫీసులో గుమ్మం దగ్గర రామన్నకు వాలంటీర్ ఎవడో మంగ దాఖలాచార్జి అందిచ్చాడు. ప్రథమ వాఙ్మూలానికి మూడు కేకలేసినా, ఊరంతా తిరిగినా మంగజాడ తెలియలేదు. కేడీ పక్షం కాలుకాలిన పిల్లుల్లా ఆ సాయంత్రం మంగకోసం తిరుగుతూనేయున్నారు. 'పూజార్లెంతపని చేశార్రా అంటే, కడుపులో అన్నం తీసుకుతినే జాతిరా వీళ్ళు' అని సాయంత్రం గొల్లుమన్నారు. పూజార్లు కారణులవుదురో కారో వివాదాంశం అయిందికాని, జరిగిన

విషయం పూజారి ఫ్యాన్ తిరపతిగాడి పెత్తండ్రి కొడుకు కో రజకరసికుడు మంగ వంతెనమీద సింగారంమీద యున్నపుడు చూచాట్ట. మంగలేని బ్రతుకెందుకని అక్కడే అనుకొన్నాట్ట. రాత్రి మాయావి ఇన్‌స్ట్రిక్షన్ తీసికొని చార్జీమీద సంతకంపెట్టి మంగ యింటికొచ్చిన తర్వాత 'లోక ముతో మనకేటికి లోలాక్షి పోదమురా' అంటూ చెవిలో పాడుతూ మంగను లేవతీసుకుపోయాడు.

కార్యభంగం కలిగినందుకు పార్టీప్రధానులు ఖేదించలేదు. విధా నంలోని లోపాలోపాలను విమర్శించుకొని, నిలదొక్కారుగాని, నిరు త్సాహం చెందలేదు. 'స్వభావ చపలత్వంగల స్త్రీని, స్త్రీయే కాకుండా నిపాద స్త్రీ, పైగా స్వచ్ఛందజీవి, దాన్ని నమ్మి చెడ్డాం, పొరపడ్డాం' అని సరిపెట్టుకున్నారు. పార్టీ నియమావళిని అనుసరించి నోరెత్తకపోయినా విద్యార్థులుమాత్రం యీవిధానాన్ని గర్హించినట్టే కాస్త గుసగుసలు విన్పించాయి. పూజారి సైప్ల వీధికెట్టిన ఒక కేడీ విద్యార్థి సంభాషణ నిందు పొందుపరుస్తూన్నా. నారాయణరావు, రామారావు యిద్దరు కేడీ పార్టీ విద్యార్థులే.

రా:— శిఖండిని ముందెట్టుకు యుద్ధం చేయడమనేది, ఐడియా భారత సాంప్రదాయం, సనాతనం, స్తవనీయమే. మాయావి బుద్ధిచాతు ర్యం కొనియాడదగ్గదే. ఏమైతేం, మంగ హెడ్మాస్టారుకు ఎదు రుగావెళ్ళి, చేయిపట్టి విరహవేదన నభినయిస్తుందనుకొన్నాడు మాయావి. కాని ముహూర్తసమయాన్కి విముఖియై ప్రకృతి సౌందర్యారాధనచేస్తో పార్టీ కర్తవ్యం మరుస్తుంది అనుకున్నాడా, అప్పుడే చాకలాడు మంగమీద కన్నేస్తాడని కలకంటాడా!

నా:— ముసలిముల్లు ఏమనుకుంటే ఎవరికొవాలి. అయిన అరవైరూపా యల చీరా- పాపం అప్పటికప్పుడు తాతయ్య కొట్టులోనుంచి పరుగున తెచ్చారు, సైన్సు మాష్టారు- పొట్ట నెట్టుకొని ఠింగురంగా అని ఉడాయించింది మంగ. నాకు మరెందుకుకాదు కాని, ఆచీర అది కట్టుకు రోడ్డెక్కితే కేవలం తాము కట్టుకున్నట్టే కుళ్ళికారు

మన పార్టీ పెద్దలు. మరున్నారీశిరోరత్నం అని మత్తగజేంద్ర సమానగామిని అని పద్యాలుకూడా చదివారు కారు నయమే, ఆ మత్స్యగంధిమీద. మాబాగా జలుబు వదల్చిందిలే మళ్ళిప్పుడు యీలాంటి పిచ్చిపిచ్చి పన్లు మీదపెట్టుకోకుండా.

రా:—వెధవ అరవైరూపాయలకు బెంగపెట్టుకోకపోతే, పోనీ మన పార్టీ పేరట ఒక కులటను, ఒక యింటిదాన్ని చేసి చాకలితో పంపించాం అని సంతోషించుకోకూడదేం?

నా:—సరి, పార్టీ అదృష్టం బాగుండి దాని కడుపున ఓతొండిమి బయ ల్దేరితే దౌహిత్రుడంటో చంకనేసుకోడం తర్వాయిగా చెప్పావు ధర్మపన్నాలు. నీకు వాళ్ళ దాంపత్యం అంత ఉబలాటంగాఉంటే, నీ వా బిడ్డను చంకనేసికొందుగాని, నీ వెనకాల శ్రీహరి అముదపు గిన్నె, పాలబుడ్డి చేతపట్టుకొస్తుంది. ఎంత పార్టీ కార్యమైనా విధంచెడి, నేనూరేగలేను సుమా. ఓరి దానిల్లు బంగారంగాను! ఆ డొక్కదవడల చీకు శ్రీహరి అదెక్కడ దొరికిందిరా మన పార్టీకి? అలా అని యీలా అని ఒక సాలు గ్రాసం లాగేసిందిరా మన పార్టీముఖ్యుల దగ్గరనుంచి, యీ లెక్క రెండువూటల్లోను. ఊరికే వచ్చినకొద్దీ ఏంమింగిందిరా నల్లమందు చలిమిడిముద్దల్లా? దానికి కారపూప్పసా, నల్లమందు అందిస్తోండడం పార్టీ నామీద పెట్టారు కాబట్టి నాకు తెల్సింది.

రా:—ముసలిముండకు కాస్త నల్లమందుమాత్ర అందిచ్చినందుకే, మాకష్ట పడ్డవాడికీ చెల్లకుండా మాట్లాడతావు. అమాత్రం పుణ్యం ఉంటుం దనైనా చేయవచ్చునే. మేమేంగాను? అరాత్రి నేనూ లెక్కల మాస్టారూ పడ్డ శోభ పూజారికైనా వద్దురాబాబూ. చీకటికోణం, దీపం పట్టుకెడ్తే చిక్కు పట్టుకువెళ్ళకపోతే చిక్కు; దారంట పలికితేచిక్కు పలక్కపోతే చిక్కు; ముసుగువేసినా ప్రమాదమే వేయకపోయినా ప్రమాదమే; అడుగడుగునా పూజార్లే. పల్లేరు కాయలు చల్లినట్టున్నారు కోడ్డంటూ ప్రక్కసందుల్లోను కూడా.

మేం కొన్ని కొన్నిచోట్ల నల్లికిల్లిపాముల్లా మెలికలు తిరిగిపోవలసి వచ్చింది. పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారు, అలయంపక్కనున్న పెద్దప్లీడరుగారు, ఆయన యింటిసందునా మాయావి యింటిసందునా లక్షసార్లు తిరగాల్సొచ్చిందంటే నమ్ము. మా నాన్నకు ఒక్క అర్ధణా పొడుం బజారునుంచి తెచ్చిపెట్టడమంటే ప్రాణం పోతుంది. ఆ బద్ధకమంతా ఏమైందా అనిపిస్తుంది. అప్పును పార్టీ పనిమరి. అంతా అయాక చార్జీ షీట్ వ్రాయడానికి ప్లీడరుగారు వారి గుమాస్తాను కేకేసుకురామన్నారు. ఆ గుమాస్తా విడిదె రాత్రిళ్ళు మరోచోట. ఆ మరోచోట, దాని తలుపుమీద పెద్ద చప్పుడు కాకుండా కృష్ణగాన చిటిక వేసినట్టు, లఘుశబ్దమయ్యేటట్టు వ్రేళ్ళతో మీటాం. ఖర్మం ఆరాత్రి గుమాస్తా అక్కడలేడు. మరోడెవడో చీంబోతులావున్నాడు. వాడు కర్రేసుకొని తలుపు తీసుకొచ్చాడు. పచ్చడిక్రింద దంమనుమమ్మల్ని. నేనైతే కాలికి బుద్ధిచెప్పి ఎగిరిపోయా. కాని లెక్కలమాష్టారు పరుగెత్తలేక దరిలో రోడ్డుప్రక్కను విప్పిన వంటెద్దుబండి ఒకటి ఖాళీగా వుంటే అమట్టునే దాల్లోదూరి, అచ్చంగా బండివాడిలా ముసుగు బిగతన్ని పరున్నాడు. ఈలోపల బండివాడొస్తే ఏమిజరగవలసింది చెప్పు పాపం ఆయనపని? చీంబోతు యింట్లోకిపోయి తలుపు వేసుకొన్నతర్వాత పిల్లికాళ్ళమీద రానా పాపం! జాలేసింది. బి. ఎ., యల్. టి. కి రాదగ్గ పాట్లాయివి. పార్టీపని ఆయెరి, ఏం చేసేది. ఇంత శ్రమపడే మాష్టర్లు దొరుకుతారా? ఏనాడో పెట్టిపుట్టాం కాబట్టికాని!

నా:—నీమాట కడ్డొచ్చా. మన మిద్దరమే మాట్లాడుకొంటోన్నాం, మూడోమనిషి లేదుకదా అని ధైర్యంచేసి అడుగుతున్నా. అయితే రామారావు, పార్టీపనే అను. పార్టీ అయితేమాత్రం అంతచేటు ఉచ్చనీచాలు లేని బ్రతుకు, బ్రతకాలా మనం మన మాష్టర్లూ? అనిపించింది మొన్నరాత్రి ఆ కాల్వగట్టు కాలనేమి యింటివద్ద

ఉన్నంతసేపూ. 'జన్మమాదిగా పదపడి ఎగ్గొనరించు' అని చదివామే ఏపాఠంలోనో, అలా పుట్టింది మొదలు తల్లీపిల్లా లేకుండా ఘోరాలుచేసి, హృదయం శరీరంకూడా చెడిన, ఆ చెడగజపు బోడికి, ఏమి విద్యాసంస్కృతులున్నాయని, వాడి ముందర జబ్బలు కట్టుకొని, మన మాస్టర్లు పిల్లిపిల్లలైపోనా! ఇక అక్కడ నుంచి వాడు మన హెడ్మాస్టారంతవాణ్ని, ఊళ్ళో పెద్దమ్మీడర్లను, ఆవెధవ, యీ వెధవ అంటో నోటికొచ్చినట్టు దూలుతోంటే ఆనందం వెలిబుచ్చనా? ఆత్మగౌరవం అనేది మచ్చుకైనా ఉందా వీళ్ళకు. ఇంతకు వీళ్ళు సాధిస్తోన్న దేమిటి? నీవేమనుకొన్నా సరే గాని, యీ బాపతువారి మాష్టర్లను గౌరవించలేమురా.

రామా:— నీవేనా, నారాయణరావు, ఆమాట్లాడేది. లేక కలకంటున్నానా? ఉక్కుముక్కలాంటి వాడవు పార్టీకి, మైనపుండ ఎప్పుడు అయ్యావురా? యీ మార్పు ఎప్పటినుంచి? కాస్త తగిలిందాయేమిటి పూజారి వాసన? మొన్న పూజారెవడో నీదగ్గరనుంచి హిస్టరీనోట్సు పట్టుకెళ్ళడం స్వయంగా చూచానని మన సభ్యుడొకడు పార్టీ సభలో ఊదితే, నీవాలాంటి పార్టీ ద్రోహానికి వడిగట్టే వాడివి కావని నిన్ను వెనుకేసుకొచ్చాను. అయితే ఏదో సంపర్కదోషం కలిగేయుండాలని తోస్తూంది.

నారా:—(చెవులు మూసుకొని) హరహరా! ఎంతనింద పడవలసివచ్చింది! నేనా! పూజారికా! హిస్టరీ నోట్సా! అన్న వాడికినోరెల్లా వచ్చింది? ఆరుమాసాల నుంచి పొస్తకంమీద పెన్సిలు చూపితేవట్టు. హిస్టరీ నోట్సు నేను వ్రాశానా? శనివారాది వారాలుకూడా యింటికి వెళ్ళకుండా, పార్టీకి సర్వకాలసేవ చేస్తోన్నందుకు యిదన్న మాట నాకు పార్టీయిచ్చిన బహుమతి. పూజారి సావాసం చేస్తోన్నాననడం కన్న యింకా మీరు చేయగల్గిన పరాభవం ఏమిటుంటుందినాకు? ఊళ్ళో పార్టీ ప్రజల ముఖం ఏమని చూడగలను? సందేహం ఏదో

కల్గితే నీతో చెప్పకున్నా నా, అదీ నేను చేసిన అపరాధం. సందే హంకల్గడం కూడా పార్టీ ద్రోహమన్న మాట.

రామా:— పార్టీ ద్రోహం అననుకాని, ధర్మసందేహం కల్గితే మెత్తపడ్తో న్నావు అన్న మాట. ఎవడు కాస్త మెత్తపడ్తోన్నట్టు కనిపించినా, పూజార్లు పార్టీని దెబ్బతీసారన్న మాటే. ఇక మనవాళ్ళకు మన మీద అనుమానం కల్గిందా, మనకు పార్టీలో ఉప్పు పుట్టదు. జాగ్రత్త, రెంటికీ చెడ్డవాళ్ళ మవుతాం.

వారా:— ఇస్సు! కొంపములిగిందిరోయి రామారావు! అపరుగత్తే చార్ల లాగు పూజారేగా, యీగోడ చాటునుంచి మన మాటలువిని, మూట చేరేస్తో న్నాడ్రోయి. గోడలకు పూజారిచెవులున్నాయిరా నాయినా. యీడుంళ్ళో, ఎల్లాబ్రతుకుతా మోగాని పట్టుకో, పట్టుకో అంటో యిద్దరూ పూజారిపిట్ట వెనకాల పడ్తారు, వాడినో దరువు తీయడానికి.

రోజులు గడుస్తున్నాయి. పూజారి పార్టీ గాడిపొయ్యిలా ఉజ్వ లంగా ఎగిరిపడ్తోంది. కేడీ పార్టీ పిడకల దాలిలా ధుమ ధుమలాడ్తోంది. ఒక్క దర్బారు ఉత్సవాలు తప్పితే, రెండు పార్టీలు ముఖా ముఖీగాకల్సే శుభా శుభాలేవీ జరగ లేదు. అప్పట్లో, చిన్నో పెద్దో వారాని కొకసారైనా సంఘర్షణ లేకుండా, పార్టీ చరిత్ర ఎప్పుడూ అంతస్తబ్దత వహించియుండ లేదు. అందరికి ఆశ్చర్యంగానే యున్నది ఈ స్తబ్దత. యథాలాభంగా సమీక్ష చేసే వారికి ఏలాయున్నా, నిజానికి చాలా గంభీరమైనది. ప్రళయం ముందరి ప్రశాంతత.

## ద్వితీయ యుద్ధం - దర్బారుత్సవములు
## ప్రెసిడెంటు పరాభవం - మనస్తాపం

దర్బారుత్సవాలు జరిగిన పదోరాత్రి, పత్రిపాణీ ప్రశాంత సుషుప్తిలో విశ్రాంతి తీసుకొంటూన్న నిశీథంలో తణుకులో ఆంజనేయస్వామివారి కోవెల సమీపంలో ఒక ప్రాణికి చావుబ్రతుకుల మీద యున్నట్టు దోరాటంపుట్టింది. చంద్రాస్తమయంలోపల, ఒక్క పర్యాయం చూచి వెళ్ళవలసిందిగా మామఅయిన మాయావికి కబురు వెళ్ళింది. పనుంటే ఎవరైనాసరే, కాలనేమి యింటికి వెళ్ళడమేకాని, అతణ్ని తమ వద్దకే రప్పించుకొనే సాహసం, ఎప్పుడూ ఎవరూ చేయలేదు. అంచేత, యీ విషయం పూర్వాపరాలు తెలియని కాలనేమికి కబురు కారణం దురూహ్యంగా ఉంది. యూనియన్ బోర్డు ప్రెసిడెంటూ, ప్లీడరూ అన్నానే అయన్ను ఏదో పురుగు ముట్టుకొని యుండాలనీ, పార్టీ కట్టి తనకు వప్పచెప్పి, ఆఖరిమాటలు చెప్పి పోవాలనీ తనకు కబురుచేసి ఉంటాడనీ అనుకొని ఏలాఉన్నవాడు అలా బయల్దేరాడు మాయావి. అవలిస్తే పేగ్రులు లెక్కపెట్టే మాయావి అభిప్రాయ పడ్డట్టే జరిగింది. కేవలం పురుగుముట్టుకోడం కాదుగాని విషం తలకెక్కి ఉన్నమాట వాస్తవం. మాట్లాడేదీ పార్టీ వ్యవహారమే.

పాపం యూనియన్ ప్రెసిడెంటు తలగడా సహితం పడకకుర్చీలో వాలి యున్నాడు. పార్టీ ఉపాధ్యాయుడొకడు మధ్య మధ్య టీ స్పూన్‌తో గ్లూకోజు కంఠలో పోస్తోంటే, గుటకేస్తోన్నాడు. అవయవ పటుత్వం తప్పింది. ఆపస్సోపాలు పడ్తోన్నాడు. వీధి గుమ్మంలోకే విని పిస్తోన్నాయి దీర్ఘనిశ్వాసాలు. పడక్కుర్చీ ప్రక్కను పళ్ళెం అనారోగ్య చిహ్నంకాబట్టి, 'ఏమోయి నాకు తెలియనేలేదోయి. ఎప్పటినుంచి' అన్నాడు, మాయవి, అదుర్దాగా అది శరీరరుగ్మత అనుకొని. శరీరరుగ్మత అయితే, ప్లీడరుగారి పార్టీలే, బోలెడుమంది భిషగ్వరులున్నారు. అల్లోపతీ ఎక్స్పర్టు అవసరమైతే, హాస్పిటల్ అసిస్టెంటు సర్జన్ తన పార్టీ సభ్యుడే. గోడనో చార్ట్ కన్పించదు. బల్లమీద మందుల సీసాలు,

పొట్లాలు లేవు. ఇకనో యిప్పుడో అన్నట్టు పైకి కన్పిస్తాడు. కాని, చక్కగా వచ్చేవాళ్ళూ వెళ్ళేవాళ్ళూ ఏనిండు లేదు వాకట్లో. 'నామాటేం చెప్పావురా నాయినా!' అంటూ కళ్ళుకుక్కు కుంటోన్న ముసిలమ్మలైనా లేరు. తీపర్రు మాట విన్పించడం లేదు. లోపలి గుమ్మంలో భార్య, అప్పగారూ ఉన్నారు. ఏం పుచ్చుకోమన్నా పుచ్చుకోడు. పలకరిస్తే చీకాకు పడుతోన్నాడు. సకలసుఖోపభోగ విముఖుండై ఎవ్వరితోడం బలుకకున్న నాతని మాయావి చూచి,

> "ఇన్ని దినములయ్యె నేటికి నాతోడ
> పలుకవిట్టులేల నీముఖంబు దీర్ఘనిశ్వాస
> ధూమ సంహుతులచేసి కలుషమయిన దయ్యె?
> ఏనుండగ నీవు సంతాపింపనేల?"

అని దగ్గరకు తీసుకొనే సరికి, 'విను, మాతుల, మాన ధనాఢ్యుడు సహియింప నోపుడె సపత్నుల వృద్ధియు, ఆత్మహానియున్' అని తలపైకెత్తకుండా కన్నీరుకార్చాడు యూనియన్ బోర్డు ప్రెసిడెంటు. మాయావి వానిని ఒడలంటి జూచి, మనస్తాపహవ్యవహదాహమున ఉడుకుతోన్నాడని గ్రహించి, కడు దుఃఖితుడై అన్నాడు "నీకు గ్రామంలో ప్రీతులే కాని, అప్రియులు లేరు. ఎటుచూచినా, నీచేతి జీతబత్తాలు తిని బ్రతుకుతోన్న వాళ్ళు లెక్కకుమిక్కిలిగా యున్నారీ పట్టణంలో. నీవు సంధ్యాలంకారాలు ముగించుకొని సాయంత్రం విలాసంగా రాజవీధిని బయల్దేరితే, నీదారి కిరుప్రక్కలా తణుకు నగర ప్రౌఢులు తమ దృక్కులతో తోరణాలు కడ్తారే! తమ హృదయాల్లో నుంచి బయల్దేరే ప్రశంసాతరంగాల్ని, నీరవంగా నీపాదాల పైన అభిషేకం చేస్తారే! నీ దర్శన మాత్రనే భక్త్యావేశంతో మూర్ఛిల్లేవారు మరెంతమందో! రోడ్డు మొగ తుడిచే యూనియన్ సిబ్బంది వందమందీ నీఅలుకుడు తగిలినంతనే చేచీపుళ్ళు నిల్వానా ఎత్తినుంచుంటే నీకు ఛత్రచామరాలు వేస్తున్నారన్నట్టు ఎంతో హృదయాహ్లాద కరంగా ఉంటుందే ఆదృశ్యం. ఉపాధ్యాయ వర్గం, విద్యార్థి బృందం సగానికి సగంగా నీచెప్పుచేతల్లో మెలుగుతున్నారే! నీ ప్లీడరీ ప్రతిభ చూసుమా, కోర్టుపార్టీల్లో అంటే

కోటిమంది నీకు. సత్నాభ్యాంతర సీమల్లో అడుగిడితే, ద్వారంలో వంది మాగధస్తుతులు వినిపిస్తాయి "తణుకు పురేశా!" అని నిన్ను ఆహ్వానిస్తో పురపౌరులు నీ మెడ కెన్నికర్పూరమాలలు వేస్తారు! కవులు నీకెన్ని చంపక మాలలు వేస్తారు. నయనానందకరమైన సుందరలతల్లా ప్రగడవంశ పుష్పాదరింట పుట్టి తణుకు నలుమూలని యీ నగరానికింత శోభచేకూర్చిన వాడివి! సూర్యబింబ సాదృశ్యంగా తేజఃకాంతుల ప్రసరిస్తో పెద్దలిడిన నామం సార్థకంచేసిన ప్రతిభాశాలివి. అన్నిటికన్నా మిన్నగా నేను నీ దండనుండ, ఒరులకు నిన్ను తేరిజూడ తరమా? తరమే బ్రహ్మకునైన, కుమారా!"

యూ. బో. ప్రె:- నావిభవాన్ని జ్ఞప్తికి తెచ్చి వేధించకు మామా తూట్లడిన దేహికది సమ్మెటపెట్టు. లేమికాదు, కలిమియే నా ఖేద కారణం, మారుమూల, ఏ కుగ్రామంలోనో కళ్లుమూసుకొని, ఉద్థానపతనాల నెరుగనిసమతల జీవనమే చేస్తోంటే, అతి దర్పోద్ధతుడును మహాద్భుత భూరిబలుఁడునగు ఈ శత్రుని చింతాప్రసక్తులు లేకుండ సుఖంబున నుండెడివాఁడ. ఇప్పుడో, సమస్త పురుషార్థములు సంపాదించి, సమస్తైశ్వర్యాలు సాధించియుండి, ఒక్క ఉపాధ్యాయుని విభవ సౌందర్యాలు 'ఎట్లు చూడనోపుదు ప్రాభవ శూన్యునట్లు?' వీడి 'పేర్మి జూచియే జూపౌసహింపనోపక కృశుండ వివర్ణుడనైతి నెంతయున్?' అని సజలనయనుడై, తనచేయి మాయావి చేతిలో 'యిన్సిరో' అంటో బరువుగా పడేసి "భగ్నదర్పుడనైతి" నని విలపించాడు.

మాయావి:- అన్నా! మున్నెన్న డెరుగని యీ దైన్యానికి కారణమేమి? ఆ నాడు ఇన్‌స్పెక్టరు అఫ్ స్కూల్సు వచ్చి మన పార్టీకి పెట్టిపోయిన చిచ్చేనా? మరేదైన నూతన సంఘటనా? నీవు నిలద్రొక్కకపోతే, పార్టీ బెంబేలుపడి, కాపటిలేని గొర్రెలమందైపడి, తల్లిలేని పిల్లలరీతిగా విచ్ఛిన్నం కాగలదు. చిరకాలనిర్మితమై, నీవు పెంచి పెద్దచేసిన పార్టీ నిర్మూలనకు నీవే కారణభూతుడవు కాగలవు. నీవు లేనినాడు

శత్రువు విజృంభించి మమ్ముల చేరపేరం బిల్చుచు నుక్కుమిగిలి వీరవిహారం చేయగలడు. ఆజిరంగంలో పూజారిమూకల బారిని పడలేక మాబోంట్లం నూయో గోయో చూచుకోవలసి వచ్చును. ఆకష్టకాలం తలపుకు వచ్చినంతన ఒడలు జలదరిస్తున్నది. ఇంతకూ నీహృదయంలో అగ్ని పర్వతాన్ని రేపిన కారణం చెప్పవైతివి!

యూ. బో. ప్రె:- ప్రభుత్వ సహాయసంపత్తులు పూర్ణంగా కలిగియుండి, తణుకు పురాధిష్ఠాన దేవతనైయుండి, నేను Celebrate చేయించిన దర్బారుత్సవాలు శత్రువు స్కూలు ఆట స్థలంలో చేసిన దర్బారుత్సవాలకు, ఎందును సరిగాదనే వగతును. రోడ్డుమలుపు తిరిగిబడి విలోచనగోచర మగు నంతకు దృష్టినిల్పి, చూస్తినికదా, సకల జనమనోహరాలైన నానావిధయంత్రాలు, వివిధ విచిత్ర పతాకాలం కృత తోరణ విటంక ప్రదేశాలు, కృత్రిమ కుసుమఫలభరిత తరువన చిత్రరచనలు నాకంటబడి, మరతునన్నను మరపు రాకున్నవి. రంగ మధ్యంలో మహోజ్వల వికాసంతో మెఱుస్తోన్న శత్రునిర్మిత సభామంటపం – అది అపూర్వం. 'నీవునుజూచి తట్టి సభనేని, వినంబడదే యుగంబులన్' అద్దాని శిల్పకళా కుశలత్వాన్ని శ్లాఘిస్తో దాని అపూర్వ రామణీయత కచ్చెరువందుతో, దూరాన్నుండియే నావెంట వచ్చిన మిత్రులు భృత్యులు ఒక్కకరే నన్ను వీడి ముందుకు పోసాగారు. దేవతా విమానములిట్టివే కాబోలునని నా యూనియన్ ప్రజలే ఆసభను చూడబోవ వారల కృతఘ్నతకు నిట్టూర్పు నిగిడించి, ఏకాకినై వేరుదెసకు మరలితిని. ప్రసిద్ధులు, శూరులు అయిన నా పార్టీ సభ్యులే పెక్కండ్రు దీప్తిదఱిగి, పార్టీ ధర్మాన్ని మరచి, పారవశ్యంతో అచ్చటి ఉత్సవ కార్యకలాపంలో పాల్గొని, శత్రునికి జయజయ ధ్వానాలీయ మొదలిడ, జీవితంమీద విరక్తి కల్గి, నిమిషమేని అచ్చో నిల్వలేక గృహోన్ముఖుడనై, ద్వారముఖానికి తిరిగితిని. కుసుమస్తబకమువలె మానవంతుడు సర్వజనుల మూర్ధము మీద నయిన నుండవలె లేదా వనమందు సమసిపోవలె.

"హెడ్మాస్టరు నిన్నాహ్వానించనే లేదా ?" అని మాయావి అడిగిన మీదట ప్రెసిడెంటు కథాశేషం చెప్పాడు. హెడ్మాస్టరు యజ్ఞదీక్షితుడై, దర్బారుత్సవకార్యనివిష్టబుద్ధియై ప్రెసిడెంటును చూడకుండనో, కాక ప్రెసిడెంటు పట్ల బుద్ధిపూర్వకంగా నిర్లక్ష్యము చూపబూనెనో ఎదురుగా రాలేదు. ఆహ్వానించలేదు హెడ్మాస్టరు. కారణమేమైనను, ప్రసిడెంటుకు పరిస్థితి మనస్థితి కూడా జబ్బచ్చియుంటచే నిజానికి ఆయన అజ్ఞాతంగా యిల్లు చేరడమే సమంజసము, సవ్యమున్నూ. వెనక్కి తిరిగిన ప్రెసిడెంటు చక్కగా రోడ్డెక్కితే యీనాడీక్షోభ కల్గెడిది కాదు. కాని ఒక నిషేధఫలాన్ని అనుభవించటంలోని కోర్కె, అరహస్యంలోని ఉత్కంపనమూ ఔత్సుక్యమూ, మానవుని యుక్తాయుక్త వివేకాన్ని చంపి, జీవితాన్ని అపసవ్యపు పంథాను పెట్టి, అనర్థాలను తెచ్చిపెట్టడం సామాన్యాను భవాల్లోదే. అంతలో తన ప్రెసిడెంటు హోదా స్ఫురణకు వచ్చింది. పట్టణానికి ప్రథమ పౌరుడు అయిన తన్ను ఒక ఉపాధ్యాయుడు ఆహ్వానింపకుండుటకు గుండెలున్నాయా? అని స్వాభిమానం రేగింది. తాను లోన అడుగిడ, 'నీ' కాహ్వాన మెక్కడిది? అన్నట్టు హెడ్మాస్టరు తన సహజ దౌష్ట్యాని చూపాడా – దొరికాడే; తన్నుకట్టు త్రాళ్ళు తానే తెచ్చుకొన్న వాడవుతాడు. ప్రభుభక్తి ప్రదర్శనోత్సవ సమయాన బహు ప్రేక్షక జనసమక్షాన, అడుశ్శీలు డవినీతికి పాల్పడేనా, వాని • ప్రవర్తనను అనంతంగా వ్యాఖ్యానించి, వాని నొక రాజద్రోహిగా ప్రకటించి, అధికారుల చెవికొరక వచ్చు. తనకా, అహ్వానావశ్యకతే లేదు. దర్బారుత్సవాలకు అహ్వాన మక్కరలేదని, ప్రతి పౌరునికి, సత్యనారాయణ వ్రతప్రసాద తుల్యంగా, దర్బారుత్సవాలలో, ఒక్కొక్కడుండ నోట కఱచుకుపోయే హక్కుందని, అతొక్కడుండకు ఎవడు ఏ రూపేణా అడ్డుపడ్డా శిక్షాస్మృతిలో 6 th Chapter, offences against the State గా ఉదహరింపబడ్డ రాజద్రోహం సెక్షన్ల క్రింద దండనార్హుడనీ, యింతకూ తాను ప్రెసిడెంటు గిరి చెలాయిస్తోన్న గ్రామ జ్యూరిస్ డిక్షన్ లో ఏ సౌధంలో కాని గుడిసెలో కాని, ఏమూల ఉత్సవం జరిగినా తత్ప్రజా

ప్రాతినిధ్యం తనదే కాబట్టి లోకల్ బోర్డు అక్టురీత్యా తనదే ఆధ్వర్యం అనీ, ఆ రాజసూయాధ్వరాలలో కలిగే హవిర్భాగాలు ప్రభుస్థానే లాప్రకారం తానే పుచ్చుకో కల్గిన (వారసత్వపు)హక్కులు తన కున్నాయనీ వాదించి లోపల ప్రవేశించి, నెమ్మదిగా పెత్తనం పైవేసుకొని హెడ్మాష్టరు ప్రతిభా ప్రాభవాలు తగ్గించేయ వచ్చుననీ, తలచాడు. దైవం మేలుచేసి, దర్బారు త్సవ కార్యకలాపంలో లోపాలే కంటబడితే వాటిని సొమ్ముచేసి, అప్పుడు అక్కడే రసభంగం కావించి హెడ్మాష్టరుపై పగతీర్చుకో నుద్యమించే, యింటికిపోక, ముఖద్వారంలో తచ్చాడ్తోన్నాడు. ప్రెసిడెంటు, ప్రభుభక్తి పేరిట ప్రత్యేక కక్షలు తీర్చుకొనే సదవకాశం అన్నప్పుడూ లభించేది కాదు. కాన దానిని జారవిడువ కూడదని పాపబుద్ధియందు కృతనిశ్చయుడై అడ్డంగా ఆటస్థలంలోకి త్రొక్కుకు పోయాడు.

హృదయమున అభిమాన మాత్సర్యాలు ఆవరించినచో హృదయమునకు సుస్పష్ట విషయములయందుకూడా సత్యం స్ఫురింప నేరదు. అందందు ప్రతిపదిగజాలలోను రోడ్ పాయింటర్సు పైఖరిని నిల్చుని విహితకృత్యాన్ని నిర్వర్తిస్తోన్న మార్గదర్శకుల మాట, మనవి చెవినిపెట్టక త్రోవతప్పి, వక్రమార్గంపట్టి స్త్రీల ప్రత్యేక స్థలంలోకి ఎగబడి, వెలువడ నేరక ఆ వెదురుకట్టడాల్లో పరిభ్రమిస్తోన్న ఆక్రోధనుని చూచినంతన, నారీ జగత్తులో కలకలం బయల్దేరింది. మార్గదర్శకులు నియుక్తధర్మానుసారంగా యీల వేసారు, సిగ్నల్సు యిచ్చారు. S. O. S. అందింది తడవుగా సుశిక్షిత సాయుధ స్కౌట్ స్క్వాడ్స్ రెండు యీవెల్లా వచ్చిపడి చుట్టేశాయి. స్వభావ సౌజన్యాదులు కల సత్ప్రవర్తనుల కేరికైన, ఆ బాలభటుల కార్యనిర్వహణ దీక్షా కౌశల్యాలు సంతసం కల్గించెడివే. కాని మంథర మనస్థితి ఆవిష్టించిన యీర్ష్యాళువుకు తోరణాలు, వీరణాల దగ్గర నుంచి సర్వమూ సంతాపహేతువై వేధించడం విరుద్ధం కాదు. అందువలననే ఆతని అడుగుల ఊతంలో తగవు, తెగువ ధృవమవుతోన్నాయి. తన్ను నిలువరింప సమకట్టిన డింభకులకు ఓడి మళ్ళితే లోకం తనకు అశక్తి నిరుత్సాహాలు ఆరోపిస్తుందని తప్పత్రోవను పడ్డాడు కాని, ఆ బాలభటుల

నడవడి శాస్త్రసమ్మతమనీ, తానే సభావిషయక మర్యాదాతిక్రమణ చేస్తో న్నదనీ, గ్రుక్కతిప్పుకొని సన్మార్గం తొక్కలేకపోయాడు. పాపవ్యవ సాయమందు బుద్ధిపదలక నిల్చాడు. తణుకు పురేశుని ప్రవర్తన కాబట్టి సిష్ఠభాషలో అతకి పాపవ్యవసాయమంటో చెప్పాల్సొచ్చింది కాని సామాన్యమానవుని చర్యయే అయితే శుభ్రంగా ఒక్కమాటలో పెంకి తనం చేసాడందును ఆచేసిన పనికి. ఆసమయంలో ప్రెసిడెంటుగారిక్కి చాలా అశాస్త్రీయమైన ఆలోచనలు, అసంస్కృత, అనార్య, అసభ్య భావాలూ కలిగియుండాలి. లేనిచో, యింతదనుక ప్రెసిడెంటుగారి హస్తంలో చేదోడు వాదోడుగా, విలాసంగా, వయ్యారాలుచూపుతో, అందాలు వలకబోసుకుంటో, దారంట టక్కు టిక్కు మంటో లెక్కట్టి నట్టు అడుగు లేసుకుంటో వచ్చే సింహతలాటపు చేతికఱ్ఱ ఒక్కపర్యా యంగా, అమాంతంగా, రోష భీషణాకృతి దాల్చి, నిజకాఠిన్య ప్రదర్శ నాభిలాషతో బాలభటుల శిరోభాగాల ఛేదింపనుంకించినట్టు పైకెగయ నేల? బాలబలగంశక్తి గ్రహించక తొందరపడ్డాడా అధికారి? సౌమనస్య సౌజన్యాలు చూపితే ప్రాణం యిచ్చేసే బాలబలగాన్ని రెచ్చగొట్టి వాళ్ల మధ్యనుంచి మర్యాదదక్కించుకొని దాటినవాడెవడూ కానరాడు. ఒక పర్యాయం మాకాసికుని ట్రూప్ బాడ్మింటన్ ఆడుకొంటోన్నారు స్కూలు ఆటస్థలంలో. వాళ్ళవూళ్ళో పలుకుబడి ఉన్నవాడే- వయస్సూ ఉంది- బాడ్మింటన్ కోర్టు హద్దుల్లోనుంచి ఒకపురుషసింహుడు విస్సా టంగా వెడ్తోంటే మాకాసికుడు పరుగెత్తి మర్యాదగా "యియ్యది విద్యా ర్థులకు క్రీడార్థం కల్పితం అయింది కాన దీనిని మీరు సేరక తొలంగిపోవు వది" అని చెప్పిచూచాడు. బాలురుకదా అని వాడుద్ధతక్రోధుడై అట్టే వికటాట్టహాసం చేసేసరిక్కి, మాకాసికుడు అండ్ పార్టీ అతణ్ణి ఒక దద్ధిం దక్క పట్టుపట్టి సవ్యంగా నడిపించి పంపించారు. ఈఉత్సవసమయంలో అనతిదూరంలో హెడ్మాష్టరుగా రుంటచే వ్యవహారాన్ని అంతవరకూ లాగలేదు బాలురు. అకాడికింకా సర్వేజనాః అదృష్టవంతులమే. అప్పుడు దశ్శారు స్పోర్ట్సులో ఫుట్ బాల్ జరుగుతోన్నందున పెద్ద, పిన్న, ప్రేక్ష

కులూ, ఉపాధ్యాయులూ అదృష్టినుంటచే, స్కూట్సుకి ప్రెసిడెంటుకి మాత్రం యిది ప్రత్యేకసమస్యగా యీమూల జరుగుతోంది. కొంత నయమే.

## కొంటికొసికుడు - కిరాతవేషం

మరి నాల్గునిమిషాలు, యీ పెనగులాట పెరిగితే ఎట్లుపరిణమించెడిదో! అంతలో ఫుట్ బాల్ అనంతరం రానున్న ఫాన్సీడ్రెస్ వినోదప్రదర్శనార్థం, మా నాటకసమాజ కొసిక పాత్రధారి - బడి మొత్తం మీద బలే కొంటెపిల్లకాయ— ధూర్జటి రచించిన శివుని సీసం చిత్తరువు ఒక్కొక్క పాదమే స్మరణకు తెచ్చుకొంటో, ఒక్కొక్క అలంకారమే అమర్చుకొని,

'జడకొప్పు కేకిపింఛపు దాటిమట్టగా
    బిసరుహాహిత రేఖ పీకెగాగ
సెగలు చల్లెడు కన్ను జేగురుబొట్టుగా
    శృతిఫణియౌషధ లతికగాగ
మెడను బున్కలపేరు మేటి తామరలుగా
    దోలు దుప్పటి యొడదోలుగాగ
జేతిపినాకంబు సెలవింటిబద్దగా
    శూలమేర్చిన యంపకోలగాగ'

ఈవర్ణిత పరికరాలన్నీ అలంకరించుకొని నామమాత్రంగా నలుపురంగు ఒక్క షేడ్ వేసుకొని, మీసం గడ్డం కట్టుకొని, ఎక్కడా మావాడన్న అనమాలు తెలియకుండా, అప్పుడు కొండల్లోనుంచి వచ్చిన మృగహంత లాంటి అచ్చు ఎఱుకలవేషం ముగించుకొంటో, తన గ్రీన్ రూమ్ తడికలో నుంచి, సామీప్యంలో ప్రెసిడెంటుగారు చేస్తోన్న అత్యాచారం చూచి, ఏమిపోలించిందో, ఒక్కపరుగున ఫుట్ బాల్ గోల్ వద్దకెళ్ళి,

"ఆడోళ్ళల్లోకి పోతుపేరంటాల్ అడ్డంపడ్డాదీ, కర్రెత్తి పిల్లల్ని
బెదరకొడ్తోండాదీ బాబోయి, రాండోయి"

అంటో - పాటో, మాటో తెలియని కృత్రిమ ఎలుకలుగాత్రంతో, అల్లరి చేసికొంటో చత్రుస ఆటస్థలం నాల్గుప్రక్కలా రివ్వున చుట్టివచ్చాడు ఒక్క నిమిషంలో. ధూర్జటి నోట్లోనుంచి ఊడిపడి ప్రత్యక్షమైన ఆకిరాత వేషానికి, 'పోతుపేరంటాల'న్న ఆ వికృతపదప్రయోగానికి కల్గిన హాతాదానందంలో, విషయం తెల్సినవాళ్ళూ తెలియనివాళ్ళూ ప్రేక్షక జనం, ఫుట్‌బాలర్సు, ఒక్కుమ్మడిగా బొబ్బపెట్టి ఏమైయుండునా అని స్త్రీల ప్రత్యేకస్థలం వైపుకు తలలుత్రిప్పారు. ఆరీతిగా ప్రెసిడెంటు పరువు వీధినెట్టి, ఎవడెన్నదీ తెలియకుండానే, కౌసికుడు మీసం గడ్డం లాగేసుకొని మూకలో దూరిపోయి మాయమైపోయాడు. ఫుట్‌బాల్ పాక్ ట్రూప్సు రివ్వున వెళ్ళిపడ్డారు. వాళ్ళవెనుక ప్రేక్షకజనంకూడా ప్రవాహరూపంగా తదన్వేషణాసక్తచిత్తులై విరగబడ్డారు. పాపం, ప్రెసిడెంటుగారు బంధప్రాప్తుడై, రోషరంజితాననుడై, విషాదవివర్ణుడై, బాలభటుల కరపంజరంలో చిక్కి దీనదశలోనున్నాడు. ప్రెసిడెంటుగారి చేతిని అలా వదలేస్తేనే యీలా కర్ర తమ బుర్రమీద పడ్తుందేమో అన్న భయంతో, ఖగేంద్రుడు కొలూదినశాఖపై వ్రేలాడుతోన్న వాలఖిల్య మహామునిగణాల్లా, బాలురు అంగుళానికి ఒకడిచొప్పున ప్రెసిడెంటుగారి కుడిజబ్బను గట్టిగా పట్టివున్నారు.

♦ ♦ ♦

## పార్టీ జనుల పరస్పర క్రోధ వచనాలు

ఆదృశ్యం కంటబడ్డది తడవుగా, కుర్రాళ్ళ పకపకలూ, ఆడాళ్ళ ముసిముసి నవ్వులూ, పెద్దల గుసగుసలూ చెలరేగాయి. చిలికిచిలికి గాలి వాన అయ్యేట్టుంది వాతావరణం. దుర్నిమిత్తాలు పొడసూపుతున్నాయి. ఎవరు నోరెత్తి, ఎటు నేరారోపణ చేయడానికి వీలులేని విషచక్రబంధంలో

పడ్డారు మధ్యములంతా. ప్రెసిడెంటుగారు పొరపాటున వెళ్ళియుండ వచ్చునన్నది ప్రెసిడెంటుగారికి రక్షణ అయితే, కుర్రాళ్ళకు రూల్సు కవచంగా ఉన్నాయి. అబిగిలో వారినిగాని, వీరినిగాని పల్లెత్తుమాట అనలేకుండా ఉన్నారు. పెద్దల గుసగుసల్లో తణుకుపార్టీల అంతర్యుద్ధం తిరుగా సిద్ధం కాబోతోందనే చిహ్నాలు కనిపిస్తోన్నాయి పూర్వవైర స్మరణ కలుషితులై మాట్లాడుకొంటోయున్నారు. "వేయి చెప్పు, లక్ష చెప్పు. ఏమీ అనుమానం అక్కరలేదు. ఇదంతా హెడ్మాష్టరు ఎరుగుండి, చెయ్యాలని చేయించిందేరా. 'పుట్టుగల్లరియై పాపములను నెల్ల దిట్టయై లోకములచేత దిట్టువడిన కట్టిడి' యీ హెడ్మాస్టరు దుండగాలు ఎరగమా? గ్రామానికి ప్రెసిడెంటు కదా ఆవచ్చినవాడు, యీ కిష్కింధ పతాలాన్ని వప్పుచెప్పి అల్లరిపెడ్తాడా? కాస్త మంచీచెడ్డా ఉండక్కర లేదూ? ఉండక్కరలేదా అని అడుగుతా!" అన్నాడో పార్టీవీరుడు తన సోదరసభ్యుల గుంపుతో. ప్రక్కనేయున్న ముఠా పెద్దమనిషి ఒకడు — కాస్తంత పైత్యతత్వం తేలుకుట్టినట్టుగానే రెండుసార్లు ఎగిరిపడ్తో ముఖంలో ఏదో అవ్యక్తమైన వేదన చూపాడు. దాంతో ఆ ముఠా మెంబర్లు దభీలున స్వప్రాణరక్షణార్థం అటూ యిటూ చీల్తో, ఖంగారుగా "తేలేమిట్రా?" అని కాదామరపడ్డారు. "ఇంకా నెమ్మదిగా తేలా అని అనొచ్చారా! అదెక్కడ తేలురా నాయనా? పాము. విషం ఏగా కక్కిందో మీరూ విన్నారుగా యిప్పుడు, విననట్లు మాట్లాడతారు" అన్నాడు ఒక అజానుబాహుడు కోపంతో. ఆ మొదట మాట్లాడిన పార్టీవీరుడికి, యీ పెద్దమనిషి ప్రతివీరుల ముంగంవాడన్నమాట. ఆ మొదటివాడు మాట్లాడినంతసేపూ మాటమాటకూ యీయన హృదయంలో రాజేసుకొన్న కుంపటిమీద గుప్పెడు గుప్పెడు గుగ్గిలం వేసినట్టయింది. ఆతడిది ఒక్కొక్క మాటా యీయన్ని ఒక్కొక్క బాకులా పొడిచేసింది అని తోస్తుంది. ఇంతంత కత్తులు పెంచుకు కూర్చుంటే ఒక్క సారసు చాలదూ భగ్గుమనడానికి? నుళ్ళా అందుకుని అన్నమాటలు చూడండి! తోడివాళ్ళను తనతో సమానంగా ఉద్రిక్తులనుచేయడానికి

"నేను మీలా మహర్షి నికాను. నాకు యింకా శాస్త్ర మానాభిమానాలు అంటో ఉన్నాయి. వాడి సంభాషణ వినీకూడా సరిపెట్టుకొనే పరిపక్వం పొందలేదు నేను. ఇప్పుడు వెళ్ళి ఆ పెద్దమనిషి హెడ్మాష్టరుమీద చేసిన ప్రసంగానికి ఆనోటిని పచ్చిమెలకాయ నొక్కినట్టు నొక్కేసి రాక పోతే నాకు మారుపేరెట్టండి. నన్నుమాత్రం పట్టుకోకండి, నన్ను అపు చేయకండి" అంటో సంరంభంచేసి స్నేహితులచేత ఆపించుకొన్నాడు ఈ పూజారిపార్టీ మెంబరు. మరోడందుకొని విషయనిర్ధారణచేశాడు. ఇతరులేమనుకొంటోన్నా, తాను పెద్ద పరేంగితావగాహినని గట్టినమ్మకం యీతడికి: "చూడరా కేడీలు నోటికొచ్చినట్టు ఏలా వదలుతారో! హెడ్మాష్టరు ఆ రెండ్రోజులను ఉత్సవ కార్యనిమగ్నుడై యుండడం మనం కళ్ళతో చూచాంకదా! ప్రెశిడెంటు యింతమంది ప్రేక్షకజనం వెనక యీమూలనుంచి వస్తోన్నాడని ఆయన చూచాడా ఖర్మం? మనం చూచాం కనకనా? అసలు ఆ ప్రెశిడెంటు రాకే, ఏదో పార్టీ దుర్మంత్రంలా కన్పిస్తుంది. పదిమందితోటి రాజబాటను రాకూడదూ? సందుగొందుల బుద్ధి ఎందుకుకల్గాలి? దర్బారుత్సవాలకి ప్రభుభక్తిపరాయణులమై బడికి వెళ్ళినా, 'లోపలకురా' అన్నమాట అయినా హెడ్మాష్టరు అన్నాడు కాదు" అని ఆడిపోసి, అల్లరిచేసి ఏకెయ్యడానికేనా రేపటినుంచి, యీ దొంగపోటురావడం? ఎంత కుత్సితబుద్ధో చూచావా? అంతమంది కుర్రాళ్ళు చిలక్కి చెప్పినట్టు చెప్తోంటే వినిపించుకోకూడదేం? ప్రెశిడెంటు అయితే సభామర్యాదలతో నిమిత్తంలేదా? అధికారమదాంధత అనవు. ఎవడు త్రివ్వుకున్న గోతిలో వాడే పడ్డాడు. వీడికింతకన్నా యింకేం పరాభవం కావాలి? బాగుందిలే."

ప్రేక్షకజనం ముఠాలమధ్య యీలాంటి పక్షపాత జనిత పరస్పర క్రోధవచనాలు విన్పిస్తోన్నాయి. చెప్పుకోడాల్లోనుంచి చేతులుకల్పుకోడాల దగ్గిరకొస్తోన్నారు. గుసగుసలు రుసరుసలు, రుసరుసలు బుసబుసలు అవుతోన్నాయి. మాటలు చేష్టల్లోకి మారడం అట్టే దూరంలో లేదు. ఇరుపార్శ్వాలా ఉండే సహృదయులు బహు అల్పసంఖ్యాకులు.

పాపం వారు ఏమి కీడు రానైయున్నదో కదా అని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని యున్నారు. ఇదీ అప్పటి పరిస్థితి.

## అర్జునుని చే ప్రెశిడెంటు బంధ మోక్షం

అప్పట్లో, మేరీ లిబోన్ 'క్రికెట్ క్లబ్, ది గవర్నింగ్ బాడీ ఆఫ్ ది గేమ్', అప్రూవు చేసిన ఎలాబొరేట్ రూల్సును, స్పోర్ట్సు ఇన్‌స్ట్రక్టర్‌కు, క్రికెట్ టీమ్ కెప్టెనుకూ హెడ్మాస్టరుగారు జ్ఞాపకంచేస్తో లేబరేటరీలో యున్నారు. హెడ్మాస్టరుగారు దర్బారు రెండవరోజు ప్రోగ్రాములో క్రికెట్ పురమాయించి జిల్లాకలక్టరుదొరవారిని ఆహ్వానించి యున్నారు. ఆ కాలంలో మాబడితప్పితే కృష్ణాజిల్లా క్రికెట్ ఎరుగదు. జిల్లా కలెక్టరు విఖ్యాత వికెట్టు కీపరు అని చెప్పారు. ఆ సన్నాహంలో ఉండగా జనరవం హెడ్మాస్టరుగారి చెవిని పడింది. ఆయన అదరిపడి బయటకు వచ్చారు. కేడీపార్టీ టీచరొకరు పరుగునవచ్చి, 'విద్యార్థులు నిర్దయగా యూనియన్ బోర్డు ప్రెశిడెంటును బంధించారు' అని ఆక్రోశించుచూ చెప్పి మూర్ఛిల్లాడు. మా సమాజ అర్జునుడు ఫుట్‌బాల్ టీమ్ కెప్టెన్. హెడ్మాస్టరు వాడికి సిగ్నల్ యిచ్చి రప్పించి 'తత్‌క్షణం యూనియన్ ప్రెశిడెంటును బంధవిముక్తుణ్ణి చేసుకురా' మ్మని పంపించి, తానూ అటు బయల్దేరారు.

గురుహితకార్య దురంధరుడు మాఅర్జునుడు, ప్రేక్షకసమూహంలో యిద్దరిని ముల్గి అద్ధరిని స్త్రీల ప్రత్యేక స్థలంవద్ద తేలి బాలభటుల నుద్దేశించి, "ప్రెశిడెంటుగారిమీద చేతులు తీసేయండి. హెడ్మాస్టరుగారి పన్పిది అలంఘ్యము మీకు నిత్తరిన్" అనిచెప్పి ప్రెశిడెంటుగారిని బంధమోక్షితుణ్ణిచేసాడు. ఇంతలో హెడ్మాస్టరుగారుకూడా వచ్చేసారు. వస్తోనే "వీ రెవరయ్యా? ప్రెశిడెంటుగారే? యిట్లు కృపణులై పట్టుపడ

వీరికి వలసెనే? అరరె!'' అని ధ్వనించేటట్టి పరామర్శచేసి, యిక ఆయన తనతోకూడ ఉంటేనే కాని తనకు తోచదన్నట్టు ఎక్కడలేని ఆప్యాయతా గుమ్మరిస్తో అందరూ వినేట్లా ఆయన్ని హెడ్మాస్టరుగారు సభలోకి ఆహ్వానించారు. లజ్జాకజ్జలిత హృదయుడైన ప్రెశిడెంటుకు ఆమాటలు నిశితశూలాలైనాయి. హెడ్మాస్టరుగారిచే విముక్తుడయ్యి, కోపపాశ బద్ధుడై ఆనాటి పరిభవానికి ప్రతీకారం చేయసమకట్టి, ఆహ్వాన మంగీకరింపక, ఆవేశపూరితుడై, అన్యచింతారహితుడై, మధ్యసరికి స్కూలు - హాస్పిటల్ సరిహద్దులో నరకబడి నేలకూలియున్న ఒక చేవతాడిబాదు ఫెడిల్లున కాలికితగిలి ప్రెశిడెంటుగారికి ప్రాణం కడంటింది.

అత్యంతదైన్యాస్పదమైన ఈనిజపరాభవగాధను ప్రెశిడెంటుముఖతః విన్నంతసేపూ అప్పవాల్చని మాయావి 'తాడిబాదు' అన్నమాట చెవిని పడగానే కనురెప్పల నొక్కసారిగా తపతపలాడించి, 'స్కూలు-హాస్పిటల్-సరిహద్దులో-నేలకూలియున్న చేవతాడిబాదు' అని ఎసైజ్ లోసావకాశంగా పెదవులమీద తాటించి, 'కథ కానీ' అన్నట్టు ప్రెశిడెంటువైపు చూచాడు. మాయావి వింటున్నాడే కాని, యిప్పుడు ప్రెశిడెంటు పరాభవ వృత్తాంతంలో అతనికితొల్లింటిశ్రద్ధ సన్నగిలింది. ''తాడిబాదు, తాడిబాదు'' అంటో ప్రతిరెండుమూడు నిమిషాలకి పునః పునఃస్మరిస్తోన్నాడు. ''స్కూలు గ్రౌండు పరిమితిలో తాళ్ళున్నట్టే కన్పించదే'' అని ఒకసారి ''స్కూలుకి హాస్పిటల్ కు మధ్య పిట్టగట్టుండాలిగా'' అని ఒకసారి, కథవింటో శుద్ధ అసందర్భంగా తనలోతానుఅంటోవచ్చాడు. ఇంతదనుక ఊఁ, ఊఁ, అంటో తరుముతో కౌతుకభరవ్యగ్రాంతరంగుడై సవిస్తరంగా వింటోన్నవాడు ఏలనో ఊకొట్టడం మానేసాడు. పెదవి కదపటమే లేదు. కదిపెనో, ''తాడి పచ్చిగానే ఉండాలి'' అని ఊసుకుంటాడు. ''ఈవారంలోనే జరిగి యుండాలని'' ఒక పలవరింత. ప్రెశిడెంటు తనగర్వభంగవిషయం ఉద్రేకంగాచెప్తో, ఒకటి రెండు స్థలాల్లో, ''ఏమంటావు మామా?'' అని అడిగినపుడుకూడా, కాకేం?'' అనో, ఖచ్చితంగా ''ఎప్పుడూ కాబోదు.'' అనో, పంచమంలో కయ్యిన రెస్పాన్సు యీయవలసింది పోయి, పైగా

మందరస్థాయిలో 'బాదుధరిని మొదలు ఉందా?' అని పత్రి అసందర్భపు కుశలప్రశ్న వేసి, తనక్రింది పెదవిని సాగతీసుకొంటూ, కుర్చీ కాలువంక చూస్తూ కుతకుతలాడ్తోన్న ప్రెశిడెంటుమీద చన్నీళ్ళుచల్లి ఊరుకున్నాడు. మాయావి సకలవిషయాలను వ్యావహారిక దృష్టితో పరిశీలించే బుద్ధిజీవి. వాస్తవికుడు. పరిభవక్లేశాది మానసిక పీడలను, వ్యర్థఆధ్యాత్మిక చింతలనూ, పెద్దచేసి వ్యవహారదౌర్బల్యానికి దారిచేసే భావుకుడు కాడు. అతని భావగతిని ప్రెశిడెంటు పట్టలేకపోయినట్టు తోస్తుంది. నిజంగా, మాయావి హృదయ కావ్యం, నారికేళ పాకం - దురవగాహం.

"పొరపడి, కాలికితగిలిన ఘాతను చింతిస్తున్నా ననుకొన్నాడా మామ? పదే పదే తాటిబాదువృత్తాంతం ఎత్తుతున్నాడు" అని సందేహించి, ప్రెశిడెంటు 'మామా! కాలిబాధకు దుఃఖించునంతటి బేలనే, కళేబరధారుల కది సామాన్యానుభవం. కాక, కాస్త టించరుతో పోయేదే. అందుకు కించేలేదు. హృదయశల్యమై నన్ను వేధిస్తోన్న విషయం అది కానే కాదు.

'అకటకట యిట్టికష్టమునకు వచ్చితినయ్యా నేను
నన్నకట! వైరిప్రకరము లని బట్టిన,
గృప నొకరుడు విడిపించె దైవమోపదె ఎట్లున్'.

అందులోను హెడ్మాష్టరు పనుపున వచ్చిన ఒక అర్భకుడు నన్ను విహాక్షితుచేయనా! 'హెడ్మాష్టరు పన్పిది' అని ఆతడన్నంతమాత్రాన రాజశాసనముగా దాన్ని బాలురు శిరసావహించిరే! దుస్థితిలో హెడ్మాష్టరు కంటబడి, అతని పరిహాసప్రసంగానికి గురిఅయ్యే దుర్యోగం ప్రాప్తించేలోపల నాదరిదాపుననున్న పార్టీవీరులు, నన్నుపట్టిన కోతిమూకలను చెదరగొట్టలేకపోయిరే! 'You there, what's the noise about?' అని హెడ్మాష్టరు రెండోకొసనుంచి సింహగర్జన చేసేసరికి, మన యేనుగులు పీనుగులుగానా? దైన్యసంభరితులై, బెదరి, చెదరి, ప్రక్కలకు తప్పుకోనా? -వాని శౌర్యోదయవృత్తి- హెడ్మాష్టరుని ముఖంమీద అడిగి, ప్రతీకారం చేసివస్తానని ప్రగల్భాలుకొట్టి వెళ్ళిన మనపార్టీ ఉపా

ధ్యాయుడు అయనముందు మూర్ఛిల్లనా? ఏమిచూచుకొని, యింకేమి చూచుకొని నా కాతనితో కయ్యం. అతని బలం గ్రహించక మీ మీ మాటలు నమ్మి భంగపడ్డా. బొప్పికట్టింది. ఆత్మదోషమైన అపాయం, అవశ్య భోక్తవ్యం.

'విను దుర్వినయాత్మకుడగు జను డుజ్వల
మైన సిరియు, సద్విద్యయు గల్గిన నందు
మెలగ నేరక, చెనటి తెఱంగునను జొచ్చి చెడిపోవుతుదిన్'.

'ఇక జనుల్ నవ్వగ నేటి బ్రతుకుగా యిన్నగర మేలువాడ నెట్లు చరింతు?' ఇట్టి దురవస్థకు పాల్పై, బోడిమి చెడి శత్రుచేత శిరస్తాడనం చేయబడ్డ నేను బంధుజనంలోనికి, బార్ రూమ్‌కి ఏమని అరుగుదు? ఇటు పార్టీకిగాని, అటు న్యాయాధికారికిగాని నామాటయందికేమి ఆదర గౌరవాలుంటాయి? హెడ్మాస్టరు చేయించిన దర్బారుత్సవం నాకసూయా జనకంబైనదనీ, సకలజనమనోనయనోత్సవమైన తత్సభాలక్ష్మి నా మనో నయనములకు అగ్నిజ్వాల అయిందని నేడీనగరంలో జనవాక్యమట. ఇట్టి నడివడుటకన్న ఒడలు విడచుట మేలుగాదా మామా! ధర్మైశ్వర్య ధనభోగాల్లో నాకభిలాష లేదు. మామా! ప్రాయోపవేశంచేసి ప్రాణ పరిత్యాగం చేయ నిశ్చయించుకున్నాను.

"మానము సెడియును నిమ్మై మేనం బ్రాణము లెట్లు మోకొనితాల్తుం?
గాన యిది నిశ్చయముగా, బూనితి నా తెగువ మాన్పబోల దొరులకున్."

దుఃఖాతి భారవిహ్వలుడై, ప్రెశిడెంటుగారు చెప్పినంత చేసి చూపెట్టే పట్టుదలతో, లింగైక్యసిద్ధ్యర్థం, తణుకు కంటబడకుండా, తువ్వాలుతో కళ్ళు మూసేసికొని, తణుకుపురంతో పెనవైచుకొనివున్న తన మోహపాశాలను ఒక్క త్రుటిలో తెంపేసాడు. అవును, తనకు పుట్టిన కక్షకు, మా నగరపౌరులంతా ఉగ్గూ పాలూ పోసి పెంచారు కాదని తణుకునగరంమీదే విరక్తిపుట్టింది ప్రెసిడెంటుగారికి.

♦ ♦ ♦

# ప్రాయోపవేశం

ప్రాయోపవేశ ప్రొసీజరు పరిజ్ఞానం సివిల్, క్రిమినల్ ప్రొసీజర్లలో ఉపలబ్ధమయ్యే పదార్థం కాదాయిరి, పోనీ అనుభవాన్ని పట్టి కొట్టుకుపోదామా అంటే తనకు తెలివివచ్చాక చుట్టుపట్ల ఎక్కడా నిర్విఘ్నంగా యీ క్రతువును జరిగించినవారు లేరు. ఎంతెంత విషమసమస్య లేర్పడ్డా సర్దుకుపొయ్యే గడుస్తనాలు నేర్చారు ప్రజలు. మరీ తెలుగుమీరి పోయి ప్రాయోపవేశాలు మానేసారు. ఒక్కసారిమాత్రం ప్లీడరుగారి పినతండ్రిగారే కాస్త నమూనా యిచ్చినట్టేయిచ్చి ఆపుచేసారు. ప్రాయోప వేశం ఏలా ఉంటుందో చూడాలని కనిపెట్టుకొన్న పెక్కండ్రకు ప్రాణం చివుక్కుమంది. ఇంట్లో ఆడాళ్ళమీద కోపంవచ్చి, జంధ్యాలు చెప్పి తెంపుకొని, యిఖ ఎవరికివారే యమునాతీరే అంటూ సమస్తసన్నాహాలు చేసుకొని, వీధివాళ్ళంతా వినోదంగా చూస్తూంటే, పక్కలకు తలతిప్పకుండా సరాసరి తన గోష్ఠసాలలోకి దారట్టి, పట్టెగడ్డిమేటిదరిని ఒక అరగంటకాలం దర్భశయనుడై, ఊళ్ళోవాళ్ళ సరదాకోసం యింట్లో వాళ్ళను ఏడ్పించడం యిష్టంలేకపోయింది కాబోలు, తడికళ్ళతో వచ్చి కాళ్ళు కడుక్కొని, హోంచేసి తశ్శాంతి అయ్యాడు. పచ్చికాయ బద్ధలైంది, ప్రాయోపవేశం పక్వానికిరాలేదు. మరో, గంగయశాస్తుర్లుగారు అయన పొలంలోకి ఆయన అడుగెట్టడానికి వీల్లేకుండా అంసాయీదారు ఎండు తుమ్మకంపమోపులువేసి మార్గావరోధం కల్గించి, 'ఎవడుతీస్తాడో చూస్తా' నని గట్టున కర్రవేసుకుని కూర్చున్నాడు. సాత్వికుడు శాస్తుర్లుగారు, శరతల్పగతుడైన భీష్ముని తలపుకుతెస్తూ, ఆ ముళ్ళకంపకు జార్లబడి, ఆ రోజల్లా ఎవరు 'గ్రామంలోకి రావలసిం'దని బ్రతిమాలినా, 'ఉత్తరాయణానికి వేచియున్నా' నని ఒక్కటేమాట. కదలలేదు. ఇప్పటి పిదపకాలం కాదు, బ్రాహ్మణోపద్రవం ఘటిస్తే ఉత్పాతాలు పుడ్తాయని గ్రామం యావత్తూ అట్టుడికినట్టు ఉడికిపోతోంది. జిత్తులమారి గ్రామ

కరణం, గ్రామరక్షణకు కంకణంకట్టి వెళ్ళి, 'యీ ముసలాడిక్కడ చస్తే నీమీద ఖూనీకేసు రాగలదు, వెంకయ్యా' అని అంసాయీదారుని సాయంత్రం హడలగొట్టి, రాత్రి కాగడాలేయించి, కంపళయ్య సహితంగా యీ గాంగేయుణ్ని ఊరేగిస్తో గ్రామంలోకి తీసుకొచ్చాడు. ఆలా, ఆ ప్రాయోపవేశం, ఆశపెట్టి ఆరిపోయింది.

♦ ♦ ♦

## సుగంధి రొట్టి ముక్క

పోనీ, యీ ఒక్క ప్రాయోపవేశమైనా తుదముట్టా చూడగలుగుతాం అనుకొంటే, చివరికిదీ బుస్సుమనిపోయింది. ప్రాయోపవేశ కర్మకాండ సక్రమంగా సలక్షణంగా నడిపించడానికి ఉపాధానాలేని సమకూర్చుకోవాలో అని ప్రెసిడెంటుగారు తువ్వాలు ముసుగులో మిటుకు మిటుకు చూస్తో బుర్ర బద్దలుకొట్టుకుంటూన్నారు. ఎంతసేపూ తువ్వాలు ముసుగులోనుంచి మబ్బుమబ్బుగా మేస్టారి చేతిలోయున్న గ్లాసో జాగ్లాసు ఒక్కటీ ప్రత్యక్షమవుతోంది - అజ్ఞునుడికి పిట్టఒక్కటేగాని, ఓ ఆకనీ, రొబ్బ అనీ ఏమీ కన్పించనట్టు. గోరుముట్టుమీద రోకటిపోటన్నట్టు మరోటీ- ఏకొంచెం యింకా చివపని ఏమూలా తరుగుబట్టని అమ్మమ్మగారి మినపరొట్టె అప్పుడే పొయ్యి దిగుతోన్నట్టు వంటింటి బూర్లె మూకుడు సవ్వడి వాకట్లోకి తగిలింది. ఆ వెంటనే మరోతృటిలో పరిపుష్టి పొంది, సఖుముఖాలా పొంగియున్న అంగసౌష్ఠవంతో, గుబాళిస్తోన్న కమ్మటి వాసనతో, పూర్ణచంద్ర బింబాకృతిదాల్చి ఆ మినపరొట్టె స్వయంగా చక్రగమనస్థై ఖరిని గిరగిర తిరుగుతో, నియతాహారులై సర్వసంగములు విడిచి జితేంద్రియులైన మహాత్ములనేని నోరూరిస్తో వచ్చి, పెళ్ళిపెట్టుగా ప్రెసిడెంటుగారి మానసావనికపై బడింది. అక్కడక్కడే దోరగావేగిన భాగాలు వయసుకత్తెల కన్నులలో తేలియాడే నీలిమబ్బుల్లా ఆకర్షణీయంగా ఉన్నాయి. దాని పెదవులలో తేనెవాకలున్నట్టు

తోస్తోంది. దాని పెచ్చు చుంబన సౌభాగ్యమునకై పరితపించు పరమకళా ప్రదేశం. ప్రథమసందర్శనంలో తెరమీదకు వచ్చునపుడు ప్రెసిడెంటుగారి కంటికి -బూర్లుమూకుడులోనుంచి వచ్చినా- సమస్తాభరణ భూషితురాలై ఆ కాశమునుండి తొంగిచూచు తిలోత్తమలా కన్పించింది. ప్రెసిడెంటుగారి కళ్ళఎదుట వివిధరీతుల నాట్యరేఖకళా దురంధరనిరూఢిని నృత్యం చేస్తోంది. అంతలో 'మందగమనంబున పురంధరనందను మందిరంబున కరుగుదెంచిన ఊర్వశిలా' ప్రెసిడెంటుగారి పెదవులకు తగిలీతగలకుండా దరికిచేరింది. ఆయన పెదవులు చెమర్చేసరికి తెయ్యిన వెనక్కి గంతేసి ఎక్కడో మిన్నులుపడ్డచోటుకు పోయి దాగుంది సుగంధి, ఆ అసమాన సౌందర్యవిభాసిని. నిజానికి దాని అందం, ఆట కొరుక్కుతినేయాలన్నంత ముద్దొస్తున్నాయి ప్రెసిడెంటుగారికి. ప్రెసిడెంటుగారు మనసును దానిపై లగ్నంచేసి తన్మయులైయున్న ఘడియల్లో మాటలు నేర్చిన రొట్టిముక్క కొంటెమాటలు విన్పించాయి ఆయనకు. ఆటవలెనే మాటకూడా ఎంతో హృద్యంగా రుచికరంగా ఉంది. దాని వాగ్గుంభనకు ప్రెసిడెంటుగారు పులకపటలపరికలితదేహుడైనాడు.

రొట్టిముక్కలు మాట్లాడతాయా అని బెంబేలు పడకండి. కనుబొమలు ఎగరేసేటంత విడ్డూర్యం ఏమీలేదు. మాచిన్నతనంలో శుభ్రంగా మాట్లాడేవి. ఎందుకు మాట్లాడేవి అంటే, మాట్లాడేవి కాబట్టి, అంతే. అవి మాట్లాడడమే కాకుండా, వాటిని నిత్యంసేవించేవాళ్ళు మాట్లాడుతోంటే, కంచుకంఠాలా అనిపించేది అమ్మోత. ఈ పిదప కాలపు యిడ్లీ పీలగాత్రాలూ, హ్రస్వధ్వనులూనా? ఆఖరి ఘళ్ళల్లో ఉన్న ముసిలమ్మగారు, దొడ్డివసారాలో పోతో, పోతో, "మెరకపొలం సిస్తు రైతిచ్చాడురా, యాజులూ?" అనో, "ఫలానివారి అమ్మాయిని ఫలానివారి అబ్బాయికి ఖాయపర్చారా?" అనో, కొనఊపిరితో అడిగితే, అప్రశ్న వీధి అరుగుమీదకు ఖణిల్లని విన్పించి అదరిపడేవారు. ఇప్పుడో - యింకా మూడురోజులదాకా ఊరగాయకుండలగొడవ అక్కరలేదని అనుకొంటోన్నా ముందు మాటపడిపోయి కూరొచ్ఛేదమాయిరి, ఖర్మ. కాలపరి

కాలంలో మినపకొట్టి యిడ్లీ అయ్యేసరికి ఆ అవరోహణక్రమంలోనే మనుష్యులు వాళ్ళకంఠాలు దిగజారాయి. ఇంతగా యీవిషయం సాగ తీసినకారణం, ఏమనిషినైనా, 'మాచిన్నతనంలో' అని ప్రారంభించనిచ్చి బరిమీదకు వదలిపెట్టామంటే, హరిశ్చంద్రుడే కాని చంపేశాడన్నమాటే, గోరంతలు కొండంతలుచేసే కోతలు. ఆచిత్రమేమో 'మాచిన్నతనంలో' అన్నది మనిషికి సాంబ్రాణిపొగే. వాడు చూస్తోంటే సారనాథస్తంభ మంత అయిపోయి మున్ని నలుసుల్లా మాట్లాడతాడు.

నే నంతదూరం వెళ్ళకుండా మధ్యమంలో పోనిస్తున్నా. నిజానికి ఓకాలంలో రొట్టెలు మాట్లాడాయి అన్న సిద్ధాంతానికి రుజువులు లేక పోలేదు. పంచతంత్రంలో పిట్టలు, జంతువులు ఎంతచక్కటి పేర్లెట్టుకొని, ఏలాంటిసుభాషితాలు ప్రసాదించి, ప్రజలకింత సుబోధకాలయ్యాయి! అమాటకొస్తే భారతంలో చెట్టుమాట్లాడింది. చదివారుగా 'అందు రోహిణంబను పాదపోత్తమంబు గరుడునిం గని' ఊరికేనిలబడి ఉండలేదు స్మండీ – 'సంభావించి ఏమేమో చెప్పిం'దన్నారు నన్నయగారు. ఒక్కటి మాత్రం ఘంటాపధంగా చెప్పగల. మీరు చూడనివన్నీ లేనట్టు భావించే బుద్ధి అలవడకూడదనీ, 'There are many things in heaven and earth than are dreamt of in our philosophy' అనీ! మన బాహ్యనేత్రాలకు గోచరించనివి పెక్కులు మహనీయుల మనో నేత్రాలకు (Intution అంటారు) గోచరిస్తాయని నామనవి.

కాబట్టి మహనీయుడు ప్రెసిడెంటుగారితో రొట్టె మాట్లాడింది. కొంటెపిల్లలా మాట్లాడిందికూడా. చమత్కారంగా! "ప్రెసిడెంటుగారూ మీరు నిరాహారదీక్షబూని చావటానికి సిద్ధమైనారంటే, నేను నమ్మను మీమాట. మీరుకనక అట్లా నిగ్రహించగలిగితే నామొత్తంతూకంలో సగానికిసగం ఓడిపోతానని పందెంకాస్తున్నా" నంది. ఈసవాలుకు ఏలాంటి సమాధానం సమంజసమో ప్రెసిడెంటుగారికి తెలియలేదు. ఏదో పొడుపుడు కథలాగుంది. "తిరుగా చెప్పు" మని దగ్గరకు తీసుకో పోయాడు. "అమ్మో నన్ను కాజేతామనా? నేను భోజ్యమను తమరు

భోక్తలు. మనకేటి పోత్తు?" అని కించచ్చకితన్రై రెండడుగుల వెనక్కి నవ్వుతో కవ్వించింది. ప్రెశిడెంటు శీలాన్నే సందేహిస్తోన్నట్టు ముక్కుమీద వేలేసుకొని రొట్టెను పొట్టనెట్టకుండా, ముట్టకుండా ప్రెశిడెంటుగారు నిరాహారదీక్షను దిగ్విజయంగా నడపగల్గారా, రొట్టెపూర్తిగా అమట్టునే యుంటుంది. దానితూకంలో సఖానికిసఖం ఓడిపోతానని అది అనికున్నా, సఖంమాట అటుంచి ఏకొంచెం పిసరైనా దానిదిపోదు. కాబట్టి యీాయన దీక్షలో నెగ్గితే అది ఎప్పుడూ ఓడదు. అలాకాక యీాయన రొట్టిని కించిత్ కరచాడా యీాయనదీక్షే పోయింది. దీక్షే భగ్నమైతే యీాయనే ఓడిపోయాడు. ఓడినవాడికి రొట్టెలో హక్కు ఉండదుకదా న్యాయశాస్త్రరీత్యా. రొట్టెలో యీాయనకు హక్కు కలగకపోతే, రొట్టె నెగ్గుతుందన్నమాట. ఎటుచూచినా రొట్టె ఓడిపోయే సందర్భమే కనిపించదు. ఈపందెంలో ఆాకంఠపాశాన్ని ప్రెశిడెంటుగార్కి తగల్చి తెయ్యాని అడుతోంది. ఈ డైలమాను ఏలా విప్పేదీ తార్కికులకు వదలి, ప్రెశిడెంటుగారి ప్రాయోపవేశ పర్యవసానాన్ని చూతాం.

## ప్రెసిడెంటు ప్రతిన, ప్రసన్నత

ఈ ప్రశ్న కెటుచూచినా దారీతెన్నూ కన్పించలేదు ప్రెసిడెంటుగార్కి. ధర్మనిర్ణయానికి సభాసదులకు "మున్ను ననోడి తనోడాడా? తనోడి ననోడాడా?" అని మెడకుపట్టించిన ద్రౌపదిప్రశ్నలా కొరుకు పట్టం లేదు. అంచేత నష్టమతియై, పరాజయ దుఃఖితచేతస్కుడై, అదత్త ప్రతివచనుడై, చేతుల్లో తలపెట్టుకొని కర్తవ్యం ఆలోచించాడు. లెక్కకు మించిన కేసుల్లో, పెక్కు క్లిష్టసమయాల్లో అపూర్వప్రజ్ఞా, ప్రజ్ఞాప్రతాపాతిశయాలు ప్రదర్శించి, చిత్రవిచిత్రగతుల్లో లాపాయింట్లు గుప్పి

ద్రోణాచార్యునికన్న మిన్నయగు ధానుష్కుండని పేర్వడి, తర్కకర్కశత్వమున రక్కసుల్లాంటి న్యాయవాదుల నుక్కడించిన గండరగండడీనాడు, ఒక్క రొట్టె వెకిలి వెక్కిరింతలకు వెరగుపడి, వెన్నిచ్చి పాటినవో నగరే, తోటివారన్న సిగ్గురేగింది. పౌరుషం రెచ్చింది. కోపరక్తాంతనయనుడగుచు నంత కాకోరంబున దంతసందష్ట దారుణముఖుండై, తువ్వాలు ముసుగులోనుంచే భూమ్యాకాశాలు సాక్షిగా, నేపథ్యంలో ఘోరాతిఘోరమైన ప్రతిన చేసాడు. "శరనిధు లింకుగాక, కులశైలము లేడును గ్రుంగుగాక, ఆ జ్వలనుడు వేడిమినే విడచి చల్లదనంబును దాల్చుగాక నేనీ ఖలు నుత్తమాంగమును ఖండనచేసెద" నని తొడకొట్టాడు. "మహానస గృహాంతరాళాల్లో బూజ్లుమూకిట దూరనీ పాతాళంబున దాగనీ పట్టితెచ్చి లోకభీకరకీలలన్ వధియించి తద్వపుల వక్షశ్శైలమును నుగ్గుచేసి నవిలిమింగేస్తా" ననే అహంకారంతో మహానసగృహోన్ముఖుడై పోతున్నాడు. దూకుడుగా అడుగేస్తోన్నవాడే, ఏలనో అంతలో ఆగి, క్రీకంట వంటింటిని చూచుకొని, దొడ్డిగుమ్మందరి నున్న కళాయిలోనీళ్ళు కాళ్ళమీద పోసుకొని, ముఖం తడుపుకొని, స్త్రీజనమచ్చెరువొంద, ప్రసన్నవదనుడైనాడు. ఒక్క శీతలోదక ముఖప్రక్షాళణతో ఉపశమిత క్రోధులైన ఉత్తములు మహర్షులంతైన కానరారు. ఓ హారతికర్పూరపు బిళ్ళనీ, ఓ కొబ్బరికాయనీ, ఏ ఉపశమనపదార్థావశ్యకత లేకుండ, క్షణమాత్రాన, ఉగ్రనారసింహం ఉపసంహరింపబడ్డదంటే, ప్రెసిడెంటుగారియందేదో, బహువీర్యవంతమైన మహాద్భుత మంత్ర మాహాత్మ్యం ఉండాలి. "అబ్బే! ఏమాహాత్మ్యం కాదండీ, జఠరప్రభావమండీ" అనిపెదవి విరిచాడట కిట్టనివాడో పూజారి. అంటే ప్రెసిడెంటుగారు రొట్టెముక్కకు కక్కూర్తిపడ్డారనా వీడి అభిప్రాయం! పార్టీ కక్షలుండవచ్చు, కాని ఎంత నైచ్యాని కొడిగట్టాడో చూచారా? ఎంతవాడిని ఏలా తీసిపారేయడానికి సమకట్టాడో గమనించండి. నిజానికి వీడి టెస్టిమోనియల్ వల్ల ఆయనకు వలకునది తొలకునది లేకపోగా, తన గుణాన్నే వెళ్ళబెట్టుకున్నవాడయ్యాడు. వాడెవడో 'Carnal Considerations of bread and

Cheese' అధిగమింపలేని అల్పబుద్ధి అని తోస్తుంది. పొట్టను నోటికి కట్టుకొని, ఒక్కపూట భోజనాన్ని 'Special providence' లా పరిగణించే ఆజన్మక్షుత్పీడితునికిగాని, యీ అనార్యాభిప్రాయం కల్గదు. ఇతర జీవరాసులనుంచి మానవుని ప్రత్యేకించే విశిష్టగుణాలు, అన్యాలోచనలు ఏకొంచెం అంటని అపరిపక్వమనస్కుడైయుండాలి. పశువాంఛలను చంపుకోలేక, జఠరపిఠరీపూరణమునే జీవితపరమార్థంగా పాటించి, ప్రతినిమిషం పొట్టకు ప్రాధాన్యం యిస్తో, క్షుద్రవ్యక్తిత్వజీవితంలో బంధితులై, స్వోదరమాత్రం పూరింపకోరే పశుతుల్యు లెందరులేరు? వీడొకడు. ఈ బాపతువారికి పండితమ్మన్యుడు ప్రెసిడెంటుగారి హఠాత్పరివర్తనం అర్థం కాగలదా? ప్రెసిడెంటుగారు ముఖ్యంగా విప్రుడాయిరి. 'విప్రుల యలుకయు, దృణహుతాశనంబును దీర్ఘములగునే!' అంచేతనే, 'నమిలి మింగేస్తా' నంటో వచ్చిన ఆయనపల్కు దారుణాఖండల శస్త్రతుల్యమే అయినా, వాకిట్లో తెయ్యిన ఆడింది. ప్రెసిడెంటుగారికి ఆగ్రహ కారణమైనది. ఇప్పుడు ఎఱుగనట్లు పొయ్యిప్రక్కను బూర్లిమూకుట్లో సుఖనిద్రతీస్తోంది. ఆసుగంధినిచూచి, ప్రెసిడెంటుగారు వికసితవదనుడైనాడు. ఎంత సువిశాలహృదయుడు. రొట్టెనుచూచిన కళ్ళతోనే, వెన్న నేయి పెట్టుకునే ఉట్టిమూలను విలోకనప్రభావీచికల సారించి, ప్రెసిడెంటుగారు తమ 'నిండుమనంబు నవ్యనవనీతసమానమని' ప్రదర్శించారు. 'మామా, మేష్టారూకూడా వాకట్లో వేచియున్నా' రని మామ్మగారితో చెప్పి ప్రెసిడెంటుగారు వాకట్లోకొచ్చారు. వారి వెన్నంటే, పోతన్న ఫిలిమ్‌లో మన కంటబడ్డట్టు నన్నయ్యగారి తరలంలో చెప్పబడ్డట్టు లార్జిస్కేలులో, వెండి పళ్ళెరాలు, రొట్టెముక్కలూ, మరచెంబులు 'నేతికుండలు, గుడంబు' పలు తెరంగుల పచ్చళ్లు వచ్చిపడ్డాయి. అవిరళవితరణ నవరాధేయుడు ప్రెసిడెంటుగారూ, మాస్టారూకూడా జీలకర్రపాటైనా వదలకుండా వాటి నారగించి గతక్షేములైనారు. ఈరీతిగా 'రొట్టెముక్కను కుక్క ముట్టుకుపోయిం' దన్న పోల్కను, ప్రపంచం చూడవేచియున్న ప్రాయోపవేశాన్ని రొట్టె ముట్టుకుపోయింది. 'ఎంతెంతటి మహోద్యమాలు

ఎంత అల్పకారణరీత్యా విధ్వంసం కాగలవు'' అనిపిస్తుంది. ప్రెసిడెంటుగారు ఆరాత్రిపడ్డ నొప్పులు చూచినవాళ్ళెవరూ, ప్రాయోపవేశానికి పురుట్లోనే సంధికొడ్తుందని అనుకోరు.

## కథకుని ఊహాగానం కాదు

ప్రెసిడెంటుగారి ప్రాయోపవేశఘట్టం యీ కథకుని ఊహాగానమని శ్రోతలు తలుస్తున్నారేమోనని, తదనుమాననివృత్త్యర్థం కథకు అడ్డురావల్సి వచ్చింది. ప్రసన్నకథాకలితార్థ యుక్తిసంపన్నులు నన్నయ్యగారికే యీ ప్రక్క బెదురు ఉంటోవచ్చినట్టు, ఆయా ప్రదేశాల్లో శ్రోతలను సమాధానపర్చుకొంటో వచ్చారు. విషాగ్నిచే పరీక్షిత్తును దగ్ధంచేయబోతూన్న తక్షకుడు, పరీక్షిద్రక్షణార్థం పయనమైన కశ్యపుడు, నిర్మానుష్యమైన అటవీప్రదేశంలో కలసినట్టుగా చెప్పి, ఆ కశ్యప తక్షకుల రహస్య సంభాషణా వృత్తాంతం నుడివి, నన్నయ్యగారి కంతలో సందేహం కల్గింది కాబోలు, తీరా నిర్మానుష్యాటవీ ప్రదేశమంటి నే యున్నట్టు,

'ఇట్లు విజనంబైన విపినాంతరంబున నైన యయ్యిరువుర వృత్తాంతంబు మీ రెట్లెరింగితిరం టేని,

''ఇప్పురంబున బ్రాహ్మణుం డింధనార్థ మేగి
మున్న యావృక్షంబు నెక్కి దాని
తోన దగ్ధుడై మఱి దానితోన లబ్ధజీవుడై
వచ్చి జనులకు చెప్పె దీని''

అని ఒక తేటగీతంలో తేటపరచి, సందేహనివారణా ప్రయత్నం చేశారు. ఏలనో యీపద్యం, పిల్లలను ఊరుకోబెట్టే సమాధానంగా ధ్వనిస్తుంది. కాని, ఆది సభాపర్వ పాఠకుల మనోనయనంలో గోచరించే నన్నయభట్టుగారి దివ్యమూర్తి యెదుట మనం నిస్సందేహంగా పసిబిడ్డలమేనని గ్రహించుకొని, ఆసమాధానాన్ని భక్తియుక్తంగా స్వీకరిస్తాం.

చూచారో లేదో, యుద్ధపర్వాల్లో బయల్దేరే గడ్డుచిక్కొటి - శ్రోతలు సందేహాలుపెట్టుకు యుద్ధపర్వాలు వినక్కరలేకుండా - వ్యాసులవారు ముందే ఆలోచించి జాగ్రతపడ్డట్టుగా శుభ్రంగా యుద్ధపర్వాల preamble లోనే, తగుసమాధానాన్ని సుప్రతిష్ఠితంచేసి, ముఖ్యంగా పౌరాణికులకు ఓగొప్పవిపత్తు తప్పించారు. యుద్ధపర్వాల్లో పట్టుమని పదిపద్యాలైనా చదవందే, శ్రోత ఎవడైనా పౌరాణికుణ్ణి నిలేసి నాలుక పట్టుకొని, "అయితే శాస్త్రుల్లుగారూ, యీసంజయుడు అస్త్రానికీ అస్త్రానికీ మధ్యనుంచి శరవేగంతో సమరధరణిఅంతా లుంగచుట్టి చూచొచ్చినట్టు, గుడ్డివాడుకదా అని ధృతరాష్ట్రునిదగ్గర మూరా బారా లేకుండా, కురు పాండవవీరుల రణకౌశలం ప్రతిఅంశం కోస్తాడు. పైగా దివ్యుల స్తోత్రాలు, తలపులుకూడా తెల్సుకొచ్చినట్టు హంగామాచేస్తాడు. ఈయనను అస్త్రాలు ముద్దుపెట్టుకోవచ్చాయా!" యనీ, "కురు పాండవ వీరుల దివారాత్రప్రవర్తనాలు, రహస్యప్రకార సంభాషణలు, మనోవృత్తాలుకూడా ప్రక్కనుండి చూచొచ్చినట్లు దంచుతాడు; సూర్యాస్తమయం కాగానే యిరుపార్శ్వాలవీరులు వారివారి ప్రత్యేక మిలటరీ క్యాంప్‌లకు పోతారుగదా, ఏకకాలంలో ఎక్కడ ఏంజరిగేదీ ఏలా చూచాడు? పోనీ వారివారి క్యాంపులలోకి చాటున దూరాడేఅందాం, వాళ్ళబుర్రల్లోకి ఏలా దొల్చుకుపోయాడు! ఇంతకు, యీయన ఆహార నిద్ర లక్కరలేదా!" అనీ, పరిహాసిస్తే, పౌరాణికుడు మిడిగుడ్లు వేయనక్కరలేకుండా, సంజయున కాశక్తులు వరప్రసాదమని తానొసంగినవే అనీ సాత్యవతేయుడు ముందుచెప్పేసే, యుద్ధగాథ ప్రారంభంచేసాడు.

"అలాంటి మంత్రబలమనీ, తపోవిభవమనీ, ఏ ఒక్కటీ యింటా వంటాలేని అర్భకుడు యీకథకుడు, ప్రెశిడెంటుగారి కంటింటి నేతివృత్తి దగ్గరనుంచి వాకిట రహస్యప్రసంగంవరకు రాత్రివృత్తాంతమంతా, కల్పితం కాకపోతే, ససాకల్యంగా ఏలా చెప్పగల్గాడు!" అని శంకించే సోదరపాఠకులకు సమాధానంగా, "పూజారి చారుల అద్వితీయచాకచక్యం యింకలోనే మరస్తిరా!" అని నాప్రశ్న. విపత్తుల కిటికీలు, తలు

సులు, చూర్లు, పిట్టగోడలు, పిడకలగూళ్ళు, పాతరగోతులు, మదుర్లు, తలుపు సందుల దేఖిలా సమస్తబాహ్యాభ్యంతర మర్మస్థలాలూ, ప్రతివీరుల ప్రాంగణంలో,' 'కవట లాండ్రొంటితో గదియుచు నెడములుక్రింగి లోని జొంపము పవలును జెనుచీకటి నొదవించి పొదలంగనొప్పు వృక్షశాఖలూ, పూజారిచారులకు రాత్రిబసలని మనవిజేసియున్నా. రాజనీత్యుపదేశంచేస్తో నారదుడు ధర్మరాజును 'పరమహీశుల చరితము వీక్షింతె నిపుణచర నేత్రములన్!' అని కుశలప్రశ్న అడిగాడే! అదుగో, కేవలం, ఆ నిపుణచరనేత్రాలే పూజారిపార్టీ చారులు. రవి కాంచనిచో, కవి కాంచుననేకదా అనడం వింటాం. ఆకవి కంటబడని పెక్కువిశేషాలు పూజారిచారుని కంటపడడం కలదు. వార్తాసంచయసేకరణా, ప్రచార ప్రకటనలు చారులకు నిత్యవిధి.

"వార్తయందు జగము వర్తిల్లుచున్నది, యదియు లేనినాడ యఖిల జనులు
నంధకార మగ్నులగుదురు గావున, వార్తనిర్వహింపవలయు బతికి"

అన్న రాజనీతిని జీవితప్రథమసూత్రంగా నమ్మేసి, మనోవాక్కాయ కర్మలా ఆదరించి ఆచరించేది పూజారిపార్టీ. ఆరాజకీయదృక్పథంతో పార్టీ క్యాబినెట్టు నిరంతర సేవాతత్పరతతో చారులు, ఏనిమిషాని కానిముషం వార్తావళిని కొల్లలుగా గ్రామవాసుల కందిస్తోంటే, ఊహకు అవశ్యకత అటుంచి, స్థానమెక్కడ? పూజార్లు జారేసుకొచ్చిన మాటల్లోనే కొన్నిటిని, గ్రంథవిస్తరణభీతితో వదలివేస్తోన్నా డీకథకుడు.

## మాయావి చోరీ అభియోగ దుష్ప్రయత్నం

ప్రెసిడెంటుగారి ప్రాయోపవేశపుణ్యకథా సుధారస వశీకృతులమై మాయావిని పెద్దప్రొద్దు, తడిపిపెట్టాం. ఆతడికేంజలుబుచేసిఉంటుందో. తాటిబాదును పెడవులపై తాటిస్తోన్న మామ.తధ్యానయోగ పారతంత్ర్యంలోనే ఉండిపోయి, ప్రసిడెంటుగారనుభవించిన అవస్థాభేదాలను పాటించ

లేదు. పరధ్యాన్నంగానే రొట్టెను కొద్దిగా చవిచూచి, తిరుగా తాళవృక్ష గుణనామ సంస్కారాణాల్లో కొంతవడి కనుమూసాడు. కళ్ళుమూతలుపడ్డా ప్రణవపూర్వకంగా పెదవులపై పాదపం, కదల్తోనేయుంది. ఏనాడైనా కల్పతరువు, కదంబం, అశ్వత్థం పూజార్హాము లైనాయి కాని తాళవృక్షం పంచాక్షరీమంత్రమూలం కావడం కని విని ఎరుగం. ప్రెసిడెంటుగారు వంటింట్లోకి వెళ్ళిన ఘుళ్ళల్లో ఏదో కంఠంలో కెళ్ళించినట్టు మామ చప్రున లేచి మాస్టరుగారు తూలిపడేలా ఆయన్నాపి 'ఇట్టిగట్టున తూర్పుప్రక్కనే చెట్టుమొదలుందనీ, డాక్టరు చెట్టును కొట్టించలేదనీ' సంశయ నివారణ చేసుకొని సద్దుకొని, తదేకదృష్టితో వాకటి తనాభీపై చూపు నిగుడించి, కాళ్ళూపుతున్నాడు. ప్రెసిడెంటు రొట్టెగొడవనుంటచే అదంతా మేధా సంపన్నుడు మామ, హెడ్మాష్టరుపై అభియోగం తెమ్మటటుగాను భావ సామగ్రిని కూర్చుకొంటోయున్న మనోవేదన అని కానలేరు. మామూవి తన్నడిగిన ప్రశ్నలన్నీ తదభియోగ జ్వరోన్మాద సంజనితమైన పలవరింత లని మాస్టారూ పసిగట్టలేదు. కంచాల్లో దిగన్ల పెమ్బలను ప్రెసిడెంటు గారు, మాస్టారు కరకరలాడిస్తో పరిసరాలను మరచియున్నతఱి, - మామ ప్రోసెస్ ఆఫ్ థాట్ అప్పట్లో ఏమీ తెలియదు - 'అబ్బాయి' అని కొవ్వున ప్రెసిడెంటుగారిని సంబోధించాడు-మామ. మాస్టారులిక్కిపడి చేతిలో ఉన్న రొట్టెడిప్పను పాసం నేతిగిన్నెలో వదిలాడు కంగారులో. "ఇంత కమ్మటినేయి యింటిపాడేనట్రా అబ్బాయి?" అని ఏదో ఫలాహార విషైక కుశలప్రశ్న అడుగుతున్నాడు మామ, అనుకొన్నాడు ప్రెసిడెంటుగారు. 'ఆ, అవునుమామా' అనడం తర్వాయిగా ప్రెసిడెంటుగారి పెదిమలు కలియ బోతోన్న సమయంలో గుక్కతిప్పకుండా, "పడిందిరా పతకం యిప్పు డెక్కడికి తప్పుకుపోతాడ్రా. పడ్డాడ్రా, ఉచ్చుల్లోపడ్డాడు. ఏమిఎగిరి పడ్డాడు. ఆ! నవనాళ్ళూ బిగించేసాలే, యిక తెన్నుకుచావాలి. ఇప్పు డేవెధవ అడ్డొస్తాడో చూస్తా. చెయ్యి, డాక్టరుకు కబురుచెయ్. తక్షణం నాయింటికి పంపించు. తెల్లవారేసరికి మాగుమాస్తా యిక్కడుండాలి. ఏమయ్యో మాస్టరు, అట్టే మిటుకూ మిటుకూ చూడక వాడితో చెప్పి మరీ

వెళ్ళి యింటికి ఎక్కడున్నాడో వాడు. ఏడవగానే నేవచ్చిపడ్తానని చెప్పిపో' అంటూ సంతోషభరాక్రాంత స్వాంతుడై మాయావి ఎగిరిపడి పోతున్నాడు. అంతలోనే వికటాట్టహాసం చేస్తూ ప్రెసిడెంటుగారివైపుకు తిరిగి, హాహ్హాహ్హా! అని నవ్వుతో, "అరనిఉక్రోషం, తీరనిసమస్యఉంటాయా అబ్బాయి, పనునికిరావాలి, సాకానికి తెచ్చుకోవాలిగాని" అని బుసలు కొడ్తోన్నాడు. ఆ నిశ్శబ్ద నిశీధంలో ఆడ్తోన్న మామ కేవలం ఆరడుగుల ఎత్తులేచి, పడగవిప్పి బుసలుకొడ్తోన్న మహానాగంలా కన్పిస్తోన్నాడు. నిజంగా మహానాగమే. దానిబుస యమధర్మరాజు మహిషపుబుస. దాని దృష్టి లోకాంతరంనుండి పిలుపు. దాని కాటుకు తిరుగులేదు. మాయావి వదన నిశ్వాసపవనం, సధూమదహనజ్వాలాభీలంగా, భయానకంగా ఉంది కాబోలు, పంతులుగారు ప్రెసిడెంటుగారి కుర్చీప్రక్కకు తప్పుకొన్నారు.

నిజనామధేయాన్ని సార్థకపరుస్తూ మామచేస్తోన్న ప్రళయతాండవ అంతరార్థం, ప్రెసిడెంటుకు, పంతులుగారికీ,దురవగాహంగానేయుంది అన వచ్చు. ప్రెసిడెంటుగారు మేధావే. కాని పరాభవ క్లేశోపహతుడైనతరి ప్రారంభంలో పూర్ణశ్రద్ధ వహించలేకనైతేనేం, రొట్టెముక్క వేటకు వెంటెంట దొరబడ్డపుడు వినకనైతేనేం, మాయావి ప్రశ్నా ప్రసంగాల సీక్వెన్స్ ప్రెసిడెంటుగారు ఫాలో కాలేదు. చెవినిబడ్డ తెంపుడుముక్కలను ఎంతఅతికినా ప్రెసిడెంటుగారికి మాయావి మస్తిష్కంలోతయారయిన అభియోగాకృతి నిర్దుష్టంగాలేదు. పంతులుగారంటారా గత పది, పదిహేను సంవత్సరాల మాష్టరీలోనూ జవాం నిఖారసు సరుకు అచ్చాడీలంటి బండాభాయాలు, ఆయన అదృష్టంకొద్దీ లభ్యమవుతో వచ్చారేమో, వాళ్ళకు నూరిపోసే రాపిడిలో తాను ఉద్యోగ ప్రారంభంలో తెచ్చుకొన్న కొంచెంఉత్సాహం, ఊహాసంపత్తి, లోకజ్ఞత, ఆనవాలు లేకుండా అరిగి పోయినాయి. పైగా అబుద్ధిమంతులతో కలిగిన నిరంతర సందర్శన సంభాషణ బోధన వ్యాసంగంమూలంగా— ముఖేముఖే సరస్వతీ అన్న ఆర్య వాక్యం ఊరికేపోతుందా— చూస్తోంటే వాళ్ళబుద్ధిసాత్మ్యత ఆయన్ని ఆవిష్టించి, శిష్యులనుమించిన గురువై ఊరుకున్నాడు.

పై ప్రత్యేకవిషయమటుంచి, ఉపాధ్యాయుల్లో వర్గవిశిష్టత ఒకటి గోచరమవుతుంది. విద్యాలయాలు కాక, విద్యాలయాలన్న పాఠశాలల్లో దరహాంమీద ఉపాధ్యాయులు సాధుజీవనులు, సరళవర్తనులు, నైతిక సంపన్నులు అయియుంటారు. నైతికబల సంపాదనకా వాతావరణం తోడ్పడుతుంది. విపరీత పరిస్థితులేర్పడితే తప్ప వాతావరణం కలుష భూయిష్టం కాదు. కానక్కరలేదు. న్యాయస్థానాలు లౌకికులకు పుట్టినిళ్ళు అయినట్టే విద్యాపీఠాలు శ్రోత్రియస్థానాలు. వ్యక్తిగతంగా చూస్తే పేర్వడ్డ లౌకికులు ఒకళ్ళిద్దరు బడిలోనూ దొరకవచ్చు. నుతికెక్కిన శ్రోత్రియులు న్యాయస్థానంలోను లభ్యం కావచ్చు. మనకెక్కడ లౌకికశక్తి లేదనుకుంటోన్నారో ప్రజలని కలియదొక్కుకునే అల్పజ్ఞులు విద్యాస్థానాల్లో యుండవచ్చు. శ్రోత్రియులమని పేరేసుకొనుటకు భేషజప్రసంగాలు చేసే బడాయికోరు న్యాయస్థానాల్లో ఉండవచ్చు. వెతికితే ఎక్సెప్షన్స్ కన్పట్టినా సూత్రం మాత్రం సత్యదూరం కాదు, అందుచేత మాస్టారు మాయావి ప్రసంగాన్ని మొదలంటా విన్నవాడైనా ఆప్రసంగంలో అంత లీనమైయున్న దుర్మంత్రాన్ని గ్రహించలేకపోయాడంటే మరి వింతలేదు.

## నాచురల్ సైన్సుమాస్టరు (Delirium) సంధి.

కథకడ్డొచ్చా. మిత్రుడో ఉపాధ్యాయుడు, జంతుశాస్త్రం గణితం బోధించేవాడు, జ్వరపీడితుడై డెలీరియమ్‌లోయున్న ఘళ్ళల్లో చూచి, సాలిగ్రామంలాంటి అతడి నిర్మలజీవితాని కచ్చెరువొందా. జీవిత యాత్రలో మనం మనసుకు గట్టిగా పట్టించుకొన్న అహంకార మమకారాలు అనుభవాలు, జ్వరసమయంలో కళ్ళముందు కొచ్చి గజ్జెకట్టి పోతుంటాయి. అతడి మంచందగ్గర ఉన్న గంటలోనూ, భార్యని కాని, పిల్లలని కాని, మిత్రులని కాని, శత్రులని కాని ఏ భౌతిక వాంఛ, విద్వేషం

అతడి ధోరణిలో రాల్చలేను. ఆతని మంచందగ్గర గజ్జెకట్టినవి, మిగతా మానవీమానవులాడుకొనే నాలుగు స్తంభాలాటలోని విషయాలూ, వినోదాలూ, కానేకావు. అన్నీ ఆతడు సాలుసాలూ చెప్పే పాఠాల్లోని విద్యావిషయిక వినోదాలే. మొత్తం ధోరణి నిస్సంశయంగా Delirium అయినా, అదేంచిత్రమో ప్రతి ప్రసంగం ప్రతి ప్రశ్న సందర్భశుద్ధి చెడకుండా, బహు సమయోచితంగా అంటూ వచ్చాడు. అందువల్లనేకూడా ఆరేడేళ్లు అయినా నేటికి ప్రాసగుచ్చినట్టది నాకు జ్ఞాపకమే. నేనూ వెళ్ళా, డాక్టరూ వచ్చాడు. డాక్టరు చేయిచూస్తూ నాలుక తెరవమన్నాడు. మిత్రుడు శుభ్రంగా చూస్తున్నాడు, నాలుక తెరుస్తాడనుకొన్నా. అట్లా చేయక, పైపెచ్చు, 'కప్పనాలుకపటంగీయుము, నాల్గుమార్కులు. మిడత నోటిభాగములను పేర్కొనుము, మూడు మార్కులు' అన్నాడు. పొట్ట చెక్కలయ్యే పన్నాను నాభిదగ్గరనుంచి నాకు నవ్వు బయల్దేరి, తన్నుకొచ్చిపడ్తోంటే నేపడ్డక్షోభ భగవంతుడికెరుక. నా కాతడాప్తుడా, ఆతడి కుటుంబపరిచయంకూడా ఉందా; గాఢంలేదని నవ్వుతూ అనుకొంటోయున్న ఘళ్ళల్లో వెళ్ళానా; అక్కడ ఫెడీలున నవ్వాడంకన్న తుంటరితనం మరోటుందా. అప్పుడే నవ్వితే యీజన్మలో దానికి ప్రాయశ్చిత్తమంటూ ఉంటుందా? రౌరవాది నరకాల నేటివే ఉంటే, ప్రాప్తించి తీరే విషమఘట్టం దాపరించింది. చచ్చే చావు వచ్చింది, నవ్వా వచ్చిపడ్తోంది. ఏంచేసేదీ తోచలేదు. ఏంతోచడానికీ వ్యవధిలేకుండా వచ్చిపడ్తోందాయిది. ఇప్పుడాలోచిస్తే రెండే గత్యంతరాలు కన్పిస్తాయి. మా వూళ్ళో పెళ్ళిపీటలదగ్గర తుమ్మువచ్చిన బుద్ధిమంతుడోడు, బిగపట్టుకొని దభీలున గడపదాటి, యిక ఆపుకోలేక లోపలకొస్తోన్న పెళ్ళికొడుకు అప్పగారిమీద తుమ్మి దెబ్బలుతిన్నట్టు వీధిలోకివెళ్ళి నవ్వేరావాలి. తప్పితే హరహరా అని పైకండువా ముఖానికి ముసుగేసుకొని నవ్వినా ప్రమాదమే, ఆనవ్వును శోకధోరణిలో ధ్వనించేటట్టు చట్టున మార్చేసి పరువు నిలబెట్టుకోవాలి. దైవానుగ్రహం బాగుండి ఎవరైనా అక్కడ, నువ్వు కడుప్పగలకునాయినా అంటే, ధన్యజీవుణ్నే. మిత్రుడు, తన జ్వరంమాట

ఏలాయున్నా నన్నీ వడుదుడుకులలో పెట్టాడు. తీరా ఆడాళ్ళు నేను రావడం చూచారు. ఇంకా ఒకర్ని ఒకరం పలుకరించుకోనైనా లేదు. నవ్వుప్రమాదాన్ని తట్టుకోలేక పీథట్టుకు పోయానంటే పదిమంది పది మోస్తర్లుగా అనుకోగలరు. మిత్రుడికి కాదు ప్రాణంమీదకువస్తే, నిజానికి నాకు. కొన్ని డెలేరియమ్‌లు అసలివాళ్ళకన్న ఎదరవాళ్ళకు ప్రమాదం. నాకు రోజులు బాగున్నాయి. దైవం సాయంచేసాడు నవ్వు ఆపుకొన్నా. ఆజన్మ నిందపడే యోగం అప్పటికి తప్పింది. ఆరకంవాగుడు వాడితో ఎంతసేపు కావాలి మరో ఉపద్రవం వచ్చిపడ్డానికి. కాని యిక తెలిసింది కాబట్టి ముందు జాగ్రతపడి కొంటుకు మెజర్సు తీసుకున్నా. నన్ను దుఃఖాబ్ధిలో ముంచేసి చనిపోయిన నాస్వజనంలో ఒకరి మృతశయ్యా దృశ్యం మనోనయనంలో తయారుచేసిపెట్టుకున్నా. రాబోయే నవ్వుకు ఎత్తుకెత్తుగా ఉండే దుఃఖాన్ని నాకంటిని కట్టేసుకుని కూర్చున్నానన్న మాట. ఇంతదుఃఖాన్ని మింగేసేటంత నవ్వు మిత్రుడు తెప్పిస్తే తప్ప నేను తేలిపోనన్నమాట. పోనీ అని చూసివెళ్ళిన వాడికి రాదగ్గ పాట్లా యివి ఖర్మం. వ్యవహార మింత గడ్డైన కాలాన మిత్రుడు వాతంకమ్మి ఉన్నాడు. అతని బ్రతుకు యిహపరాలమధ్య వ్రేళ్ళాడుతోన్నమాట వాస్తవం. ఆ ప్రేలాపన మిథ్యకాదు. అభినయం కాదు. నవ్వువచ్చినా నిజంగా ఏడ్వదగ్గ ఘట్టం. కడుపుబ్బా నవ్వు తెప్పించినా మిత్రుని పల్లెత్తుమాట అనడానికి వీల్లేదు. అతడి ధోరణికి ఆగ్రహపడ్డం ద్రోహం. ప్రతీకారం తలపెట్టడం పాతిత్యం. ప్రతీకారం అన్నానంటే, మరో మిత్రుడు కష్టంలో ఉన్నాడని ఒకపర్యాయం చూడవెడితే మాముందు గొప్పకు ఏడిచి మమ్మల్నీ నటకంలోనే పెట్టాడు. తోడపాశంపెట్టి నోరు నొక్కుచ్చాం. వాడు మాతోడి యాక్టర్. వాడి తండ్రి) [illegible] పెద్దాచిన్నా చూడవెళ్ళాం. మంచీచెడ్డా లేకుండా, నాటకాల్లో నల హరిశ్చంద్రాది కిరీటమాంధాతలు శోకించినట్టే, [illegible] సమాసయుక్తంగా, మధ్య మధ్య ఎక్కిళ్ళు [illegible]

వాల్తో, హాహాకారాలు చేస్తో, మోకాలిమీద కూర్చొసాహసిస్తో, హా! హతవిధీ అని విధినిదూరుతో మావంక చూడడం మానేసి అలా శూన్యం లోకి చూస్తో, ఒక్కవరసని ఉన్నాడు. వినిపిస్తోన్నాడు శోకరసం మహా నటుడికి చెల్లకుండా. 10 నిమిషాలు చూచాను వళ్ళు మండిపోతూంది. అంతలో చిత్రనళీయంలోని నటుడు స్టాప్ ఉండే, 'అంతియగాక, క్రూరకర్మ డనై, అయూసమున శ్రాంతిజెంది, నన్నే దైవముగా నమ్మియుండిన మానవతీమణిని నట్టడవింగట్టుచీర జించి గుట్టల బట్టించిన నాయట్టి కట్టడి కిట్టిపాటు యింకెట్టి పాటురాగలదు' ఫక్తు అదే నమోనాలో ముందేకట్టుకు పెట్టుకున్నాడు కాబోలు, మాకేం తెల్సు, మొదలెట్టాడు. 'అంతియగాక, కోరకట్టుకొని, చింతఉట్టైనా నోటపెట్టక, సంసారవారాధి నీదలేక, నీదలేక, పెక్కుయిక్కట్లులకు పుట్టినిల్లై, పుత్రుని శ్రేయస్సాకటే పరమ లక్ష్యంగా పెట్టుకొని, ఆతడు పరదేశంలో, దూరాన, సముద్రతీరాన, అన్యప్రజలమధ్యన కాకినాడలో, విద్యాసముపార్జనకు బోయి ఏంపడరాని బాములపడ్తోన్నాడో అని తదేకచింతతో, కాకితో కబురుచేసింది తర్వాయిగా, కార్డు గీకిపారేసింది తర్వాయిగా, శరవేగంతో టి. ఎమ్. ఒ. లు కెక్కుకు మిక్కిలిగా కష్టోంటివే. ఈకట్టిడి కారోజా లికరావు యిక రావు. బంధువులవీడి, బాంధవశ్రేణిని శోకాంబుధినిముంచి, సురలోక గతుడైతే హా! జనకా!' అని మూర్ఛిల్లాడు. పీడిదుంపతెగ ముఖారిమీదో, నాదనామక్రియమీదో పద్యమో గేయమోకూడా దంచడుగదా లేచి అని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకున్నాం. ఇంగ్లీషు చదువుకున్న పిల్లలు నాన్నలుచస్తే అలాఏడుస్తారు కాబోలు అని ఆశ్చర్యంగా చూస్తున్నారు కొందరు అమాయికులు. 'ఒరేయి, వాళ్ళబ్బాయి ఎంతో చిత్రవిచిత్రాలుగా ఏడుస్తున్నాట్ట రాండిరా చూసొద్దాం' అని పదిమందీ వూళ్ళోవాళ్ళు కట్ట కట్టుకువస్తారేమో సిగ్గు సిగ్గు, అనుకొన్నా. చూస్తోంటే ఒక్కడు పండంటి వాకలిని నాటకం పెండాల్ చేసి ఊరుకున్నాడూ! ఇక పదినిమిషాలు వాడిని పేట్రేగనిస్తే, వాడే కాకుండా, వాడి సావాసగాళ్ళంతా కూడా,

నవ్వులపాలు అయ్యే అసహ్యకరమైన దృశ్యం తయారవుతుందని తోచి, 'అయ్యో నీకెంతకష్టం వచ్చిందిరా అంజీ' అంటో రానికోక మోటి పెళ్ళ పెట్టుగా తెచ్చుకొని వెళ్ళి, వాడిని మెడేసుకొని ఉభయులం లుంగ చుట్టుకు క్రిందపడ్డాం. 'ఇంగ్లీషు చదువుకునే సావాసగాళ్ళు ఒకరికోసం ఒకరు ఆలా దొల్లుతారు కాబోలు' అని అంతా అనుకుంటూంటే, ఆవాడా వుడిలో, రక్తంచిమ్మేలా ఒక్కతొడపాశం పెట్టి, యిక నాటకంమాట కోటంటరానిస్తే చంపేస్తానన్నట్లు కళ్ళలోకి చూచా. దాంతో, ఆలా పైకిపోతోన్నవాడు చల్లగా క్రిందకుదిగి, పందులా మనవూరివాళ్ళు అందరూ ఏడ్చేలాగే ఏడ్వడం ప్రారంభించాడు. అంతభీభత్సం చేయ వలసివచ్చింది వాడి వికారాన్ని ఆపటానికి. అది దొంగవేషంకాబట్టి చేయగల్గాం కాని పాపం యీ ఉపాధ్యాయమిత్రుడి పేలాపన నిజం. అందువల్ల క్లిష్టసమస్య ఏర్పడ్డది. తొడపాశమంత్రం యిక్కడ పనిచేయదు. మరో ఉపచారాలు చేసిమాత్రం ఏంలాభం అనుకొని

'సన్నిపాత సంగతమైన జ్వరముచేత
ఒడలెరుంగక పేలుచున్న రోగి,
తేరగల వేడిమందుల చేతగాక
చక్కపడునొక్క శైత్యోపచారకతుల'.

అన్న నాటకపద్య మోటి మననంచేస్తో, మిత్రుని అనారోగ్య విషయం దుఃఖం ఒకవీసెడు, ఫక్తు నవ్వుఆపుకోటానికి తెచ్చిపెట్టుకొన్న దుఃఖం స్వంతం రెండువీశెలు బుర్రలోపెట్టుకొని, మళ్ళా మిత్రుడు ఏమిపలికి పుట్టిముంచుతాడో అని బెదురుచూపులు చూస్తో, కండవా సాధ్యమైనంతవరకు నోటిధరి పెట్టుకొని నవ్వురాకుండా సిద్ధంగా కూర్చున్నా.

చెయ్యిచూతామని కాబోలు వైద్యుడు మిత్రుని ముంజేయి పట్టుకొని, వంచి, సాచి, నాడిమీద చేయివేసాడు. నాడిచూచి వైద్యుడు చెప్పేదాకానైనా ఊరుకోవచ్చునా, అంతలోనే మిత్రుడు చేయిలాక్కొని 'ముంజేతిని సాచి వంచుటలో ఏయే కండరములు పనిచేయునో పటసహాయ

మున వర్ణింపుము, పదిమార్కులు' అన్నాడు. నిమిష నిమిషానికి నాబాధ కూడా చెప్పి మిమ్ముల నెక్కువ యిబ్బందిపెట్టను. రోగి చేయి సరిగ యీయలేదు. అంచేత వైద్యుడు థెర్మామీటరు రెండోచేతి చంకలో పెట్టి చూడాలని జేబులోనుంచి థెర్మామీటరు పైకి తీశాడు. మిత్రుడు దాన్నెక్కడ చూశాడో 'జ్వరమానినికి, సామాన్య ఉష్ణమాపకమునకు గల మూడుభేదములేవి! మూడుమార్కులు' అన్నాడు. మిత్రుని మేన మామ అవధాన్లుగారు వైద్యునితో 'డాక్టర్ గారూ అసలంటు కాగానే శరీరో ష్ణత తగ్గుతోన్నట్లు కన్పిస్తుందేమండీ!' అన్నాడు కాస్త స్పష్టభాషలో. రోగి ఆమాటందుకొని, 'మానవుని శరీరోష్ణం సెంటిగ్రేడు స్కేలులో ఎంతో మామూలు చెప్పండి సాయం లేకపోతే రెండుమార్కులు పోతాయి. తర్వాత ఏడ్చి పోతాడు' అన్నాడు. 'శరీరోష్ణమును చర్మమెట్లు నియతస్థితిలో నుంచగలదు. మామా 1½ మార్కులు'. 'ఈవయస్సులో మార్కులకెందుకు ఏడుస్తావం దోయి నాకు నీవు బ్రతికి బాగుంటేను. తెగ మాట్లాడకోయి నాయనా అలసటవస్తుంది.' అని మామంటే, 'అలసట ఏలకలుగును! దానిని నివృత్తి చేయుటకు ఏమిచేయవలయును? కృషికుడు అలసట చెందిననేలను పున రుద్ధరించుటకేమిచేయవలెను!' అంటాడు అల్లుడు. ఆ వైఖరికి మామే గోషవ బార్లబడిపోయి, ఆయాసపడ్తోన్నట్లు అయిపోయాడు. ఎవళ్ళు పలకరిస్తే వాళ్ళకే సాగదీసి నామరల్ సైన్సులో ప్రశ్న వేస్తాడని భయపడి పలకరిస్తా మని పెదిమలదాకా వచ్చినా మానేసాం వాడినకదపడం. ఇక వైద్యుడు ఏవిధంగాను నాడిపరీక్షా, నాలుకపరీక్షా, శరీరోష్ణపరీక్షా చేయడానికే సావ కాశం చిక్కక వైగుణాలింటో వాళ్ళనడిగి తెల్సుకొని మందిద్దామని మిత్రుని భార్యను పిలిచి, 'ఈఉదయం విరేచనవర్ణం ఏమైనా మారిందా' అని నెమ్మ దిగా అడిగాడు. పాముచెవులు ఏలావిన్నాడో, ఆవిడ సమాధానానికి కంఠం సవరించుకొనేలోపల భార్యవంకచూచి, 'మిడుత, బల్లి, కొంగ, వీటి వర్ణముల పరిశీలించి ఆవర్ణములవల్ల కల్గు ప్రయోజనాలను, వంటింట్లోకెళ్ళి వ్రాసుకురా. లేకపోతే నీపని యీఏడు క్షవరకల్యాణం' అంటూ దగువులా పొడ్తో అభినయయుక్తంగా ఎడంచేతి రెండువేళ్ళు సాచిపెట్టి కుడిచేత్తో

వెనక్కీ ముందరకు చిటికెలేస్తోన్నాడు. 'అయ్యో!అయ్యో! డాక్టరుగారూ విన్నారా ఆమాట అస్లీల మండి, అననీయకండీ అలాంటిమాటలు' అని నాలుక కొరుక్కున్నాడు అవధాన్లుగారు. ఒకమాటమాత్రం డాక్టరుగారు అనుకుంటే: అంటున్నాడా అవధాన్లుగారి క్షేమస్థంగాని. అసలు ప్రాణాం మీదకే వచ్చేసాక, యింతకన్నా యింకా ఏం అపకారం చేయగలవండీ అశ్లీలాలు. ఇంకా అననియ్యండీ డాక్టరుగారూ' అందాం అనుకొన్నా నేను. కాస్సేపు కదపకుండా రోగిని పడుండనిస్తే ఏంగాయుండునో, పని కట్టుకు మేము పురమాయించి రోగిచేత వాగ్లాడిస్తోన్నట్టు కప్పించింది నాకూ, డాక్టరుకూకూడా. యిప్పుడు రోగిని పలకరించకండి అని డాక్టర్ గారు మాకు ప్రిస్క్రిప్ట్ చేసి కిటికీలేయబోయారు. 'గాలికిటికీలు (వెంటిలేటర్స్) ఉపయోగమేమి?' అని అడిగాడు రోగి. 'ఏవో నెక్కీ వన మూలికలు చెప్పి వాటిని తెస్తే ఘాటైన కషాయం తయారుచేస్తానన్నారు డాక్టరు ఆడవాళ్ళతో. చెక్కినొప్పుతుంది గాని. వేళ్ళకెక్కినాసుకుతా యని ఆడాళ్ళనుకొంటోంటే తెలివిఉన్నవాడిలా నే చెబుతానుండి అని వాళ్ళను దగ్గరకు పిలిచి ఎట్టిమొక్కలకు ఊపిరివేళ్ళుంటాను? ముందు చెప్పి మరీకదలంటన్నాడు రోగి. ఎక్కినకొనుకుతాయేమిటనే, మానవుటాడికి ఊష్ణం తగిలితే యిద్దరిమనుష్యులకు రోజుకూలీచ్చి పంపితా, బోలెడు వేళ్ళు సంపాదించుకొచ్చాను అన్నాడు ఆడాళ్ళతో అవధాన్లు. కనుమూశాడేను కొన్న రోగి అలాగాండి అన్నట్టు కళ్ళుతెరచి, యాం. మనుష్యులు దినమునకు యున్. మూపాయిలు కూలి సంపాదిస్తే ఓ. మనుష్యులెంతకూలి సంపాదిస్తా రంటో ఎంతో ఉత్సాహంగా నువ్వా, నువ్వా అంటో ఆ చివరగది గుమ్మందగ్గర బిక్కమొగమేసుకొని మామ్మదగ్గర కూర్చున్న మిత్రాని కుర్రాడే వాడిదాకాఅడిగితే ఆబుడత బొరుమంటో దొడ్లోకిపరుగెత్తాడు. బెంబేలుపడిపోతోన్నారమ్మా పిల్లలు చీమాచిమకూమా, పదీ, పంద్రెండూ వయస్సులాయిరి. అని పక్కయింటిఆవిడ గుడ్ నైబర్ లైన్స్ కనుగుణ్యంగా అంటే రోగి ఆపెకంక చూస్తో జోసెఫ్ కు ప్రస్తుతవయస్సు టి. సంవత్సరా లైతే యిక ఎ. సంవత్సరాల కెంతవయస్సువాడవుతాడు చెప్పు అంటో

లేవబోయాడు. అమ్మో అంటో కెవ్వున ఒక్కకేక వేసి ఆవిడ గోడంటే దిగజారింది. గుండెజబ్బుదానివి రావద్దంటే వినిపించుకుంటా అంటో భర్త లేవతీసుకుపోడానికొచ్చాడు. మిత్రుడాయన్ని నిలేసి మూర్ఛపోయిన వాళ్ళకు మొదటిసహాయం (ఫస్ట్ ఎయిడ్) ఏమిచేతువు అని అడిగాడు. ఇక్కడేంచేసేది, యింటికెళ్ళి చేస్తా నీకు చెప్పిచెయ్యాలాంటో ఆయన ఆమెను బుజాన్నేసుకుపోయాడు పాపం. ఎవరిబాధవాళ్ళది.

హారంలేదాయిరి, గ్లూకోజుఅయినా వంటబడితే యింతచేటు పైత్య కోరణి ఉండదంటో కాస్త వైద్యశాస్త్ర ప్రసంగం చేసాడు మరో పెద్ద మనిషి. రోగి ఆయనవంక కరకరా చూస్తో 'ఆహారం వంటబట్టుట యన నేమి? అది జీర్ణకోశమందెచ్చట ఎట్లుజరుగును?' అని అడిగాడు. ఆప్రశ్నతో సఖం అయిపోయాడు ఆపెద్దమనిషి. పెదిమ కదిపినవాడల్లా చిత్తైపోతు న్నాడు. ఇంకా ఎవళ్ళొస్తారో రానీ అన్నట్టున్నాడు మిత్రుడు. జాడ్య ప్రకోపం వెళ్ళినకొద్దీ విజృంభించేస్తోన్నాడు. వ్యూహంలో చిక్కుడ్డ వీరుడిలా ఎడాపెడా చెక్కేస్తోంటే వ్యాధిగ్రస్తుని ముందు వెనుక చేరిన జనం చిక్కువడియు, సుడిపడియు, గలంగియు, దొలంగియు దీనదశను వచ్చేసారు. రోగిధోరణి ఆపలేక తెల్లపోయి ఒకరివంక ఒకరు చూచు కుంటోన్నాం.

ఇంతలో ఒక వందెద్దుబండెడి కుచేలసంతానాన్ని వేసుకొని పింతల్లి ఆమె పెనిమిటి దిగారు. రోగితల్లి ముసిలావిడ వాళ్ళను రోగిదగ్గరకు తీసు కొచ్చి వాడిచేతులమీద వెళ్ళిపోతాననుకున్నా నాకు చావెట్టాడు కాదు మాయదైవం. అంటో పాపం కళ్ళనీళ్ళుకుక్కుకుంది. గాలిలో ఉంచిన చేపకు, నీటిలోముంచిన మనిషికి ఏదేవుడు అక్కరలేదమ్మా మనఃస్ఫూర్తిగా చావదలచుకుంటే అన్నాడు. అయ్యో అయ్యో ఎంతమాటన్నావురా నాయినా కనిపెంచినదాన్ని నిన్నేమిఅంది అనిరా అంతమాటంటివి అంది పింతల్లి, అప్పుడే చూచింది కాబట్టి రోగిజాడ్యంతీరు తెలియక. నేనెవర్ని అని పింతండ్రిఅడిగితే ఖర్మం ఆయన యీమధ్యనేకొత్తగా చేయించుకొన్న కుండలాలు చెవులను వేళ్ళాడుతోంటే చూచాడు కాబోలు రోగి, 'అకుండ

శీకరణముల తొలగించి నిన్ను సూక్ష్మంచేస్తే నీవు బాబాయివే, ఎరుగుదును కాని మీ గ్రామప్రాంతాల్లో జీవసమాధిచేయు జంతువుల పేర్కొన కలవా?' అన్నాడు. అయ్యో! సమాధులు, గోరీలు అంటున్నాడర్రా యింకేమి(బతుకుతాడరా) అని ఆడాళ్ళు పాతవాళ్ళు కొత్తగావచ్చినవాళ్లు కలసి ఘొల్లుమన్నారు. సైలెన్స్ అని ఒక్క కేకేసాడు. నిశ్శబ్దంగా ఉన్నాం. అది టైఫాయిడ్ క్రైసెస్ రాత్రి. మిత్రుడు నిశ్శబ్దం అన్నాడు 12 కొట్టింది గడియారం. మిత్రుడికి చెమటలుపోసేయి ప్రశ్నలు కట్టే కాయి. రోగం మళ్ళింది. బ్రిదికాడు. అర్ఘూం కారం ఏమైందో నీరసంగా నాచేతిలో తనచేయివేసి కునుకోయాడు. వెడ్తో వెడ్తో ఒక్క ఊపు ఊపేసి. పోయిందన్నమాట సన్నిపాతం. తెలివిసంధి మరీగడ్డట.

నా కిప్పటికీ ఒక్క పెద్ద సందేహం. ఆరోజున మాలో నామగల్ హైన్సు తుణ్ణంగా వచ్చినవాడు ఏఒక్కడున్నా అయుక్తప్రశ్నలకు తోడక సదుత్తరాలిచ్చి, యింత అవిధి పడక్కరలేకుండా, మిత్రుణ్ని అప్పటి కప్పుడు బ్రతికించుకొని, చెయ్యి చెయ్యిపట్టుకొని ధర్మరాజు తమ్ములతో వచ్చినట్టు వస్తుమేమో జబ్బుగదిలోనుంచి. ఆప్రశ్న లేసినంతసేపూ ఎంతో తెలివిగాఉంది ముఖం. ఓసారి నానాలుకచివరకొచ్చింది సుమండీ 'ముఖంలో కళ తప్పలేదు. ఎందుకమ్మా కంగారుపడ్తారు' అని. కాని చటుక్కున అనకుండా ఆపేసా. ఇక ఆ కళ అన్నమాట పట్టుకొని 'దృతప్రకృతికము లకు, కళలకు భేదమేమి' అంటో వ్యాకరణ వడ్డన ప్రారంభిస్తాడేమో నని హడలిపోయానంటే నమ్మండి. సర్వే జనా స్సుఖినోభవంతు.

యాతావాతా చెప్పొచ్చేది, సంధిలోకూడా ఎక్కడా పొల్లు మాట లేకుండా అలాంటి నిర్మలమైన విద్యావ్యాసంగంలో జీవితంగడిపే ఉత్తములు ఉపాధ్యాయశ్రేణి. కాబట్టి మాయావి పన్నిన ప్లాట్ను గ్రహించలేకపోయాడు, మాస్టారు. అంచేత మాస్టారూ ప్రెసిడెంటు గారూకూడా మాయావి త్రొక్కుతూన్న శివాల భావమేమైయుంటునా అని కించెదాశ్చరంతో ముఖాలు ఓరగాపెట్టి ఆకళింపు చేసికుంటూన్నారు కథ ఏమిటి అన్నట్టు. వారి కనుబొమలు ప్రశ్నార్థకాల్లా వంకరతిరిగిస్తై

కాని, వారు పెదిమె కదపలేదు. నిజానికి మంచిపనే చేసారేమో. అంత వేడిలో ఉన్నవాడిని, ఏమిటని ఎప్పుడూ అడగకూడదు. అడిగిన కాడి నుంచీ ఏడిసారు అడగొచ్చారు యిదే తెలియదా అనే సహృదయుస్వాయిలో తిక్తో ప్రారంభించకలరు. కొంపముంది కదో Habits of speech ఉంటుంది. ఎవరివాడు వినాలని కుతూహలం చూపినకొద్దీ.

♦ ♦ ♦

## బాలనిసము ప్రవర్తన

రెండు, మూడు షారాలు రాజవేగోబాలు మాకు. కాకినాడ మేనత్తగారింటికి వెళ్ళొచ్చాడు క్లాసుమేట్. అక్కడ రంగూన్ నుంచి వచ్చిన ఓడను చూచొచ్చానోహోయి, వినేవాళ్ళు రావచ్చునోయి, అని అలజడి చేసాడు. ఇప్పట్లా సినీమాలు లేవు. తీర్థాల్లో, కానీ, అక్కడా ప్రమ్ముకొని, చిన్నకసాపిలమ్మ అలయంలాంటి పెట్టికి అతికిన భూతద్దంలోనుంచి, తాళపుచిప్పలుకొడ్తో ఓడవస్తోం దోడవస్తోంది అని పాడ్తో, ఎవత్తో పిల్లలని అద్దంకేసి ఎత్తి దింపేది. ఆ ఎత్తి దింపడంలో ఓడెళ్ళి పోయేది యింకో రేవుకి. ఆమూట్లుకేనా ఓడదర్శనం అందరకీ లభ్యమయ్యేది కాదు, కుమ్ముకొని వెళ్ళినవాళ్ళకి తప్ప. అంచేత శని వారం చద్దులు తిని, ఓడలెల్లావుంటాయో చెప్పించుకోద్దామని ఎంతో సరదాగా దాగంటుకన్పించిన స్నేహితుల్ని కలుపుకుంటూ వెళ్ళాం. పది మందిదాకాఉన్నాం. మేం వెళ్ళేసరికే క్లాసుమేట్ చుట్టూ అయిదారుగురు మూగి ఉన్నారు. ఏమైతేం కొంతచెప్పేయడం అయిపోయిందేమోరా అని జిజ్ఞాసపడుతో మేమూ దగ్గరకెళ్ళాం. క్లాసుమేట్ ముఖం బాగా పొంగిఉంది. ఏం చెప్పిఉన్నాడో దూరంగా Horizon కేసిచూస్తోన్నట్టు వాడిచేయి బాగా చాచీ ఎత్తి ఉంది. వాడిచుట్టూఉన్న అయిదారుగురూ అపాయకరమైన క్రూరజంతువును దేన్నో ఎదరగోడమీద చూస్తోన్నట్టు వాడి చేతివంకే [illegible] తదేకదృష్టితో చూస్తున్నారు. మాతో సాదారు

సరదా ఆపుకోలేడు; పట్టి పిచిక చపలత్వంవాడు. వాడి కాగోజా దెబ్బ తినేయోగం ఉందికాబోలు, ఆమూచేవాళ్ళలో ఒకడి చొక్కాలాగి, ఏమిట్రా అని అక్కడికీ, కంఠంనొక్కుకొనే అడిగాడుసుమండీ. మావాడు తన్నేదో డిస్టర్బుచేసి రక్తికట్టనున్న విషయం రసభంగం చేసేసినట్టు, ఉగ్రుడై, పోవోయి అని మావాడిని, ఊతంగా ఒక్కగెంటు గెంటేసి, తానింకో అడుగు ముందరకేసుకొని యథాప్రకారంగా మిగతామందితో పడిచూస్తున్నాడు. మధ్యన వీళ్ళ నడిగేదేమిటి మనమే చూసుకొందాం అని క్లాస్‌మేట్ చేయిచాచినవైపుకే మేమూ చూడ్డం ప్రారంభించాం. చంద్రుణ్ని పండితుడూ చూస్తాడు, పిల్లీ చూస్తుంది. ఆ అయిదారుగురి భావాల్లో ఏదో రూపాంతరం చూస్తున్నారు. మావి ఖాళీబుర్రలు, వెర్రిమొహాలూ అయిపోయాయి. ఎంతో భయవిహ్వలులై వాళ్ళు చూస్తోంటే, మాకా ఎవరోయింటివారి ముసురుగోల దాన్ని ఆరేసిన పైనా తప్పితే మరే పరిహాసాస్పదమైన వాక్యాల ఖడ్గ మహాభాగాలు కన్పించ టంలేదు కన్నోస్పృహకోనాన్ను. ఏమిటో చెప్పండ్రా బాబూ తెలియక చచ్చి పోతున్నాం అని గోలచేశాం అనిపించింది. కాని, కిక్కురుమంటే చంపేసే టంత నిశ్శబ్దంలో ఉంది అక్కడి వాతావరణం. మేం ఆశ్లేసేపు బాధపడ నక్కరలేకుండా, ఆ అయిదుగురిలో ఒకడు ప్రశ్నకు క్లాస్‌మేట్ చెవాళ్ళు పెట్టుకెంలో మాకు వాళ్ళు చూస్తోన్నదేదీ తెలిసింది. కథాఘట్టం తెలిసింది. అర్థం అయినా ఏమీ కాదు. 'మానవులారి కాళ్ళ కెరటాలు కెన్ని రక్కటా యుంటావు, ఆ కెరటాలు' అని అమాయికంగా అడిగాడు. క్లాస్‌మేట్ తోకత్రొక్కిన తాచులా లేచి, స్కౌండ్రాలి అలా అడగడానికి యీ వెధవ వాడు, వెధవ కాళ్ళ యీ కెరటాలకు వాటికి సాపత్యం ఏమిటని. ఓరబాబో, అబ్బో, అవ్వెంత పే—అంటూ ఆ అక్షరం మీదే దమ్ముపట్టేసి, అర్థం కాని అంతర్నిహిత క్లేశసూచకమైన కళ్ళతో, ఎందుకో ఉత్కృష్టపడిపోతో, భద్రతా శ్రోతల నావ్యవధిలో ఆకర్షించేసి, అప్పుడు, అధమం రెండు నిమిషాలయ్యాక- దంతాలు కదిలేలా -'స్థవో' చెప్పలేంరా అని పూర్తిచేసి సొమ్మసిల్లిపోయాడు. దాంతో సముద్ర కెరటాలు ఎత్తు కళ్ళకుకట్టినట్టుగా,

ఆఅయిదారుగురిలో, ఒకడు తన్మయుడై, అంత పెద్దవేం అని ఏదో అడగ పోతే, అమ్మమ్మమ్మా యిక వాటిమాట నన్నడక్కండిరా బాబూ, నాకు తలచుకుంటే పిచ్చెత్తిపోతోంది అని క్లాస్‌మేట్ చతికిలబడ్డాడు. సముద్రకెరటాల ఎత్తు అందరికీ, సుస్పష్టంగా తెలిసిపోయింది.

అంటే, మాకంగారేకాని, క్లాస్‌మేట్ యింకా మాకుకావల్సిన, ఓడవర్ణన ప్రారంభించనే లేదన్నమాట. మేము వెళ్ళేసరికి క్లాస్‌మేట్ తన సముద్ర ప్రథమసందర్శనభాగ్య స్వీయచరితం వినిపిస్తోన్నాడన్న మాట. సాగరాన్వేషణా యత్తచిత్తుడనై, కాకినాడ రోడ్డెట్టి, వారాసి పైపు, కొసకెళ్ళేసరిక్కి, యిట్టే అటుచూస్తినికదా, ఆ! అల్లదే, కల్లోల మాలోల్లిఖితగగనమై, బహుతరాయామ విస్తారమై, మహాపవనసముద్ధూత మహోత్తుంగ తరంగ గంభీరాలంఘ్య ప్రౌఢమై బిట్టాలోకింపగ నుగ్రం బగు జలనిధిగంటి నంతనే, అని చెప్తో, భూనభోంతరాలను కలిపేసిన సాగర విస్తీర్ణప్రాభవాలను సోదరులకు అనుభూతిలోకి తెచ్చుటకు అభినయ యుక్తంగా హస్తమెత్తి Horizon చూప్తో యుండాలి. అచుట్టూయున్న అయిదారుగురు సముద్రం మీదకొచ్చి పడ్తోన్నట్టే అనుభూతినొంది, అటుచూస్తున్నారని తోస్తుంది. ఆజానుబాహు మా క్లాస్‌మేట్ ఆఅయి దారుగురు కోతిమూకమధ్య నిలబడి, సాగరవిషైక ప్రసంగంచేస్తో చేయెత్తి చూపుతోన్న ఆపోజు, దక్షిణోదధి సేతుబంధ నోద్యుక్తుడైన శ్రీరాముని తలపుకు తెచ్చింది. పులకిత శరీరుణ్ణయ్యా చాలు, కావలస్తే కాకినాడవెళ్ళి సముద్రం, ఓడా చూచిరావచ్చు; వాడి వర్ణనకేమి.

కళాదృష్ట్యా చూచినా, ఆవర్ణన కేమి లోపంచేశాడు. సాహితీ ప్రవాహంలో ఒక నవ్యతరంగిణిని చూపాడే! అద్వితీయమైన కవితా శిల్పాన్ని సాధించాడు కొలదిపలుకుల్లో కొండంత అర్థమిమిడ్చి, అల్పా క్షరముల అనల్పమైన భావాన్ని బిగించి, ఎంత రసవత్తరంగా 'తలచు కుంటే నాకు పిచ్చెత్తిపోతూంద'ని ఆలెక్క నాలుగైదు మాటల్లోను, మహోదధియొక్క ఆ అనంతమైన లోతు, అపారమైన ఆ విస్తీర్ణత, మహోద్ధతంగా వచ్చిపడే ఆ కెరటాల ఎత్తు, విసురు, కళ్ళకుకట్టినట్టు

చూపి, సంకల్పసిద్ధుడై, శ్రోతల్ని అక్షరాల 'పొయట్స్ ఫైన్ మాడ్ నెస్' లో ముంచెత్తేసాడు. ఈభాగ్యానికేనా, కవులెంతో బాధపడిపోతా రనిపించాడే. ఏమిటండీ, మీచెవుల్లో గింగురుమంటోన్నదేగా 'కరిమకర నికరాఘాతజాతవాతోద్ధూత తుంగతరంగా' అంటో యింకో అంతదూరం లాక్కెళ్ళి శ్రమించారే నన్నయ్యగారు. మరోకవి కెరటంఎత్తు చెప్ప టానికి అగస్త్యదర్శనం కానప్పటి వింధ్యం అంటో పోలిక చెపుతాడు. అగస్త్యలోపాముద్రల కాలంనాటివాళ్ళు, అవునూ కాదూ అనేవా ళ్లెవరూ యీనాడు లేరుకదా అనేనా ఆయన ధీమా. చేతనైతే అతి వాస్తవిక కవుల పోకడను, సర్వే పాసయిన గ్రామకరణంచేత కొల్త వేయించినట్టు అంకెలసహితం చెప్పమనండి, లేకపోతే ఏమీ ఎరగనట్టు ఊరుకోమనండి. అంతేకాని Verify చేయడానికి Data లేని పోలికలు మాత్రం చూచివచ్చినట్టు మాట్లాడనీయకండి. సముద్రానికొచ్చిన ప్రమాద మేదీలేదు; వీరు వర్ణించకపోయినా అది సత్యం, స్థిరమున్నూ. యీమధ్యన అతివాస్తవకుణ్ణి అంటో మావాడ్డోడు.

'గోడమీద ఒకపిట్ట నిలచియుండెను
దానికి రెండు రెక్కలుండెను
వాట్ని ముక్కుతోన గీరుచుండెను
కొట్టండోయి రామడోళ్ళు, పద్యంచెప్పాను' అన్నాడు.

అవును, అణుమాత్రమైనా వారపారాలులేని అతివాస్తవిక 'Visual image' యిచ్చాడు. నిస్సందేహం కాని పద్యమంటాడు దాన్ని. అక్కడ పేచీ, మనలో మనమాట, మాఖర్మంకాలి, మా కాపిట్ట నకలే కావాలిస్తే ఓ కెమేరా మనిషిని పిల్చుకొని, రెండో మూడో వాడి మొహాన్ని వేసికొట్టి ఒకటి కాదు నాలుగు కాపీలు పుచ్చుకోలేం? మధ్యన బడాబడాకవి బయల్దేరాడంటో వీడికెందుకు బాజాభయింత్రీలు. పొయిట్రీ అంటే ఫొటోగ్రాఫనా, కవిత్వమంటే కెమేరా పనా. Image ఎంత Visible, stark and real అయినా కళకింద జమ కాదు. కళాసృష్టికి కావల్సిన అమూల్యపదార్థం వేరేఉంది. Predominating

Passion కావాలి. Passion అన్నానుకదా అని, ఏదో బొమ్మో పద్యమో వ్రాసేసి వాళ్ళ వాళ్ళను హడలకొట్టాలన్న వాంఛ అనుకోకండి సుమా, బోలెడు Spiritual Journey చేసియుండిన Pilgrim యొక్క Predominating Passion అని నేను మనవిచేసేది. పట్టి 'Visual image' అల్లమ్మొక్క Passion తో ప్లావితమైతేనే అది అల్లం మురబ్బా అవుతుంది. గోస్తనీఫల మధుద్రవగోమృతపాకంలోనుంచి తీస్తేనే గులాబీజాము. కానినాడు, పెసరపుణుకును చెయ్యాను దాని నాశం. కళాకారుని Predominating Passion లో పూరిన యిమేజే, గమ్మున గమ్మనే చేతము చల్లనచేసే కైత.

కవుల్లో, మాయోపాయం నేర్చిన బద్ధకస్తులు మరోతరహా ఉన్నారు. ఎంతసేపు పని ఒత్తిగించుకుపోయే అలవాటు వారిది. వర్ణనలకు స్తోత్రపాఠాలకు మొదట వాడెవడో, యిప్పుడు బ్రతికి ఉన్నవాళ్ళు గాని, వీరి తాతముత్తాతలు కాని ఎరగరు ఆ మహానుభావుణ్ని, అతడి పేరు శేషుపెట, - Perhaps అతడు దేవతలకు అవసరం తెంబడిని, Descriptive essays, welcome addresses, valedictory యడ్రసులూ, ప్రార్థనాపూర్వకమైన మహాజర్లు వ్రాసిపెట్టె Expert వ్రాతకాడై యుండాలి - అతడే వ్రాయలేనివి సృష్టిలో మరొకడి తరం కాదన్నమాట - యీ మూడో తరహా కవులాతని పేరువత్తి, ఆశేషుడే వర్ణించలేడీ విషయం, పోండి, ఆ మాటపట్టుకొని అనందించుకోండి, అని శ్రోతల్ని నేట్టేసి పనివిరగడ చేసికొంటూరు. అలా ఒళ్లు దాచుకొన్నడా మా Classmate. మావాడికి ముచ్చుమటలూ పట్టినాయే, కెరటం ఎత్తు చెప్పమంటే. పోనీ వాడు చెప్పినంతలో దూరాన్వయదోషం కాని, బలాత్కృతాలంకారాలు కాని, శిల్పం రసంలేని ద్వ్యర్థిత్ర్యర్థి శబ్దపై చిత్రికాని, దొరుకుతుందా ప్రబంధకాలంనాటిలోలా. భావకవుల తుంటో టపాల్పులుకొట్టే నవీనుల వైఖరిని భావశూన్యతను మరుగుపర్చుకునే పదచాపల్యం, కాని మార్గాన్ని కంటకావృతంచేసే భావమర్మం కాని, మావాడి వర్ణనలో వెతికి పట్టుకోండి, మీకు తిమ్మరాజు జమీందారులో

చెప్పి బంగారు సింహతలాటం మురుగు వేయిస్తాను. పోని మరేకవికైనా నీచదాస్యం చేసిన వాసనైనా అవర్ణనలో ఉందా. అంతా ఎత్తుకెత్తు స్వంతం. పదహారణాల ఆంధ్రత్వం కన్పిస్తుంది. ఏమెచ్చినా, ఆరోజుకు పిచ్చెత్తేయడం మన ఆంధ్రులసొమ్ము, మరొకరికి తరం కాదు. అరటిపండు వల్చినట్టు స్త్రీయహృదయం ఆంధ్రహృదయం కూడా వల్చి మీచేత పెట్టాడే. మాకవి, ఏమన్నాడో చూస్తిరా 'నాకు తలచినకొద్దీ పిచ్చెత్తిపోతోంద'ని కదా అన్నాడు. ఎన్ని తరాల ఆంధ్రుల అనుభవపరంపరల మహాశక్తిని ఆ ఒక్క వాక్యంలోను కూరగలిగాడో అద్భుతమవుతుంది. ఎంతభావం ఆ ఒక్క వాక్యంలోను వ్యక్తీకరింప గల్గాడు. ఆత్మానుభవ వ్యక్తీకరణ సాధనమేగా, కవిత్వమంటే. అన్నమంతా అక్కరలేదు, ఒక్క మెతుకు చాలు, అన్నప్రాశస్త్య - పరిశీలను. వాక్యం అంతా అక్కరలేదు, ఒక్క పదం తీయగలరా ఆ వాక్యంలో, యితర కవుల మాడ్కి పాండిత్య ప్రకర్షకై పెనుగులాడి బూజెట్టిన తేజోవిహీనమైన పదం వాడింది. 'పిచ్చెత్తు' అన్న ఆ ఒక్క మూడు అక్షరాల మాట చాలదా మావాడి వర్ణనకు అమరత్వం యిచ్చేది. పానుగంటివారు చెప్పినట్టు అది, మాటయన్న మాటయా, మాణిక్యముల మూట, మౌక్తికముల పేట, మకరందప్రవాహపు తేట. అయ్యా నన్ను అనిపించకండి, కెరటం ఎత్తు అడిగితే వాడికి పిచ్చెత్తినట్టు, వాడిమాట తలచుకుంటే నాకు మతిపోతూంది. చెప్పేది యీ మాటకదా మా Classmate. దీనికి ఆడిగాం కదా అని కలవాలా అంటుకన్నా యింకోమారం మాయావికికూడా మావాడి Habit of speech ఉంది కాబట్టి ప్రెసిడెంటుగారు, మాస్టారు గందరగోళం ఎందుకని మాయావిని అడగలేనో, తీర్మానిస్తావో మరోపాంగులో మాయేవే కక్కేసాడు ఆకాస్తా. అంత గొప్పసంగతి తనకు తోచింది ఎంతసేపు దాచుకోగలడు. అనానే అన్నాడు.

ఎల్లుండీపాటికి వీడి హెడ్మాస్టరీ వికల్పితంచేసి, నరులెల్ల చూడ నవ్వగునట్లుగా; అరదండాలు వేయించి, జబ్బలుకట్టించి, అటో పోలీసాడ్ని యిటో పోలీసాడ్ని జతయిచ్చి, వీధులంట ఊరేగిస్తో, గుమ్మాందగ్గర

మధ్యమధ్య ఆపి శరగోపం పెట్టిస్తో, కూడా నే ఉంటూరుగా వాడ్ని వదలలేక పూజారిగాళ్ళు కర్మకాండలికి, మేజస్ట్రీటు కచేరీకి రప్పిస్తా. కూడా వెన కాల రోడ్డు మొగలుతిరుగుతో ఆ చివరోనల్లురు యీ చివరోనల్లురు తాళ్ళేసి ఎత్తుకొని మోసుకొస్తారు, వీడు Hospital పరిమితిలో కొట్టించిన తాటి చెట్టు వాహానాన్ని. కేసుకది M. O. నేగా, తలుపులు మూసుకొని ఏడుస్తో లోపల కూర్చోకపోతే, పూజారి గుమ్మాల దగ్గర ఆపి. కదిలిస్తా. పనిలోపని మీపార్టీవారి నెవరినైనా, ఏ సత్యనారాయణ వ్రతపు పిలుపో అని పేరెట్టి, డోలూసన్నాయీ సహితం మన ఉత్సవం ఏలాకదలితే అలాకదలేట్లా తయారు చెయ్యవయ్యా మాష్టరూ. యిదీ చెయ్యలేకపోతే భోజనానికటయ్యా మీమాస్టర్లు. మదరాసునుంచి వీడి అన్నే వచ్చి వీడ్ని కాచుకుంటాడో, వీడి ఇంగ్లీషు పాఠాలు పద్యాలూవిని స్పృహతప్పి పోయిన యిన్‌స్పెక్టరు అఫ్ స్కూల్సే వచ్చి వీడికి బెయిల్ యిచ్చుకుం టాడో చూస్తా. వీడికి జామీను ప్రయత్నంచేసే పూజార్లమీద ఎప్పటి కప్పుడు ఓనమ్మిక స్వామిద్రోహమనో, మోసమనో, శరపరంపరలుగా కేసులు తయారుచేస్తోంటూగా. ఏ బాధవనీ వదలిపెట్టనులే. మీ కాబెంగ అక్కురలేదు. మీ మాష్టర్లుకూడా మాసాక్షిపత్రాలంలో వాళ్ళే. వీళ్ళని ఆయాకేసుల్లో పేకముక్కలు సర్దినట్టుగా సాక్షులక్రింద అమరుస్తా. చెప్పి మీపార్టీ మాష్టర్లను సిద్ధంగాఉంచు" ఆ గుమాస్తాగాడితో చెప్పివెడ్తా వుగా! అంటో అధిక హర్షవికసితాస్యంతో, మాయావి ఎత్తెత్తి అడుగేస్తో ఆ విమిషంనుంచే కార్యదీక్షపూని, యింటికిపోయాడు.

♦ ♦ ♦

## చోరీ అభియోగవిచారణ

హెడ్మాష్టరును మాయావి తలచినట్టుగాను, కలలుకన్నట్టుగాను, శమానించలేకపోయినా, హెడ్మాష్టరు హాస్పటల్ హద్దులలోని తాడిని కొట్టించినట్లుగా అసిస్టెంటు సర్జన్ చేత, రిపోర్టుచేయించి హెడ్మాష్టరు

పై Sec 379 I. P. C. క్రింద చోరీ అభియోగం తెప్పించకల్గాడు. ఆ అభియోగం అనతి కాలంలోనే మాయావి పార్టీ పక్షపాతిఅయిన మేజిస్ట్రేటు వద్ద విచారణజరిగి, హెడ్మాష్టరుపై చార్జి ఫ్రేమ్ చేయబడ్డది. అమట్టుకు మాయావి అండ్ పార్టీ కృతకృత్యులైనారు. తద్విచారణ వ్యాసంగమంతా, సి. సి. నంబరుగా కోర్టురి కార్డ్సులో ఎక్కియున్నందున, దాన్నిచట ఉదహరించడం చర్విత చర్వణం. ఆకేసుదాఖలా మెయిన్ ప్లాంక్ ఆఫ్ డిఫెన్సు మానాటక సమాజ కథాఘట్టంతో సన్నిహిత సంబంధం ఉన్నదైంది కాబట్టి హెడ్మాష్టరుగారి ప్రధానవాదాన్ని మాత్ర మిట పేర్కొంటూన్నాను. హెడ్మాష్టరుగారు చెట్టుకొట్టించిన మట్టుకు నిర్వివాదాంశంగానే వప్పుకున్నారు:

## సివిల్ డిస్ప్యూట్ అంతరార్థం

1తదంగీకార కారణంగా, ముద్దాయి చెట్టును కొట్టించాడో లేదో అనే 'ఫాక్టం ఆఫ్ కట్టింగ్' అట్టే విచారణావశ్యకత లేకుండా నడలింది. ఎందుకు కొట్టించాడు, అనే 'యింటెన్షను' ప్రాముఖ్యత వహించింది. ముద్దాయి తాను చెట్టు కొట్టించలేదంటే, ముద్దాయి జయాపజయాలు చాలభాగం, కొట్టించడం చూచినవాళ్ళ సాక్ష్యప్రాశస్త్యంమీద ఆధారపడిఉండెడివి. యిప్పుడో ముద్దాయి భావి ఫిర్యాది తెచ్చే సాక్ష్యపటాలం తోటి, అంగబలంతోటి ప్రసక్తిలేకుండా చాలాభాగం ఉద్దేశ్యసూచకమైన పరిస్థితులపై ఆధారపడే సందర్భం ఏర్పడ్డది. సదుద్దేశ్యంతో కొట్టించాడా హెడ్మాష్టరుగారు నిర్దోషి. దురుద్దేశ్యంతో కొట్టించాడా దోషి. ఉద్దేశ్యనిర్ణయానికి కొట్టడం చూచామంటూ వందమంది సాక్షులు తొడలుకొట్టి, రొమ్ములు బాదుకొని, చేసేదేముంది?

రెండోవిషయం, తగాయిదా; సరిహద్దు చెట్టు విషయం కాబట్టి చెట్టు పైవారం ఏకొంచెం, ఏఒక్క బెత్తెడు, పడిహద్దులోకొన్నా

కేసు సివిల్ డిస్ప్యూటు అయి ఊరుకుంటుంది. అంటే, దేవతలు రాక్షస పీడా నివారణార్థం ఏబ్రిహ్మనో ప్రార్థిస్తే, ఆయన తన అసమర్థతను తెలియబుచ్చి, వార్లను విష్ణువద్దకు పోయి చెప్పుకోమనేటట్లు, హక్కు, భుక్త విషైకసందేహాలున్న చోరీలు నేను వ్రేలు పెట్టేవి కావు, కోర్టు మునసబుగారిదగ్గరకు పోండి కావల్సివస్తే అని సలహాయిస్తూ మేజస్ట్రేటు వారు ముద్దాయిపై కేసు, కొట్టేస్తారన్నమాట. సివిల్ డిస్ప్యూటు పేరెట్టి మేజస్ట్రేటుగారు చోరీకేసు కొట్టేస్తే, కొంతమంది ముద్దాయిలు ఆతీర్పును ఏలా అర్థంచేసుకుంటారో చూచారా. మేజస్ట్రేటుగారు స్వయంగా ముద్దాయిని పిల్చి "దిగష్ట చెట్లుకూడా నీవిప్పుడెళ్ళి కొట్టేసుకొచ్చినా నా భయం నీకేమీ అక్కరలేదు, నిజానికి నేను చేయగల్గింది ఏమీలేదు" అని అభయహస్తమిచ్చినట్లు, యింకా తనపై ప్రేమాతిశయాలవల్ల, మిగ తావికూడా కానిచ్చిరామని తనను హెచ్చరించినట్లున్నూ భావిస్తారు. అందువల్ల యీబాపతువారీ చోరీకేసుల్లో ఫిర్యాదిగాణ్ని చూస్తే జాలి వేస్తుంది. అయ్యో, నీకెంతకష్టంవచ్చిందిరా నాయనా అని కాగిలించు కొని బారుమన బుద్ధివేస్తుంది. కాదూ, పాపం? ఒక్క చెట్టుకొట్టినవాడు సాగితే మిగతావి కొట్టగలడు, కాస్తవాణ్ని అదుపాజ్ఞలలో పెట్టించడం మంచిదని, చెట్టుకొట్టినందుకు కేసుపెట్టినవాడి కేసు మేజస్ట్రేటుగారు కొట్టేస్తే, మరుక్షణంలో ఆచెట్లు వరసలో దిగడ్డ పడిచెట్లున్నూ, ముద్దాయీ-యింకా చెట్లవసరం ఉన్న-గ్రామస్థులూ కలిసి, కబుర్లు చెప్పుకొంటూ కొట్టేస్తారు. ఒకపర్యాయం, మొదటిచెట్టు కొట్టిన ముద్దాయీ, వీడిమీద కేసుపోయిందన్న ఊతంతో తర్వాత చెట్లుకొట్టినవాళ్ళూ, పంపుళ్లు తెగిక కేసులెట్టుకుంటే, పాపం అసలుచెట్ల ఆసామీ తన్ని కానట్లు, పైగా ఉండిపోవల్సివచ్చింది, చూస్తూ ఏపక్షంలో చేరడానికి ప్రాణం వప్పక. కాబట్టి, సివిల్ డిస్ప్యూటు తీర్పు, యజమాని కొక్కడికి తప్ప గ్రామం అశేషజనానికి ఆ దౌర్భాగ్యపు చెట్లమీద స్వతంత్రం యిచ్చిందన్నమాట. అంచేత ప్రతికక్షుల స్థితిపరిమితులు, హద్దులూ, యిరు పార్శ్వాల తకిళ్ళు వారాలపాటు పనిచెప్పే వాదాలు అవుతాయి.

చెట్టు స్కూల్ హద్దులోదో, హాస్పటలు హద్దులోదో చూచినమాత్రాన తెల్సేదే అయినా, వకీళ్ళ వాదాలు సంపూర్తి అయ్యేసరికి, బోలెడు ధర్మసందేహాలు చిక్కగా పెరుక్కొచ్చి కోర్టువారికి, కాలక్షేపార్థం కోర్టుగుమ్మాలు కాసే ఆడియన్సుకీ, మతులోయి, అటు అరువూళ్ళూ, యిటు అరువూళ్ళూ కొల్చుకుంటో వస్తేగాని, యీచిక్కు విడదు. యీ చివర ఔత్తైడు నిర్ధారణచేయలేం. బహు గడ్డుసమస్య వచ్చిపడిందనీ, వారి మెదళ్లో సంవేదన బయల్దేరుతుంది. ఓకేసులో మేజస్ట్రేటుగారు ఉత్తమోత్తముడు. కేసు కొట్టేస్తే పోయేదానిక్కి, యిట్లాంటి సందిగ్ధ విషయంలో, కళ్ళకు కన్పిస్తోన్న న్యాయానికి, తీర్పుల్లో కనిపించే న్యాయానికి కల్గిన సంఘర్షణను తట్టుకోలేక చూస్తో ఫిర్యాదీ చెట్టుకు ముద్దాయిచేతిలో పట్టా పెట్టలేక, ధర్మసమ్మార్ధచేతస్కుడై, రెండు కాల్లపాటు సెలవెట్టి ఆరీతిగా ఆకేసును మరో మేజిస్ట్రేటు మెడకుచుట్టి, వదల్చుకున్నాడు. తస్మాత్ కారణాత్, నేను కొట్టలేదన్న ముద్దాయికన్న, తొడకొట్టి నేను కొట్టానన్న ముద్దాయి న్యాయాధిపతికి ఎక్కువ మనో వేదన కల్గిస్తాడు. అట్టే పార్టీలగొడవ పెట్టుకోకుండా, Disposal యే పరమావధిగా పెట్టుకున్న మంచి మేజస్ట్రేటులకు పని సుళువు చేస్తాడు, సాక్షులను పదేసిమందిని విచారించనక్కరలేకుండా. ఇది ఒప్పు దలలో ఉండే ధర్మసూక్ష్మం.

ఎప్పుడైతే హెడ్మాష్టరుగారు ఫిర్యాదీని ఆవిషయం Cross Examine చేయకుండా వదలేసారో, మేజస్ట్రేటు 'సహజంగా నేరం ఒప్పుకోదల్చుకొన్నావా' అని అడిగాడు. చెట్టు కొట్టించింది నేనేనన్నది మాత్రం ఒప్పుకుంటానని హెడ్మాస్టరువారన్నారు. అప్పుడు మేజస్ట్రేటు వారు సాక్ష్యలిస్టు చూచి యీమొదటి 38 గురిని యిక విచారించడ మెందుకని ఫిర్యాదీచే వదలేసినట్టుగా వ్రాయించుకున్నారు. దాంతో తొమ్మిదిబళ్ళ సాక్ష్యరథికులు, మహారథికులు, మేధావి హెడ్మాస్టరు గార్కి విరగడయ్యారు. ఇరుసువిరిగిన బండిలా చతికిలబడ్డాడు మాయామి. ఎంతో చెప్పేసేద్దామని కత్తుకట్టి వచ్చిన కేడీ సాక్ష్యపఠాలం. శత్రువు

హెడ్మాస్టరుగారి ఒక్కమాటతో తామంతా ఊడిపోయినట్టు మాట అంటడంతోటే బుసలుకొడ్తో కోర్టు కాంపౌండులో కొబ్బరిచెట్లక్రింద పరవళ్ళుతొక్కారు. కాదూ, వాళ్ళబాధ ఎవరికి తెలుస్తుంది? చక్కగా బోనులో గజ్జెకట్టి, తమ వాగ్వైభవం, ప్రసంగకౌశలం, సిరిసంపదలు, పేరు ప్రతిష్ఠలు ప్రకటించుకొంటో, కసితీర్చుకునే సదవకాశం ఒక్కమాటుగా, ఒక్కమాటతో జారిపోయిందాయిరి. ఎత్తడిపోయిని పడమటావులయ్యారు. వాళ్ళ నోళ్ళడిపోయాయి. నడుములు విరిగాయి ఆ బెంగని అమట్టునే కొబ్బరిచెట్లక్రింద కూలి పడిపోయిన కేడీలను, కొందరికి పప్పుగూటి సవారీలుకట్టి, కొందరిని ఓంభాయిపట్టి యిళ్ళకు చారేసారని చెప్పుకున్నారు.

## పరామర్శల సోమయ్య

అదృష్టవశాత్తూ, పరామర్శలకు ఫస్టని పేర్వడ్డ సోమయ్యమామ కేడీపార్టీ అష్టదిగ్గజాల్లో ఒకడు. కేడీపార్టీ యిళ్ళల్లో ఎవళ్ళుజారిపోయి. కష్టాలొచ్చినా, పరామర్శకు యీతడే నడుంకట్టేవాడు. అజానబాహు మనిషి, బాగా ఘృత నూపాలు వంటబట్టిన కంచుకంఠం, అన్నిటికన్నా మిన్న పిల్లా పీచూ లేరు. చుట్టుపట్ల పదివూళ్ళకు మాంచి యశస్సెర్ట్ పరామర్శకుడై ఊరుకున్నాడు. వందమంది మధ్యవయుస్కులైన వితంతువులు చుట్టూ పెనేసుకుపోయి, శోకాలెడ్తోన్నా, ఎక్కడా కంటికొనల్లో చుక్క ఎరగడు. ఉద్దండ పిండం. వాడిపై ఖరిని పరామర్శలు చేశామని కొంతమంది ప్రాక్టీసుచేసారు కాని, ఉపజ్ఞ ఉపజ్ఞే, యిమిటేషను యిమిటేషనే. వాళ్ళ పరామర్శలు యిమిటేషను కెంపుల్లా ఎబ్బెట్టు అయిపోయాయి. వాడి స్థాయీలందుకొన్న మొగాడు నాటికి నేటికీ మావూళ్ళో పుట్టలేదు. వాడి చేతిని పరామర్శ fine art అయిందంటే అతిశయోక్తి కాదు.

'Like Aeschylus or Milton in poetry, like Machel Angelo in painting, he has carried his art to a point of colossal sublimity and in a manner created the taste by which he is to be enjoyed'

అని డీక్వన్సీ Mr. Williams, the murderer కిచ్చిన ఎన్‌కోమియమ్ నాకు స్ఫురణకొస్తుంది సోమయ్యమామను తల్చుకుంటే. ఓడు సోమయ్యతోకూడా బయల్దేరుతో, వాడి అడుగుల్లో అడుగేసు కొంటో రెండుసంవత్సరాలపాటు పరామర్శలు సాగించాడు. సోమయ్య మామ వడుపులు పట్టేస్తోన్నాడని కొంచెం కొంచెం పేరుప్రతిష్ఠలు వస్తో న్నాయి. వీడికి మంచి ప్రాస్పెక్ట్సు ఉన్నాయని అనుకోనివాళ్ళు లేరు. ఏమైతేం, ప్రజల్లో వైపరీత్యంగా expectations లేవదీసి అంతలోనే disappoint చేసేసాడు. దేనికైనా కృషిఫలించాలంటే, అదృష్ట ముండాలి ముందు ముఖ్యంగా. వీడు స్వంతయింట్లో నిసుముజారిపోతే బారుమని ఊరుకున్నాడు. దానితో వీడు యితర్లనుచేసే పరామర్శలు చప్ప బడిపోయాయి. 'seemed so droll' కాని కనోషియర్సు ఒకసాకు చెప్తారు. అది కొంతవరకు సహేతుకమేమో. సోమయ్య పరామర్శల్లో Master pieces of excellence దొరకడానికి కొంతవరకు కారణం వాడికి పిల్లా పీచూ లేకపోవడం. వీడు–ఖర్మం–పిల్లలున్న వాడు అయిపో యాడు ఏంచేస్తాడు? అక్కడికీ కొట్టుకొచ్చాడు, అంటారు. ఏమైతేం, సోమయ్య పరామర్శవాడల్ మళ్ళా గ్రామానికి లభించలేదు. వాగ్యం త్రాలు, టాకీలు ఉద్భవించని అంధకాలం అయిపోయింది సోమయ్య మామ బ్రతికినకాలం. ఈఆధునిక సాధనాలు లేక సోమయ్యర్ఘూంకారం, వడి, విసురు మనం తెచ్చుకోలేకపోయాంగాని, వాడికేం, వాడిమాటల్లోనే చెపితే 'వాడు పండులా బాగానేపోయాడు' 'పరామర్శల సోమయ్య' అంటో వాడి నామసుగంధం down the corridors of time వస్తోనేఉంది; వాడిది, కాలప్రవాహంలోపడి సమసిపోయే పేరుకనకనా! చివరికి వాడి చావువేళకు, వాడివాళ్ళను పరామర్శచేయడానికి ఏఒక్కడు

సాహసించలేకపోయాడు. వాడి నిండు ఎవడు తేకలడండి ఖండమరణ శయ్యలు చూస్తేమాత్రం? వాడితోనే పోయినై వాడిప్రతిభ, వాడి పరామర్శ పొందితినిన్ని.

ఓరి వాడి చాకచక్యంకూలా, ఏనక్షత్రాన్ని పుట్టాడో. అసలు తేనకోడం వాడా Subject కిచ్చిన అప్రోచ్చిలోనే ఉంది సగం సక్సెస్సు. నడుంకు గామంచాచుట్టి, గడపలో అడుగేస్తోనే షడ్జమంలో ఉపక్రమణ. "చాలుచాల్లేండి, నవ్విపోతారు, యింకా పెట్టుకూర్చున్నారు? ఏంచేస్తున్నట్టు" అని ప్రారంభం. ఇక అక్కడనుంచి ఏడ్చే వాళ్ళని, ఎరుగున్నవాళ్ళనీ ఎరగనివాళ్ళనీ లుంగచుట్టి తలవాచేట్లా చివాట్లెట్టడం. వాడి గాత్రపుష్టి ఏమో కాని, వీధిలోవాళ్ళకు, యింటిడిశో కాల పైన, వీడి గాత్రం విడిగా ఆనమాలు. వాడొక్కరసని కేకలేస్తోంటే ఆడాళ్ళు కంఠాలు నొక్కుకొని, నాగస్వరానికి పాముల్లా వాడివంక చూస్తో, తలలు ఆభుజంమీదకు యీభుజంమీదకు గిరాటేస్తో కిమన్నాస్తి మాట్లాడకుండా ఆపసోపాలు కంఠం ఎత్తితే చంపేస్తాడేమో అన్నట్టు, వార్లను అదుపాజ్ఞల్లో పెట్టి అప్పుడు మధ్యమంలోకి దిగి, 'వాడికేం పండులా, మహారాజులా వెళ్ళాడు. రాజామరణం. వాడికోసం ఏడవక్కరలేదు. ఎవళ్ళకేం లోపంచేశాడని వాడికోసం ఏడవడం? ఓరిని సుఖపెట్టాడుకాని ఎవ్వళనీ కష్టపెట్టలేదు. పదిమందీ బాగుండగా దాటాడు. వాడిదారి వాడు చూచుకున్నాడు. చచ్చినవాళ్ళకోసం చస్తాం కనకనా? కాకపోయినా ఏమమ్మాయి! వదిన! ఒక్కమాట చెప్తోన్నావిను. అవును నీకు తప్పదీబాధ; నలభైఏళ్ళ కాపురం. నీతనువు యీ శోకంతో వెళ్ళదగ్గదే. కాని కాస్త యిటు చూచుకోవాలిమరి. నిన్నుచూచి పిల్లలు కడుప్పుగిలిపోతున్నారు. ఓడూ చేతికందినవాడు కాడు చీమాచిదుగూ. చూడు, పాపం ఆ కుర్రవెధవ దిక్కుమొగమేసుకు ఏలా కూర్చున్నాడో. వాళ్ళని దగ్గరిగా తీసుకో. వాళ్ళని చూచుకు బ్రతుకు. కష్టం సుఖం చెప్పుకోండి. ఏమే రమణమ్మా! నువ్వూ ఆవిడతో సమానంగా శోకా లెత్తో కూర్చోకపోతే, యీపాటికి పిల్లల్ని కాస్త తడపకూడదటే! నీకు

చెప్పాలా. వీరయ్యా, ప్రయాగాడికోసం ఎవరైనా వెళ్ళార్రా? వాడికి ఖాళీలుండవురా ఖర్మం. ఊళ్ళో ఒంటిచెయ్యి. వాళ్ళ కుర్రవెధవ యింకా అందుకోలేదు. కోమట్ల యింటోనో, కాలవగట్టునో ఉంటాడు వెళ్ళిరా; అక్కడ సంచయనంకూడాను, అన్నీ యీవాళేవస్తాయి. వచ్చేటప్పుడు వాల్గు కవిళ్ళు అరటాకు కొట్టుకురా. లేకపోతే లేనిపోని యిరకాటం ఇకనుంచి చెయ్యొద్దు. సైను తెచ్చారే సోదెమ్మా? పెద్దచాకలి ఏమైనాడురా, నిన్నుపంపాడు? 'అడ్డబడ్డలు అంత పొడుగ్గా కొట్టుకు కూచున్నావెందుకురా? యివాళేనేమిట్రా పనినేర్చుకోడం? యింతకన్న ఉండక్కరలేదురా పొడవు. అదెక్కడుంది? యిదెక్కడుంది' అంటో యింటంట బొంగరంలా ఆడిపోతో, అడ్డాలొచ్చిన యిరుగమ్మనూ పొరుగమ్మనూ బెదరగొడ్తో నిమిషాల సర్వసరంజామ చేసేసి, "యింకా అలా మిటుకుమిటుకుచూస్తో నుంచుటారెందుకయ్యా?" అని వాహకులను కసిరి, దారియ్యండర్రా ఖర్మం, అని మూగినవాళ్ళమీద కైయ్యిమని ఒక్క అరగంటకాలం అలా వాకలి ఫెళఫెళ్ళాడించేస్తాడు. యిక నిష్క్రమణ. వాడెళ్ళాక వానవెల్సినట్టే వాకలి. తెచ్చుకోవాలంటే వస్తుందిటండీ, అచెవాల్! కేవలం పూర్వసంచితంకావాలిగాని. పరామర్శల సోమయ్యంటే వజ్రపుతునక కాదూ, సంఘదృష్ట్యా తాము చచ్చిపోతే, అధవాం యింటో వాళ్ళైనా ఏడ్చిపోతారేమోనన్న మాత్రం జాలిగుండెలవాళ్ళు, సోమయ్య గ్రామంలో ఉన్నరోజున మరణం రావాలని కోరుకొనేవారట. ఇల్లా వుంటుందేమిటమ్మా ఎక్కడైనా అనుకోకండి. పచ్చినిజం, కమ్యూనిస్టు పరిభాషలో మాట్లాడితే.

ఆసోమయ్యసేవ కేడీ సాహ్యులకు లభించింది. [illegible]డాడు. కేసరికి ఆకలి ఆడగాలంటే నిజఖరనఖరవిదారితమా స్తిమస్తమ స్తిమ్మక్కాము కోరుతుంది అన్నారే చిన్నయగారు. సోమయ్యమూతు అంగద ఆడగాలంటే దుఃఖపూరితములైన పతాలాలు కావాలి. ఉలుకుతాడు. "ఎవడుచెప్పాడు మీకీ శోకాలు తీరికూర్చుండి? పెళ్ళివేళ యీఏడుపులేమిటి ఖర్మంకాకపోతే? దిగ్దంతులంటివాళ్ళు మీరు, మీయెదట పదలేక రెండుచేతులూ ఎత్తేసి

"చెట్టు కొట్టించాను బాబోయి" అని వాడు తప్పుకున్నాడూ. అందుకు మీరు శోకాలెత్తూన్నారూ? వచ్చినపని గుమ్మంలోనే అయిందని ఎగిరి గంతైవలసిందిపోయి కావల్సినవాళ్ళెవళ్ళో చచ్చిపోయినట్టు ఓటే ఏడ్పా? లేకండీపాటికి ఎవళ్ళైనావింటే నవ్విపోయారు. చేసారు ప్రహూజకత్వం చేసారా? అని. వాహ్వా." అంటో తలోశాస్త్ర ధారకంపట్టించి వాళ్ళను యిళ్ళకు నడిపించుకెళ్ళాడు. మాయావి కేసును పెనుగొండ మేజస్ట్రీటు కోర్టుకు ట్రాన్సుఫరుచేయించుకున్నాడు. పెనుగొండ మేజస్ట్రీటు కేడీపార్టీ పక్షపాతే. హెడ్మాస్టరుగారిపై చార్జీట్రీఫేముచేసాడు. హెడ్మాస్టరుగారు స్టేటుమెంటులో దర్బారుత్సవకార్యార్థంచెట్టు కొట్టించానన్నారేకాని, ఆ ప్రధానకార్యమేమో విశదీకరించలేదు.

ఉత్తరసాక్ష్యానికి కేసు వాయిదాపడింది. ఉత్తరసాక్షులచేత ఆ కార్యమైనం చెప్పించవలసియున్నది. దానికేమి పేరుపెట్టడం సమంజసమా అని పూజార్లు హతమవుతున్నారు. హెడ్మాస్టరుగారైతే నిశ్చింతగానే యున్నట్టు కన్పట్టినా, తద్విషయం ఆయన ఆలోచనభాగలో ఉంది. ఈ క్లిష్టసమయంలో, మావిద్యార్థి నాటకసమాజ నారదపాత్రధారి అయిదో ఫారం లెక్కలక్లాసులో, లెక్కల నోటుబుక్కుమీద మాసమాజ నామచిత్తరవు చెక్కుతో, మాకు తెచ్చిపెట్టిన ఒక చిత్రసంఘటనరీత్యా బడిలో ఒక నాటకసమాజమున్నట్టు, హెడ్మాస్టరుగారికి తెల్సింది. బస్! బాగుంది, అనుకొన్నారు ఆయన. దర్బారుత్సవంలో, ప్రభుభక్తిపరమైన, విద్యార్థి నాటకప్రదర్శనం పౌరులకు చూపనెంచి, తదుద్దేశ్యంతో, నాటకరంగ నిర్మాణానికై బోడితాడిని కొట్టించానని చెప్పించ పరిష్కరించుకొన్నారు. వారివాదం, వారికీ, మాకూకూడా ఉభయతారకమైంది, ఆయన కేసువి[illegible]లో మేము చేసింది ఏమీ లేకపోయినా.

# ప్రవరవరూధినీ వృత్తాంతం

చివరకు హెడ్మాష్టరుగారు సాక్ష్యం పెట్టినా పెట్టకపోయినా కేసు కొట్టేసి బ్రతికి బయటపడవలసిన వదుదుడుకులో మేజస్ట్రీటువారే పడ్డారు. మాబడి యుద్ధకాలవిశేషమే మోకాని, అన్నీ shocks, అన్నీ surprises. రెండురోజుల్లో ఉత్తరసాక్ష్యం వాయిదా అయియుండగా కలెక్టరుదొరవారు, దర్బారుత్సవాల్లో మా హెడ్మాష్టరుగారిచే క్రికెట్టు క్రీడకు ఆహ్వానింపబడ్డవారే, తణుకు తాలూకాఆఫీసు విషయం ఏదో యింక్వైరీకివచ్చి సతీ సహితంగా పెరవలి రెస్టుహౌసులో క్యాంపుచేసారు. ఆరోజుల్లో ఆంగ్లేయోద్యోగులు సతీసహితం క్యాంపుకువస్తే తాబేదార్ల ప్రాణంమీదకు వచ్చేది. బుద్ధిమంతులు సెలవుపెట్టేవారట, ఏదోపేరెట్టి ఆపరగంగ ఏలూరు యిల్లు చేరేవరకూ. దొరదంపతులకు సప్లయిలతో ఘృతలవణతైలతండుల ధాన్యాది సమస్తవస్తువిస్తృతమైన కోష్ఠాగారమోటి తయారుచేయలేక కాదు. ఓటికాదు నాలుగు తయారుచేయగలరు. గ్రామ మునసబు కరణాలను పిండడమేగా. అక్కడకాదు యిబ్బంది. దొరసాని గారికి సరస సంభాషణా కుశలుడైన పురుషునొకని అమర్చి మరీ కలెక్టరు గారిని ఆఫీసుకు తీసికెళ్ళాలి. మిగతా సప్లయిలలాంటిదికాదు. బహు గడ్డు సమస్య. ప్రాణాంతకమయ్యేది. ఆరోజుల్లో పరభాషలో ప్రసంగ చాతుర్యంగల పురుషులు పల్లెలంటగాని పట్టణాల్లోకాని, కన్నొడుచు కున్నా దొరికే పదార్థంకాదు. పట్టభద్రులైనా దొరసాన్లముందు వాచా లతలో పిల్లలైపోయేవారు. వీరు నేర్చిన విద్యలను వడ్డించి చేతుల కడు క్కోద్దామంటే ఆ వనితలకు విద్యావ్యాసంగాలు రుచింపవు. చేదుకూడాను. చిన్నచిన్న పట్టాల్లో ఏళ్ళతరబడి వాళ్ళ దర్శనభాగ్యమే లభించక వాళ్ళ పట్ల చాలా విపరీతాభిప్రాయాలుండేవి. వాళ్ళకు యిష్టంలేని ప్రసంగం చేస్తే ఎగిరి ఎడంకాలుతో తన్నుతారేమోనని భీతి ఉండేడిది. ఒక పర్యా యం 'వాచాలాభావం వస్తే, నీప్రాణానికి మాప్రాణం అడ్డం, నీకొచ్చిన భయంలేదు. మేమీ పరిసరాల్లోనే పొంచి ఉంటాం, నీవు కేకేసేసరికల్లా

వచ్చిపడ్డాం' అని తహసిల్దారు, రెవిన్యూ యిన్‌స్పెక్టరూ ఓ పెద్దమనిషికి ధైర్యంచెప్పి పంపించారట. ఆతణ్ణి వెతకటానికి కారణం మరేమీలేదు ఆప్రాంతాల్లో 'May God bless your honour with long life and prosperity' అనే దీవనవాక్యాలు గుప్పుతో ఎంతమందికో మహాజర్లు వ్రాసిపెట్టాడట. అల్లుల్లో మల్లు పెద్ద అన్నట్టు, ఉన్నవాళ్ళల్లో అతడే అనుభవశాలి, పండితుడున్నూ. ప్రార్థన దండక రచనాపాండిత్యం కలవాడిని పంపితే ఎందుకైనామంచిది. చేతకాకపోతే దణ్ణమైనా పెట్టి వస్తాడు. అధమం తగువులేకుండా వస్తాడు అని భావించారు. కాని అప్పటికి ఆంగ్లభాషలో అమల్లోయున్న సజీవ శబ్దసంచయం యిడియమ్ ఉంటుందా, చస్తే వాళ్ళ యాక్సెంటు పట్టుబడుతుందా, స్వభాషలో తుంపుడు వాక్యాలతో సంభాషణను చైతన్యయుతం చేసినట్టు పరభాషలో చేయగలడా? నెస్ఫీల్డుగ్రామరు పడవల్లించిన సిష్ఠుఆయిరి. ఏపరీక్ష యిచ్చినపుడు పట్నంవెళ్ళాడో మళ్ళాఎరుగడాయిరి. అతడు చదువుకొన్నపుడు మాస్టర్లు ఎంతసేపూ బడిలో Direct speech ని Indirect చేయించారేకాని చక్కగా యిటువంటి అవసరాలు గడపడానికైనా పనికొచ్చేను Indirect speech ని Direct speech లోకి మార్పించి ప్రాక్టీస్ యిచ్చివుండలేదు. అంచేతపాపం ఒక్క verb కాని ఒక్క That కాని లోపించకుండా సదశ్యపూర్ణంబూరెల్లాంటి బాగా బరువైనవాక్యాలు కట్టి మాట్లాడడం మొదలెట్టాడు. పైగా స్పెల్లింగుకూడా కళ్ళకు కట్టినట్టు కన్పట్టేలా ప్రతిఅక్షరం ఊతంగా మన తెలుగు యమకగమకోచ్చారణతో సాగదీస్తో ఫుల్‌స్టాప్ ఎక్కడో దాఖలాయిచ్చేలా, అమ్మయ్యా అన్నట్టు చివర ఆగి విశ్రాంతి తీసుకోడమున్నూ జరిగింది. ఇది ప్రసంగ పౌఢత్వం. మరోటీ, ప్రారంభిస్తోనే నాలుగోఫారం కుర్రాడు లిటరరీ ఎసోసియేషను మీటింగులో maiden speech నాడు ప్రయోగించే వాక్యవిధానాన్ని 'As this is the first time for me to speak etc, please excuse me for my mistakes for I am not a professor అనేమాదిరి నాందీవాక్యం పలికాడట. ఆపె యోగ్య

రాలే ఆకాడికి. పదపడి పెందలకడే పంపించేతామని టీ యిస్తే దాన్ని గుటకలేస్తో, గురకళబ్దం చేస్తో తాగి కృష్ణా కృష్ణా అంటో గ్లాసు బల్ల మీద పెట్టవచ్చునా అన్నట్టు వెఱ్ఱిచూపు చూచాడు. దాంతో ఆపె యిక పట్టలేక అతణ్ని వీధికంటా తరిమింది అని చెప్పుకొనేవారు.

అందువల్ల యీయిక్కట్టులో ఎవడు నడుంకట్టగలడు? 'విఘ్నేశ్వరుడికి ఏమిప్రీతి? ఉండ్రాళ్ళు ప్రీతి' •అన్నట్టు యీ అమ్మవార్లకు గాలి పడగలాట ప్రీతి. అంటే ఆవిడకోరేది, చెయ్యీ చెయ్యీ పట్టుకొని ఆచం దాస్యను తిప్పుతో, కాస్తకు కూస్తకు యికిలిస్తో, సకిలిస్తో, వట్టి 'weather' మీద గంటలతరబడి సంభాషణను సాగదీస్తో కాలక్షేపం చేయించాలి. ఇకనీపాటికి మంగళాస్నానాలు చేయించాలన్నట్లు నీమాటలు భావగర్భితంగా ఉన్నాయా లేవా అని కాదు ప్రశ్న. ఎంత భావరహితమైతే, అంత ఒప్పుకచ్చుకూడా. సంభాషణ సాగపెట్టకలవా, నెగ్గావన్నమాటే. అదీ చూచుకోదగ్గది. నిశితంగా ఏవిషయాన్నీ ఆలోచించవలసిన అగత్యంలేని ఖాళీమనస్సు ఆయెదరున్నది అని గ్రహించుకొని ప్రారంభించు. బట్టతలకు, మోకాళ్ళకు ముడెట్టి దంచై. ముచ్చటపడి విని మురిసిపోతుంది. నీవు చెప్పేవి ఎంత గగనకుసుమాలూ, అజాగళస్తనాలూ, నేతిబీర కాయలూ అయితే అంత చెలామణీ అవుతాయన్ని ఎఱిగియుండు. లోకం సమస్తం నీకు అవగతమైనట్టుమాత్రం brave face తో కానీయి సంభాషణ, స్వోత్కర్షకు తెనుదీయకు. ఆత్మప్రశస్తిపరులుగాని పైకిరాలేరు, యీఅమ్మవార్లదగ్గర. అర్థరహిత సంభాషణ కిచ్చట అయస్కాంతశక్తి ఉంటుందని నమ్ము. ఇవే కాంతాసమ్మితాలు, ఆనందప్రదాలూ అన్నిమ్ముఖ్యకు. కాని యీసంభాషణ అందరికీ చేతనవుతుందని అనుకోడం పొరపాటు. అది ఒకకళ. సహజప్రతిభతోపాటు ఉత్పన్నత ఉంటేగాని కబుర్లరాయుళ్ళు కాలేరు.

ఖర్మం అది మనవాళ్ళకు స్వభావవిరుద్ధమైన ప్రమేయం. అంత తేలికవిషయాలమీద పనికట్టుకు మాట్లాడే మనస్తత్వంకాదు మనది. ప్రపంచ ప్రఖ్యాతతాత్త్వికులు పుట్టిన దేశంవాళ్ళం. అందులో ఆడాళ్ళతో అసలే

కాదు. 'ఏమండోయి మీపింతండ్రిగారు పాపం, నిన్నను బాగానే యున్నాడున్నండి, పలకరిస్తే చక్కగా పలికాదుకూడా' అనేమాత్రం ప్రధానవిషయమేనా అయితేతప్పు, లేకపోతే పనిచెరిపి నట్లే. బాగా భావగర్భితమైన పలుకు తట్టితేనేతప్పు పరాయి పెద్దమనిషిదగ్గర పెదమి విప్పం. అర్థశూన్య సంభాషణలు చేసేవారు మనకు అలుసు. అవే కావాలి ఆచక్రస్తనికి. ఏలానడుస్తుంది యీకాపురం.

చేష్టల్లోనూ యీవైవిధ్యం కన్పిస్తుంది. అవిద్యుల్లతావిగ్రహ మెంత చిలిపితనం చూపుతుందో అంతా చూపుతేనేకాని good manners లేనివాడిగానో, కృత్రిముడుగానో సంశయిస్తుంది. పరాయిస్త్రీని చెయ్యి చేసుకోడం భావ్యంకాదని మనవాడు నిష్ఠవెలిగించబోతే, అదంతా దోషంగా పరిణమిస్తుంది. అంతలో అవిడకు ఏ క్రోటన్ వేరుమీదో హాకాల్ మమకారంకల్గి అవిడ వంగితే, యింతమనిషీ చట్టున నేలమీదపడి, సృష్ట్యాదినుంచి నేటివరకు అరకం వేరు భూమండలంలో పుట్టలేదన్నట్టూ, నేటికి కంటబడిందన్నట్టు. యీమహదవకాశం సిద్ధించ డానికి ఆపె సహవాసమే కారణమన్నట్టు, కృతజ్ఞతాప్లావితమైన హావ భావాలతో, చిటుక్కున ఒకకన్నుమూసుకొని రెండోకంటితో అవిడ కనుకొలుకులకు గేలంవేసి, యిట్టే అవిడ గుప్పిడి నొక్కాలి. వీలుకొంబడిని సుస్నిగ్ధములైన ఆపె కపోలపాళినీ, కమనీయమైన నేత్రద్వయాన్ని మూయడంనేర్చి, లఘుమాత్రంగా దాగుడుమూత లాడాలి. ముని మాణిక్యం వారినాయక రసికుల రీతిని. అందాక తెచ్చి యిక బద్ది గిసేస్తుంది.

తరువరి, వ్యవహారం కత్తిమీద సామే ఆపెతో. ఒకర్ని ఒకరు అపార్థంచేసుకొనే తరుణంయిది. మనదేశంలో మొగాడికి పగలు ఆడ స్పర్శ అలవాటులేక సహజంగా చకితుడై, ఆపె తనను తాకి, కలచిందని భ్రమించి ఆపె సంభాషణకౌతుకమును విరహవేదనక్రింద, ప్రణయప్రద ర్శనక్రింద జమకట్టుకుంటాడు, అమాయకుడు. తప్పుత్రోవ పట్టాడు. వక్ర బుద్ధికి వికారాలు పొటకరిస్తాయి. లవంగీ సన్నిధానంలో నిల్దొక్కలేక

నీళ్ళు కారిపోతాడు. ప్రతీచీఖండవాసుల దేశకాలపరిస్థితుల పట్టి ఆచారాలను పట్టి చూస్తే, అచ్చటి స్త్రీలకు నాట్యసంభాషణకాంక్ష లున్నంత మాత్రాన వారు అవినీతులని, విషయలోలురని గణించరాదు. బాగా వయసుకలవారైనా, తరుణవయస్కులైనా శిశుహృదయంతోనే చనువుగా ప్రసంగించవచ్చు. వారి మాటలు చేష్టలు శృంగారరస ప్రధానం కాక పోవచ్చు. మనవాడికీ సత్యం అనుభవంలోలేక, ఆపె పలకరించినా స్పృశించినా, కారణం తాననుకొన్నదే నని పొరపడి 'మదిలోన కోరికల్ గుబ్బటిలంగ మదనాగ్నికి యింధన మవుతాడు'. అంత పెద్దఅమ్మాయిని సిగ్గుబిళ్ళ యీడు అమ్మాయివలె, వట్టి వట్టి ఆటలు ఆడ్తోందని ఏలా అనుకోగలడు, ఆపె చర్యలను మరోవిధంగా presume చేసికొని ఉన్నవాడు? ఇక ఆవిడమాట— మూతి విప్పనందుకు, చేయి తగల్చనందుకు వీడు కృత్రిముడు అని యింతదనుక భావించిన పంకజముఖి, యిప్పుడు వీడి వికారం, అవస్థాభేదం పసికట్టి, వీణ్ణి తన పాతివ్రత్యం భంగంచేయపూనుకొన్న దుష్టునిగాను, బుద్ధిజాడ్య జనితోన్మాదునిగాను భావిస్తుంది. ప్రారంభంలో ప్రవర వరూధినీ వృత్తాంతంలా కన్పించినది, కొసకు తిరగబడి, తారుమారు కావచ్చు. ఉపద్రవం.

♦ ♦ ♦

## సా హి త్య స రా గా లు

కలెక్టరుదొరవారి గృహిణి సాహితీహృదయంకలది. తాబేదార్లను యిబ్బందిపెట్టేది కాదు. బహుయోగ్యురాలు, సుగుణరాశి. క్రికెట్టు క్రీడలకు స్కూలుకు భర్తతో వచ్చినపుడే, మా హెడ్మాస్టరుగారియందు భక్తితాత్పర్యాలు ఏర్పడ్డాయి ఆపెకు. మా హెడ్మాస్టరుగారి ప్రసంగాల్లో కన్పించిన సరళతకు, ఔచితికి అబ్బురపడి, దర్బారు క్రీడల విశ్రామసమయంలో ఆయనతో వెళ్ళి ఆయన స్వంతలైబ్రరీ, స్కూలు లైబ్రరీ చూచి, ప్రచురణ తర్వాయిగా హెడ్మాస్టరుగారు బడికి

తెప్పించిన Swen Heiden's Trans Himalayas' న్ను హెడ్మాస్టరు గారు తన స్వంత లైబ్రరీలోనుంచి ఆపెకు బహుమానము చేసిన, Allen కంపెనీవారి ముద్దులమూటగడ్తోన్న గిల్టు ఎడ్జిలుకల క్రొత్త యడిషన్ 'Ruskin's Sesame and Lilies' న్ను, తెచ్చింది. ప్రజెంటు చేసినపుడే, ఆగ్రంథం వ్రాసింది తానే అన్నంత ఆనందంతో రెండు పేజీలు 'Queen's Gardens' భాగంలోవి ఆపెకు చదివి ఆవిడను Ruskin భక్తురాలిని చేసినాడు అని వినికిలి. ఆయన రచయితతో తాదాత్మ్యత పొందేవాడు. ఆయన చదువుతోంటే మేము తన్మయత చెందేవాళ్ళం. కలెక్టరుగారి భార్య అయినా అంతే. ఆగ్రంథం ఆపెకు యీయడంలో ఉన్న ఔచితి చూచారా! ఆగ్రంథంలో, త్యాగ శక్తి, సేవాదృఢత్వం స్త్రీలకు దేవుడిచ్చిన మహత్తర సాధనాలనీ, మానవ జీవితాన్ని నియమబద్ధంగా, ఆదర్శంగా చేయుటకు, ప్రపంచమును స్వర్గ తుల్యంగా, సుఖమయంగా చేయుటకు భగవంతుడు సృష్టించిన స్వరూపమే స్త్రీ అని, స్త్రీకి అత్యున్నత స్థానమిచ్చి, గార్హ్యస్థ్య ధర్మబోధన చేసే విద్య స్త్రీలకు గఱపాలని ఉన్నది. ఉత్తమకర్తవ్యాన్ని, మానవ జీవితంలో స్త్రీయొక్క ఉత్తమస్థానాన్ని ఏలా విశదీకరించాడో చూడండి; 'Catastrophe is always caused by the folly or fault of man; the redemption if there be any, is by the wisdom and virtue of woman, and, failing that, there is none'. డాక్టరు జాన్‌సన్ అయితే ఆంగ్లవిద్వాంసుల్లో కుందనాలు కాసుర్లగారే. ఆంగ్లసాహిత్యంలో నియంతృత్వం చెలాయించినవాడే, ఆయన్ని పల్లెత్తు అనడానికి వీల్లేదు. కాని, ఓ అమ్మాయిని ఏంచేశాడో చూచారా! నాకు పొట్ట చెక్కలయింది- పెళ్ళికూతురికి లెక్కలపుస్తకం యిచ్చాడని చదివినపుడు. వెడ్డింగుగిఫ్టు అంటో పేరెట్టి 'Croker's Arithemetic' యిస్తాడా తెలికితెలికి! 'A book of Science is an in exhaustible thing in nature' అంటో కారణంకూడా చెప్పాట్ట. గణితం అంటేనే నాకు మంట, యిచ్చియిచ్చి దాన్ని పది

కాలాలపాటు బ్రతికి బాగుండి, పిల్లలను పెట్టదగ్గ పెళ్ళికూతురికికూడానా! నయం, సన్నికలుపాత్రం యిచ్చాడు కాదు, యింకా శాశ్వతబ్రహ్మ కల్పంగా ఉండును, ఎండలకు ఎండకుండా, వర్షాలకు తడవకుండా. చిరిగేది కాదు, దొంగలు ముట్టేది కాదు. ఔచితికి చెప్పా. ఎక్కడో ఒక ఆయన, ఎక్కడో ఒక ఆవిడకు మక్కువగా ఏమి యిచ్చుకుంటే మధ్యన నాకేం; మాంపూరా, మావీధా? చిత్రమెక్కడంటే -ఆపిల్ల పుచ్చుకుందట అగణితాన్ని. అగణితమైన భక్త్యావేశంతో కళ్ళకూడా అద్దుకొందట ఖర్మం ఎంత పాతకాలపుపిల్లో! కేవలం సోమిదమ్మగారన్నమాట. ఈ మధ్యనొక ఆయన యింటికొస్తో ఊరుకోలేక 'పాతివ్రత్యం' అనే గ్రంథ రాజాన్ని భార్యకి తెచ్చిఇస్తే, ఆవిడ నవ్వుతో దాన్ని అగ్నిహోత్రానికి నైవేద్యం చేసిందని, ముసలమ్మలు బుగ్గలు నొక్కుకున్నారు. వాడికిఆశాస్త్రి కావలిసిందేలేండి, శుభకార్యంనాడు 'విప్లవం వర్థిల్లాలి' సీరీసులోది 'స్త్రీస్వాతంత్ర్యం' భార్యకు ప్రజెంటుచేస్తాడా? కొంప ములిగిపోదూ మరి! అది కంటబట్టినపిల్ల, దీన్ని కంట పెట్టనిస్తుందా? ఎవరిది తప్పు? ఆ పిల్లది కాదు.

ఆరోజున ముద్దువచ్చే మరొకపని చేసారు హెడ్మాస్టరుగారు. దర్బారు క్రీడలు పూర్తిఅయ్యాయి, బహుమతులు యీయాలి. దానికుపోద్ఘాతం చాలా చిత్రంగా జరిగింది. ఎవరూ సభలో కోరకుండానే ఉద్రున కలెక్టరుగారి సతీమణి సభావేదికపై కుర్చీ అలంకరించింది. ఓ పరిచయవాక్యమనీ, ఓ ఉపపాదనసీ, ఏముద్దూ, ఏముచ్చట లేకుండానే, ఏ సాంప్రదాయం పాటించకుండానే, పీటలదగ్గర బ్రాహ్మణ్యానికి ఫలప్రదానాలు యింకాముట్టకుండానే పడగ్గదిలోకి వెళ్ళిపడ్డ మాకెరిత్తొందర రామబ్రహ్మంలా, ఊరికింది కుర్చీలోకి. ఆవిడ అసభ్యతకు మేము తెచ్చుపడ్తోండగానే లేచి విషయంచెప్పి మాచిక్కువిప్పింది. హెడ్మాష్టరుగారిని ప్రశంసిస్తో, వారు తనను అప్పుడే అక్కడే బహుమతులు యీయవలసిందిగా కోరిన చమత్కారవిధానాన్ని చెప్తాను వినండి అంటో తన చేతిలోనున్న సిసేమ్ అండ్ లిలీసును విప్పింది. పేజీ జ్ఞాపకం పెట్టు

కుంది కాబోలు, తీసి చదివింది. 'Woman's great function is praise. She enters into no contest but infallibly adjudges the crown of contest' అన్న వాక్యం వేలితో చూపారట. అంతే ఆయన చేసింది. అది చదువుకొని, తనను బహుమతులు యీయమని కోరుతున్నారని గ్రహించుకొని, తత్కార్యక్రమం జరుపుటకు అమితానందంతో వచ్చానని చెప్పింది. ఆయనతో జరిగిన గంటా, రెండుగంటల సంభాషణతో, ఆయన ప్రతిభా పాండిత్యాలు ఆవిడకు గట్టిగా నమ్మినవిషయమైనాయేమో! కొంతవడి వచ్చిన కార్యం మరచి, మా హెడ్మాష్టరుగారి ప్రతిభ బహుముఖమని, వారి ప్రౌఢవాక్పాటవం అనన్యసామాన్యమనీ, యింకా ఏమేమో గంగాఝురీవేగంతో వారిని స్తవంచేసి, అవిద్యాధికుని బోధన నిత్యంపొందుతోన్న మేము ధన్యులమని మమ్మ అభినందించి బహుమతులు బాలురకు అందించింది. కలెక్టరుగారు ఆవిడ ఉపన్యసించినంతసేపు మధ్యమధ్య కరతాళాలిస్తోంటే, 'చూడండి, హెడ్మాష్టరుగార్ని గురించిన స్తవానికి అంగీకారం కలెక్టరుగారుకూడా ఎలాయిచ్చారో యిప్పుడైనా గ్రహించి బ్రతకండి' అన్నట్టు పూజార్లు కేడీలవంక ఎద్దేవాగా చూచారు. 'అది కాదోయి సంగతి, తనభార్య వాగ్ఝరిని ప్రశంసించారు కలెక్టరుగారు, మరెవర్ని కాదు. మధ్యన మీరాట్టే గొప్పలకు పోకండి' అన్నట్టు కేడీలు అభినయించారు.

యాతావాతా చెప్పొచ్చేది మా హెడ్మాష్టరుగారు దర్బారుసమయంలోనే కలెక్టరుగారి సతీమణి హృదయాన్ని సాహిత్యసరాగాలతో చూరగొన్నారు. అంచేత ఉత్తరసాక్ష్యపు వాయిదాకు రెండురోజులక్రితం పెరవలి కాంపుకి వచ్చినపుడు, ఆయన్ను టీకి ఆహ్వానించింది. హెడ్మాష్టరుగారా రాపెచనువును సొమ్ముచేసుకోకుండా ఉంటారా? కేసుమాట ఆపెచెవినేసిఉంటారు సన్నసన్నగా. ఆయమ కేసు తీసేయించుమని కలెక్టరుగారిని తొడపాశం పెట్టిఉంటుంది తియ్యతియ్యగా. కలెక్టరుగారు మేజస్ట్రేటుకంఠం పట్టుకొనిఉంటారు గట్టిగట్టిగా. కలెక్టరుగారు పెరవలి కాంపునుంచి షికారుగా పెనుగొండ మేజస్ట్రేటువారి కచేరీకి వెళ్ళి, కోర్టు ఎదుటయున్న

తాటిమీద కాలేసి, మేజస్ట్రీటువారిని నిలేసినట్లు దర్మిలా కొంతకాలానికి తెల్సింది. ఉత్తరసాక్ష్యం వాయిదానాటి మధ్యాహ్నం రెండుగంటలకు పెరవలినుంచి కలెక్టరుగారి డిపార్చరు అనీ, ఆరెండుగంటలలోపలనే కేసు కొట్టేసి వచ్చి చెప్పమని మేజస్ట్రీటుకు కలెక్టరువారి ఆర్డర్ అని, పూజార్లు తర్వాత కోశారు. ఎంతవరకు నిజమో తెలియదు ఫలితాలు చూచిన తర్వాత లేవదీసిన మాటకాబట్టి. నిజానికి అప్పట్లో హెడ్మాష్టరుగారు పూజార్లకైనా తెలియకుండానే కలెక్టరువారితో టీ తీసుకొని, వచ్చారు. హెడ్మాష్టరుగారు వ్యవహారనిపుణుడు కాబట్టి, కేడీల కే కొంచెం వాస నేసినా వారు రెవెన్యూబోర్డుకికూడా మహజర్లుపెట్టి, అల్లరిచేసి తనకు కార్యభంగం కల్గిస్తారని ఎరుగును. అంచేత బ్రహ్మకు తెలియకుండానే జరిగిందా అంతర్నాటకం, ఏమిజరిగినా.



## ఉత్తరసాక్షి వెంకయ్య

ఏమైతేం, కలెక్టరుగారు మాట్లాడిన సాయంత్రం మేజస్ట్రీటు సంధ్యచీకటిని ఒంటిగా జట్కామీద తణుకువచ్చి, ఊరుచివర పక్షపాత మొచ్చి మాటపడిపోయిన ఒక మిత్రునింటికి, అతన్ని చూడవెళ్ళినట్టు వెళ్ళి రహస్యంగా హెడ్మాష్టరువారికి కబురుచేసి, ''మీరూమీరూ బాగానేయున్నారు మధ్యన నామెడకు పట్టించారు. మహాత్మా ఉత్తరసాక్ష్యం అక్కరలేదు, ఏసాక్ష్యం అక్కరలేదు. తీరా చార్జి frame అయింది కాబట్టి, వాలాయతి ఒక్కణ్ణి, లెక్క ఒక్కణ్ణి, దార్లో దొరికిన గొడ్లకాడాడైనాసరే, తీసికొచ్చి చెట్టు న్యూకాలు పరిమితిలోదే అన్న ఒక్కమాటా అన్పించవయ్యా. ఏంఖర్మం వచ్చిందయ్యా నాకు? మరుక్షణంలో కేసు కొట్టేసి నాకు చుట్టిన కంఠ పాశం నేను తెంపుకుపోతాను' అని వాపోయాడు. అంతే జరిగింది కూడా వాయిదానాడు. హెడ్మాష్టరుగారైతే ఉదయం పెరవలి కట్టు

హౌసుకు వెళ్ళి అక్కడనుంచి పెనుగొండ కోర్టుకు 9 గంటలకు అందు కున్నారు. కాని వారి ఉత్తరసాక్షులు పదిన్నర, పదకొండు గంటలకు తప్పకుండా రాదగ్గవాళ్ళు రాలేదు. స్వామికార్యం విస్మరించేవాళ్ళు కారు పూజార్లు. 12 అయింది. ఇన్స్పెక్టరు, యిన్స్పెక్టరును అసిస్టుచేస్తోన్న కేడీపార్టీవకీళ్ళు, హెడ్కాన్స్టేబుగారున్ను కోర్టులో ఉండగా, 'తూర్పువిప్పర్ల దగ్గర తణుకు జట్కాబళ్ళవాళ్ళు కొట్టుకుని చచ్చిపోతున్నారని, ఒకటి రెండు బళ్ళు కాల్వలో పడిపోయాయనీ, యిద్దరో ముగ్గురో కన్పించటంలేదని, యిద్దరు ముగ్గురు పలకరించినా పల్కటం లేదని, బుర్రలు పగిలినవాళ్ళ తోటీ, కాళ్ళూ చేతులూ విరిగినవాళ్ళతోటీ, సముద్రక్షణ్ణి విప్పర్ల రోడ్డు మొగ భీభత్సంగా ఉందనీ,' మనిషోమాటగా కబుర్లొచ్చాయి. ఆ అల్లరి తణుకు జూరిస్డిక్షనులో జరుగుతోంది కాబట్టి, యిన్స్పెక్టరు తన్ని అసిస్టు చేస్తోన్న వకీళ్ళకు కేసు వప్పచెప్పి తాను పరుగెత్తాడు. మేజస్ట్రేటుగారి తొందర మేజస్ట్రేటుగారిది. మేజస్ట్రేటుగారు ఆఫీసురూములోనికిపోయి ప్యూనుకి ఏంచెప్పాడో, వాడు రోడ్డెంటవెళ్ళి పెనుగొండ సంతకు పోతుల చేరానికొచ్చిన తణుకు వాస్తవ్యుణ్ని ఓణ్ని జబ్బలు దొరకబుచ్చుకొని మేజస్ట్రేటువారి ఎదుటకు లాక్కొచ్చాడు. 'నాపోతు తప్పిపోతుంది బాబో' అంటో కాళ్ళావేళ్ళా తన్నుకుంటో కాకిగోల చేశాడువాడు. 'పోతు ఆసామీకిపూర్తిగా డబ్బుయిచ్చేసే తోలుకుపోతున్నాను, పెనుగొండలో ఎవర్ని పల్లెత్తుమాట అన్నపాపాన్ని పోలేదని చేతులు ముడుచుకొని అతి జాలిగా చెప్పుకుంటూన్నాడు, వెంకయ్య, మేజస్ట్రేటుగారితో. మేజ స్ట్రేటుగారు, విసిగించుకోకుండా బోనెక్కు అని గదిమి ఎక్కించారు. గోత్రనామాలు అడగి వ్రాసుకొన్నారు. వాడు సమాధానం చెప్పినంత సేపు కాల్వగట్టువంకే చూస్తున్నాడు కాబోలు, "అదుగో, అదే నాపోతు, ఆ గంపకొమ్ములదే" అంటో ముఖం చేటంత చేసుకొని బోను మరచిపోయి వీధిలోకి ఉడాయించాడు. ముగ్గురట్టుకు తీసికొచ్చి బోనులో నిలేశారు. ఓప్రక్కను ప్యూను, ఓప్రక్కను పోలీసు కాన్స్టేబులు కాశారు. మరో డెళ్ళి ఆ పోతును తోలుకొచ్చి, వీధిలో పడేసి ఉంచిన కేసుదాఖలా M.O

తాడిబాదుకు కట్టాడు. తీర్పు మొత్తానికి అన్యాయమే అయినా, నీహార్లేశాలైన ఆచారాలనుమాత్రం, ఎంతో నిష్ఠగా అమలుపరుస్తోంటాయి కోర్టులో. బోనులోనుంచి ఒకసారి దిగి ఎక్కాడు గా— అందుకు తిరుగా ప్రమాణం చేయించారు, అక్కడికి మహా, చేయించినవాళ్ళకూ చేసిన వాడికి ప్రమాణంలో గురి ఏర్పడి వచ్చినట్టు- ఆ ప్రమాణవాలాయతి అయిన తర్వాత పలికే ప్రతి అక్షరం ప్రమాణపూర్వకంగా చెప్తోన్నట్టు- ఓరు తెగనమ్ముతూన్నట్టున్నూ. ఆ ప్రమాణం చేయించేవాడు 'అధమం విభూతిరేఖయినా ముఖాన్ని దిద్దుకొని, కాస్త పట్టుపంచి మొలకుచుట్టుకొన్నా, ఓ కాడికి యింకా ఏమో కాని యీ ప్రమాణం చేయించేవాడు నిలువెల్లా అబద్ధం, శుద్ధ హుళక్కి-న్నీ. ఆ ప్రమాణమైనా, ఏం ప్రశాంతాంతఃకరణంతో చేయించేడుస్తాడు. అప్పట్లో ఏ హెడ్ గుమాస్తా చేతిలోనో చివాట్లుతిన్న క్రోధంతో వచ్చాడా, సాక్షిని కసిరికొడ్తో ప్రమాణాన్ని క్రోధగర్భపూరితం చేస్తాడు. మేజస్ట్రేటుగారి ఆగ్రహానికి గురిఅయి వచ్చాడా, ఆ హృద్వేగంలో ప్రమాణం శోకరసప్రధాన మవుతుంది. కాక పండుగరోజులైయుండి యీ సాక్షివద్దనుంచి, అతడు బోను దిగాకా, గేటావతల మామూలు పుచ్చుకోదలచుకొన్నాడా, ప్రమాణం కరుణారసపూరితంగాను ప్రాధేయపూర్వకంగాను తయారవుతుంది. అసలు మనం కాస్త ఓపికపడ్తే, కాస్సేపట్లో, సాక్షే వప్పుకుంటాడు తాను ప్రమాణంచేసి చెప్పిందంతా సర్వాబద్ధమని. 'అబ్బే యిక్కడమాటెందుకండీ, యిప్పుడు గోడావతల అనుకున్నామో లేదో అడగండి మీపార్టీని' అంటాడు. అంటే కోర్టులో ప్రమాణంమీద చెప్పినవన్నీ దొంగమాటలని శుభ్రంగా, కోర్టువారికి పార్టీలకు సాక్షులకు తెలిసిన Presumption ఏనాడో లా లోనే ఖచితమైయున్నట్టు.

సాక్షి వెంకయ్యకు యీ వ్యవహారమంతా అయోమయంగా ఉంది. పోతుతో యింటికిపోతూన్న తన అవుసరం యిక్కడ ఏంవచ్చిందో అను చిక్కక, ఆ వ్యాకులతలో, ఏమి అడిగితే దానికే తలఊపే 'Resigned manner'లో యున్నాడు. "He was reduced to the

requisite ebb of nervous perplexity". తాను నిలబడ్డది సాక్ష్య స్థానమో నేరస్థానమో కూడా ఎఱుగడాయిరి. వీడిని ఉతికితీసినా దోషం లేదనేటట్లి డబ్బుచిక్కున ఒక్కటే తప్పితే, యింకేలక్షణంలేని జడం. శుద్ధ నిర్గుణబ్రహ్మం. అహంకార మమకారాలకు అతీతుడు. ఓదావా చేయలేడు, చేయించుకోలేదు. 58 వత్సరాలవాడు ప్రథమభార్యయుండగా 12 ఏళ్ళ బాలను రెండో పెళ్ళి చేసుకొని ఆ లేతదవ్వ కంఠం కోశాడంటే స్త్రీలోలుడై కాదు. హరహరా! అడబాధ కానేకాదు కారణం. ప్రథమ భార్య పిల్లలను పెట్టలేకపోయినందున తనకున్న రెండుకుంచాల అడ్డెడు మహామహీ రాజ్యానికి Prince of Wales లేక తదైశ్వర్యం యావత్తూ క్షణంలో జ్ఞాతిహస్తగతమవుతుందేమోననే మనఃక్లేశం అంతే. వాడిని అనుకున్నవాళ్ళది దోషం. మేజస్ట్రేటుగారు నాల్గు లీడింగు క్వశ్చెన్సువేస్తే చిత్తంచిత్తం అన్నాడు రెండింటికి, తలఊపాడు ఓదానికి, పోతువంక చూచుకొంటో సమాధానంలేకుండా ఊరుకున్నాడు ఓదానికి అపోతుకు పెట్టిన 30, 40 రూపాయలలోను ఒక్క అణా దండగపడ్డాడంటే ఏడ్చి పోవడం ఒక్కటే ఎరుగును కాని, వీడికేం సంస్కృతి కావాలా, రాజకీయం కావాలా, కమ్యూనిజము దేశాన్ని ముంచెత్తేసిందంటే వాలిపోతాడా, యిండియా రిపబ్లిక్ అయిందంటే ఎగిరిపడకలదుకొన్నాడా, వీడికి కావలసిందల్లా తన 2 కుంచాల అడ్డెడుకూ పరిపాల నాదక్షుడైన ఒక పుత్రరత్నం. గేదెబేరంలో తాను అణా నష్టపోలేదనే ధైర్యం. పల్లెటూళ్ళంట నూటికి 70, 80 గా యున్న యీ నాచువంక చూడక యిక పల్లెటూళ్ళ నుంచి పట్నాలకువచ్చి బార్బరు సెలూనులో జుట్టు కత్తిరింపు వేయించుకువెళ్ళే యిద్దరి ఏర్భాయీలను, సినిమా రెండాటలూ చూచి పాడ్యే cressid's kind యిద్దరి అమ్మాయిలను 'సెన్సు' తీసుకొని వారిని అభ్యుదయ కాములంటో వాళ్ళెరగని పేర్లు వాళ్ళకుపెట్టి అభ్యుదయమన్న పదానికి విపరీతార్థం తెచ్చిపెట్టి ప్రజాస్వామ్య పత్రికలు తయారు చేయడం హాస్యాస్పదం. వయోజన విద్యావగాహనసొంటు లేకుండా ముందేచేసుకు కూర్చున్న అడల్టు ఫ్రాంచైజు నిర్ణయానికి బుద్ధిమంతులకు

రక్తవాంతులు కల్గుతున్నాయి. గుండెలు గుభిల్లుమంటున్నాయి తలచుకుంటే. ఏమి ఉత్పాతాలు పుట్టనైయున్నాయో! ఆబురొల్లో దీపారధన చేయండి చేతనైతే. అందుకియ్యండి ప్రణాళికలు. పార్టీల్లో చేరమని టికెట్టుకోయడం కాదు పనివాడితనం. ప్రజలకుత్తమసంస్కృతి. విజ్ఞాన శాస్త్రతృష్ణ అలవర్చేవిద్యావిధానప్రసక్తి ఎక్కడా వినిపించదూ. ఎలక్షన్స్ మాటలే వినిపిస్తాయి! ఎవడికొంప తవ్వడానికి ఎవనిపొట్టనింపడానికి యీతతంగమంతా? మోసం !, ద్రోహం.

♦ ♦ ♦

## కంగేళీవకీలు

మేజస్ట్రేటువారు వ్రాసుకొన్న వాంగ్మూలరీత్యా, తాడి బడిస్థలంలోదే నని చెప్పినవాడయ్యాడు వెంకయ్య. నిజానికి ఆతడి వాంగ్మూలం బుర్రఊపే కాని, ఏమాత్రం బుద్ధిప్రయోగం కాకపోయినా. ఏమైతేం, మెట్టుమాట మేజస్ట్రేటుగారికి అవసరం గడిపాడు. నిద్రలో చరిస్తే, ఉలిక్కిపడి లేచి తొలివాక్యం, తాడి బడిలోదే అని యిన్నాళ్ళంటరీగా అనేసే టంత గాయత్రీమంత్రపఠన చేసిన పూజారి పఠాలం వేళకు సంశప్తకులతో పోరుతో కుముదవల్లి విప్రరురోడ్డు మొగను నిలవరింపబడగా, ఋణానుబంధమన్న దిదేగాబోలు అన్నట్టు, జన్మలో పరిచయభాగ్యం కల్గియుండని వెంకయ్య అయాచితంగా హెడ్మాస్టరుగార్కి ఉపచరించి ఊరుకున్నాడు. తాడి బడిలోదే అని వెంకయ్య వాంగ్మూలంలో యున్నందున, వెంకయ్య కేడీపార్టీ వకీలుకు అగ్గిముట్టించినవాడయ్యాడు. ఆయనకు ఒళ్ళు భగ్గుమంది, లేచాడు. వెర్రివెంకయ్య నెంతసేపు బోల్తాకొట్టించడమన్నట్టు భూరిపరాక్రమ గర్వసంపదతో వెంకయ్యవంక కేడీవకీలు చూచేసరికి వెంకయ్య వితాకుచెందాడు. వెంకయ్య ముఖంలో వ్యాకులత, భయం కన్పించినకొద్దీ ఆనిష్పత్తిలోనే వకీలు విజృంభిస్తోన్నాడు. ఈబాపతువారీ వకీళ్ళను చూచేకాబోలు ఏకంగా వకీలువర్గాన్నే అవ

హేళన చేస్తోంటారు కొందరు అపరిచయులు, అహితులున్నూ. వాడి కలబడితే, కోర్టులో వకీలు cross examination లో కాస్తమ్రుమని పించాడు కాబోలు, నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుడైన ఆసూతుడే తెలిసాడన్నట్టు, వాళ్ళవూళ్ళో రావిచెట్టుక్రింద కూర్చుని, కోర్టుల యితిహాసం రైతాంగానికి వినిపిస్తో అంటాడు "నాకు తెలియందికాదు యీ అయ్యల అందం. సాక్షిది వేడితత్వమైతే, అట్టే మీదమీదకు రారు, ముట్టుకుంటే తమచెయ్యి కాల్తుందని. వాడు వాతంముద్ద అయాడేం, యిక ఎగబడ్తారు నూరాపనూరులు. పట్ట పగ్గాలుండవు. వెక్కిరింతలే కావు, వేళాకోళాలే కావు, ఓః ఒక్కఖరసని, పదివేలోసి, పెళ్ళాం పుస్తె అమ్ముకొని, పట్నన్నుంచి గడించుకొచ్చిన పాండిత్యం అంతా ఆవాతంముద్దమీద గుమ్మరిస్తారు. జగద్వీరులం అంటో బారుజాములో టపాలుకొడ్తో కూర్చుంటారు. అక్కడ కొద్దోగొప్పో, రకంఅంతా యిదే కాబట్టి ఒకరి వీరగాథలను ఒకరు, మధ్యమధ్య వీలువెంబడిని తమ వాటిని జ్ఞానుపుతో, అడ్డంతగలకుండా వినడం, మర్యాద కట్టుబాటు, సాంప్రదాయమున్ను. మాప్లీడరేదో లెక్క నాలుగు మాటలడిగాడు. ఖరాగాచెప్పి నుంచున్నాను. ఇఖ అళ్ళరభా అంటో లేచాడు ఎదరాయన. నన్ను కడిగేస్తాడట. కడిగెయ్యడానికి ఆయనకు బిందా, చెంబా ఏముందని. వీరయ్యదగ్గర సాగుతాయా యీవేషాలు, సంగీతానికి చింతకాయలు రాల్తాయా" యీప్రగల్భాలుకొట్టే వీరయ్య సాక్ష్యం తగలేసిన వాడే అయియుండాలి. ఎక్కడ తగలేసాడోమాత్రం ఎరగడు. నీహార్లెకాలక్కేమి, నేరం కళ్ళతో చూచానన్నానుగా అన్న మొండిధైర్యం మీదే యున్నాడు, తగలేశా వని స్వంతప్లీడరు నోరు నెత్తి అప్పాడే బాదుకున్నా.

చూచారా, నూటికి కోటికి ఒకర్నో యిద్దరినో కుఱ్ఱతనపు కంగేళీలను చూచిన కళ్ళతో, వార్షికంగానే, వకీళ్ళపై నిరసనాభిప్రాయం వెలిబుచ్చాడు వీరయ్య. గట్టిచేతులను చూచినవాడెవడూ, యీలాంటి చేసబబు, బాధ్యతారహిత పరిసంగం చేయడు. అనుభవశాలి, సిద్ధహ

స్తుడు అయిన క్రాసు యగ్జామినరు ఉగ్రాగ్రహిత చర్యలకు సందీయడు. Histrionic effects కొరకు కలియదొక్కుకోడు. గేటుఅడియన్సు గొడవే యుండదు అతడి మనసులో. సాక్షి చెప్పేదూ గద్దించడు. అది కార్యభంగ కారణం కాగలదు కాని, కార్యసాధనకు తోడ్పడదని గ్రహించే యుంటాడు. అంచేత పైత్యించిన సాక్షినికూడా, ఎంతో ప్రశాంతంగా, 'చూడమ్మా చూడూ' అంటో ఆపేక్ష అంతా గుమ్మరిస్తో, చంటిబిడ్డతో మాట్లాడ్తోన్నట్టు పెదవులు రానిచ్చి, సాక్షిని చంక నేసుకోడం తర్వాయిగా, గారాబంగా పల్కరిస్తాడు. సాక్షికి కేవలం పేగుసంబంధం కలవాడిలా, కష్టసుఖాలకు అయేవాడిలా సాదరంగా, సాక్షిని 'వెంకయ్యా' అని పేరెట్టి పలకరిస్తోంటాడు ప్రతి రెండుమూడు నిమిషాలకు. ఉభయులు ఏదో యిష్టాగోష్ఠి మాట్లాడుకుంటున్నారనే చనువు మైకం సాక్షికి కమ్మడానికి, మధ్యమధ్య, మందరంలో, ''అయితే'' అన్న సామాన్య సంభాషణాయుక్తమైన పదాన్ని పడేస్తో, సాక్షినాడి చూచుకొంటో యుంటాడు యింత సేపూ - ఎప్పుడూ ఏమరచియుండడు. కొంత మచ్చిక కుదిరిన తర్వాత, తానే ఏదో అని 'చెప్పావుకాదూ?, అదా, అ! అలారా, వెంకయ్యా' అంటో, సాక్షి జన్మలో అనని సంగతికి, వడుపేసి, అతనిచేత 'మరే' అనే నిద్రమాట సుమారుగా అనిపిస్తాడు. ఆసుమారు సంగతి సాక్షికి కాస్త అలవాటయి, వంటబట్టి 'అని యుంటా'నని అనుకోడానికీ, మట్టి ఉండలా అది గట్టిపడడానికీ, తీరాచితికి పోకుండా, ఏమాత్రం కటువు తోపకుండా, బహులాఘవంగా నాలుకమీదకు జారుజారుగా రానిచ్చి రాసాడిస్తోంటాడు. సాక్షి, ఆ సంగతిని, తానన్నానన్న స్థితికొచ్చి, అన్నానా అన్నఅనుమానం ఓప్రక్కని మబ్బులా వస్తోన్నా, ప్లీడరు గారితో యింత స్నేహం తనకి కుదిరాక, అయన అనేది, తాను కాదనడం, మర్యాద కాదేమో అనే మొహమాటంలో పడిపోయి, ఎక్కడా అడ్డు తగలకుండా, మందహాసంచేస్తో, ప్రతి ప్రశ్నకు యిక అక్కడనుంచి 'చిత్తం' బజాయిస్తోంటాడు. ఈపాకానికి వచ్చేలోపల, సాక్షి ముఖం అద్దుతగిలేటట్టు కన్పిస్తే 'పోనీలే, పోనీలే' అంటో కిల్లిఅడు

గులమీద దూరంగాబోయి, మరొకొత్త ప్రసక్తితెచ్చి, సాక్షి దృష్టి మార్చేసి, ఆ పరాధ్యాన్నంలో సాక్షి ఉన్నపుడు, తొల్లిటిసంగతిని తెచ్చి 'చిత్తం' అనిపించుకుంటాడు. ఇంత అష్టకష్టాలూపడతాడు. సాక్షితో మిత్రత్వంవల్ల కలిగే సత్ఫలితాలు, శత్రుత్వంవల్ల ఎప్పుడూ కల్గవు. కాబట్టి క్రాసుపరీక్ష పనివాడితనం కాని ప్రజలనుకొనే అల్లరి భాగోతం, కజ్జా కాదు. అల్లరి భాగోతాలు ఎప్పుడూ, ఎవరికీ కల్సిరాలేదు. ప్రతి సాక్షికీ యిదే వైద్యం అనిగాని, ప్రతివకీలుకు యిదే విధానమని కాని కాదుస్మండీ; తత్వభేధాలను పట్టి మందు మారుతుంది. ఒక వకీలుతాతగారి విధానం మనవిచేస్తా. కుర్రకారు కళ్ళకీ విధానం బ్రిలియంటుగా కన్పించక పోయినా, ఓరోజుల్లో యిది మంచిఫలితాల నిచ్చేదని మనవిచేస్తా. మొత్తం మీదమాట సాక్షి విహితంతో వశమైనట్టు వైరంతో కాదని నామతం.

సాక్షి వెంకయ్య యొక్క మనస్తత్వ విమర్శన వ్యాసంగంలో మునిగినమూలాన తెగిపోయిన కథాక్రమం కొస వెతుక్కొని, చోరీ అభియోగవృత్తాంతం పూర్తిచేస్తున్నా. వెంకయ్యను క్రాసుచేసి, ఆతనిచే స్వవచన వ్యాఘాతాలకు దారిపట్టించి, ఆతడి సాక్ష్యాన్ని చీరి ఎండేయ సమకట్టి, దిగ్గునలేచాడు ప్రతివాది భయంకరుడు కేడీ ప్లీడరుగారు Spring work పొడుండబ్బీ Special make ఒకటి చే సంధించి. తాడిమాట పల్లెత్తు నోరెత్తిన ఉత్తరసాక్షినల్లా చిత్తుచేసేయాలని పది పదిహేను రోజులనుంచి తయార్ తింటోన్నాడు. ఏమైతేం, కోర్టులో చెట్టుకొట్టినట్లు ఒప్పుకలవచ్చిన కేసుకు అప్రస్తుతమైపోయింది క్రాసు పరీక్షాగ్రంథం. సాక్షి తన పోతును హృదయపీఠిని గట్టిగా కట్టుకొని వకీలుమాటలు వినలేదు. ఒక్క అరగంట కాలం, వియద్గంగా ఝరీ వేగంతో వెనకా ముందూ చూచుకోకుండా. తాడిచెట్టును కూకటి వేళ్ళతో పెల్లగించి ఎప్పుడుచేసాడు యింత పరిశోధనఅన్నట్టే ఉండె ఏప్రశ్న కాప్రశ్న. తాడిజాతిలోయున్న స్త్రీపురుష భేదాలను విశదీకరించి తన జూనియర్లను తన్మయుల చేశాడు. టెంకజాతి చెట్లకు, గింజజాతి మొక్కలుకు యున్న ముఖ్యవైవిధ్యం ప్రకటించి ప్రశంసా

పాత్రుడయ్యాడు బారులో. 'ఇవైనా తెలియనివాడు, ఏమని, తగుదునమ్మా అంటూ బోను ఎక్కాడు వెంకయ్యా' అని, వెంకయ్య తలవాచేలా చివాట్లు తినేటట్టి ప్రశ్నలు, అవోవేయి, శరపరంపరలుగా పడ్డాయి, పది నిమిషాలపాటు. చూడరాదూ? వెంకయ్య వయస్సూ, వెంకయ్య మామ్మ వయస్సూ, తాడి వయస్సూ, వెంకయ్య వివరించగలడా! ఈతాడి పైకి పొటకరించి, తణుకు పురవాసులను ఆనందాబ్ధిని ముంచిన దాని జనన శుభదినాన, అక్కడ మూగిన జనంలో వెంకయ్యనాబడే యీవ్యక్తి యున్నాడా, ఉంటే ఎందుకున్నాడు? ఆరోజున గ్రామంలో జరిగిన ఉత్సవకార్యాలనుకాని పుట్టిన ఉత్పాతాలనుకాని సుమారుగానైనా చెప్పగలడా వెంకయ్య. పోనీ యీతాడి ముంజెనుకాని, పండునుకాని వెంకయ్య ఏనాడైనా భక్షించాడా! అధమం తింటోన్నవాళ్ళనైనా చూచినపాపాన్ని పోయాడా? చూసియుంటే ఆతేదీ యా సంవత్సరం నోరు మెదపడేమి' అని ప్లీడరుగారి జూనియర్లు వెంకయ్యవంక చురచురా చూచే ఆఘడియల్లో, వెంకయ్య పోతుగొడవ నుండకపోతే, బోనులో వాడికి నీళ్ళు పట్టించవలసిన ఘట్టం అది. అవసరావసరాలను గుర్తించని కోర్టుగుమ్మం లోని శ్రోతలకు మధురాతిమధురమైనవి, అమాయకసాక్షుల ప్రాణానికి ఘోరాతిఘోరమైనవి, దీశక్తిగల్గిన న్యాయాధిపతుల దృష్టిలో శుద్ధ అవహేళనాపాత్రమైనవి. యీలాటి ప్రశ్నలు ధారాపాతంగా వర్షిస్తోంటే, ఎంత జడివానకైనా జంకకుండా, నిశ్చలంగా నెమరేస్తో నుంచునే తన పోతులాగే, వెంకయ్య సంతబేరాన్ని జ్ఞాపకంచేసుకొంటో పొట్లపువ్వులాంటి నిర్మల నయనాలతో, మౌనముద్రాధారుడై పోతును చూచుకొంటో అగొడవనున్నాడు. అంచేత ఎదటనుంచి సమాధానం లేని కారణంగా ప్లీడరుగారి అరగంట క్రాసుపరీక్షా ఒక సుదీర్ఘమైన, సమగ్ర సుందరమైన సొలిలోక్వీ అయి ఊరుకొంది.

ఇదీ, యీకేసు విచారణ, విశిష్టపరిణామం. పగలు ఒంటిగంట కావస్తోంది. రెండుగంటలకు ఏలూరు బయల్దేరేలోపల కేసు కొట్టేసి, తీర్పు తనకు చూపెట్టుమని కలెక్టరుగారి శాసనం. అదే తిరుగుతోంది

మేజస్ట్రీటుగారి బుర్రలో. ఒంటిగంట కొట్టింది. గుండెల్లో రామఢోళ్ళు కొడ్తోన్నాయి ఆయనకు. అంచేత వంచినతలెత్తకుండా, ప్లీడరు ప్రశ్నలు గుప్పుతోన్నంతసేపూ జడ్జిమెంటు వ్రాసుకొంటోన్నాడు. ప్లీడరుగారా, ఎన్నెంటి ప్రశ్నలేస్తున్నానురా అనే ఆనందమే కాని, సాక్షి సమాధానం యీయడం, మేజస్ట్రీటుగారు వాటిని వ్రాయడం, యీగొడవే పెట్టుకున్నట్టు కన్పించడంలేదు. సాక్షి వెంకయ్యో, పోతును నిజహృదయం లోనే కట్టేసుకొని లాభసాటి బేరమని పలుపుతో, ప్రపంచమే మరచాడు. కొన్ని కేసులకిట్టి పరిష్కారాలు లభిస్తోంటాయి కాబోలు కోర్టులలో.

♦ ♦ ♦

## మహిషాసురమర్దనం

మరో ఉత్పాతం పుట్టిందీ ప్రస్తుతపు కేసుకు. సంపూర్తి అయిందిసుమండీ తీర్పు వ్రాయడం, తీర్పు చెప్పడం. తీరుపు చెప్పినట్టు కలెక్టరుగారితో చెప్పడానికి బండెక్కడం తర్వాయి మేజస్ట్రీటుగారు. అయ్యా మాపిటి బేరాన్నే ఉన్నాడన్నట్టు ప్లీడరుగారు అప్పుడు మేజస్ట్రీటుగారివంక తిరిగి 'మీరీలా ఉపేక్షించడం, న్యాయం కాదు. అరగంటనుంచి నేను అలమటుగుతోంటే యిప్పటికి ఒక్క ప్రశ్నకింకా సాక్షివద్దనుంచి సమాధానం రాలేదు. మీరు మందలించాలి. అది కోర్టు కనీసపు కర్తవ్యం' అంటో ముఖం యర్రచేసుకొని మొర్రపెట్టాడు. ప్లీడరుగారిమాట వినిపించకుండా, గుండెలు బాదుకొంటో 'పోతు ఏదండీ, కన్పించడం లేదండోయి, పారిపోయింది బాబోయి' అని లబోలబోమంటో బోనులోనుంచి నేరుగా వీధిలోకి పరుగెత్తాడు వెంకయ్య. ఈ వెంకయ్యను తన్నుకుంటో ఎదర వచ్చి 'తాడిబాదును పోతు కాల్వచూరుకు యీడ్చుకుపోతోంది ఆగటం లేదు కుమ్మేస్తోంది' అంటో గుండెలు కముక్కుంటో మేజస్ట్రీటుగారి కాళ్ళల్లోపడ్డాడు కోర్టు ప్యూన్ రామన్న. ''అయ్యో అయ్యో MO యిప్పుడూ పోకూడదయ్యా హెడ్డుగుమాస్తాగారు. అది ముద్దాయికి వప్ప

గించాలయ్యా ఏం ఖర్మంవచ్చిందయ్యా యీకేసు మన ప్రాణానికి, పరుగెత్తవయ్యా'' అంటూనే కేసు కొట్టేసానని వీధిలోనుంచి ఓ పొలి బొబ్బపెట్టి, బండిలోపడ్డాడు మేజిస్ట్రేటుగారు. ఈ హంగామాలో ఎవరి మాటైనా. ఎవరికైనా వినిపించిందోలేదో కాని, కోర్టుసిబ్బందీ యావన్మంది 'పట్టుకోండి అంటే పట్టుకోండి' అంటూ వీధినిపడ్డారు. రామన్న మాత్రం, 'యిక అరుమాసాలికి నాకు పెన్షనురోజులు, పిల్లలుకలవాణ్ణి అది కుమ్మి చంపేస్తుంది దరిమానా పడితే'నని రెండడుగులేసి ఆగిపోయాడు. 'అంటే మేంచచ్చిపోయినా తంటాలేదనేనా నీ అభిప్రాయం' అంటూ రామన్నతో వాదంవేసుకొని నిలబడిపోయాడు హెడ్డుగుమాస్తాగారు. వీరి ఉభయుల తగాయిదా పర్యవసానం చూతామని ఆగిపోయారు మిగతా గుమాస్తాలు. వాళ్ళకు యిది ''మామూలు'' చేతులాపడే పనే అయితే ఓరికన్న ఒకరు పంతాలమీద పరుగులెట్టవలసినవాళ్ళు పాపం.

ఎవరు వదిల్తేమాత్రం, వెంకయ్య వదలగలడా పోతును. పోతుకు వెంకయ్యప్రాణానికి లంకాయిరి. మూడుపదులు ముప్పైరూపాయిలు దాకలోసివి బొడ్డునకట్టుకొచ్చి దళారీచేతులో పెట్టి మెడకుచుట్టుకున్న దీపోతు. పశువుల సంతప్రక్కనున్న బుక్కా దుర్గమ్మ దుకాణంలో, ఏడణాలకు ఒకగంటకాలం బేరంచేసి, పువ్వులతో పొదివిన వినూత్న కావివర్ణ కేశమాలనొండు పుచ్చుకొని, స్వహస్తాలతో దాని మెడకు కట్టి, తా ననురాగబంధుడైనాడు. అంచేత 'పాయె, పాయె, ధే, ధే' అంటూ బొబ్బలుపెడ్తూ వెనక వెంకయ్యా, ముందు ప్రభంజనధ్యేయజవంతో, నిజవేగదర్ప ప్రశంసాప్రవచనోపన్యాసాలు ప్రేక్షకపాంధులనోట విన్నకొద్దీ [illegible]రవడిస్తూ, జన్మస్థానాగమన కౌతూహలాధీనమానసుడై, రాపాక గ్రామాభిముఖుడై, మధ్యమధ్య మార్మోత పిక్కటిల్ల ఖణిల్లని అంకవేస్తూ, తద్భీషణఘోషణము విన్నవారలు యిరుపార్శ్వముల వెఱుగుచే రాపడి నిల్వ, మిట్టుపల్లములు సరకుగొనక, ఊక్కుముక్కలాంటి అచేవతాటిని సుసాయాసంగా, . నిరాఘాటంగా యీడ్చుకుపోతూయున్న దృఢకాయుడు, రక్తాంతలోచనుడు, మహిషాసురుడు ముందూ, పరుగున

నున్నారు. కాల్వగట్టంటనున్న జనం ఎక్కడవాళ్ళక్కడ స్వప్రాణ రక్షణార్థం, పికాపికలై, కాఱెనుపోతు కాళ్ళలోపడి పచ్చడికాకుండా, కొమ్మువాతపడి ముక్కలుకాకుండా ఎటు వీలుచిక్కితే అటు పరుగిడుతున్నారు. మహిషాసుర వీరగాథ వీనులసోకి, వింత చూడవచ్చే సంత జనం తృటిలో పెరుక్కుపోయి కాల్వరెండుగట్లూ తీర్థప్రజ అయినారు. 'మహిషాసురుని నిల్వరింపజాలు మోటుమానిసి పెనుగొండలో లేడా!' అని హాహారావములు మిన్నుముట్టినవి. అవును లేడు. వీడి పూర్వచరితం భీతి గొల్పెడే. 'త్రాగినవాని కన్నులవిధంబున నేత్రము లెఱ్ఱవాఱ, భూభాగము దద్దరిల్ల, వీడు కాలు నేలరాచి, మోరఎత్తి వాలమున్నిగిడ్చిన రాపాక ప్రాంతాల ధేను మహిషీసంతతులు బెదరి చెదిరేవట. చుట్టుప్రక్కల పది మైళ్ళలో ఎక్కడెక్కడున్న నిల్వెత్తు గఱిగడ్డిబీళ్ళలోను, నిశీథసమయాల్లో చొఱబడి, కాలవర్ణకాయుడగుటంచేసి, పొలము కాపుల కనుబ్రామి, బీళ్ళకు బీళ్ళు పొట్టబెట్టుకొని సూర్యోదయాత్పూర్వం యిలుచేరే వివేకి. వీడి నిశాచర కృత్యాలవల్ల, ఆయాగ్రామాల పశుసంపద చేవకుదక్కి, దైన్యంచెంది కృశించుచు బెగ్గడిలుచుండిరి. రైతాంగం యీపరదేశిని వడుపేసి పట్టప్రయత్నించి విఫలులైనారు. అన్యవిత్తవితానముల కొఱికి, పోతరించి, పగలే పొలాలపైకెగబడ మొదలిడి, వీని 'శృంగముల పోటులు నాటియు నెవ్వడేనియుం బ్రాణములం ద్యజింపడే' అనేటట్టి భయంకరాకారుడైనాడు పోతురాయుడు. బాల్యంలోనే యజమానిపట్ల వినయం మృగ్యమేమో. కృష్యాది కార్యాల్లో విముఖుడై, స్వచ్ఛందజీవియై విఱుచుకొని ఊళ్ళమీదపడ్డాడు. పెరవలి గ్రామవాసులు కొట్టుముట్టాడి ఎట్టెటో వీనిని బందెలబెట్టి, నీరసగొట్టి, విరగడ చేసుకొనుటకు పెనుగొండ సంతకుతోలారు. సంతబళ్ళ కసవుతిని తేఱుకొని రెండుపూటల్లో చియ్యబట్టాడు. శెట్రి వెంకయ్య లాభసాటిబేరమని, మోసపోయి, వరించాడు. అనుభవిస్తోన్నాడు, వీనిని మెడకుకట్టుకొని. వీడి జననవృత్తాంతం, అదోవిపరీతగాథ: అంటుకొన్న యింటివసారాలో పుట్టాడట. బడబానలంలో తల్లి మ్రగ్గింది. కాని, వీడు వీధికి ఉడా.

యించ గల్గాడట. కథా కాలంనాటికి తరుణవయస్కుడైనాడు. పిడికెడి రొమ్ముతో నడుగువేసిన గుఱ్ఱడి కండపుష్టితో కడుంగడు బెడగైనవాడై, యమమహిషు కొండలపాలుచేసే దార్ఢ్యం. ప్రాణాలపై తీపిలేకున్నవారెవరు ఎదరపడలేకున్నారు, యీమర్త్య విరోధికి.

మహోగ్రప్రక్రియాధుర్య దామహిషు నిలవరింపగల మొగాడు లేకపోయినా, పెనుగొండ వాస్తవ్యులకు నూకలున్నాయి కాబోలు, కేవలం ఆమహిషాసురమర్దనియే సాక్షాత్కరించిందా అన్నట్లు, రోకళ్ళూ, తిరగళ్ళూ యిత్యాది గృహపరికరాలు అమ్ముకొనేది, వాళ్ళకు అప్పులకు కక్కులుకొట్టేది ఎరకయో అడవిచెంచో ఒకశక్తిస్వరూపిణి వాడిదారి కడ్డం తగిలి, వాడిగుండెలు గుభిల్లుమన ఒక్కబొబ్బపెట్టి నిలవరించి కాల్వలోకి తరిమింది. తాడిబాదు కోర్టుకు దక్కింది. పోతు వెంకయ్యకు దక్కింది. పెనుగొండవాళ్ళకు ప్రాణం దక్కింది. ఆ స్త్రీకి మాటదక్కింది. మనకు మహిషాసురమర్దనదృశ్యం దక్కింది.

♦ ♦ ♦

## కుముదవల్లి కురుక్షేత్ర హతశేషులు

అంతా అయినతర్వాత, యిప్పుడొచ్చారెందుకో వేళకులేని బాకాలూ, హెడ్మాష్టరుగారి ఉత్తరసాక్ష్య బలగమూ, దానికి శాస్త్ర ఠానుక కేడీపతాలమున్నూ! తలలకు వాసినలుచుట్టీ, కాళ్ళకూ చేతులకూ, కట్లుకట్టీ, రక్తసిక్తపుగుడ్డలతో వచ్చారేమిఖర్మం! అవునండోయి, Inspector కోర్టులోనుంచి పయిగత్తాడుగా! విప్పర్రు – కుముదవల్లి కదనరంగ హతశేషులు కాబోలు వీరు. అయితే, యీ కేడీ పూజారి వీరులేనా అక్కడ కొట్టుకున్నది? లేకపోతే పనిచెడి కొట్టుకొనే వాళ్ళెవరుంటారులెండి. మరి జట్కాలేవి, కాలినడకనొచ్చారు? యుద్ధభూమిలో విరథులయ్యారా? అవునట. ఎంతోకక్షగా వాళ్ళే చెప్పుకుంటున్నారు ఒకరుచేసిన అన్యాయం ఒకరు, మధ్యన యిక్కడ వినేపెద్దమనిషి జబ్బులు

విరిగేట్లా లాగుతోనూ, అంతలోనే 'నువ్వే చెప్పు అంటే నువ్వే చెప్పు' అంటూ ఎగపడ్తోనున్నా. అదేం కోపమండీ, కేడీది మరీ చిత్రంగా ఉంది. ఎదరచెప్తోన్న పూజారి పొడుగునా బొటనవ్రేళ్ళమీద లేచాడూ; ఒళ్ళంతా ఏకకడ్డీగా సాగకొట్టినట్టు పూజారి మెడకంటా సాగాడూ; వాడి ముఖంమీద ముఖంపెట్టి, వాడి బుజాలమీదనుంచి గాలిలోకి ఊచ పోనిచ్చినట్టు చెయ్యిపోనిచ్చాడూ; ఇంతప్రళయంచేసి ఏదో అందరికీ నచ్చేమాట అంటాడనుకున్నానుస్మండీ. 'మరే' అని ఉద్రేకంతో ఆఒక్కమాటా అంటూ యికిలించి, యిక అక్కడ ఆగకుండా చట్టున వచ్చేసి, ఇ తల పిట్టఅరుగుమీద తన రెండుచేతుల్లోనూ పెట్టుకొని కూర్చుని ఊరుకుంటాడూ? ఏంచెప్పినట్టు, ఏం చేసినట్టు మరి పూజారి మాత్రం? పిట్టఅరుగుమీద కూర్చున్న కేడీవద్దకు యీ రెలావచ్చి అన్నది విన్నారా. 'మర్రే' ట, ఆమరేకే మరో రేఫంచేర్చి ఎప్పటిచోటకువెళ్ళి నుంచున్నాడు. ఆకేడీకి వీడి 'మర్రే' కన్న పరాభవ ముండదు. దాంతో సిగ్గుపడి చచ్చితీరాలి అనా వీడి అభిప్రాయం?

వాద ప్రతివాదాల్లో Law of deminishing returns పని చేస్తుందికాబోలు వెళ్ళినకొద్దీ. ఒకహద్దు దాటినతర్వాత మాటకారితనం సన్నగిలడం కద్దు. వాదోపవాదాల స్థాయి వెనకపట్టుంది. వాదాలు కైబాయ్ రూపం తాలుస్తాయి. ఒకరు ఎత్తిన ముఖ్యపదాన్నికాని భావాన్ని కాని రెండవవారు మార్చగల్గినమాత్రం మనస్తిమితమైనా, సావకాశమైనాలేని వాగ్వ్యగావేశాల్లో కొట్టుకుపోతారు. అప్పుడు, ఒకరు మరే అంటే రెండవవారు మర్రే అంటారు. ఒకరు చెప్పావులే అంటే రెండవ వారు ఎంతోప్రయత్నంమీద 'సెప్పావులేతూ' అంటారు. మార్పల్లా 'చె' వర్ణస్థానంలో 'సె' వర్ణం వేయడంవల్ల కల్గే యీసడింపు. అంతలో చూస్తుంటే ఉభయులకూ అమాత్రంగానూ నాలుకలు తిరగడం మానేస్తాయి. వాదం ఆఖరక్షణకొచ్చినప్పుడే, నాలుకలు ఆగిపోయి, చేతులు ఎగరడం ప్రారంభిస్తాయి. అటువంటప్పుడే మధ్యనున్నవాడికి ఎవరిచేతులను వారికి తప్పచెప్పవలసిన బాధ్యత కల్గతోంటుంది. ఎందుకైనా మంచిదని

ఒకరిని తూర్పుముఖంగాను ఒకరిని పడమర ముఖంగాను త్రిప్పిమరీయిళ్ళకు పంపే బుద్ధిమంతులూ ఉంటారు. తత్ప్రియత్నంలో చచ్చీచెబ్బలుతిన్న మధ్యవర్తి ఒకడు ఆప్రతిపక్షు లుభయులమీదా తన్ను కొట్టినందుకు కేసు పెడ్తే యీదెబ్బలు Transferred malice వల్ల కల్గాయికాని నిఖార సైన Malice వల్ల కాదని కేసుకొట్టేస్తారు. దాంతో మధ్యవర్తిత్వాలు మానుకున్నారు. ఆకోర్టు Jurisdiction లో శుభ్రంగా కొట్టుకు చచ్చి పోనిస్తున్నారు. వ్యవహారం యింతశృతిమించినతర్వాత వీళ్ళనడిగిన లాభం లేదు. పల్కరించే స్థితిలో లేరని వీళ్ళల్లో కాస్తసాధుగా కన్పిస్తోన్న వాణ్ని ఒకణ్ని ప్రక్కకుతీసి అడిగితే పాపం, వాడుచెప్పాడు వాడి కడుపుచల్లగా. యుద్ధభూమిలో ముందు కేడీలు పూజార్ల తేరులను విరిచారట, రథాల్ని కూల్చారట. కేతనాలను కాల రాచారట. ఇక పూజార్లకు చేత యింది కేడీల బళ్ళగుర్రాలనువిప్పి చేలమీదకు తోలేసారట, మళ్ళీ కంట పడకుండా. అసలు విప్రగుదగ్గర ఎందుకుకే స్నకు ఉభయులు ఎవరిదార్ని వారుపోక? కలవాలనే కల్నాయట వెనకనుంచి వచ్చిన కేడీలబళ్ళు ముందెళ్ళే పూజారిబళ్లని. హెడ్మాష్టరుగారికి ఉత్తరసాక్ష్యమన్నది లేకుండా ఆయన్ను నిస్సహాయుణ్ని చేసి, తద్వారా కోర్టుదుర్ఖ్యాతంలో కారాగృహశిక్ష వేయింప సమకట్టిన మాయావిపసుపున కేడీజెట్టు, పనికట్టుకొని పూజారి జెట్టుకు అడ్డంనిలచి మార్గావరోధం చేసాయట. తస్మాత్ కారణాత్ కుముదవిల్లి మొగ ఆనాడు కురుక్షేత్రం అయిందని చెప్పాడు.

## శాంతి — సౌమనస్యం

హెడ్మాష్టరుగారి విజయవార్త వినగానే, తమ శిరోఘాతలను విస్మరించి, విగతఖేదులై, బళ్లు కట్టించుకొని పూజార్లు నిమిషాలమీద తిణుకు వచ్చిపడ్డారు. పూజారిగణాచార్లు కొంతమంది అప్పుడే ఊరిమొగలోనున్న బాణా కాకీ సాహేబుకు అర్ఘరిచ్చి తర్వాతరోజున బాణసంచాతోటీ

గ్యాండువాయిద్యంతోటీ విజయోత్సవం చేసుకొంటూ వీధులంట ఊరేగా లని సన్నాహాలు చేసారు. వారిలోనే, బుద్ధిమంతులు, సమయాసమయ వేదులు కొందరుకూడి తొందరపడవద్దన్నారు. ఆదేమీ విరుద్ధప్రవర్తన అనికాని, శాంతిభంగ కారణం కాగలదని కాదుస్మండీ. ఉత్సవశోభకు కూర్చే కాలవ్యవధికోరి చేసిన నిర్ణయం. కూడా తాడిబాదును లేవతీసు కొని వెళ్ళని ఊరేగింపు అగ్రరహితం, కళావిహీనం కాగలదని, శిష్టా స్మృతి విధానరీత్యా నెల అయినా గడిస్తేనే కాని కోర్టువారు తాడిని హెడ్మాస్టరుగారికి వప్పజెప్పజాలరని, ఆతాడి గ్రామంలోకి వచ్చిన రోజున సంపూర్ణ శోభాయమానంగా దానికి పసుపు గంధంరాసి, కుంకం మెత్తి బంతి, చామంతి యిత్యాది పలురంగుల పూలమాలలువేసి, వివిధ వర్ణ వస్త్రాలంకృతమైన వీరభద్రోత్సవప్రభలా లేవదీసి, కాకతీయ శర న్నవరాత్రి ఆయుధపూజోత్సవం వైఖరినో, సాలిపేట వీరభద్రోత్సవం పోల్కనో, అధమం అమ్మవారి జాతరలానో, ఆరాత్రి నగరమందంతట వెలిగే దివ్వెల కాంతిలో, ఎక్కడికక్కడ దానిమీద కొబ్బరికాయలు కొడ్తూ, పార్టీ హెచ్చరికలుచేస్తూ, వీధివీధికీ, సందుసందుకూ దాన్ని ఊరేగిస్తూ భళ్ళున తెల్లార్చాలని, యీలోపల పొరుగూళ్ళంట యున్న పూజార్లకు ఆహ్వానాలు పంపించి, రప్పించి వార్ల సరదాకూడా తీర్చే బాధ్యత కేంద్రస్థానంలో యున్న పూజార్లకు ఉందనిన్నీ, బాగా ఆలో చించి చేసిన నిర్ణయం. ఈ సన్నాహాలు హెడ్మాస్టరుగారి చెవిని పడింది తర్వాయిగా వారు పిచ్చిపిచ్చి ప్రయత్నాలేవీ తలెత్తకుండా పూజారిముఖ్యులను వారించి అదుపాజ్ఞలలో పెట్టారు. విజయోత్సవమేజరిగితే ఆరాత్రి కొన్ని పూజారి బుర్రలు రామకీర్తన పాడతాయంటూ, ఉద్రిక్త కంఠంతో కేడీ శక్త్యోపాసకు డొకడు, తన పార్టీకి సంభవించిన అవమానాపజయాలకు సలసల క్రాగుతోంది కాబోలు రక్తం, వీధినిపడి, విషయం తెలియనివాళ్ళనుకూడా, విలేసి, సంఘుపేట చేస్తోన్నాడు.

దుష్ప్రచారాలు క్రక్కుతో ఉన్న యీ కారుపొగలు, దుష్ప్రవృత్తి [illegible] ఊరేగిస్తూయున్న యీ విషవాయువులు సూక్ష్మ వాతావరణాన్ని

కలుషితం చేసి, విద్యార్థిలోకాన్ని ఉక్కిరిబిక్కిరిచేసి ఊపిరాడకుండా చేసేస్తోఉంటే, నిర్మల విద్యార్థి హృదయాల్ని మాలిన్యంచేయకుండా ఉంచగల్గిన రక్షణోపాయం మంత్రమో, తంత్రమో, ఏదో ఒకటి ఎక్కడ దొరుకునా అని మాబోటి మాధ్యమికులం చింతిస్తోన్నాం. ఇంతలో మా స్కూలు అదృష్టంచేతను, దైవకృపవల్లను ఓ విచిత్ర సంఘటన తటస్థించింది. అది అనాలోచితంగా జరిగిన పనేగాని, అప్పట్లో దాని పరమార్థం మేం గ్రహించలేదు. ఏదో ఫక్తు వినోదమే అనుకున్నాం. కాని అందులోనూ కొంత పురుషప్రయత్నం ఉండకపోలేదు. మా విద్యార్థి నాటకసమాజపు కృష్ణపాత్రధారి కొంత నాటకం నడిపించకపోలేదు. దాంతో మాలాంటివాళ్ళంవాంఛిస్తోన్న శాంతివాతావరణం ఇట్టే ఏర్పడిపోయింది. కృతార్థులమైనాం అనుకున్నాం అందరమూను.

ఆ రోజుల్లోనే మా బడి పూర్వవిద్యార్థిసంఘంయొక్క వార్షికోత్సవం, స్కూలుడే జరుపవలసినరోజూ వచ్చాయి. ఆ కార్యనిర్వాహకసంఘంలో మా కృష్ణుడో సహాయ కార్యదర్శి. స్కూలులో ఉండే Excelsior club అనే లిటరరీ యుసోసియేషనుకు అతడు శెక్రటరీ అవడంచేత ఆపదవి అతడికి ప్రస్తుత విద్యార్థి అయినా, లభించింది. పూర్వవిద్యార్థి పండుగ జరపడానికి తగిన ఏర్పాట్లు చేయుటకు కూడిన సభలో, వినోదవిషయ ప్రస్తావనలో, ప్రస్తుత విద్యార్థులచే నాటకం ఒకటి వేయిస్తే బాగుంటుందని మా కృష్ణుడు సజెస్టు చేసాడు. ఆసభలోనే కేడీ ముఖ్యులలో ఒకరైన శ్రీ …యరుగారు, సరేనని షేక్స్పియరు రోమియో అండు జూలియట్టు వేయిద్దాం అన్నారు. అది మా హెడ్మాస్టరుగారికి ప్రియశిష్యులైన పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారు ఇంగ్లీషుకు చేసిన తెలుగుతర్జుమా. మా కృష్ణుని శక్తియుక్తులు మాకు దురవగాహములు. ఆ నాటకం ఆడడానికి అతడు అంగీకరించడంలో ఉండే కారణం అప్పట్లో మాకు బోధపడలేదు. అందులో, పాత్రల వైషమ్యాలు, వైపరీత్యాలు, వాటి ఫలితంగా కల్గిన వినోదాం, ఎంతో సుబోధకంగా చిత్రించబడిన సౌమనస్యం ప్రస్ఫుటమయ్యే అనుభవము పరిపక్వంగా విన్నయించాడు మా కృష్ణుడు.

ప్రదర్శనం ప్రస్తుత విద్యార్థులు నిర్వహింప నిర్ణయం అయిందికాబట్టి, కార్యనిర్వాహకవర్గం నాటకంకృషి యావత్తూ కృష్ణుడిమీద పెట్టారు. సహజంగా నాటకప్రదర్శనం నటకుల తయారీ టైముమీద ఆధారపడి ఉంటుందని సాకుపెట్టి, కృష్ణుడు, వార్షికోత్సవాన్ని మరో మూడురోజుల పైకి జరిపి తేదీ నిర్ణయంచేసాడు. నాటకం తయారీకి ఆ లెక్క మూడు రోజులు ఏమంత తేడా లేదనో అప్పట్లో మిగతావారికి అనుమానంగానే యున్నా, ప్రదర్శనబాధ్యత కృష్ణునిమీద ఉండడంచేత, ఆ తేదీ అందరికీ అంగీకారమే అయింది.

హెడ్మాస్టరుగారి అనుజ్ఞ పొందడానికి కృష్ణుడు సాయంత్రం హెడ్మాస్టరుగారి దర్శనం చేసినప్పటికే హెడ్మాస్టరుగారికి వార్షికోత్సవ కార్యక్రమవృత్తాంతం అంతా చేరింది. హెడ్మాస్టరుగారు ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలవ్యక్తి. మాకృష్ణుడు కన్పించింది తడవుగా తేదీ నిర్ణయం మీలో ఎవరుచేసారని హెడ్మాస్టరుగారు అడిగారు. కృష్ణుడు కించచ్చకితుడై తనేనని వప్పుకున్నాడు మా రామచంద్రంతో యిదివరకే యీ తేదీ విషయం నీవు ప్రసంగించావా అని హెడ్మాస్టరుగారడిగితే, అంగీకారసూచకంగా కృష్ణుడు తలవంచి, టేబిల్ మీద చేయి తెన్చినుంచున్నాడు. రామచంద్రం హెడ్మాస్టరుగారి అబ్బాయి. ప్రసంగించిన తేదీ హెడ్మాస్టరుగారి జన్మదినమైయుంది. ప్రేమప్లావితమైన కృష్ణుని హృదయాన్ని అతని సత్సంకల్పాన్ని హెడ్మాస్టరుగారు గ్రహించి, ఆనందాశ్రువులతో మాకృష్ణుని మోము తిలకించి, అతణ్ని దగ్గ గవుగిలించుకొని చిట్టిలెంపకాయవేస్తో మూర్ధము ముద్దుగొన్నారు. పరేంగితావగాహి మాకృష్ణుడా యదనులో, పరపక్షనాయక రచిత నాటకప్రదర్శనానికి హెడ్మాస్టరుగారి అనుమతిపొందాడు. అనుమతి యీయడమే కాకుండా, స్కూలుతరఫున చేయవలసిన సాయసంపత్తుల కంతకూ అధ్వర్యం కృష్ణునిమీదే యుంచారు. రెండవప్యూన్ సూరిగాడిని వార్షికోత్సవ సరంజాం చేయుటకు కృష్ణుని చెప్పుచేతల్లో ఉంచారు. తనతో చెప్పనక్కరలేకుండా కృష్ణుడు కోరిన బడిసామగ్రి యిస్తో

సౌకర్యాలుచేస్తో యుండవలసిందిగా క్లార్కుకు, లైబ్రేరియనుకు, డ్రిల్లు మాస్టర్లకు తాఖీదుపంపించారు. ఈరీతిగా, ఓల్డుబోయస్సుడే, స్కూలుడే సెలిబ్రేషన్లు, హెడ్మాస్టరుగారి జన్మదినవిజయోత్సవాలు కలిసిపోయి ఏలా చూచిన కళ్ళకు అలా కన్పించి ఊరుకున్నాయి.

ప్రతిభాశాలి ప్రజ్ఞాధురీణుడు, మాకృష్ణుడు చూపిన వైష్ణవమాయ కురోటి పేర్కొనవలసియుంది. పాత్రల పంపకంలో, కృష్ణుని అంతర్యం అను ఒక్కొక, అతడు చేసిన నటనిర్ణయానికి ఎడముఖాలు పెడముఖాలు పెట్టాం. మాబుద్ధిమంతులు ముక్కుమీద వేలేసుకున్నారు. గానమాధురీకిగాని, నటనాకౌశలానికిగాని, ఉచ్చారణ ప్రాశస్త్యానికిగాని మాలో పేరుమోసింది ఒక్కచెయ్యీ కన్పించదు కాస్టులో. మానాటకసమాజ ధర్మజ భీమార్జున నకుల నారద కౌసికుల నందరిని వదలేసి, కేవలం కొత్తమూకను వెతకివేస్తే ఖచ్చపడ్డాం. నటనిర్ణయంలో కృష్ణునికి ఎదురాడడం అసభ్యతగా పాటించే సాంప్రదాయం మాసమాజానిది. అంచేత కంఠాలదాకాయున్నా పడిఉన్నాం. కృష్ణుడు విద్యార్థుల్లోని పార్టీ ప్రధానులతో కాస్టునింపాడు. నాటకంలో రెండుపార్టీలొస్తాయి. స్కూల్లో రెండుపార్టీలున్నాయి. అలాంటపుడు విద్యార్థుల్లోని ఒక పార్టీరంగువాళ్ళు ప్రత్యేకంగా నాటకంలో వచ్చే ఒకపార్టీని నింపితే ప్రమాదకరంకూడాను. నాటకంలోని ఒకపార్టీఅంతా పూజార్లై, రెండోపార్టీఅంతా కేడీలై, వారు స్టేజీమీద ఎదురుపడడమేతటస్థిస్తే, నాటకమయ్యాక యిళ్ళకెళ్ళేవాళ్ళు నాటకానికి వచ్చినవాళ్ళల్లో నూటికి అయిదుకన్న ఉండరు. కృత్రిమపు కదనరంగం వాస్తవికమౌతుంది. 'నీవిప్పుడెత్తినయట్టి కాలు కటకుకరవ్వాలమున ద్రుంతురావో' అనే భూపాళగుమ్మరింపులతో నిమిత్తంఉండదు. ముందు ఆ కాలిని తెగనేసే మాట్లాడం, మాటలతో యింకా అవ్వసరమేయుంటే, గింటే సమరస్మాస్థలి నొక్కచేయి తెగియున్' అంటో రెండుచేతులూ పండులా శుభ్రంగా ఉన్నవాళ్ళు చెప్పేదొంగమాట లుండవు. ఉత్తమాంగమును ఖండన చేసెద' నంటో, ఎల్లుండి చాతామనుకొనే హత్యకు యిప్పుడేడప్పుకొట్టి

చివరకు ఏమీ లేకుండా బుస్సుమనిపించి ప్రేక్షకులను Disappoint చేసే నాటక బూటకాలుండవు. కవి వ్రాసిన నాటకం రక్తికట్టడ మటుంచి, స్టేజి రక్తసిక్తమవుతుంది. నేటి ఆర్థిక జగత్తులోకన్నా ఎక్కువుగా మనిషిని మనిషి తినేసే దృశ్యం కంటబడ్తుంది. ఇప్పుడు సంఘం యీ దారుణాలను నిజజీవితంలో సరిపెట్టుకోటంలేదూ? అలాగే ఆదృశ్యాన్ని చూచి సరిపెట్టుకుందుమేమో. ఈ మనుష్యులమేగా, అప్పుడున్నూ. ఈ మానవ లక్షణాన్ని ద్విజేంద్రలాల్ రాయి ఎంత చక్కగా చెప్పారు. 'రేపు సూర్యుడు పశ్చిమాన్ని ఉదయిస్తే అప్పటినుంచే దినాన్ని ప్రారంభించి పొయ్యాలు రాజేసుకొంటాం' అన్నాడు. అయినా యిటువంటి ఉపద్రవాలకు తావీయకుండా, బడిలో రెండు పార్టీల్లోనుంచి సమపాళ్ళగా జనాన్నితీసి వీళ్ళని పడుగూ, పేకా క్రింద, నాటకంలోని ఒక్కొక్క పార్టీలోనూ పెట్టి, ఆ నాటకపు పార్టీలను తయారుచేసాడు. నాటకపు పార్టీలు తిట్టుకున్నా కొట్టుకున్నా మా కృష్ణుని నేర్పు ఏమో కాని, స్టేజిమీద పూజారిని పూజారి, కేడీని కేడీ కొట్టుకోవలసిరావడం, తిట్టుకోవలసిరావడం జరిగి ఊరుకొంది. దాంతో బడిపార్టీలు స్టేజిమీద కోరలుతీసిన త్రాచులైపోయినాయి. గారడీవాడి బుట్టలో దూరే మచ్చికత్రాచుల్లాగే పాపం, పూజార్లు, కేడీలు పెద్దమనిషితరహాగా సహజలక్షణాలను చంపుకొని, సైడ్ కర్టనులలోకి వెడ్తోండేవారు. ఆరీతిగానే, యిదివరలో పార్టీవ్యసనాన్ని వెలిబుచ్చిన యిరుపార్శ్వాల ఉపాధ్యాయులను, కొంతమందిని ప్రాంప్టుచేయడానికి, కొంతమందిని స్టేజీ సవరించడానికి, కొంతమందిని ఆడవేషాలకు చీరలు తెచ్చిపెట్టి కట్టిపెట్టడానికి, కోరి తెచ్చి వాళ్ళకు గుక్కతిరగని పనిఅప్పచెప్పాడు. ముఖ్యంగా హెడ్మాష్టరు ప్రెసిడెంటుగార్ల మధ్య కృష్ణుడు రాయభారం చేసి, రిహార్సలకు ప్రెసిడెంటుగారిని తోడితెచ్చేవాడు. తన బాలుర నటనాకౌశలానికి ఏ ఒక్కడూ, ఏ ఒక్క లోపం, ఆరోపింప సాధ్యంకాకుండా, ప్రదర్శనం బహు ప్రశంసనీయంగా యుండాలని హెడ్మాష్టరుగారి కక్ష. సర్వాంగసుందరమైన తన కావ్యకన్య సర్వజనామోదంగా స్తుతిపాత్రం కావాలని ప్రెసిడెంటుగార్కి కక్ష. ఈ నాటక

ప్రదర్శనంతో బడిలో శాంతిశ్రీ సాక్షాత్కరించాలని మాకృష్ణుని కక్ష. మాకృష్ణుడు చేపట్టిన కార్యం నిర్విఘ్నంగా కొనసాగాలని మాకక్ష. అశకం మనుష్యులం యీనాటికన్న నిస్సంశయంగా, వైరంలోనైనా, విహితంలోనైనా పట్టుదలమనుష్యులమేమో. ఈక్రొత్త కక్షలతోటి ఏకకార్యార్థులమై పదిహేను యిరవదిరోజులు కలిసిమెలసి కృషిచేసే సరికి, పాతకక్షలు రూపుమాసాయి.

ఉభయపార్టీజనం పోలికలు తెలియకుండా పెనేసుకుపోయారు. పాపం కేడీపార్టీ 'యియాగో,' మాయావి, తేతలి క్షత్రియులతో అపీళ్ళ పోరుతో యీ గతనెలనుంచి యిల్లు పట్టకుండా, ఏలూరిలోనే ఉండి పోయాడేమో, రేపు వార్షికోత్సవం అనగా, తణుకులో అంతా పది పదహారేళ్ళ కుర్రాడోడు, రేపెల్లవాడలో కృష్ణుడి వైఖరిని చాటున ఉన్నట్లేవుండి, యిప్పుడు కేడీనాయకులనందరను బుట్టలోవేసి వార్షికోత్సవం పేరట హెడ్మాష్టరుగార జన్మదిన విజయోత్సవాలు సెలబ్రేటు చేస్తోన్నాడని విని, యీ విపత్తుకు దురపిల్లి, రికార్డుకట్ట ప్లీడరు మెడనేసి, అంచలమీద తణుకొచ్చిపడ్డాడు. కేడీపార్టీజనం చెవులు కొఱకకపోతే, ఉత్సవకార్యాల్లో ఏకాగ్రచిత్తతతో నిమగ్నులై కొందరు, నాటక ప్రయత్న ఫలిత ప్రేమానుబంధాలను తెంపుకోలేక కొందరు, ఆట్టే సాదపెట్టకంటో చీదరపడి తప్పించుకుతిరిగారు. మాయావి మేనల్లుడు, ప్రెసిడెంటుగారు, మా హెడ్మాష్టరుగారి కోరికపైన నర్సాపురం హెడ్మాష్టరు జయరామారావుగారిని తన నాటకం చూచుటకు తీసుకొనిరా వెళ్ళాడు. వార్షికోత్సవ దినాన్ని పగలంతా మాయావి తణుకులోనే యుంటే ఏమి చిచ్చు పెట్టునో, దైవికంగా ఏలూరి ప్లీడరుగారివద్దనుంచి వైరువచ్చి, మాయావి వున్నవాడున్నట్టు ఏలూరుకు బండెక్కవలసివచ్చింది అక్కడికీ దారిలో బడిదగ్గర బండి ఆపుచేసి, ఉభయపార్టీలను ఎక్కడా హెచ్చు తగ్గులులేకుండా; పక్షపాతం చూపకుండా, తిట్టుకొంటో, యీదభా ఏముఖంపెట్టుకు తన సలహాలకు వస్తారో చూస్తానంటో పశ్చిమాభిముఖుడై పోయాడు, మరెవరికి సలహాలీయ నక్కరలేకుండానే. తర్వాత కొద్దిరోజు

లకు యుద్ధభూమిలో వీరమరణం పొందిన ధానిష్కానిపోలికను, ఆపీళ్ళ కట్ట చేతిలోయుండగా కాలంచేసాడని కబురువచ్చింది. ఒక చిన్న యాక్సిడెంటు తప్పితే, మాకృష్ణుని అధ్వర్యాన, వార్షికోత్సవం బహు సరసంగా- దిగ్విజయంగా, అపూర్వవిభవంతో జరిగింది. యాక్సిడెంటైనా మరేమీలేదు. కేడీపార్టీ నిరతాగ్నిహోత్రుడొక ఉన్నతోద్యోగియై, దూర దేశంలో ఉంటోన్నాడు. హెడ్మాస్టరుగారి పెనుగొండకేసు ఫలితంగా కేడీలకు కల్గిన దుఃఖానికి వారిని పరామర్శచేయదలచి ఎప్పటికప్పుడు సెలవుపుట్టక, కాలం, ఖర్మం అలా గెంటుకొచ్చాయి కాబోలు, వార్షికోత్సవ సాయంసమయానికి దిగి, కేడీ నాయకులు బడిలోనున్నారని విని వచ్చాడు.

ఈలాంటి దృశ్యమే ఒకపుడు నాకూ ఎగిలింది. చింతఉట్టైనా నాలిక మీద పెట్టుకోకుండా, నోరు కట్టేసుకొని, ఎరుగున్నంతవరకు ధరిమానా వచ్చినవాళ్ళ నందర్నీ హింసించి, కూడబెట్టి నూరు నూటపాతిక యకరాల మాగాణి చిల్లరిమల్లరి డెబ్భై డెబ్భైయయిదువేల రొక్కం, మెళ్ళో మామిడాకు, పసుపుకొమ్ము, కట్టుకొన్న తన భార్య వీటిని కొడుక్కి వప్పచెప్పి ఆవి పదిలంసుమా అని కొడుక్కి తెలియచెప్పిన్నీ, చూస్తో పోవడానికి ఏకాడికి ప్రాణం వప్పకపోయినఒకణ్ణి రూపాయి కడిగికంఠంలో పోసి, పదిమందిసాయంపట్టి పంపించారట ఊరుచివర చింతచెట్టుక్రిందకు. ఆయన పుత్రరత్నం నాకు ప్రాణస్నేహితుడు. ఇంత ఆస్తి యిచ్చిపోయిన తండ్రికోసం ఏమిఏడ్చిపోతున్నాడో. స్నేహితుడు - చిన్నవయస్సు-ఓదార్చి రావాలని ఎన్నివిధాల తంటాలుపడ్డా అప్పటి పనితొందర్లవల్ల పదహారు రోజులు నాకు యిల్లు కదలడానికి వీల్లేకపోయింది. చివరకు పదిహేడో రోజున స్నేహితునింటికి పదిబార్లదూరంలో కాస్సేపు ఆగి, ఏడుపు ముఖం పెట్టుకొని వెళ్లేనికదా, వాడు హార్మోనియం వాయిస్తోన్నాడు. వాడి భార్యాలలామ, లతలా, వాడి మెడను చుట్టుకొని పాడ్తోంది. అప్పటి కొచ్చేసి మధ్యాహ్నం వెడితేనికదా, ఫ్రెండ్సుకు టీపార్టీ యిస్తోన్నాడు. ఏమెంతేం, పరామర్శముద్దు తీరలేదు. నేను నాయింటికైనా రాగలిగాను.

పాపం ఈకేడీఉన్నతోద్యోగి నామాత్రం నిలదొక్కు లేకపోయాడు. స్కూలు హాలు గుమ్మంలో అడుగిడ్తోనే గోడకు జేర్లపడిపోయాడు. నాటక ప్రేక్షకుల్లోనుంచి ఎంతమందో లోపలికిరమ్మని సంజ్ఞలుచేసినా, కళ్ళుగీటినా, రాడు. చివరకు దగ్గరకువెళ్ళి రమ్మన్నా పలకడు. మిడిగుడ్లేసాడు. గోడంట కాస్త కాస్త జారుతోన్నాడుకూడాను. తీరా జారిపోతే ఏంప్రమాదమౌనని, డాక్టర్లంతా మా వార్షికోత్సవంలోనే ఉండిపోవడంచేత, ఆయన్ని మా స్కూట్సు వెటెరనరీహాస్పిటల్లో పడేసొచ్చారు. హెడ్మాస్టరుగారు ప్రెసిడెంటుగారు పూలమాలాలంకృతులై భుజాలు రాసుకొంటో ఆయన కంటబడ్డ తొలినిమిషంలోనే ఆయన నోరు తెర్చాడని గేట్లో అబ్బాయి చెప్పాడు.

ఈవిధంగా, నాట్యకళాకృషి మావిద్యాసంస్థకు సంజీవిఅయింది. ఇష్టకార్యసాధనకు, శాంతిస్థాపనకు, నాటకకళారాధన, మాకృష్ణుని చేతిని సుదర్శనమైంది అంటే నాట్యకళామహాత్మ్యాన్ని గుర్తించిన విద్వజ్జనులకు వింతదోపదు. హృదయపరివర్తనం కలిగించడం, నాట్యకళయొక్క పవిత్రాశయం. ప్రేమ అనే శక్తిమీద విశ్వాసాన్ని స్థిరంచేయడానికి, ఆస్తికత్వం మానవజీవితంలో బహిష్కృతంకావడానికి, అనివార్యమైంది నాట్యకళ. 'Art is a means of escape and deliverance' అన్న పరమసత్యమును, యీనాటకప్రదర్శనరీత్యా మాకృష్ణుడు రుజువిచ్చిన నాటినుంచి నేటివరకు మాబడికి, విద్యార్థి నాటక సమాజం, లిటరరీయసోసియేషనూ 'భూరిమయాంగద తారహారా' లయినై. పాతిక, ముప్పదివత్సరాల అంతర్యుద్ధాలను, అంతస్స్రోతాలను నాటకప్రదర్శనం అబ్లిటరేట్ చేసి మాబడికి పచ్చతోరణం కట్టిన కారణంగా, నేటికీ ఏవత్సరంలోనైనా మాబడిలో సాలుసరినాటకం పడకపోతే, అలోపాన్ని అనారోగ్యలక్షణంగాను, కీడుగాను పాతవిద్యార్థులం భావిస్తాం. మావిద్యాసంస్థ కాలోపం ఘటించకుండా నూతనోపాధ్యాయులు, విద్యార్థులు శ్రద్ధచూపడంచేత, ఉత్తమవిజ్ఞానసందీప్తజీవద్యైన మాబడినిగాంచి, దిశాంగనలు పులకితలై, జేజేలు పాడ్తోంటారు.

మాబడిని సందర్శించినవారి కేరిక్తైనాసరే, తణుకు బోర్డుహైస్కూలుకు జై. అనే అభినందన అప్రయత్నంగా నాలికమీద కొస్తుంది.

పెక్కుమణులం దొక్క కెంపుదారమును జొనిపి చక్కని మాల్యము గుచ్చినట్లు, నాటకపరిదర్శనరీత్యా, వ్యత్యాసములందు ప్రేమ సూత్రము జొప్పించి, Unity in difference సాధించి, ఆనాటి మా సభ్యజగతియందు బుసబుగొడ్తోన్న క్రౌర్యమును లాంగతీసి, భ్రాతృత్వ సౌహృద్యభావముల నెలగొల్పిన మా కృష్ణపాత్రధారి ఆదర్శ విద్యార్థి. అతడి మహితాశయ విలసిత విద్యార్థి జీవనం, సౌందర్యశోభిత హృదయం, మా విద్యాసంస్థకు శాంతినికేతన సాంప్రదాయాలను ప్రసాదించింది. తారకామధ్య చంద్రబింబంవలె కాంతులీనుచుండే మా కృష్ణుడు, యీనాడు మాబడిలో విద్యనభ్యసించే వేయిమంది విద్యార్థులలోను పునః అవతరించియున్నాడనే విశ్వాసంతో, అతని సందర్శనభాగ్యమాశించియే, నేటికీ విద్యార్థి సాహిత్యసభలను, నాట్యప్రదర్శనాలను, ఆహ్వానమందింది తర్వాయిగాపోయి, శ్రద్ధమై అవలోకిస్తోంటా.

సర్వభూషణాలంకార దివ్యగాత్రుడై మా నాటకరంగంమీద నిలబడి మమ్మానందవార్నిధీ తరంగడోలికల నూగించిన అతడి మూర్తి నాకు నేటికీ తలపుకువచ్చి మనోవికాసం కల్గిస్తుంది. మంచి వర్చస్వి. అనంతసౌందర్యభావోజ్వలమూర్తి, వక్షోవిస్ఫూర్తి, అతని మూర్తిసమున్నతం, కండలుతిరిగిన బాహువులు, మంచి కోలమోము. హోస్టెలు ఒపీని యన్నుని రికమైన్సలుచేసి, నవ్వుచూ, సొగసులు ప్రత్యక్షమొనర్చే కళ్ళు. కంఠ మతిమధురం. పదునారేండ్ల ఎలప్రాయం. అన్నిటికన్నమిన్న, రాగ రంజితపరీమళ హృదయుడు. విద్యామృతాప్లావితచిత్తుడు. గుణశీలసంపద, అనన్యం, అప్రతిమానం. సోదరుడు, విఖ్యాతరచయిత, శాస్త్రవేత్త, కవి, శిల్పి, గాయకుడు, దేశభక్తుడు శ్రీ అడవి బాపిరాజుగారి నారాయణరావుకు మా కృష్ణుడు Pocket Edition. రూపభావన మాత్రాన మమ్మల వివశులచేసే వర్ణనాతీత సుందరశ్రీమూర్తి మా కృష్ణునిమూర్తిని, సోదరుడు బాపిరాజుదక్క ఏశిల్పి విన్యసింపగలడు? అంచేత నా అంతరంగమంపలి

కృష్ణవిగ్రహానికి సిద్ధహస్తుడు బాపిరాజుగారి బహు నాజూకైన మల్లికా మకరంద శబ్దసంచయంతో రంగువేసా.

ఆ వత్సరం, School litarary association Secretary అయిన కారణంగా అయితేనేం, అన్ని Subjects లోను 80 % Percenter అయిన కారణంగానైతేనేం స్వీయసద్గుణవ్రాతంతో వైరుల నేని విహితులచేసుకోగల స్వభావసౌజన్య సామర్థ్యాలు కలవాడైతేనేం, బాలుడయ్యూ, మాకృష్ణుడెపుడూ ప్రధానాచార్యులవారి సాన్నిధ్యానికి గమనాగమనార్హుడే. ఉపాధ్యాయులే వారి కెదురుపడ భయపడే ఆ కాలంలో, ఉపాధ్యాయులతో సమానప్రతిపత్తి గడించడమే కాకుండా, హెడ్మాష్టరుగారితో అన్యోన్యసహకారాలు కలవాడిలా, సర్వస్వతంత్రంగా వారి ఆఫీసురూముకు రాకపోకలు సాగిస్తోంటే, మా కృష్ణునిపై పెద్దల్లోను పిన్నలలోను, అక్కడక్కడ కన్నెర్రకలిగేది. హెడ్మాష్టరుగారి అనుగ్రహసంపాదనమును, వారిచ్చిన చనువును, ఏనాడూ స్వోపయోగార్థమై దుర్వినియోగముచేసిన స్వార్థపరుడు కాడుగాన, కృష్ణుడు నిస్సందేహంగా సర్వస్వతంత్రుడే. ఆడది మెచ్చిందే అందమన్నట్టు మాష్టరు మెచ్చిందే ఆనందం విద్యార్థికి. 'పెరనెయ్యములు వేయును తత్సదృశ్యములే' 'మాష్టర్ల మెచ్చుకడసిన విద్యార్థి మనుగడయే మనుగడ' అని నామతం. గఱువతనము వదానక, లాతులకు మేలొనరించే, మహత్సంకల్పంతో, మాష్టర్ల మెచ్చువడసిన విద్యార్థి ధన్యుడు. సోదర విద్యార్థులపట్ల, భాతృత్వ సుహృద్భావం, ఆచార్యులపట్ల సద్వినయ సౌశీల్యం భావభువనంలో నిల్పిన మా కృష్ణుడు ఆదర్శప్రాయుడు. అతనిహృదయం విద్యార్థిజనహిత వాంఛాపూరితం, అతని నడకలలో అధర్మములేదు. చేతలలో కాఠిన్యంలేదు. పలుకుల్లో వక్రతలేదు. నిలువెల్ల నమ్రతమూర్తి అతడు! అంచేతనే ఏ సన్నివేశానికొచ్చినా 'as though another candle was lighted' వాడిచుట్టూ పండువెన్నెల కాస్తుంది. దానంజేసి అతని సమక్షంలో ఆత్మజ్యోతినీ, పరంజ్యోతినీ గుర్తించి, గీతాంజలి సమర్పిస్తోంటూ. చిననాడే అంతరంగికోద్ధరణము

సాధించినాడే. లేబ్రాయమునసే, ఆతడి హృదయం సౌందర్యసౌరభ మాధుర్యాలకు నిధానమైందే. 'శైశవజీవమున తళ్కొత్తు కెంపుకాంతులే కదా కొంతకాలము వెలిగించిన, విశ్వవిలయమున నవప్రసుప్రభలను విరియబోయగలవు. చిననాటి సూక్ష్మాంకురములేగా, కాలక్రమమున మహోన్నత భూమీరుహములయ్యేడివి.' అగ్రజీవితం గడవపెట్టి, తిథివార నక్షత్రాలప్పటికి కుదిరినట్టు, ప్రారంభించేవానికి ప్రాప్తించెడి ఐశ్వర్యం కలుషకాంక్షా కార్పణ్యాలే కాని సద్గుణసంపన్నతలు కావు. ఏలక్షణముల చిననాట అంకురార్పణచేతుమో, అవే కాలవాహినిలో, సోపానక్రమంలో పెరుగును కాని, మధ్యగా మరచిపోయి, మరోటయి, విలక్షణంగా, పెరుగవు. మొక్కై వంగనిది మ్రానైవంగదు మోడైపోయిన తగువు కావచ్చునేమో కాని. సృష్టి Cosmos కాని Chaos కాదు. అమట్టుకైనా నమ్మాలి. విద్యార్థులకు క్రమనిష్టావశ్యకతను తెలియచెప్పటానికి. పృథ్వి పెద్దబొంగరమైనా, నియమబద్ధంగానే తిరగడం, సూర్యచంద్రాది సమస్త గ్రహాలు గతులుతప్పక తమతమ ధర్మాలను అనునిత్యం నిర్వర్తించడం, సప్తసముద్రాలూ తమ నిర్ణీతావరణాతిక్రమణ చేయక నిలచియుండడం, జననమరణాది వ్యవస్థలు, మనం ఏకగ్రీవంగా వద్దని శాసించినా ప్రాణికోటికి తప్పకపోవడం, నిమిషనిమిషం యిన్ని ఘటనలు మన కండ్లముందు జరిగడితైనా, ప్రస్తుతంలో మాట్లాడుకొంటోన్న మహాపురుషుల మిద్దరం మాత్రం, ఈ Universal Laws కు అతీతమైనట్టు మనం ఓ మిథ్యా భావ పైత్యభ్రమలో తందనాలు త్రొక్కుతాం. హాస్యాస్పదం. ఒడుదుడుకు పరుగులాటకు సంస్కరణమనియు, అభ్యుదయమనియు, అభివృద్ధి పథమందలి సమధికగమనమనియు, గొట్టం బూరాలతో ఊరేగుతాం. అజ్ఞానంలో తప్పటడుగులు వేసే బాలురకీ Fundemental Laws నిరుల్లంఘ్యం సుమా అని తెలియచెప్పుకోవలసిన బాధ్యత గురుదేవుళ్ళకు, పితృదేవతలకు ఉంది.

తద్వారా, బాలురకు క్రమనిష్ఠాభినివేశచిత్తత అలవరిస్తేతప్ప, వారికిలాంటి దురభిప్రాయాలు కల్గవచ్చునేమో గమనించండి. ఎప్పుడో, పెళ్ళ

పెట్టుగా, ఒక్కసారిగా, ఒకానొక సుప్రభాతసమయంలో యింకా తమవారెవరూ నిద్రమంచాలు దిగకుండగనే, వీధిప్రజ ఆశ్చెర్యపోంది, నోళ్ళు తెరచుకొని, నిలబడిపొయ్యేలా ఏదో గొప్ప Meteoric career ఓటి తనపై కురుకకలదనీ—అలా తోచడానికి ప్రబల కారణం, 'యిన్ని రోజులనుంచి ఉన్నాను, ఎప్పుడైనా తోచిందా,' అనీ ఏదో కనిపెట్టు కుండకపోతే యీవాళే ఎందుకు తోస్తుందనీ, అంత తెలివితక్కువవాణ్ణా నాలకే తోచడానికనీ, ఇత్యాది భావభంగుల్లో ఆశావహులై, Whang the Miller's money dreams లాంటి వినాశకమైన కలలు కంటోనో, తప్పితే దూభరా, బద్ధకచక్రవర్తిఅయిన డిక్కెన్సు మికాబరు వైఖరిని, యీమట్టునే ఉంటామా 'Something would turn up' అనీ, అది రోడ్డుమలుపులో యీపాటికి ఉండితీరాలనీ, అంతడిది ఏలాగా వచ్చిపడ్తోన్నపుడు, దగ్గరున్న యీకొంచెం దాచుకోడం, ఎవరైనాచూస్తే నవ్వుతారు, అసహ్యమనిన్నీ, అంచేత చై, ఖర్చుచేసి పారేసెయ్యావోయి అనీ, అపుడు ఆఉన్న కాస్తఅడుగూబొడుగూ కుండకడుగుడు అవడంతోనే, తెల్లబోయిన్నీ, దినదినం యీమోసపు లీపితలపులే, నెమరేసికొంటోనో, కార్యశూన్యులు కాగలరు. బాలురట్టి దురాశయాలకు తావీయకుండా క్రమనిష్ఠను అభ్యసించాలి. క్రమశిక్షనుబొంకు డెను త్వరం వహించరాదు.

దేశభవిష్యత్తు శుభోదయంగా ఉండాలంటే, మరొక్కవిషయంలో కూడా బాలురచే మాతృష్ణుడు పెట్టిన ఒరవళ్ళను దిద్దించండి. అంటే సంఘహితైకబుద్ధి, సమిష్ఠిఆచరణాసక్తి బాలురకు ముఖ్యంగా అలవడే విద్యగఱపండి. ఈవిద్యార్థి జీవిత ప్రధానసూత్రాలను విస్మరించిన విద్యావిధానాలు సంఘానికి ప్రమాదకరాలు కాగలవు. విద్యలు దుర్వినియోగం అయితీరుతై అని నాఘంటాఘోష. పుణ్యపురుషుడు, సంఘసంస్కర్త ప్రఖ్యాతరచయిత రస్కిన్ విద్యావిధానాన్ని తీక్ష్ణదృష్టితో పరికించి, అసమాన వాగ్వైభవంతో విమర్శించి, ఆనాటికున్న సంకుచిత స్థిరభావాలను పెక్కులను భగ్నంచేసాడు. చూచారా, ఎంతచురుక్కుమనేట్లు చెప్పాడో! సంఘశ్రేయోభిలాషరహితమైన, ధనసంపాదనా

ప్రధానమైన విద్యావిధానంమీద 'Otherwise you would be turning literature into lust and Arthametic into roguery'. ఎంతవరకో ఎందులకు, నేటిరాచకీయపార్టీ మంత్రాంగాల్లో గజ్జెకడ్తోన్న ప్రజాప్రతినిధులు, పార్టీ కార్యనిర్వహణదక్షులు, రాజనీతికోవిదులు వీరంతా యూనివర్సిటీడిగ్రీలు స్వీకరించిన విద్యాధికులే. వితత జగద్భరంబు తమ వీపునదాల్చిన మన ప్రజాప్రతినిధులు, కాకిచే ఖబురుచేసింది తర్వాయిగా వూళ్ళంటవచ్చిపడి, కారాబూంది బుట్టలసందున తమ ఆరోగ్యాన్నైనా పాటించుకోకుండా, మన మతులోయేలా, వారివారి సంఘుమరమ్మత్ కథా కార్యకలాప ప్రకటనోపన్యాస వీరాంగాలు ఒక్కవరసని, వాయించేస్తోంటే, వారి ఆశ్రితవాత్సల్య మేమనవచ్చు. ఎక్కడైనా ఒళ్ళుదాచుకుంటున్నారా, నాలిక కట్టుకుంటోన్నారా. అయితేం, అంతా వేదాంతులే ముంతెడుకల్లు ఏమైంది అన్యసామ్యం ఎందుకొస్తోంది. ఒక్కటే సమాధానం. సంఘహితైకబుద్ధి చచ్చింది. శాసనాలున్నై. సేవాభావం లేదు. భావాలున్నాయి, త్యాగంలేదు. అంచేత ప్రాణులున్నై, ప్రాణంలేదు.

ప్రజల్లోనూ, ప్రతినిధులలోనూ, యీసంఘశ్రేయోభిలాష క్రమశిక్షణ ప్రాగ్యమైనకారణంగానే, సర్వసంపదల కాలవాలమైన భారతభూమిలో, అన్నీఉండి అల్లునినోట్లో శని దాపరించింది. "అస్థిపంజరము జీవనంబునుబట్టి ఊగులాడగా," యింకా ఏదోఆశకొద్దీ అల్లల్లాడిపోతో, ఎంతగడుస్తనంగా మనం మన్నికానట్టు తల అటు త్రిప్పుకొన్నా, అడుగడుగునా ముందుకువచ్చి పడిపోతూన్న, హరహరా, ఆచివికిశరీరాలు, చింకిగుడ్డలు, క్షీణప్రాణాలు, వీటికి ప్రధానకారణం, విశ్వవిద్యాలయాల్లో చెప్పే విద్యలు చాలకనేనా, వెర్రి, వెర్రి — New Delhi నుంచి మనకు పథకాలు, ప్రణాళికలూ రవాణాకాకనేనా, పిచ్చి, పిచ్చి — పార్టీరాచకీయాల్లో యింకా ముఠాలు లోపమయ్యేనా, మోసం, మోసం —

ఆదేమీకాదు. రోగతీరు తెలుసుకోని వైద్యంచేస్తున్నాం. కీలుచూచి వాతపెట్టాల్సిఉంది. ప్రజలకై యింతశ్రమిస్తోన్న ప్రతినిధులసేవ

నించాలోరుటున్న ద్రోహబుద్ధి ఒంటుండదని గ్రహించుకొని, పశ్చాత్తాపచిత్తులమై వారికి విశ్రాంతినిచ్చి, స్వరక్షణ సాధనాలను చూచుకోవలసి యున్నది. ఆ కార్యక్రమప్రారంభం విద్యాపీఠాల్లో జరగాలి. అక్కడ జరగాలి శంకుస్థాపన, అంకురార్పణ. సంఘశ్రేయస్సు దృక్పథంతో, శ్రమించి యీశిక్షవిద్యార్థులకు తయారిస్తే, అనతి కాలంలో, నైతిక సంపన్నులైన ఉత్తమనాయకులు, ధీరోదాత్తులు లభ్యం కాగలరు. క్రమశిక్షణకు విద్యార్థులు సుముఖులై విద్యల నభ్యసిస్తే మనమూ చెప్పకోవచ్చు కితాబుగా, 'Waterloo is won in the fields of Eton' అన్నట్టు.

## వార్షికోత్సవాలు

అట్టి దినాలు తిరుగారావు. నావరకే కాదు మీమాకైనా అంతే. కాని యీసత్యం అనుభూతికి రావాలంటే, దానికోవిధమైన సంస్కారం ఉండిఉండాలి. కావ్యానందాన్ని అస్వాదించడానికి, కావ్యమర్మవిజ్ఞానాన్ని అకళింపుకొందుకు తొలిమెట్టు సంప్రదాయం, తర్వాత మెట్టు సంవిధానం అన్నారు రచయిత 'అగుద్ర'. అసూక్తి మన ప్రస్తుతసిద్ధాంతానికి సమానంగా వర్తిస్తుంది. పట్టంతా పెళ్ళిమీద పెట్టుకొన్న అబ్బాయో, అమ్మాయో ప్రథమప్రణయసౌఖ్యాన్ని మధురాతిమధురంగా నావించవచ్చు. కాస్త పిల్లలు పుట్టుకొస్తోన్నకొద్దీ, 'ప్రేమవసంతం, పెళ్ళి గ్రిష్మం' అని వాపోనూవచ్చు. ఏమైనా, అప్రసంగం, సామయికభావోద్రేక జనితమో, వైరాగ్యఫలితమో అయియుంటుంది కించిత్ ప్రాసుపరీక్ష చేసి చూస్తే. అయినా, లోతుసీళ్ళ దిగవద్దన్నారు బుధులు. నే ననధికారిని కాన తద్విషయనిర్ణయం తజ్ఞులకు వదలి నాపరిమితానుభవంమట్టుకు మనవి చేస్తా.

చెట్టు పూతదగ్గరనుంచి అకురాలుడు కాలంవరకు జీవిత పరిణామ దశలను అవలోకిస్తే, మానవజీవితాధ్యాయంలో అత్యంతానందమయ ఘట్టం, విద్యార్థిజీవితం. విద్యాగంధం కల్గినవారెవరూ దీనిని కాదనలేరు. 'Enthusiasm for the cloisters' సన్నగించని చార్లస్లాంబు లాంటి సున్నితహృదయులు విద్యాపీఠ పవిత్రవాతావరణంలో మధుర వైవశ్యం పొందగలరు. తదాంతావరణంలో అంతర్లీనమైయుండే 'Calm and sinless peace' చిత్త ఎతిని, నరములకుపుష్టిని ప్రసాదించే రసాయనం. వృత్తి ఉద్యోగాలకారణంగా, తమ చిననాటి బడికి దూరమైపోయిన వయోవృద్ధులెందరో, పాతవిద్యార్థి సంఘవార్షికోత్సవ దినాన మంత్రింపించినట్టుగానే బాలురవుతారు. మనువ గూట్లోపెట్టుకొన్న లేహ్యంఏదో యిక్ష్వాకులకమీద పెట్టుకొవ్వందుకు మావీధిని ఒకఅవుధాన్లుగారు యవ్వనం తిరిగి తెట్టి, అరవయ్యోపడిలో, యమబాధపడి, ముసలావిడిని పెంబేలుపెట్టినట్లు వీరికి వార్షికోత్సవ దినాన్ని బాల్యం ఉబుకుతుంది. కొందెం చిలిపితనంగా, కొంటెగా విలయిల్లాడే కృతో కన్పిస్తారు అదేంమాయో. ప్రతిముఖంలోను, ఏనాడో గిరిపోయిన ఆనందం, ఉత్సాహం లేకెత్తుతాయి. కోడ్డుభావంలో మాట్లాడే రాజకార్యదురంధరులైనా ఆ శతదినాన శిశువ్యాకుంతో ధారాళంగా మనసిచ్చి మాట్లాడుకుంటారు. ఆనాటి, యింటి వసీ ఆఫ్ స్ప్రింగ్‌కి, అచ్చెరువొందుతా. ఒలికిలి తినేలలు, గునపం వెయ్యక్కర్లేగు, జలపడ్తాయి. తాడు కట్టక్కర లేదు, చేతికందుతాయి. ఎండుమోళ్ళు చిగురుస్తాయి. షహారాలు ఫలపుష్పసమన్వితమైన ఉద్యానవనాలవుతై. కలెక్టరుగారికి కుర్చీవేయనక్కరలేదు. కలెక్టరుగారికి కోపంరాకుండా, ఫస్తు వ్యత్యాసప్రదర్శనార్థం, పని కట్టుకుగుమాస్తానిముసిలమ్మ ఉక్కాలిపీట ఎక్కించక్కరలేదు. ఏమిసరసత, ఏమిసమానత్వం, కేవలం గాంధ్యాశ్రమవాసులను చేస్తుంది. ఆవార్షికోత్సవవాతావరణం. చేతనైతే సేవచేయాలి, చేతకాకపోతే ఊరుకోవాలి. అంతేకాని సేవల నందుకోడానికి ముఖం చెల్లదాంతోజూన. చూడరాదూ, ఓఉన్నతోద్యోగి ఏలా అల్లరిపడిపోయాడో! హృదయం ఎదరితోనూ వచ్చిన

వాడు కాడు. అంచేత, స్థలమహత్యం, మనిషికింకా వంటబట్టలేదు పాపం. అధికారాతిశయంలో, ఆఫీసు కస్సుబుస్సులను బడిగుమ్మంలో వదలిపెట్టడం మరచిపోయాడు కాబోలు. మా ప్రశాంత ప్రదేశంలోకి వస్తోనే, తన వెనకవచ్చే ఫ్యాన్‌ను 'శంఖన్న' అంటో సంబోధిస్తో ఉరిమాడు. ఆ అపస్వరం సభ్యులందరకు కర్ణకఠోరంగా ఉందేమో, ఒక్కళ్ళకీ ఆయన్ను పలకరించ బుద్ధివేయలేదు. ఇంతకు ఆయనజాడ్యతీరు మాకు తెలియలేదు. గత రెండుమాసాలక్రితం ఏదో ప్రమోషను వచ్చిందట. నాటి నుంచీ ఆలాయున్నాడని తర్వాత తెలిసింది. ఆఫీసులో ప్యూనుపలకరిస్తే కొట్టవెళ్ళడం, ఐడెంటిటీ సర్టిఫికెట్టు కావల్సి వెళ్ళినవాళ్ళను వీధికంటా తరమడం, యింట్లో పిల్లలు పలకరిస్తే కస్సుమనడం, గదిలో భార్య పెదవి విప్పితే మీదపడడం జాడ్యం పుట్టిందట. పెద్దవాణ్ని అయిపోయాననీ, యింకా అంతాగుర్తించలేదనీ, పిచ్చిలోపడ్డాడన్నమాట. సక్సెస్ యిన్ లైఫ్ ఎచ్చీవు చేసానని దట్టంగా మైకంక[illegible] ఉన్నాడన్నమాట పెర్రి బాగుల మనిషి. రోగ మిది అని ముందు తెల్సిఉంటే ప్రస్తుతవిద్యార్థులు శైత్యోపచారాలు తగురీతిగా చేసియుందురు. ఈ అనారోగ్యాలకు తిరుగుడు, విరుగుడు వాళ్ళదగ్గర యుండకపోదు. తన సక్సెస్సూ, తనతోటే లోకమన్న అహంభావత్వం మేం ఎవళ్ళం గుర్తించలేకపోయామని ఏమి ఖిన్నుడైనాడో, పైగుడ్లేసేసి, బిగుసుకుపోయి, అటుచూస్తో యీలాంటి గొడవలకు అసలు తనకు తీరిక ఎక్కడన్నట్టు, 'His mind vacant of all meterial of amusement, my gentleman sits bolt upright upon a bench with lamentable eyes'. ఈ అపస్మారకులనుదృష్టినిడే కాబోయి స్టీవెన్సను చెప్పాడు. 'It seems a pity to sit, like the Lady of shallot, peering into a mirror, with your back turned on all the bustle and glamour of reality'. తర్వాత ఎరిగిఉన్నవాళ్ళం చుట్టూచేరి మాట్లాడించాం. ఇక ళ్ళిద్దరు నేనెవర్ని - అని అడిగితే సమాధానం చెప్పకలిగాడుకూడా. ప్రమాదం కల్గలేదు. అయినా జాలేసింది ఆ అరోగ్యామయపు ప్రబుద్ధు—

"On revisiting the scene of their boyish hopes and fears" పాతవిద్యార్థులకు తమ చుట్టూ ప్రేమవాహిని ప్రవహిస్తోన్నట్టు, ఒక వినూత్నానుభూతి కల్గుతుంది. చకితులవుతారు. ఆ సన్నివేశాల్లో ప్రస్ఫుటమయ్యే చైతన్యంచూస్తే 'Breathes there the man with Soul so dead' అన్న స్కాట్సులైన్సు స్ఫురణకు వస్తాయి. హృదయానికంత తీవ్రపరివర్తన తేగలిగిన దృశ్యం మరొండు కానరాదు. వయస్సుమీరినవాళ్ళమని గౌరవపూర్వకంగా ప్రస్తుత విద్యార్థులు డిస్టింక్షను చూపకపోతే కష్టంతోచవచ్చుకూడా, తాము అనుభవిస్తూన్న బాల్యాన్ని వారు కాదంటోన్నట్టు. ముసలిముత్తైదువులు, కొత్త పెళ్ళికూతుళ్ళు బొమ్మలనోము. ఊరేగింపులో వివక్షతలేకుండా బుక్కాలు చల్లుకునేటట్లు, వార్షికోత్సవోదయాన్ని, ప్రాత కొత్త విద్యార్థులు వయోవ్యత్యాసాలతో నిమిత్తంలేకుండాస్పోర్ట్సులో పాల్గొనే ముహూర్తాలలో సజలనయనుడనై, తన్మయతచెందుతా. మాబడి వార్షికోత్సవ పోటీల్లో టగ్గు ఆఫ్ వార్ కు పేర్కొదగ్గ ప్రత్యేకత ఒకటి ఉంటోంది. అది చూచి తీరదగ్గ ప్రాత కొత్తల పోటీ, మాబడిలో, ప్రస్తుత విద్యార్థులు ఏలనో ఆపోటీలో జయంమాత్రం పాతవిద్యార్థులకు వదలేసే సాంప్రదాయం పాలుపాలూ పాలిస్తూన్నారు. మధ్యాహ్నం ప్రైజు డిస్ట్రిబ్యూషన్లో నలభై, ఏభై వయస్సువాళ్ళం పేర్లుపిల్వగానే ఒక్కొక్కరమే సభావేదిక పైకి ఎక్కి ఒక్కొక్క పెరుమాల్ చెట్టీ పెన్సిలే పుచ్చుకొని, కృతజ్ఞతాప్లావితమైన ముఖాలతో ప్రెసిడెంటుగారికి నమస్కరించి — ఏం పెళ్ళికూతుళ్ళండీ మరీ సిగ్గుఅభినయిస్తారట – అలా సిగ్గు అభినయిస్తో విజయలక్ష్మీధవులం యథాస్థానాలు చేరుతోంటే ప్రస్తుత విద్యార్థులు మహదానందంగా చీర్సుకొడ్తో బల్లలు బద్దలుకొట్టేస్తోంటారు. ఒడిలో మమ్మల్ని చూచి బల్లలు బ్రద్దలుకొట్టిన వాళ్ళలో మా అబ్బాయిలూ ఉంటారుగా, అంచేత వాళ్ళకు యింకా సరదాతీరనట్టు, సాయంత్రం యింటికొచ్చాక వాళ్ళు 'అమ్మోయ్, బ్నాన్నా చెప్పనా? నాన్నేం – అంటో ఉడకడం; 'ఛా, ఊరుకో' అని నేం కసురుకోడం, 'మరీ చిన్నతనంవస్తోంది, ఉహా;

వయస్సులో మీరు చేసిన పని ఏలాఉంది, మధ్యన కుర్రాడిమీద కయ్యిమంటారు?' అని ఆవిడఅనడం జరుగుతోంటుంది. నేడుమాబడి పాతవిద్యార్థి సంఘువార్షికోత్సవాల్లో తాతామనుమలు, తండ్రీకొమాళ్ళూ కూడా పాల్గొంటూన్న రసఘట్టాలు కంటబడ్తోన్నాయి. ముందటేడు రింగు టెన్నీసులో ఒక తండ్రీకుమార్ళకు పేచీవచ్చి వారుభయులు విజృంభించి మల్లయుద్ధసన్నద్ధులై 'యుబ్బునం తలపడిన బెబ్బులులకరణిని' ఒకర్నొకరు మెడేసుకుంటే, సోహ్రాబ్బు అండు రుస్తుం భీభత్సదృశ్యం కంటబడునని భీతితో సకాలంలో వారికడ్డుపడి, తండ్రికి కాఫీయిచ్చి కుమారుడికి లొక్కుడుండపెట్టి అరీతిగా మందలించి వార్లను తళ్ళాంతిచేసాం. పెద్దా పిన్నా, ఆనందడోలికల్లో, స్మితామృతతరంగాలలో తేలిపోయే స్థల సమయాలు జీవితంలో మరేపట్టున లభ్యంకాగలవండీ? ఉన్నత భావసముల్లసితమైన మాతృశ్రీ సందర్శనభాగ్యంకన్న మధురానుభూతి, మానవునకు మరేముంటుందండీ!

విద్యార్థులను తమ ఆల్మామేటరుపట్ల భక్తిభావ ప్రబోధితులుగను, దృఢానురాగపాశబద్ధులుగను చేయడం మా హెడ్మాష్టరుగారి పరమ లక్ష్యం. కాబట్టి వారీ ఉత్సవకార్యానికి బహుథంగుల తోడ్పడేవారు. ఎక్కడెక్కడనున్న పాత విద్యార్థుల యడ్రస్సులు సకాలంలో సంపాదించి, ఆహ్వానలోపం లేకుండా శ్రద్ధవహించేవారు. ఎంతెంత పదవులలోనున్న పాతవిద్యార్థులు వచ్చినా వార్లను తానిడిన పేర్లతోనే పిల్చి, వార్లకు ప్రస్తుత విద్యార్థులపేర్లను సంకేతించి, ఉభయులకు అన్యోన్యం పెంపొందించేవారు. పాతిక ముప్పది సంవత్సరాల వ్యవధిలో మాబడిలో విద్యగఱచిన తన శిష్యులిరువురి భుజాలపై చేతులువేసి, ఎంతో ఉల్లాసంగా మ్యాలంగ్రౌండులో అయన కదలుతోంటే మా నేత్రాల్లో గురుభక్తి పూతాలైన అశ్రుబిందువులు తొలకరించేవి. అట్టి సద్గురుసాన్నిధ్య సామీప్యతలు వేయి గురుభక్త్యోపన్యాసములపెట్టు అని భావిస్తా. పిననాట విద్యనభ్యసించిన బడిని, అనురాగగర్భితంగా, ఆరాధ్యతాయోగ్యంగా, ఆజన్మం 'నాబడి' అనుకునే ఐక్యతావేశం, మాధుర్యభావం, మమత్వం అలవర్చుకల్గిన విద్యార్థులు [illegible]కారా?

# ఉ ప సం హా రం

'Look upon this picture and on this
The co[illegible] of two brother's

ఉపన్యాస పోటీలు, ఉత్సవకార్యాలు, నాటక ప్రదర్శనాలు, వ్యాయామక్రీడలు యిత్యాది రసప్రధాన కార్యకలాపాన్ని ఫక్తు ఏర్భాయితనంగాను, ఆతతాయి అల్లరిభాగవతంగాను గర్హించే శ్రోత్రియులు, ఆ కృషిని వ్యర్థవ్యాపకంగాను, దూభరావ్యాపారంగాను గణించే పినాశిలూ పంతుళ్ళుగా దాపరిస్తే, విద్యాసంస్థపై, విద్యార్థులకు ఆదరానురాగాలు కల్గడం అసంభవం. పైగా వీడ్కోల్లులను రిలీఫ్ గా భావించవచ్చు. శిష్య కోటికి నాటకప్రదర్శనాది పంచతన్మాత్రలు అంటకుండాచేసి, ప్రకృతి రామణీయతను పట్టకుండాచేసి, వాళ్లను నిదాఘకాలమంతా పంచాగ్ని మధ్య, శీత వర్షాకాలాలు జలాశయాల్లోను నిలేసి గడిపిన శిక్షవిద్యలు, విషఫలితాలనిచ్చి, దమాసత్యశౌచరహితులైన గురహంకారులను, స్వార్థ పరులను. వక్రబుద్ధులను తయారుచేసిన ఉదహారణలు పెక్కులు పేర్కొ వచ్చు. గురుభార్య తనచేతిలోవేసింది ఘృతమో, ఆముదమో తెలియకుండా విద్యార్థ్యాశ్రమం వెళ్ళబెట్టిన పుణ్యాత్ములెందరో, ఉత్తరజీవితంలో నేతికి మరిగి అంగుడులేకుండా, నేతిపుండలను కాజేసినవారున్నారు. బడి యాగ శాల కట్టెళ్ళలో పుష్పసౌరభమంటే ముక్కుమూసుకొన్న మునిముచ్చు లెందరో కాలేజీల్లో స్వచ్ఛందజీవులై నిరంతర వదనోద్గత ధూమ గంధంలో సోదర విద్యార్థులనుకూడ ముంచెత్తేస్తోంటారు. బడిలో ఒండు. గ్రంథాలను ముట్టక, నిర్ణయ పాఠ్యభాగాలమట్టుకే, మైలపడకుండా పారాయణచేసిన స్వయంపాకులెందరో, కాలేజీల్లో ఏకాగ్రచిత్తతతో హంసవింశతీ పఠనానిమగ్నులు కాగలరు. కాలేజీ పట్టణాల్లో కసితీరా నిరంతర కాఫీ కైలాసవాసం, సినీమా స్వర్గసీమ నివాసం చేసే గుణ గరిష్టులలో. పెక్కురు బడి పిండిపట్లలో క్షుత్పిపాసాదిషడూర్మ్యలను జయించిన మహాజ్ఞానులే. అంచేత, పెటుకూ పెటుకూ, పాఠాలకట్టెలు:

విరుస్తో, హోమాగ్ని జ్వాలల రేపుతే బడిలోచేసే పాతాళహోమాల సార్థకత సంశయనీయం. కుర్రాళ్ళకళ్ళు చింతనిప్పులయ్యే సెగపొగల్లోకి సరస్వతివచ్చి వీణవాయించుకుంటుందంటే నాకు నమ్మకంచాలదు. వాగ్దేవత వీణమీద రాగాలాపనచేసుకొంటోన్నట్టు రవివర్మ చిత్రించిన చిత్తరువులో, ఎంతసేపూ. మలయపవనాలూ, మయూర నృత్యాలూ, చిరుమేఘాలూ వసంతవసంత కూజితాలు యిత్యాది సుఖసన్నివేశాలే కన్పిస్తాయికాని, ఎక్కడా హోమకుండాలు కన్పించవే!

అయితేం, అర్థశతాబ్దంకిందట, అంటే, మా హెడ్మాష్టరుగారు మా బడికొచ్చిన నాటికి, బోధనావిధానం, నేపైన మనవిచేసిన మాదిరీని ఆట్టే ఆటపాటలసొంటులేకుండా, శుచిగా మడికట్టుకొన్నట్టు ఉండేదట. విన్నన్న చెప్పింది వేదం అని విశ్వసించి, వేదాధ్యయనం వతుగానే, పాఠ్యభాగాలు, వ్యాకరణం తెగరుబ్బుతోండేవారట, పేరడైజు లాస్టు ఆహుతి అయిపోయినా నేను తప్పచెప్పి లోకానికి లోపంతీర్చగలనన్న మెకాలే రీతిగా, నెస్ఫీల్డుగ్రామరు గైర్హాలియా ఆయినా మేము ఆంగ్లభాషను రక్షించగలమని తొడగొట్టే సుశిక్షిత వ్యాకరణ వస్తాదులు. శబ్దవస్తాదులు, ఆనాటి విద్యార్థులు [illegible] సాలో వాహ్యాళికి పయిటిపల్లో వంతెన కాకా చెప్పినా, లేక ఏదెప్పనిసరి పెళ్ళికెళ్ళినా, దారంట జాగ్రఫీ పట్టణాలు, నదులు, పర్వతాలు, సరస్సులు ఆంజనేయ దండకాల్లా పారాయణచేస్తూండేవారట. కురుపంటో ఉంటే ఆ పట్నాల దండకం ఏదేశాన్దో అన్న చిన్నవిషయం మరుపుకాని, దండకంలోనుంచి ఒక్క పట్నమైనా పోనిచ్చేవారు కాదట; మంచి ధారణాశక్తి. ఏ విద్యార్థి అయినా తన తండ్రిగారు పోయిన తేదీ మరచేవాడు కాని, మూడవ యడ్వర్డు చనిపోయిన పుణ్యదినం మరుపెరుగడు. నాలుకచివరుండేదట. పాపం మెట్రిక్యులేషను విద్యార్థులు యిద్దరో ముగ్గురో ఎక్కడో వివాహానికెళ్ళి పెళ్ళివారు మాటమడిగాక పెళ్ళిపందిట్లో రాత్రి తాటాకు చాపలమీద పడుండి, నిద్రరాక ఒకడు ట్యూడరురాజులయొక్క, రెండవ వాడు స్టూఅర్టురాజులయొక్క మరణతేదీలు ఏకరపెడ్తోంటే, పెళ్ళివాకట్లో

మరణరిజిష్టరు పారాయణచేస్తోన్నందుకు పెళ్ళివారు తన్నడానికి సిద్ధమయారు. 'ఇప్పుడు పుస్తకాలుతీసి చూపెడ్తాం. ఒక్క తప్పులేదు. ఎందుకు కొడ్తారు' అని వాళ్ళ వాదమట, ఎందుకు కొట్టేదీకూడా ఎరగరు. ఆనాటి మా పెద్దలెందరో యీవిధానంలో తయారైన సిష్టులే. యిద్దరు ముగ్గురు కుర్రాళ్ళు చదువుకునే ఓకొంపలో ఆడాళ్ళకు, కాగ్నెటు అబ్జక్టు కేవలం కంధా బచ్చలకాడా కూరలా అలవాటై ఊరుకొందట. రాత్రిళ్ళు కుర్రలను కూలేసి నూరీనాడన్నమాట వాళ్ళనాన్న. తెలుగుమాటల్లో యింగ్లీషు చెప్పడం తెలుగాయిరి! దీపాలు ముట్టించింది లగాయితు దోంగ పొద్దువేళదాకా అనునిత్యం, కుర్రాడికోసం ముసిలాడూ, ముసిలాడు కోసం కుర్రాడూ కాగ్నెటు అబ్జక్టును నోటకరచి ఎవరా వాలూ కయ్ బాయ్ మంటూంటే ఆడాళ్ళకుమాత్రం అది ఎందుకురాదూ? వాళ్ళు వ్రాయలేకపోవచ్చును, పీటలుదగ్గర మంత్రాలుమాత్రం తెలిసి చదువుతూన్నారా యాగ్గీకులు? భట్టీయంలో ఉన్న మహాత్మ్యమే అది. అర్థం జారిపోయినకొద్దీ బట్టీ గట్టిపడ్తుంది. కర్మంచాలక మధ్యగా అర్థమవడం మొదలెడ్తే, తాడు తెగిందన్నమాటే. చూచారో లేదో, యీచిత్రమెపుడైనా, ఉచ్చారణమాత్రాన మనసుకు గోచరించే స్వల్పాతిస్వల్ప విషయాలను, పీకిపాకమెట్టి వర్ణించబోతే, చదవేస్తే ఉన్నమతీ పోయిందన్నట్టుగానే, అగమ్యగోచరం అయి ఊరుకొంటాయి. అతిపరిచయం అవజ్ఞ హేతువవుతుందని పండితరాయలన్నారు. మేము కాలేజీలో చదువుకునేరోజుల్లో మా అదృష్టంకొద్దీ మాకొట్టు పక్కకొట్టులో ముప్పైఏసి ఏళ్ళవాళ్ళు యిద్దరు మాష్టర్లు ఎలిమెంటరీ ట్రయినింగు పరీక్షకుకట్టి చదువుతున్నారు. వారు పాఠంచదవడం సొంపు: చదువుతోన్నదికూడా మరేం పెద్దవిషయం కాదు. 'నల్లబల్లమీద తెల్లసుద్దతో వ్రాయునది.' ఇంతే ఆరాత్రి వారు చదువుతోన్నది. దీనికే వారు తిరుగా తెల్లవారగట్ల లేచిందిన్నీ. వారు చదివేది విన్నంతమాత్రాన చంటిబిడ్డకైనా మనసుకు గోచరించేదానా? మరచిపోదాం అంటేమాత్రం, మరచిపోడానికి ఏముందిదాన్లో? తప్పు చెప్పటానికి వీలేలేదుకదా! అయితేం, వారు దానిని వదేసి వేళ్ళారుగా

ఒకగంట, మరోగంట ఘన జట చెప్పినట్లుగా ఒకరు నల్లబల్లమీద అనడం, రెండోవారు తెల్లసుద్దతో అనడమున్నూ, మూడోగంటలో విడబరచి ఏమాటకామాటగా నల్లా, బల్లా, మీదా, తెల్లా, సుద్దా తో అని గద్య పద్యరీతుల్లో చదవడం, నాల్గోగంటలో వచ్చేసిందన్న విజయగర్వంతో కలబడి ఉభయులు దాన్ని కందార్థాలుగానూ, దరువులుగానూ, నూకెయ్యడం మొదలెట్టి బుర్రలు బద్దలుకొట్టుకొంటోంటే, పరిక్ష కొట్టులో మాకు మతులోయాయి. నిజంగా వాళ్ళబట్టీ వినేఘుళ్ళల్లోనే ఏలా వ్రాయాలి అని మమ్ముల నడిగితే 'తెల్లబల్లమీద నల్లసుద్దతో' అని, తీరా అన్నామని నాలుక కరచుకుందుమేమో, నాకు అనుమానమే యిప్పటికీ.

ఎలిమెంటరీ టీచర్లదాకా ఎందుకు బి. ఏ., యల్. టీ లమే పద్దాడోపర్యాయం యీవిపత్తులో. అమితాభావాలు రెండూ సమానంగా కార్యసిద్ధికి ప్రతిబంధకాలే, ప్రమాదకరాలున్నూ. ట్రయినింగుకాలేజీలో డైరక్టరు ఆఫ్ పబ్లికు యిన్‌స్ట్రక్షను యేట్సుదొరగారికి ఫంక్షన్ చేసారు. ఫంక్షన్‌కు రెండు రోజులక్రితంలో ఒక బి. ఏ., ఎల్ టీ, సభాంతమందు చేసే వందనసమర్పణ తననోటిమీద కావాలని ఉబలాటపడి, సరేననిపించుకున్నాడు. రెండురోజులు ఎవరుపలకరించినా పలకకుండా, ఒకరోజు సెలవుపెట్టికూడా, ఎంతహతాహుతలం అయిపోయాడో, 'Vote of thanks of Mr. Yates' అన్న పదసంచయాన్ని ఎన్నివందల పర్యాయములు తిరగా బోర్లా వేసుకున్నాడో బుర్రలో, తత్ఫలితంగా, సభాధ్యక్షుడు క్లోజింగు రిమార్కున్న కానిచ్చి కూర్చునేసరికల్లా పూనినట్టుగా శెత్రివిసురుగ ప్లాట్‌ఫారంమీదకు వచ్చిపడి 'A Yate of thanks to Mr. Votes' అని కెవ్వునకేకేసి, యిక ఒళ్ళుఎరుగడు. పదిహేను రోజులు సెలవెట్టి, కొంత విద్యార్థులకు యీవిషయం మనుపురానిచ్చి అప్పుడొచ్చాడు బడికి. అర్థంచేసుకుని చదవాలి కాబట్టే లాయర్లకు యాభై సంవత్సరాల ప్రాక్టీసున్నా భావంచెప్పకలరు గాని ఒకసెక్షనూ వల్లనగాదు. అది పంతుళ్ళ సొమ్ము.

అరోజుల్లో ఒకసెకండరీస్కూలు హెడ్మాష్టరుగారు తనకొమాళ్లు కాగ్నేటు అబ్జక్టును నిర్లక్ష్యంచేసినందుకు, కేవలం, తనకే వారు తృణీకరించినట్టుగా భావించి, జంధ్యాలు తెంపుకోడానికిసిద్ధమైతే బంధుగులు పదిమందిచేరి ఆయన్ని తశ్శాంతిచేసి వెళ్ళవలసివచ్చింది. నాలుగోఫారం చదువుతోన్న కొమారుడు కాగ్నేటు అబ్జక్టుకు ఉదాహరణ చెప్పలేకపోతే వాడివీపు చిల్లేశాడు. వాడు యిల్లట్టడం మానేస్తే, తల్లి కొతుక్కురమ్మని ఏడుస్తో పడుంది. ఇంటిల్లపాదీ చచ్చినాసరే కాగ్నేటాబ్జక్టురాని వెధవని నాజివ్వాతో నేను కేక వెయ్యనంటాడు ఆయన. ఏలాగైతేం యింటికొచ్చి వాకట్లో కూ కూర్చున్నాడు కుర్రాడు. రెండురోజులై చేసినభోజనం కుర్రపీనుగ, వాడు తింటేగాని యింట్లో తల్లి మిగతాపిల్లలు నాలుకమీద మెతుకు పెట్టుకోలేకుండాయున్నారు. వాడికి తిండిపెడ్తేనే యీముసిలాడు ఏమి ఉగ్రుడైపోతాడో అని హడలిపోతున్నారు. ఆయనతప్ప యింటిల్లపాదీ ఉపోష్యాలు. ఆడాళ్ళు ఎక్కడివాళ్ళు అక్కడే కొంగులు పరచుకు పడున్నారు. పిల్లలు వాళ్ళ అమ్మవంక నాన్నవంక చూస్తో బెంబేలుపడిపోయియున్నారు.

ఆయన తుంగచాపమీద కాళ్ళకు కండువాకట్టుకొని కూర్చుని మధ్యమధ్యన ఒకసారి ఎగుపువచ్చినట్టు 'కాగ్నేటుఆబ్జక్టు రానివెధవ ఏమి కాపురంచేసి వెలగబెడ్తాడనో వీడికి పెళ్ళిమాటలుకూడాను' అంటో కయ్యిమంటో, తన చిన్ననాటి వ్యాకరణ మననాభిలాషను సింహావలోకనంచేస్తోన్నాడు. ఇంతలో బి. యే పరీక్షలైనాయి రెండోకొడుకు బంగాగి వాకట్లో అడుగెట్టాడు. ఇంటివాలకం చూచి రెండుమూడురోజులక్రితం యింట్లో ఎవరో చచ్చిపోయారనీ, ఏడ్చి ఏడ్చి యింటిల్లపాదీ పడియున్నారనీ, తనపరీక్ష చెడుతుందని తనకు తెలియనిచ్చా కాదని అనుకున్నాడు. కాని, మూర్తులన్నీ విలియాకొస్తోన్నాయి. ధైర్యంవహించి ఎదురుగుండా కూర్చునిఉన్న తండ్రిగారిని, ఏమిమునిగిందని యిట్టేఅడిగాడు. ఆయన ఒక్కఊపులో కాళ్ళకండవాలాగేసి, అశ్వద్ధామలా లేచేసి, 'ఒరేయి వన్నాకట్టే మాట్లాడించక, నేనువింటోంటే కాగ్నేటుఅబ్జక్టుకు ఒకఉదా

హారణచెప్పి, ఆమూలకూర్చున్న ముంగిపెధవకి యింతగడ్డెట్టు' అన్నాడు. అదేదోచెప్పి తండ్రిగారికి కోపోపశమనం చేయాలనేఉంది కాని తను కాలేజిచదువు నాలుగుసంవత్సరాల్లోనూ దాన్ని పూర్తిగా మరచిపోయాడు రెండోఅబ్బాయి. ఆఒక్కటీచెప్పక యితరం ఏమిమాట్లాడినా తినేసేటట్టు చూస్తున్నాడు ముసిలాడు. చచ్చీచావు వచ్చింది. బాగా వ్యాకరణవాతం కమ్మిఉన్నాడు ఆయన. 'అమ్మా అన్నయ్యవచ్చాడే' అనిపాపాయి అన బోయిఅంతలోనే తండ్రిని మాచి హడలిపోయి, యికపట్టలేక వాళ్ళమ్మమీద పడిబాఱుమంది. దుఃఖంఆపుకోలేక పిల్లను కౌగలించుకొని గొల్లుమందిఆవిడ. 'అయ్యో' అని యీరెండోఅబ్బాయి లోపలికి వెళ్ళబోతే, 'ఇదిచెప్పి ఏడ వ్వోయి యింట్లోకి వాళ్ళకేమీ వచ్చినభయంలేదు వేషాలూ వేషాలా' అని అంటాడు ముసిలాడు. ఇంతలో అమ్మమ్మగారు వంటింట్లో గంజివారు స్తోంది, చిందులు కాలిమీదపడ్డాయేమోకూడా. మతిలేక, వాకట్లోకొచ్చి పడి, 'పరీక్షిచ్చి కుర్రాడు నట్టింట అడుగెడితే, వచ్చావా నాయినా అనే రుణమైనా లేకుండాచేస్తావా యింటిల్లపాదికి. రెండురోజులనుంచి తిళ్ళూ తిప్పలూ లేకుండాయున్నారు పిల్లా జల్లా. చదువులపేరెట్టి యింటిల్లపాదిని చంపెయ్యదలచుకున్నావేమిటి పోనీ చెప్పు' అంటో చర్రుమంది. ఆఊతం చూచుకొని రెండోఅబ్బాయి, 'నువ్వూ నీకాగ్నెటుఅజ్జట్టు బయల్దేరారు ఏలాగైతేం. నీవుతప్పితే మరోమానవుడేవరూ ఆపెధవ అజ్జుసూసు ఎత్తటం లేదు' అంటో తండ్రిమీద తిరస్కృతి చూపుతోన్నట్టుగా 'లేవరా తమ్ముడూ కాళ్ళుకడుక్కో — భోంచాతాం' అని వాడ్ని నూతిదగ్గరకు తీసుకెళ్ళాడు. అంతే ముసిలాడు ఫట్టున జంధ్యాలు తెంపేసుకొన్నాడు.

మరోయింటి అమ్మాయి - పట్టుమని పంద్రెండేళ్ళులేవు- డేగిసాడు నీళ్ళతోడే వయస్సు లేకపోయినా 'డేటివుకేసు అంటే క్రియకున్న రెండుకర్మలలోను మనిషిరూపంలో ఉన్నకర్మ అని నాన్నరోజూ చెప్పటంలేదు అన్నయ్యా! వస్తురూపకకర్మ కాదురా' అని అన్నగారికి కష్టకాలంలో, సులువుగా అందిచ్చేది. కుర్రాళ్ళకు యీకష్టకాలాలు తరచు వచ్చేవి. నాన్నగారి స్నేహితులువస్తే వీళ్ళ చదువుకునే గుడ్డిదీపం

దగ్గర చేరినట్టే చేరి వ్యాకరణపరీక్ష మొదలెట్టేవాడు. ఓకుర్రాడివంక చూచినట్టే చూచి 'ఏదీ, వరే, కాముడూ చెప్పూ' 'Nouns ending in -s-sh-ch or x or ex form the plural' అని అందిచ్చి వదిలేసే వాడు. వాడు చయ్యిన అవాయిలా 'by adding "es" to the singular, as class, classes' అంటూ పదిహేను ఉదహారణలసహితం చెప్పకపోతే యింటిల్లపాదీ బ్రహ్మానందభరితులయ్యేవారు. అక్షణంలో కాముడు కలక్టరో, జడ్జియో కాగలడని కళ్ళు నెత్తిమీదికొచ్చేవి. కాని సుఖాలు క్షణికాలు అన్నట్టు అంతలోనే ఆవచ్చిన పెద్దమనిషి - వాడి దుంపతెగ - కుర్రాడిని Man-of-war, index, crisis, radius వీటికి బహువచనం అడిగి యింటిల్లపాదిని దుఃఖసముద్రంలో ముంచే వాడు. గృహస్థు కాస్త గుక్క తిప్పుకొని కుర్రాడి కవి రానిమాట లేమో అర్థం చెప్పి అడుగు, మామా, అంటే, 'భేషుగ్గా' అని Man of war అంటే యుద్ధపురుషుడు అనో యుద్ధంయొక్క పురుషుడు అనో ఏదోవిపరీతార్థం చెప్పేవాడు. వల్లకాటివ్యాకరణపు సామే కాని, భాషా జ్ఞానం పెద్దాళ్ళకైనా అంతలోదే. మరోరకం గుంటనక్క నాఅనుభవంలోఉంది. రిఫ్లెక్సివ్ ప్రోనౌన్ ఏమిటో చెప్పమనేవాడు చల్లగా. చెప్పలేకపోతే అక్కడికి మహాఅందిచ్చి వరగబెట్టే సధర్ముడిలా 'ఎవడు చేసిన పాపము వాడికే, అప్పుడో యిప్పుడో, కొడ్తుందిరా కాముడూ' అంటూ, సన్నగా సంగీతధోరణిలో తెల్సీ తెలియకుండా ఆలపించేవాడు. కుర్రాడుగ్రహించుకొని Rama hurt himself అనాలట. తాను అంత అందిచ్చినా చెప్పలేకపోయాడు కాబట్టి, మీకుర్రాడు శుద్ధపూజ్యశా, భ్రాజమానమో, దద్దోజనమో అన్నట్టు ముఖంపెట్టి వాడివాళ్ళవంక చూచేవాడు. కుర్రాడు సమాధానాలు చెప్పేస్తే, వాడ్ని పడకొద్దా మని ప్రయత్నమే ఆయిరి మొదటినుంచీ. అంచేత పద్ధతిమార్చి Six and six — eleven అని వాక్యాన్ని పూర్తిచెయ్యమనేవాడు. వ్యాకరణ పరీక్ష కాబట్టి Make అనాలా, Makes అనాలా ఆబిడ్డ దృష్టిఅంతా కేంద్రీకరించి పాపం చివర 'లెవెన్' ఉందని గుర్తించకుండా వ్యాకరణం

రైటుచెప్పి వాక్యంవప్పుచెప్పితే, 'ఆరు ఆరు పదకొండుట చూసావోయి, బావా, వహ్వా' అంటో నవ్వేసేవాడు. బాలుడు వ్యాకరణం, గణితం రెండు తప్పుగాచెప్పాడా, ఒక్కరాతికి రెండుపిట్టలు పడ్డట్టు పండగే. వ్యాకరణంపేరిట బాలురను యీలాంటి చిత్రవధలుచేసి ఆంగ్లపాండిత్యం అలవర్చాం అని ఆనందించుకొనేవాడు. కలకలలాడుతో ఉండే పిల్లలకు యింగ్లీషువచ్చిన వేలువిడిచినబంధువు యింటికివస్తే ఏడుపుమూఖాలేసుకు కూర్చోవలసివచ్చేది. సర్వేజనాః, యింగ్లీషు వ్యాకరణసూత్రాలంటే కేవలం ఆర్టికిల్సు ఆఫ్ ఫైత్‌గనో, టెన్ కమాండుమెంట్సు వతుగనో ప్రజలకు భక్తితాత్పర్యా లుండేడివి. సంఘం బాగా బానిసభావజాడ్య ప్రకోపితంగా ఉండేది.

అదేమిటి, యిదేమిటంటో పల్లెత్తు ప్రశ్నించకుండా, వంచిన తలెత్తకుండా, పడవల్లించేయడం, బ్రితికిబాగుంటే వృద్ధాప్యంలో నెమలి వేయడం, విద్యార్థుల విహితకృత్యం అనే సంపూర్ణ విశ్వాసంతో తలితండ్రులు, బంధుగులు, పంతుళ్ళు, తక్కుంగల విద్వజ్జనులు విద్యార్థులచే హోమాలు చేయించే వేదమతకాలంలో, మహాచైత్యసంఘారామ కులపతి, అమృత పాదార్హతులే కానీండి, వారి నూతన విధానం ఎంత సంస్తవనీయం ఎంత సత్ఫలిత దాయకం కానీండి, నూతన విద్యావిధానాన్ని ప్రవేశపెట్ట సాహసిస్తే, నిప్పులు చెరుగుతారు కాని, నీరాజన మెత్తగలరా? మా హెడ్మాష్టరు మా బడిలో అడుగెట్టు నాటికి యీ భట్టీయఅక్ష మతం మహోజ్వలంగా మంచివ్యాప్తిలో ఉంది. ఆ నాటి తణుకు పౌరుల నేరిని చూచినా ఆర్షమతోద్ధరణకు కంకణం కట్టిన కాణ్వవంశ ప్రభువులను తలపుకు తెచ్చే మతావేశపరులే. అందుచే విద్వజ్జనులలోనున్న ఏ ముగ్గురు నల్గురు సంస్కరణాభిలాషులో దక్కమిగతా యావన్మంది మా హెడ్మాష్టరుగారి నూతన బోధనా విధానాలకు విముఖులే. నూతన భావాలు ప్రవేశపెట్టి యువక హృదయాలను కరప్టుచేస్తోన్నాడని సోక్రిటీసును గ్రీకులు హింసించినట్టుగా, యీ దాక్షిణాత్యుడు పూర్వ విద్యావిధానాలను విధ్వంసంచేస్తోన్నాడని, విద్యార్థులకు ఆటపాటలనేర్పి ఆతతాయులను చేస్తోన్నాడని వివిధరీతుల ప్రచారం ప్రారంభించారు.

ఒక ఉదహారణ: ఒక సిద్ధాంతి సిద్ధాంతంనుంచి కుర్రాళ్ళ చదువులకు తణుకు కాపరం వచ్చాడు. కుర్రాళ్లు యింగ్లీషుపాఠం చదువుతోంటే ప్రక్కను కూర్చుని, ఆచదివేదేమో అర్థం చెప్పమన్నాడట. ఆయన అడిగినట్టుగానే, ఆరోజున చదివేది వర్డ్స్‌వర్త్, 'up, up, my friends', అన్న పద్యం అయింది. దాని భావంపిల్లలు చెప్పగావిన్నాడు. జ్ఞాన సంపాదన చేయాలంటే పుస్తకాల్ని భూస్థాపితంచేసి, చెట్లని పుట్లని పట్టిపోండి. త్రాసిల్లో, లిన్నెట్లో, గుప్పెడుపిట్ట, వందమంది ఉపాధ్యాయుల పెట్టు. యింకాచూస్తారేం. యీచమురు ఖర్చు ఎందుకు పొలాల్లోకి పరుగెత్తండి, అని ఏకొంచెం ఆలస్యం తాను భరించలేనట్టు, అప్, అప్! లేవండి లేవండి' అంటూ వర్డ్స్‌వర్త్ కాళ్ళల్లో నిప్పులు పోస్తాడు ఆపద్యంలో. పిల్లలనోట యీమాట, వింటూనే మండిపడిపోయి, వీధినిపడి ఆ సిద్ధాంతిచేసిన గగ్గోలుకు హద్దులేదట. దర్మిలా యుద్ధపర్వంలో క్షేడీపార్టీలో (ప్రముఖపాత్ర) వహించాడు. యీసిద్ధాంతి అనేక సభల ఆర్ష దీక్షాభిమానిఅయిన పంచాయితీ ప్రెసిడెంటుగారికి అంతరంగికుడైనాడు.

యీతావాతా చెప్ప వచ్చేది: ఆదిలో వైరకారణం విద్యావిధాన ఆశయఆదర్శ వైవిధ్యమే కాని, వ్యక్తిత్వవైషమ్యంకాదు. మరే ప్రత్యేక పగ కాదు. Fame is the focuss of all the misunderstandings which gather about a new name' అన్న సూక్తి మా హెడ్మాస్టరుగారికి అతుకుతుంది. ఆయన్ను అర్థం చేసుకోలేనివాళ్ళు, అపార్థంచేసుకొన్నవాళ్ళు వేలుండేవారు. అంచేతకూడా అంతపేరుమోసిన ఆచార్యుడా నాటలేడు. ఆయన ఎదుర్కోవలసి వచ్చిన ప్రతి సంఘటన ఆయన కీర్తికి మరోమెట్టు అయింది. యుద్ధాలు కలిగాయంటే ఆయన దుష్టుడై కాదు, గ్రామస్థులు దుష్టులై కాదు. ప్రభుత్వవిషైక నిర్లిప్తత పరభాషావ్యామోహము తప్పితే యితర విషయాల్లో సంఘం సజీవంగాను చైతన్యవంతంగాను ఉండేది. ఈనాటివలె, ఎంత అన్యాయం కళ్ళ ముందు జరుగుతోన్నా, పబ్లిక్కు ఒపీనియను క్రియేటు చేయలేని జడం కాదు సంఘం. ఔను, కాదు, నిష్కర్షగా వినిపించేది. నిత్యజీవితంలో

ఎంత ప్రాణావసర సమస్యకైనా నిర్లిప్తత వహించే యీనాటి మనస్తత్వం కాదు ఆనాటి ప్రజలది. మిడిల్ క్లాసును నేడు నిర్వీర్యులను చేస్తున్న ఆర్థిక రాజకీయ సమస్యలుకాని, వర్గాధార పక్షపాతపూరిత ప్రభుత్వ చర్యలుకాని, కులకక్షలుకాని, వర్గవిభేదాలుకాని ఆనాడు ఎరుగము. నిత్యజీవితంతో సంబంధించిన విషయాలను పట్టించుకొనేవారు. వాటిలో, అట్లైనా, యిట్లైనా గట్టి విశ్వాసాలుండేవి, ఎవరవాడు చెప్పేమాటను 99 పాళ్ళు రిజర్వేషనుతో ఊకట్టడం ఎరుగరు అప్పుడు. నమ్మినవిషయాన్ని పాలించడానికి జవసత్తువలు, పట్టుదల ఉండేవి. ఒక్కమాటలో చెపితే అబద్ధపు బ్రతుకులు అలవడలేదు. పదికాకుల్లోకి ఒక రామచిలుక వచ్చినా, పది రామచిలుకల్లోకి ఒక కాకి వచ్చినా ప్రత్యక్షంగా కస్సు బుస్సు మనేవారు. కాకిఏదో, రామచిలుక ఏదో తెలియకుండా వేషాల మీదున్న కాంగ్రెస్సు మెంబర్లు అప్పటికి యింకా పుట్టడం ప్రారంభించ లేదు. విహితుడెవడో, విరోధిఎవడో చంటిపిల్లలకుకూడా తెల్సేది. తిట్టుకుంటే చక్కగా అర్థం అయ్యేటట్టు తిట్టుకొనేవారు. అవసరమైతే, అప్పుడే, అక్కడే నిర్మొహమాటంగా చేతులు కల్పుకునేవారు. అంతే కాని యిక్కడి కారణాలకు మదరాసు మినిష్టర్లదాకా వెళ్ళి చాటుదెబ్బలు కొట్టడాలు ఎరుగరు. ఈనాటి నిలువల్లామాయ ఆరోజుల్లో కన్పించేది కాదు. పరోక్షప్రక్రియలతో నిమిత్తంలేకుండా, శుభ్రంగా తగాదాలు ఎప్పటివి అప్పుడు, ఎక్కడవి అక్కడ ప్రత్యక్షంగా, హస్తాహస్తి నఖానఖీ, పరిష్కార మయ్యేవి, ఊళ్ళో పెద్దలు పరిష్కారం చేయలేని వాటి మాటచెప్పా.

గ్రామంలో మంచి కలిసికట్టుతనం ఉండేది. ఆనాటివాళ్ళ అన్యోన్యం అద్భుతం. ధనికుడూ, పేదా ఒకర్ని ఒకరు కామయ్యబాబూ, శేషన్నయ్యా అంటూ వరసవావుల్లో పలకరించుకొనేవారు. ఎంత సన్నిహితుడైనా, ఏకకుటుంబీకుడైనా మిస్టరు సో అండు సో అయిపోతున్నాడు యీనాడు. సాక్ష్యానికొచ్చి బంధుత్వాలు వప్పుకుంటే స్వంత ప్లీడరు లబోలబోమనేవాడేమో కాని, గ్రామంలోమాత్రం నోటినిండా

బంధుత్వరీతుల్లోనే సంబోధించుకొనేవారు. ఉన్నవాడూ లేనివాడూ అనే ప్రశంసానిరసనలు కోర్టుల్లో వకీళ్ళ వాదోపవాదాల్లో వినిపించేవేమో కాని, గ్రామజీవితంలో ఆ వివక్షత కన్పించేది కాదు. శుభసమయాల్లో, పెళ్ళివారెవరో పైనాళ్ళెవరో తెలియకుండా పనేసుకుపోయేవారు. వెంకయ్యమామ కూతురికి వివాహంకాని, దాని తర్వాత శుభకార్యంగాని జరుగుతోంటే, కేవలం తమకు జరుగుతోన్నంత ఉబలాటంగా నడుంకట్టేవారు. పద్దెనిమిది యిరవై ఏళ్ళ కుర్రాళ్ళు తెల్లవారకుండా రెండెడ్లబళ్ళను కాల్వకో చెరువుకో పట్టించి, గుండిగలతో నీళ్ళుతెచ్చి వంటబ్రాహ్మల కందిచ్చేవారు. సూర్యోదయం అయ్యేసరికి పెళ్ళిపెద్ద కబురుతో నిమిత్తం లేకుండానే, క్రొత్త ఆవకాయబద్దతో చల్ది, తరవాణీ అన్నం — బాగా వేసంగి అయితే — కొట్టేసి, ఎవరి పనసకాయకత్తికి వారు పదునెట్టించుకొని వచ్చిపడేవారు. ఎవ్వరిని ఏమీ అడగడాలేలేవు. ఓడు కొట్టుగదిలోకి చర్రున వెళ్ళి పనసకాయలు యీవతలవేసేవాడు. యింకోడు క్రొత్తచాపల కట్ట విప్పడం. మరోడు పసుపూ నూనె తేవడం, అన్నీ నిమిషాలమీద. పది పదిహేను కాయల్నీ ఫువ్వారంలా కొట్టేసి, పసుపుచల్లేసి, పొట్టును బులబులాగ్గాదిగబోసి ఎత్తుతో, పనివాడితనాన్ని ఆనందించుకుంటో వంట బ్రాహ్మడు రత్తయ్యశాస్త్రుగ్గుకు వప్పచెప్పి, 'ఆవా పోపూ ఏలావేస్తావో యీవాళ మన పనసకాయకూర నలభీమపాకాలను మించాలి రత్తయ్య పాకయాజీ' అని ఆయనకు హెచ్చరికచేసి, చక్కాపోయేవారు కాల్వకి యీతలకొట్టిరావడానికి. ఏ అవసరానికైనా కేకకు తయారుగా యుండేటట్టు, వంటలయ్యేదాకా వంటపందిట్లో పేకవేసుకు కూర్చునేవారు. ఆడపిల్లల ఉబలాటం చెప్పనేఅక్కరలేదు. పరీక్ష రిజల్ట్సు తెల్సుకోడానికో, యుద్ధవార్తలు వినడానికో మనం పేపరువానిని చుట్టేసేటట్టు, పెళ్ళికూతురు పొద్దున్నే పక్కదిగి వాకిట్లో అడుగెట్టడం తర్వాయిగా వీధి అమ్మాయిలంతా చుట్టేసేవారు. వాళ్ళు వినేదేముంటుందనో. ఎవరింటి కార్యమైనాసరే, సంఘంలో స్త్రీపురుషులందరూ అమితోత్సాహంగా, అయాచితంగా, సాయమయ్యేవారు. స్వయంపాకులను ఊళ్ళో ముసలమ్మ

లొచ్చి చూసుకొనేవారు. పెళ్ళాలు కాపరాలకువచ్చిన యువకులు, పడక్కి రాత్రి యేవేళో యిళ్ళకొచ్చేవారేమో కాని, బాలబలగమంతా పెళ్ళి పందిళ్ళు పట్టుకు వదిలేవారు కారు. ఊళ్ళో సంబంధాలే అయితే ఎవరు ఏపెళ్ళివారి తరఫో యెరుగం. పనిపాట్లకు ఆడపెళ్ళివారిలోను, భోజనాలకు మగపెళ్ళివారిలోనూ పడేవారు. తల్లుపులదగ్గర పేర్లుచెప్పించడంలో, తలంబ్రాలు పోయించడంలో రెండు పార్టీలుగా చీలిపోయి, ఏదో ప్రాణావసరమైన మహాత్కార్యం సాధించే పూనికతో ఆ కార్యకలాపంలో ఆయాసపడేవారు. అలా సాయసంపత్తులు చేసుకొంటో సుఖజీవనం గ్రామాల్లో చేయగలిగారంటే, యీనాటి ఆర్థిక క్షోభలు అప్పుడు లేవు. నిత్యజీవితంలో వాళ్ళు పాటించదగ్గ నియమాలే వాళ్ళను రోజల్లా కార్యనిమగ్నులను చేసేవి. వాళ్ళ పొలాల్లోకి సకాలంలో నీరొచ్చి, వాళ్ళ సాంఘికాచారాలు సక్రమంగా సాగుతోన్నంతకాలం, కుంభిణీ పోయి రాణీరానీ, రాణీపోయి రాజురానీ వాళ్ళకు చీమకుట్టేదికాదు.

వారి రాచకీయ నిర్లిప్తత నొక్కదాన్ని సాకుగా తీసుకొని, వారిని జ్ఞానశూన్యులైన అటవీజనులుగా భావించే అర్థరహిత, వక్రవిమర్శనకు సమాధానమే యియ్యక్కరలేదు. నన్నయ్యగారి భారతమంతా చదివినా స్వాతంత్ర్యంమీద, ప్రజాస్వామ్యంమీద నాలుగు మూరైనపద్యాలెక్కడా దొరకలేదని ఆగ్రహించినవాడి అలక తీర్చనక్కరలేదనుకొంటూ. ఆనాటి దేశకాలపరిస్థితులను ఆకళింపుచేసుకోకుండా ఏకొంచెం చరిత్రదృష్టి లేకుండా, ఓ సాంఘికాచారాలను కాని, సాహిత్యాన్ని కాని విమర్శించే సాహసాన్ని గర్హించాలి. ఆర్షదీక్షాభిమానులన్న సనాతనులు ఛాందసులు కారు. రసప్లావితజీవితం అనుభవించినవారే. ఐహికవాంఛలులేని నిస్పృహులుగారు. శృంగారరసప్రధాన కావ్యాలను రొట్టలేస్తో వినేవారు. భామకలాపంగాని గొల్లకలాపంగాని చూస్తే ఆపిల్లను ఆపామాఖీగా వదలేవారా? బహు సునిశితమైన విమర్శచేసి లోతుకనుక్కునే సమర్థులూ తరచు పురాణశ్రవణం, వేదాంతచర్చ, ధర్మశాస్త్రగోష్ఠి, సాహిత్యవిచారణ, ఆయుర్వేద జ్యోతిష విచారణలు సాగుతోండేవి. అగ్నిహోత్రాలు,

అతిథి సంతర్పణలు జరగడం సామాన్యవిషయమే. విధాయకకృత్యనిర్వహణకు వీసమెత్తైనా వారపారలు రానీయని నిబ్బరంకలిగినవాళ్ళు. 'సాంధ్యకృత్యముతీర్చి, సావిత్రి జపించి, సైకతస్థలి కర్మసాక్షికిఅగ్గి' శుచి శుభ్రతల క్షేమూలా లోపం కల్గనిచ్చేవారు కారు. ఇకన్లా లోపమేమంటే, కొనుసారం కావిడాడిదగ్గర పాలు కొనుక్కొని, కాఫీ కాచుకు తాగలేదు వాళ్ళు. మన ఉద్దేశ్యానుసా  గా, నాగరకతల్లా అదాయిరి కొలతబద్ధ, ఖర్మం. ఆకడుపుల్ని పుట్టి, యీలా తయారై ఊరుకున్నాం. ఏంచేసేదీ.

నేను జన్మించిన కాలంనాడు ప్రజలకు జ్ఞానోదయం కల్గిస్తో, గ్రామజీవితాన్ని శాసిస్తో, నిర్మలంగా, తేజోవంతంగాయున్న యీ పునీత సనాతనం, నేను కాలేజీ చదువుకు రాజమండ్రీ వెళ్ళేనాటికి ఆపదునొనిమిది యిరువది సంవత్సరాలలోను క్రమేపి దాని విశిష్టతను, ప్రాశస్త్యాన్ని కోల్పోతో కలుషితం కాజొచ్చింది. కాలానుసారంగా, చేసుకోవలసిన ఏ చిన్న సంస్కరణ చేసికోలేకుండా, చైతన్యరహితమైంది. నిర్మల సనాతనం అడుగంటుతోంది. కాని అధికారం ఒక్కసారిగా పోతుందా? అధికారస్థానాన్ని భేషజపు, బురిఖాసనాతనులు ఆక్రమించి అధికారం చెలాయింపసాగారు. వేదమతప్రతిష్ఠ చేస్తోన్నామంటూ పైకి మాట, నిజానికి ప్రత్యేక కక్షలుతీర్చుకోవడం అట. ఏచిన్నసంస్కరణ ప్రవేశపెట్టినా ఆవ్యక్తియందు తమ కిష్టంలేకపోతేసరి, జైకాళి అంటూ ఒక్కపెట్టునలేచి ఆతణ్ని హతమార్చేవారు. సంఘాన్ని ఉద్రిక్తులనుచేసి, ఆతణ్ని బహిష్కరించి, హింసపెట్టేవారు. ఈ నూతనశ్రోత్రియ పటాలానికి, హింసాకాండలో తల్లీ పిల్లా విచక్షణలేదు. రాక్షసకృత్యాలకు ఒడిగట్టేవారు. దయా, సత్యశౌచాలు, సహనం మృగ్యం. ఎంత నైచ్యానికైనా వెనుదీసేవారు కారు. ఆ కార్యకలాపంలో ఎంత హస్తముంటేనివాడైతే, అంత పూజార్హుడు. సంఘం యింకా సంస్కరణకు సుముఖం కాకపోవడంచే, యీ కృత్రిమనాయకులకు బోలెడు అంగబలం ఉండేది. మాధ్యమికులకు కూడా సాంబ్రాణిపొగేసి మతావేశపరులను చేసేవారు. నాయకులు చెప్పనక్కరలేదు ఇరువదినాల్గు గంటలూ గణాచార్యులవతుగా శివలు

త్రొక్కుతూనే ఉండేవారు. నా స్వానుభవమే మనవిచేస్తున్నా. మా గ్రామంలో రెండుమూడు కుటుంబాలవాళ్ళం సంఘ క్రోధాగ్నికి యింధనం అయినాం. ఇంగ్లాండు వెళ్ళివచ్చిన మా గ్రామవాసి, బాంధవుడు యీమని నారాయణమూర్తిగారి సహపంక్తిని భోజనంచేయడం, కారణం. ఈవిషయంలో నా అతిశయం ఏమీలేదు. మా తండ్రిగారు సంస్కరణాభిలాషి, సాహసి, మైత్రికిస్వలేటు. మతమౌఢ్యం లవలేశంలేని మనీషి, ప్రతిభాశాలి, మంచి మాటకారి. మమ్మల్నందరినీ విందుకు కొనిపోయారు. నారాయణమూర్తిగారి సహపంక్తిని భోంచేసిన మా రెండుమూడు కుటుంబాలను లండన్ పార్టీ అని తాము సనాతనపార్టీ అని నామకరణంచేసి, మమ్ము బహిష్కరించి, పరిపరివిధాల మమ్మల్ని హింసించారు. శ్రోత్రియపార్టీకి ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్ బరీ నా పెదమామగారే కావడంచేత, సనాతన పైశాచికచర్యలు నాకు ప్రత్యక్షానుభవం లోనయ్యాయి. సనాతనపార్టీ కుటుంబాలలోనుంచి, లండనుపార్టీలో వివాహితలైయున్న ఆడపిల్లలను కాపరాలకు పం ండా, ఆపిల్లలు భర్తలవంక చూడకుండా వాళ్ళకు కన్నెపిల్లలను కాపలావేశారు. శ్రీరాముపాదాలను హృదయంలో పూజిస్తో అశోకవృక్షంనీడను కృశించిన సీతలు పెక్కుండున్నారు. సనాతన లండన్ పార్టీ యుద్ధాలు ఆరెండు సంవత్సరాలు అవిరామంగా సాగాయేమో అయా వధూవరులకు సంసారవాంఛ ఉడిగాక పునస్సంధానాలైనై. లండన్ పార్టీలో పెళ్ళీడుకొచ్చిన పిల్లలకు, వివాహసంబంధ నిశ్చయం చేసుకొనుటకు ఏదూర ప్రాంతులో వస్తున్నారని సనాతన పటాలానికి చెవినిపడిందేం, వాళ్ళు ఒక్కపరుగున పుంతలు కాని, పెళ్ళివారిని వెనక్కిపంపేసి, తిరుగా వారీపూరిధరికి జన్మలో రారని గ్రామంలో యింటింట శుభవర్తమానం అందించేవారు. సనాతనపార్టీ అన్నా, పటాలమన్నా, లౌకిక సనాతనమ్మండీ. వేదార్థం చెప్పే మహనీయులు, అప్రతిగ్రహీతలైన పుణ్యాత్ములు కారు. నీతిదూరులైన లౌకికసనాతనులా వృద్ధులను చాందసులుగను, అసమర్థులనుగను, వెనక్కితోక్కేసి తామే యావత్తు అధ్వర్యం వహించేవారు. పాపం, ఆ

యదార్థవాదులు, పల్లెత్తు నోరెత్తినా, లౌకికసనాతనుల అత్యాచారాలను నిరసించిన బంధువిరోధుల మయిపోతామనే భీతితో పడియుండేవారు. నైతికసంపన్నులకు పలుకుబడిలేదు. పార్టీ అల్లగ్గచేసే సనాతనులు 'జప నియమ స్వాధ్యాయప్రపంచములు విడువగలరు బ్రాహ్మణులు, జనాధిప' అన్న రకంవారు. వీరిలో చాలామంది కోర్టులంట తిరిగి, అవజ్ఞాపూర్వ దుర్వృత్తములు పరిగ్రహించే, దుర్మార్గకర్మపరులైన విప్రులు. ఏవేళా అతిదభ్యాగతులను పూజించే గ్రామంలోని మూడునాల్గు పెద్దకుటుంబాల్లోకి, అతిథి అభ్యాగతులను అడుగెట్టకుండా ఆంక్షచేసి, ఆ కుటుంబాల్లో, శుభాశుభ కర్మలేవి సవ్యంగా జరగకుండా బాడీగార్డునేసి,

'నడవవుదేవ పితృక్రియ లుడుగును వేదార్థ సమ్యగుపదేశంబుల్'
గడగు మహామోహాతమము, పుడమి సమస్తంబు:గుజనభూయిష్ఠమగున్.'

అన్న కలికాలాన్ని ప్రవేశపెట్టిన పుణ్యాత్ములే సనాతన పార్టీ అని తొడలు కొట్టినవారు. తణుకు బడిలో చదువుకుంటోయున్న లండన్ పార్టీ విద్యార్థులకు మధ్యాహ్నవేళ తణుకు హోటేళ్ళలో భోజనాలు పెట్టకుండా, యీ సనాతన పఠాలం శ్రమించి కట్టుబాట్లుచేసి వెళ్ళేవారు మాహెడ్మాష్టరుగారొక మలబారు బ్రాహ్మణునిచే యీ విద్యార్థులకు, రహస్యంగా భోజన సదుపాయం చేయించారు. వాడైనా పాపం వంట ఒకచోట, స్థలాలుమార్చి వడ్డన మరోచోటచేసి, యీ రహస్యాన్ని హైకిపొక్కకుండా కాపాడాడు. పార్టీ ఉజ్వలంగా నడుస్తోన్నరోజుల్లో లండన్ పార్టీ కుర్రాడొకడు బడివదలిన తర్వాత, ఒక సనాతన బాలునితో మాట్లాడుతో, కారప్పూస పొట్లంతింటో తణుకు దారంట వస్తోంటే, ఏ సనాతన గణాచారి కంటబడ్డారో యీపిల్లలు, యీసనాతన బాలునికి సంపర్కదోషం తగిలియుంటుందనీ, బాలురకు జిహ్వాచాపల్యం సహజమనిన్నీ వాడు నోరు వాసన చూచుకోవచ్చునని విప్పిచెప్పినా వినుపించుకోకుండా, వాడు యింకా గుమ్మంఎక్కకుండే, కోలాహలంగా సనాతన పఠాలంచేరి వాడిని కాళ్ళగట్టుకు గెంటుకుపోయి, తలడెక్కించి, వాడు కాళ్ళవేళ్ళ తన్నుకొంటోంటే, గోపంచితం ఆరోగ్యమని: కొందరు,

పుణ్యమని కొందరూ, కొంచెంఘాటు కాని నాలికకు ఎక్కేదనని కొందరూ బోధిస్తే వాడిని పట్టుకుపట్టించి, నిర్విఘ్నంగా ప్రాయశ్చిత్త కాండ జరిపి, వీధులంట ఊరేగించి తీసుకొచ్చి సనాతన మతసంరక్షణ చేసారు. మాగ్రామ రిటైర్డు కరణం శ్రీ॥ శ్రీ॥ మండపాక రామమూర్తిగారు, వయోవృద్ధు, మా అరుగుమీద కూర్చుని వీధి భాగవతం చూసి మధ్యగా మాలోపలికొచ్చి మూతి తుడుచుకొంటో బయటికి రావడం, ఏ పుణ్యాత్ముడు పసిగట్టాడో, ఉదయం ఆయన్ని వీధిని పెట్టారు. 'చెమటపోస్తే మూతితుడుచుకున్నానయ్యా ఏం ఖర్మం వచ్చిందో గ్రామానికి, వచ్చీగానీ అని ఆయిన చెప్తోన్నా వినిపించుకోకుండా, మండపాక శేషయ్యగారి అరుగుమీద సభచేసి, వీధినాటకం రాత్రి తెన్నేటివారి యింట్లో దావాం పుచ్చుకొన్నాడని నేరారోపణచేసి,. హరహరా అని ఆయన్ని కాళ్ళ గట్టుకు నెట్టుకు పోయారు. ప్రాయశ్చిత్తాలు జాతర్లలా అత్యుత్సాహంగా జరిపించేవారు. చేయించుకొనేవాడొక్కడు మాత్రం ఖిన్నుడై యుండేవాడు. వాడుకూడా ఉత్సాహపూరితుడు కావాలని కాబోలు, ప్రాయశ్చిత్త కార్యకలాపం, శివుని పోర్టుఫోలియోనేమో నాకు తెలియదు, వీరాంగం బాజావేయించేవారు. ప్రాయశ్చిత్త కర్మలకు అభ్యంతరం కలగకుండా, యిద్దరు ముసిలి మంగళ్ళకు డోలూ సన్నాయి కొనిపెట్టి, వాళ్ళను పార్టీకి హోల్ టైము మంగళ్ళుగా ఏర్పాటుచేసారు. ఆమంగళ్ళు ఏసాలికేట అనంతశయన వాయిద్యాలకూపోయి పార్టీ కార్యభంగం కలగచేయకుండా సనాతన డోలుసన్నాయిలను మండపాక శేషయ్యగారి అరుగు గదిలో భద్రపరచేవారు. తిలలు, నవధాన్యాలు, గోపంచితం దేఖిలా సమస్తం ఆగదిలో కలకల్లాడుతో సర్వసిద్ధంగా యుండేవి. అరుగుమీద అభియోగం విచారణ అవుతోంటే, లోపల యీవస్తుసామగ్రిని బ్రాహ్మణుడు సర్దుకొంటోనే యుండేవాడు. అభియోగం రానేకూడదుగాని, శిక్ష నిశ్చయమే. ముద్దాయిమాట వినుపించుకొనే వారులేరు. చాలా కేసుల్లో ప్రాసిక్యూటర్లైనా, జడ్జీలైనా వారే. బాగా పిండపుష్టి, తిండిపుష్టి కల్గినజనం. వీరయ్య మామ వచ్చాడు అటకమీదనుంచి పులుసు

గూన దింపండరా) అనేవారు. ఎవరింటోనో నేతిగిన్నెలో గరిటవేశారని నవ్వుకోవడం నేను ఎరుగుదును దధి, క్షీరాలు మస్తుగా పట్టించేవారు. పిల్లలకు గుత్తిములగా పెరుగు, తర్వాత ఉప్పట్లూ, చెడుగుడీ. కట్టేల్లా ఉండక వాళ్ళకేం. కాఫీపానీయం, కారమ్స్ ఒయ్యారం కాదుగా ఆనాటి జీవితం.

అంచేత అవిచారణలు ఎంతోపగడ్బందీగా ముద్దాయివాదంతో నిమిత్తంలేకుండా, జెసూట్ల యిన్క్విజిషన్ విచారణలను స్ఫురణకు తెచ్చేవి. మాగ్రామవాసి, ఒకడు రాజమండ్రీ వచ్చిన సందర్భంలో నాగదిలో బసచేసాడని, భోజనంకూడా హోటల్లో నాతోనే చేసియుంటాడని ప్రొజెక్ట్యాంచేసి, అతడు పడవ దిగడంతోనే నిలేసి అతడు భోంచేసిన హోటలు పేరడిగారట. కణుగు బెణుగూ చెప్పలేకపోతే, నేరారోపణ చేసారు. 'అతడు నన్ను సాక్ష్యంవేసుకుంటానంటే, లండన్ పార్టీ వాడి సాక్ష్యం యీఅరుగుమీద నమ్ముతారని నీకు నమ్మకముండే అసాక్ష్యం వేసుకుంటావా, ఆలోచించుకో' అని సంఘబహిష్కరించి, అతడికి ప్రాయశ్చిత్తం చేయించారు. ఏబది అరువది సంవత్సరాల క్రితం నుండి అభాగ్యులను ఆఅరుగుమీద నుంచి డోలు సన్నాయిలతో, కాల్వగట్టుకు పంపించారేమో. మా గ్రామంలో ఆమూల కూటాయగ్రహారంలో అవిచారణలఅరుగు స్టార్ చాంబరులా చరిత్రాత్మకమైంది. ఒక సంతర్పణలో, సంపర్కం తగిలిన వాడెవడో దూరాడని చెవులు కొరుక్కుని, పంక్తిలో భోంచేస్తోన్న ఒకబీదబాపణ్ని, అమాంతంగా జబ్బలమీద విస్తరదగ్గరనుంచి లాగేసి, సనాతన మతరక్షణార్థం పుణ్యాత్ములు ఆబాపణ్ని వీధిచివరపారేసి వచ్చారు. ఆదీనుని ఆర్తారవాలు విని ఒకసనాతనుడే భరించలేక తనింట చాటుగా భోజనముపెట్టాడని, అగ్రహస్థును బహిష్కరించి, నిప్పూ నీళ్ళూ యీయకుండా పిల్లలకు పెళ్ళిసంబంధాలు రాకుండా నాల్గుసంవత్సరాలు పట్టిపల్లార్చారు. ఈరజాకర్ దౌష్ట్యాలకు ఒడిగట్టిన దుండగులే సనాతన మతానికి మూలస్తంభాలైతే, అది సనాతనానికి తుదిరోజులేకదా! ఔరంగజేబు పరిపాలనతోనేగా మొగల్ సామ్రాజ్యం అస్తమిస్త. శృంగేరి

పీఠాధిపతి రాణీచెన్నగారట, వారిపేరు పూర్వాశ్రమంలో; యీనైతిక పతనాన్ని నిరసించారు. వారు స్వయంగా యీ ప్రాంతాలకు వచ్చి కొన్నాళ్ళ వారి సత్రవులో బసచేసారు. పచ్చిరక్తముత్రాగే మాగ్రామగణాచార్యులా సభకు హాజరై, 'నౌకాయానం చేసిన పాపిని పాతిపెట్టడం తప్ప మరో ప్రాయశ్చిత్తం తప్పదు' అని వాదించివచ్చారు. విదేశయానం దేశకాలపరిస్థితులనుబట్టి యీనాడు నిషేధం కాదనీ, భారత యుద్ధానంతరం పురుషాభావదుస్థితిని అరికట్టుటకు అప్పటి పరిణామంలో అవసరరీత్యా తాత్కాలికంగా ప్రవేశపెట్టిన నిషేధం మాత్రమేనని పరిష్కరించి లఘుమాత్రంగా ప్రాయశ్చిత్తము చెప్పి పీఠాధిపతి వెళ్ళిన మరుక్షణంనుంచి, సనాతనబృందం పీఠాధిపతికి పేర్లెట్టి, వారిని, పీఠాన్ని బూతులుతిట్టి తిరుగా యెప్పటి ఆటే.

అధికారవాణిని ధిక్కరించారు. అంతర్వాణి కంఠాన్ని అదివరకే నులిమేసారు. సాధుజన హింస సాగినకొద్దీ వారికి సత్వోత్సాహాలు పెరుగుతున్నై కాని ఎక్కడా హృదయ పరివర్తన కల్గటంలేదు. ఈక్రూరకర్మలకు ప్రతీకారం చేయాలని నేనూ నా ప్రియమిత్రుడూ, సహాధ్యాయీ ఐన శ్రీ వక్కలంక చిన కామరాజు (నేను అతడ్ని రాజు అనిమాత్రమే సంబోధించేవాడిని) ఉపాయాన్వేషణ చేస్తోన్న కాలంలో, దైవికంగా మానాన్నగారి దగ్గరనుంచి, నామిత్రునితో మాగ్రామం రావలసిందిగా ఉత్తరం వచ్చింది. మేమూ మాయిల్లు చేరేసరికి, మా వాకిట్లో, యీసనాతన పైశాచిక శ్రేణి అత్యుత్సాహంగా ప్రాయశ్చిత్తాపరకర్మకాండ ప్రయత్నాలు చేస్తోన్నారు. విజయగర్వ సూచకమైన వాళ్ళ ఝూంకారం చకచక, చూస్తే మాయిద్దరికీ రవ్వలెత్తుపోతోంది. ఒకరిద్దరు పలకరించారు కాని, ముక్తసరిగా మాట్లాడి లోపలకుపోయాం. నాస్నేహితుడు రాజు అదివరలో మాయింటికో పర్యాయం వచ్చినవాడే. అతని రాకకు మానాన్నగారు బ్రహ్మానందభరితులై, దగ్గరకు పిలచి, 'యీ నాడు నీకిచట అజ్ఞాతవాసం అనుకో; నేపిలిచే వరకు పైకిరాకు ఎవరడిగినా నీపేరు చెప్పక కబుర్లతో పంపిస్తోండ'మని అతనికి చెప్పి ప్రత్యేక స్థలం చూపి

కాలక్షేపం చేయమన్నారు. ఎవరైనా నాతో ప్రసంగిస్తే నామిత్రుని యింటిపేరు యినీషియల్ 'వి' మట్టుకే నాకు తెల్సునని తప్పుకోమన్నారు. మానాన్నగారు ఆడబోతోన్న నాటకం యొక్క అంతర్యం ఉభయులం చూచాయగా గ్రహించాం. మొదట్లో మాకుకల్గిన పరాభవ క్లేశమంతా పోయింది. వాకట్లో ప్రాయశ్చిత్త వాలాయం తీర్చుకొని నాన్నేహితుని వద్దకు వచ్చి కూర్చుని కబుర్లు వేసుకున్నాం. మానాన్న గారి కేకకు వేచియున్నాం. సరే సంతర్పణకు సనాతన కుటుంబాలన్నీ వచ్చి పంక్తులు తీర్చికూర్చున్నారు. బాగాలౌకికుడు ప్రజ్ఞాశాలి అయిన మానాన్నగారికి ప్రాయశ్చిత్తం చేయించితీరాం చూసావా అన్నట్టు విజయగర్వంతో సనాతన పరాలం ఒకర్ని ఒకరు విలోకిస్తూ, పలకరించు కొంటో మహదోల్లాసంగా యున్నారు. అప్పుడు మానాన్నగారు పంక్తుల మధ్యకు వెళ్ళి, 'విపరీత పరిస్థితుల మూలంగా అయిదు ఆరు వత్సరాలనుంచి మిమ్ము పూజించుకొనే భాగ్యాన్ని కోల్పోయాం. మిమ్మల్నందరిని తిరుగా మావాకట్లో చూస్తే ప్రాణంలేచివస్తోంది. ఇంత కాలంనుంచి ఒక అతిథి అనీ అభ్యాగతుడనీ పైవాడెవడూ గడపత్రొక్కక, యీనాడు మా ఆడాళ్ళు పిల్లలు, వడ్డనకు వాచియున్నారు. అందరు ప్రాయశ్చిత్త కర్మమూలాన స్నానాలుచేసి పునీతులయ్యేయున్నారుకాన, వడ్డనలో కాస్త జాగుఅవుతోన్నా కోపించక వారలు వడ్డించడానికి అనుజ్ఞ యీయ'మని కోరాడు. మానాన్నగారు బహిష్కార కాలంలోపడ్డక్షోభ కన్ఫెస్సు చేసాడుగా. సనాతన పార్టీకి అదంతా కాంప్లిమెంటుగా ఎంచుకొని, 'మీ సరదాతీరడమెప్పుడు అలాగేకానీయమనవోయి' అని సనాతనులు అనుగ్రహించారు. మానాయన తద్రీతుగా సనాతన మూకను లేవకుండా కూలవేసారు. నేను నామిత్రుడు రాజుకూడా సముచితవేషులమై వడ్డనచేసాం. నామిత్రుడు, తేజస్వి, స్ఫురద్రూపి, అజానబాహు, విశాలనేత్రుడు, విపులభుజాస్కంధుడు విశ్వామిత్రయాగ రక్షణార్థం పయనమైన రవివర్మ చిత్తరువులోని కోదండపాణిని తలపుకు తెచ్చే స్పష్టసౌందర్య రేఖాసమన్వితుడు దానికి తగినట్టుగా తారుణ్యపు

తొలిరోజులు. కూడ్రైదొరగారా సంవత్సరమే అతడిచేత హైస్కూలులో ఒక్క లియా వేయించారు. మిసమిసలాడ్తోన్న అంగ సౌష్ఠవంతో, వంగపండు ఛాయతాపితాకట్టి, పచ్చని శరీర కాంతులు ప్రసరింప లోచన మోహనంగా, ఎంతో ఉబలాటంగా పంక్తులమ్మట అడిపోత్తో అతడు వడ్డించేసరికి, ఆమూర్తికీవికి, వర్ణాకు, పరమసుందర విగ్రహముయొక్క స్వర్ణారుణ కాంతులకు సంభ్రమాశ్చర్య దివ్యానందములకు లోనై, తన్మయులై, 'యీతడెవరి బిడ్డ, ఎక్కడివాడు' అని పెక్కుసార్లు అడుగుతో వచ్చారు. మజ్జిగ మధ్యస్థంలో యుండగా యిప్పుడు చెప్పవచ్చునన్నట్టు మానాన్నగారు మాకు సంజ్ఞ చేసారు. నేను, నామిత్రుడు, మానాన్నగారు పంక్తులమ్మట చెప్పాం. ప్రాయశ్చిత్తాది కర్మలకు మూలకారణుడైన మన నారాయణ మూర్తిగారితో లండను వెళ్ళివచ్చిన రాజమండ్రీ బారిస్టరు మల్లంపిల్లి నరసింహంగారికి యీ యువకుడు స్వయానా బావమరది అనీ, ఆనరసింహంగారు 'ప్రాయశ్చిత్తం అన్న ప్రశంసలేకుండా కలబడి వీళ్ళ యింట్లో భోంచేస్తోన్నాడు చూచారా విరుద్ధమనీ, మన పూర్వైతే తెల్సి వచ్చుననీ' మాంచి అవహేళనా పూరిత గాత్రంతో మానాన్నగారు సుస్పష్టంగా రాగాలాపనచేసారు. దాంతో పంక్తుల్లో హాహాకారాలు బయల్దేరినై. ఒక మతావేశపరునికి యీమాటలు ములుకులైనై కాబోలు 'హా' అని ఒక్కటే బొబ్బపెట్టి గుప్పెట్లోఉన్న పెరుగూఅన్నం సహితం విస్తట్లోకి వాలి మూర్ఛపడిపోయాడు. పాపం, కష్టకాలం. ఆ యీ మూలల్లో గణాచార్యులు తారాజువ్వల్లాలేచారు. 'ప్రాయశ్చిత్తమని పేరెట్టి వాళ్ళ ట్లోకి రప్పించి పరాభవం చేస్తావా' మాలకూడుపెడ్తావా' అని కొందరూ, 'యింతవిలువల్లా మోసం నీవు, మన్నుతావా' అని కొందరూ, 'ఎంతకాలానికి మాయింటికి దయచేసారు అంటో దొంగ ఆప్యాయత గుమ్మరిస్తో దొంగదణ్ణాలు పెట్టిందిందుకా' అని కొందరూ, 'నీవసలు ప్రాయశ్చిత్తం చేయించు కొంటానన్నప్పుడే ఏదో మోసం అనుకొన్నాం. ఏమైతేం, చెయిజారి పోయింది' అని కొందరూ, 'కలికాలం అల్లా తన్నుకొస్తోంటే, శుభం మోకాలు అడ్డుపెడితే మాత్రం అగుతుందిపోయి' అని కొందరూ,

సీచాదస్తం నాశేదస్తం మనం ఏదో సనాతనం అంటో వేళ్ళాడుతున్నాం కాని,అన్నాదయ్యా వ్యాసులవారు అన్న మాటలే అక్షరాల జరుగుతున్నాయి!

''యరాజకములై, నిర్మూల ధర్మంబులై
ద్రవిడా భీరతురుష్క బర్బరపుళిందవ్యాప్తి
దుష్టంబులై, భువిలోనెల్లెడ బాడగున్
జనపదంబుల్ దద్యు[illegible]ంతంబు[illegible]న్''

అని కొందరూ, ఉద్ధరుణులు తిరగేసి కంఠాల్లో కుక్కుకొని కళ్ళించు కొంటో కొందరూ, ఏకంగా, మెడలకు అంగవస్త్రాలు బిగించుకొని 'గోవిందా, గోవిందా' అంటో కొందరూ, ఎంగిలివి స్తర్లు చింపి కొందరూ, విస్తళ్ళమీద, గుమ్మాల్లోను నీళ్ళు గుమ్మరించుకొం[illegible]టో కొందరూ, నాపనా కారాలెడ్తోంటే, నేనూ మానాటక నారద కౌశికులం నాటక పద్యాలు పాడుతో కలుషిత సనాతన దురహంకారానికి భరతవాక్యం చదివాం. ఊరంతా ప్రాయశ్చిత్తాలు చేయించుకోవాలి ఆడాళ్ళు పిల్లలు ముసిల మ్మలదేఖలా. లేకపోతే అంతాకలిసి ఉటిపెట్టుకు చావాలి అనే విషమ ఘట్టం దాపరించింది సనాతనులకు. మజ్జిగచేతులు కడుక్కొనివచ్చిన నామి త్రుని చూచినంతన నామనసు అప్రిత్నంగా ఒక అతి లోకసాదృశ్య నిర్మాణం చేసింది. 'అనాడు మోహినీరూపంలో రాక్షసుల చేతులలో విదపకుండా వార్లను అంటకాల్చి, తిరుగాయీనాడు ఈరూపంలో చేతి నిండా అూరాక్షసులకు వడ్డించి అంటకాల్చుడాకని వచ్చావా అన్నట్టు న్నావురా రాజా. నీవీసమయంలో నాకళ్ళకు జగన్మోహినీ అవతారంలో సాక్షాత్కరించావు' అని పరమధ్యాన ముకుళిత నేత్రిడనై నాప్రియమిత్రుని చేతులందుకున్నా. అతడు 'నావంటి బేలమనస్సువాడుకాడు. ఆదరభరిత నేత్రాలతో నన్ను చూస్తో 'కవిత్వం చెప్తోన్నావు. అలస్యంచేయకుండా బండి చూడు. రేపు కాలేజీకందుకోవాలి మ[illegible]' అన్నాడు, ఎంచేతనో చిననాటి మిత్రులు జీవితఘట్టాలలో తత్ తత్ సందర్భోచితమైన, భగవ దవతార రూపంలోసాక్షాత్కరించేవారు. అంచేతనేవారికి అంతరం గార్పణ చేసేవాడిని.

ఆధునికులకు యీసాంఘిక గాథ వింతగొల్పవచ్చు. దెయ్యం పోతోపోతో చింతకొమ్మ ఊపిపోతుందంటారే, అలాగే సంఘ దురహంకారి నిరంకుశత్వాని కవి అంత్యదినాలు. పోతోపోతో దాని ప్రభావం చూపెట్టి పోయింది. అలాగే మాహెడ్మాష్టరు ఎదుర్కొన్న దుష్టశక్తులు, ఆమహాపురుషుడు అనుభవించిన హింసాకాండా, జ్ఞప్తికి తెచ్చుకుంటే, ఎంతసంకుచితస్వభావం, మౌఢ్యం, దుష్పాండిత్యం, అజ్ఞానాంధకారం విక్టోరియన్ యీరా తుదిసంవత్సరాలలో కారుమేఘంలా మనదేశాన్ని కమ్మిపోయిందో స్పష్టమవుతుంది.

సహజపరిణామశీలమైన మానవజీవితంలో సంప్రదాయం, తిరుగుబాటు దివారాత్రాలనీ, తొలితిరుగుబాటుదార్లకు విప్లవకారులకు ఏదో రంగాల్లోనైనాసరే హింసతప్పలేదని, ఆతిరుగుబాటు సవ్యం, సహేతుకం అయిన్దేఅయితే సంప్రదాయాన్ని పెల్లగించిపారేసి, ఆస్థానే తాను వేళ్ళూనుకొని, నిలదొక్కి తాను కొంతకాలం సం ప్రదాయరూపంలో జీవితాన్ని పరిపాలించగలదని, యీపరిపాలనవలన కల.. అధికారవ్యామోహంలో నూతనసంప్రదాయం, నిజధర్మాన్ని మరచి, దుష్టప్రవృత్తులకులోనై, వెర్రితలలువేసి, పూర్వసంప్రదాయంవలెనే విధ్వంసం అవుతుందనీ, పుబ్బలో పుట్టి మఖలో మాడుట్టి పట్టుమని పదిసంవత్సరాలైనా నిల్దొక్కలేక అప్పుడేవశాడుతోన్న మనకాంగ్రెసుపాలన చరితమే కానీండి, యింతకన్న మరోకొంతకాలంపాటు నిలదొక్కగలిగిన రెనైజాన్సు రెవల్యూషను చరితాలే కానీండి, ఏదైనా యీపరమసత్యాన్ని నిరూపిస్తున్నాయి. అంచేత గతించిన ముప్ఫై, నలభై సంవత్సరాల పొడుగుగొట్టంలోనుంచి యీనాడు వెనక్కిచూస్తే, అప్పటి సామయికోద్రేకంలో మరోప్రపంచ పునర్నిర్మాణం చేస్తున్నామనుకొన్న మా లండన్ పార్టీ అహంభావత్వం, అవసరమైతే రక్తంకళ్ళచూసైనా, ప్రాణాలుపుచ్చుకునైనాసరే, ప్రపంచాన్ని అరంగుళం ముందుకు జరగనీయకుండా అడ్డంపడ్తామన్న కలుషిత సనాతనపార్టీ అజ్ఞానం, రెండూకూడా ఎంతోహాస్యాస్పదంగా కనిపిస్తాయి. సుదీర్ఘ, సువిశాల ప్రపంచచరిత్రలో ఆయాఎగురుపాట్లు టీ

కప్పులో తుపానువంటు. పరిమిత స్థల సమయాలను సంకుచితదృష్టితో చూచి ఒకణ్ని 'రెబెల్' అని, రెండవవాడిని 'రియాక్షనరీ' అనీ అనుకొంటాం కాని, అనంతమైన కాలప్రవాహాన్ని విశాలదృష్టితో చూస్తే ఆపేర్లకు ఏమీ అర్థం కన్పించదు. ఈరహస్యాన్ని, యిదేమిటి విరుద్ధంగా యీలా అంటాడు అని, తొలిచూపులో మనం అబ్బురపడే 'పారడాక్సు'లో చెస్టర్టన్ ఎంతముద్దుగా చెప్పాడో ఆపదవిన్యాసం చూడండి. 'A progressive is always a conservative; he conserves the direction of progress. A reactionary is always a rebel-progress happens in short, whenever men can endure one tendency for a long time. And reaction happens whenever some particular man can endure it no longer.' ఈనిర్వచన రీత్యా ప్రకృతిశోభలో, ఆటపాటలతో విద్యగఱపే ప్రాచీనభారత గురుకులవిద్యాసాంప్రదాయాన్ని పునః ప్రతిష్ఠింపబూనిన మా హెడ్మాష్టరుగారు రెబెల్లా, రియాక్షనరీయా. 'That the children of his school should learn by reading for hours together the treasures which they have discovered for themselves by exploring and experimenting by activity, by music and drama, by making a noise' అక్షరాలాయిదే ఆశయంగా శాంతినికేతన స్థాపనచేసిన విశ్వకవి టాగూరు నేమందురో, రెబెల్లందురా, రియాక్షనరీ యందురా?

అపార బలసమేతులైన పూర్వాచారపరాయణులకు ఓడక, తణుకు వీడక, పట్టుదలే ప్రధానంగా పెట్టుకొని తనకు స్ఫురించిన విధానాన్ని అమలులో పెట్టి దానిఫలితాలను పరిశీలించుకుంటో పాతిక ముప్పది సంవత్సరాలపాటు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఆయన మా విద్యాసంస్థను పాలించకల్గియుండడం, నేటి మదరాసు ప్రభుత్వపాలనాపద్ధతులదృష్ట్యా, పెద్దవింత. నేడేఅయితే సంఘంలో ఏఒక్క ప్రజానాయకునికైనా, వినాయకునికైనా, అందాకా ఎందుకు గ్రామనాయకునికైనా, ఏ కించిదాగ్రహంకల్గినా ఒక్కమదరాసుట్రిప్పుతో, హెడ్మాష్టరునే కాదు

హెడ్మాష్టరికి యిష్టదైవం ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సుకూడా ఉద్యోగం చెప్పించగలడు. విద్యాసంస్థను విధ్వంసం చేసినైనా, ఆనాయకుని ముద్దు చెల్లించేవారు ప్రభుత్వశాఖల్లో దొరకకపోరు. విద్యాశాఖోద్యోగిని వంచించుటకు యీనాడు కేవలం విద్యాశాఖాధికారులనే వశీకరణం చేసుకోనక్కరలేదు. ఏశాఖాధికారిని పట్టినా పనిఅవుతోంది. ఈరకం అన్యోన్యోపకారాలు చేసికొంటూ యీలాంటి విషయాలలో మాత్రం కాబినెట్టు సిష్టంను మంచిదక్షతతో ఆచరణలో పెడ్తోంది ప్రభుత్వం. 'స్వార్థం అనే పాగమంచు తెరలు' శీర్షికతో, శ్రీ పి. గోపాలకృష్ణారెడ్డి సెలవిచ్చారు. 'పరపరాశాఖ పెద్దఉద్యోగులు, చట్టవిరుద్ధంగా నడచుకునే ధనికరైతును శిక్షించదలచుకుంటే ఆధనికుడైన భూస్వామి ఏఫ్యాక్టరీప్రొప్రయిటరునో, శాసనసభ్యునో పట్టి పైకిదారిచేసుకువెళ్ళి తనది ఏమాత్రం తప్పులేదని తేలబలికించుకొని, ఆగ్రహావేశుడై తన తప్పుచూపిన ఉద్యోగిని అవసరమైతే వాడి పైఉద్యోగినిసహితం సునాయాసంగా శంకరగిరిమన్యాలు పట్టించకల్గుతున్నాడు.' మనలో ఏఒక్కరికి ఏశాఖఉద్యోగులపై ఆగ్రహం కల్గినా కించిత్ కృషిచేసి, ఆశాఖోద్యోగులను నడిబజారులో నిలేసి సరదాతీరా మనమేవిచారించి ఆశాఖను ఊపేసే హక్కు తెచ్చుకోగల్గియున్నాం. ప్రజాస్వామ్యానికి పునాదివేసి, శతాబ్దాలుగా ప్రజాస్వామ్య పాలన సాగిస్తోన్న యింగ్లాండుకుకూడా యీఐశ్వర్యంపట్టలేదు. డిపార్టమెంట్లను విచ్ఛిన్నంచేసే శక్తి, ఆసక్తి వారికింకా అలవడలేదు. మనంత కూలంకషంగా ప్రజాస్వామ్యాన్ని బ్రిటిషువారు అర్థంచేసుకోలేదు అనితోస్తుంది. వారికి ప్రభుత్వం ఉల్లాసీదాఅయినా డిపార్టుమెంట్లపై డిపార్టుమెంట్లు ఉల్లాసీదాఅవడం వుండదు. ప్రభుత్వాలు మారడం ప్రజాస్వామ్య విశిష్టత. మనం ఆస్థాయీదాటిపోయాము. లేనిపోని అడ్మినిస్ట్రేటివు ఎటికెట్ అనీ, పాలనావిధాన కనీసమర్యాదలనీ, అనవసరపు ప్రతిబంధకాలు కల్పించుకోకుండా ప్రజాస్వామ్య ఫలం పండి బ్రద్దలైపోవడానికి తోడ్పడుతున్నాం. ఎలక్షను ఉప్పెన వచ్చిపడుతోందిగాని, లేనిచో మదరాసు ప్రభుత్వం సంప్రదాయాన్ని సంధానించి కల్గించే అందచందాలు

ప్రజాస్వామ్యానికింకా ఏమి తెత్తురో. పాపం వచ్చే యలక్షణకు వీరుందరు. అంతే. స్పష్టంగా జనవాక్యం వినబడుతోంది.

మాహెడ్మాష్టరుగారి ఉద్యోగకాలానికి, అత్యంత వేదనాకర మైన ప్రస్తుత మదరాసు కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలనావిధానం రాలేదు కాబట్టి, ఆయన ఏనిరత్నరాస్యుని వాతనూ పడకుండా చాలకాలం బడిలో నిలదొక్కుగలిగాడు. బ్రిటీషు ప్రభుత్వం యడ్మిని స్ట్రేటివుయెటి కట్టునూ, పాలనా నిబంధనావళిని పాటించేది. అంచేత భగ్నహృద యుడు కాకుండా, గౌరవభంగం కాకుండా, స్థానభ్రంశం పొందకుండా మావిద్యాసంస్థపై చిరకాలాధ్వర్యం వహించగలిగాడు, టాలెంటును అణగదొక్కుటకు ప్రతినబూనిన ప్రభుత్వమూ కాదది. అంచేత ఆయన తన విధానాన్ని అమలుపర్చే సావకాశం ఆయునకు చిక్కింది. ఎంతమంది కత్తిగట్టినా. తత్కారణంగా మాబడికొకవినూత్న, విశిష్ట సంప్రదాయం విశిష్యం యీయగలిగాడు.. ఆంధ్రదేశంలో వివిధరంగాల్లో పేరు మోసిన ప్రతిభావంతులెందరో, మాబడి మాతృస్తన్య పూరమున మస్తి గొన్న మహనీయులే. మాహెడ్మాష్టగారి చేతను మహితాదర్శములను గోరుముద్దలుగతిన్న బిడ్డలే. మాబడిముఖ ద్వారంలోనిలచి, మాబడికి అంకితంచేసిన వారి జీవితాన్ని చిరస్మరణీయం చేస్తోన్న స్థూప సందర్శన మాత్రన, అన్యకార్యార్థినై, దారంట పోతున్న తొందర తరుణాల్లోకూడా, అప్రయత్నంగా ముకుళిత హస్తుడనగుదునన్న, ఆయనచే సుశిక్షితులై మాబడిని వీడిన మహనీయు లెందరో నామనోఅవనిక పైఒక్కుమ్మడిగ సాక్షాత్కరించుటయే కాబోలు కారణం. మాహెడ్మా ష్టరుగారితో రక్తసంబంధంకన్న ఎక్కుడు సూక్ష్మమైన, శాశ్వతమైన సన్నిహిత సంబంధం నాహృదయానికి గోచరిస్తుంది. మాప్రాంతాల ప్రజల హృదయాల్లో ఒకనాడు, శత్రుడుగనో, మిత్రుడుగనో, నిత్య నివాసం ఏర్పరచుకొని, తీవ్రమైన భావసంచలనం కలుగజేసి, నిజమైన కులపతుల ఆదర్శానుసారం, విద్యార్థుల సర్వతోముఖ వికాసానికి తగిన వాతావరణం కల్పించి, నూతన విద్యాజగత్తుయొక్క ముఖద్వారంలో నిలచి

విద్యారంగంలో వెలుగుజూపి విప్లవశంఖఘోషలు విజయంతో వినిపించీ, తరతరాలుగా విద్యార్థులను సుపథగాములనుచేసి సర్వతోముఖంగావారికి సారస్వతాభిరుచిగల్గించిన అప్రతిమాన ధిషణాసమన్వితుడు శేముషీ ధురంధరుడు, వచోమాధుర్యధుర్యుడగు మా హెడ్మాస్టరుగారికి యీనాడు ఆయన ప్రతిపక్ష కోటికూడా అంజలిఘటిస్తోన్నారు. ఆయన అస్తమించిన తర్వాత అట్టిమేలుచేయి లభ్యంకాలేదు. తిరుగా విద్యావిధానం పాతపుంతలను పట్టోనట్టు ఆయన ప్రతిపక్షకోటికీ ద్యోతకమయింది. 'Tom Brown's school days లో సీనియరు విద్యార్థి Brooker ప్రసంగం నమూనా, నేటికి చెవిని పడ్తూంటుంది, ఆనాటి ఆయన ప్రతిపక్షులు చేరితే 'He is a Strong man and a wise one too; and a Public schoolman too, and so let us stick to him and talk no more rot and drink to his health as the head of the house' శిరస్సులమీద నీడలుపరిచే మహా వటవృక్షంవలె ఆయన యొక్కడో యెత్తుననిలచియున్నట్టూ ఈవయసులోకూడా ఆయననీడలోనే మేమున్నట్టు నాఅనుభూతి. 'An institution is the lengthened shadow of a great man' అన్నారుగా. తాను విద్యనభ్యసించిన Christs hospital కు తనగురూత్తములకు అమరయశస్సు చేకూర్చిన చార్లస్లాంబు మాటల్లో వారిని స్మరించి సెలవు తీసుకుంటోన్నా.

"Poor K ! – may all his faults be
forgiven; and may he be wafted
to bliss by little cherub boys,
all head and wings, with no
bottoms to reproach his
sublunary infirmities"

''త్రవ్వుకొలంది నీ సుమధురస్మృతి కంతములేదు. చింతయు
న్నివ్వటిలున్ దురంతమయి. నీవు బహిర్గతమైన కంటికిన్

దవ్వయినంత మాత్రమున దాపునలేవని యెంచరాదు. నీ మవ్వపురూపు మా హృదయమందిర సీమల నుండు పూజ్యమై.”

# మా బ డి



## నా ట క స మా జ ము

### నా మ క ర ణ ము

విద్యార్థిదశనాటి మాబోర్డుహైస్కూలు బాలభాస్కర సంగీత నాటకసమాజ జననం ఇవాళా నిన్నా కాదు 30, 35 సంవత్సరాల పైమాట. పెక్కు ఆంధ్రసంస్థలరీతిగానే, ఆయుస్సు అల్పమైనా మా సమాజం అనల్పమైన పేరు గడించింది. ఈశ్వరు డనుగ్రహించింది, కొద్దికాలమే అయిరి, ఎంతో చైతన్యయుతంగాను, వికచితంగాను బ్రతికింది. మా జీవితాధ్యాయం మొత్తానికే అది రసవద్ఘట్టం అనిపించుకొని పోయింది. పోనిద్దురూ, ఒకటి శాశ్వతనుట, ఉన్న పదిరోజులూ ఓహో అనిపించుకోవాలిగాని.

ఇంత భావపూర్ణం, అలంకారబహుళం, రసవంతం, రమణీయం శబ్దార్థసంపన్నం, సంశ్రవణీయం, అయిన పేరు, మండపాక బాలనాటక సమాజానికిగాని, మా చుట్టుపట్ల మరోవిద్యార్థి నాటకసమాజానికిగాని లభ్యంకాలేదు, కాబోదు అనీ, అది మా పూర్వసంచిత పుణ్యఫలమై యుండాలనీ, పేరు మజాచూచుకొని మురిసిపొయ్యేవాళ్ళం. మా సమాజ నారదపాత్రధారి ఒకపర్యాయం, సమాజేతర బాలురవద్ద డచ్చాలుకొడ్తో, ఎంతో భక్త్యావేశంతో చేసిన వ్యాఖ్యానానికి, నామనిర్ణయం చేసిన మా కృష్ణపాత్రధారి అచ్చెరువంది, 'సూత్రకారుణ్ని మించిన భాష్యకారివైతివోయి' అని నారదుణ్ని అభినందించాడు. నాకీనాటికీ మఱపురాదు. పేరు మధ్యనున్న 'బాలభాస్కర' పదద్వయం పేరంతకూ ఆయువుపట్టని,

రవికిరణాలు సోకినంతమేర మాయశస్సుపాకి, మా సమాజం ఉజ్జ్వలం గాను, జ్యోతిష్మంతంగాను వెలగగలదనే భావం, 'భాస్కర' శబ్దంలో ప్రతిబింబిస్తోందని, ఉచ్చారణచూతుమా, 'భా' ఊతంగా ఒత్తిపల్కితే ఉలుమూలగాంభీర్యం ప్రస్ఫుటమవుతుందని చెప్తో, పట్టలేక (demonstrate) చేసి చూపాడు. ఎదరఅబ్బాయి ముఖంమీద ముఖంపెట్టి, ఎంత దమ్ముపట్టి ఉన్నాడో నాలుగు, బుగ్గలు bladders లా పొంగా, కళ్ళు చింతనిప్పలుకానూ, ' ' Pistol Shot లా పేలా, నారదుడు ముందుకు తూలాడు, ఆ అబ్బాయి వెనక్కితిరిగి ముఖం తుడ్చుకొన్నాడు. 'ఎంత అభిమానమున్నా, సమాజసభ్యులే అయితేమాత్రం, దినచర్యలో అంతచేటుగా నోటికి పనిచెప్పి, నామోచ్చారణ చేస్తారా, పనిగట్టుకు చేయాలని చేస్తే, ఏపేరైనా అలా మ్రోగుతుందని' ఆ పైకుర్రాళ్ళు ననిగారు. సామయిక భావోద్రేకంలో నారదుడు ఆ నిరసన, నసుగుడు వినిపించుకో లేదు కాబట్టి సరిపోయింది. వాగ్ధాటిలో అడ్డుతగిలినవాళ్ళను ఓమట్టున వదలిపెట్టడు నారదుడు. 'సంగీత' అనే విశేషణప్రయోగం ద్వారా రస వంతమైన రాగాలు రైయ్యిన విసురుతో ప్రేక్షకులను రాల్గరగించు విమల గాంధర్వగానంలో ముంచెత్తేస్తామని యీసమాజంవారు హెచ్చరిస్తోన్నా రని, 'Board High School' అనే ఆంగ్లశబ్దగుచ్ఛం మూలంగా మా సమాజ విద్వత్ వైభవం స్ఫురిస్తుందని కోసాడు. ఎదరకుర్రవాడూరుకోక, 'బాగానేఉంది కాని, మీఊరుకు మాఊరు మూడుమైళ్ళేగా. మరి మా ఊళ్ళోనే తెలియదేం తణుకులో మీ సమాజమున్నట్టు' అన్నాడు. మా కాశికపాత్రధారి అయితే 'మీఖర్మం' అని మోటుసమాధాన మిచ్చును, వాదాన్ని తుంచేసును. సహేతుకంగా సమాధానాలొచ్చినంతసేపు వాదాన్ని సరసంగా సాగనిచ్చే వాగ్విభవం, ప్రసంగకౌశలం కలవాడు నారదుడు. నారదుడు పొడికళ్ళువేయకుండా, 'మేమింకా నాటకాలు వేయలేదుగా' అంటో అకుర్రాణ్ని కనుగప్పాడు. నారదుని సమాధానం సమయస్ఫూర్తిగా చెప్పినట్టు కన్పిస్తోన్నా, సత్యదూరంకాదు. అప్పటికి ఒకనాటకమూ పడలేదు.

ముందు నామకరణంచేసి కూర్చున్నాం, తర్వాత ఏడాదికి నాటకం పుడత. పోనీ పడత అనండి. మా Proceedure అంతా Inverse. సాధారణసమాజాలు, నర్తనశాల వేసుకొని, అవనిక, ఆభరణాది వివిధవస్తు సేకరణచేసుకొని, నటీనటులను చూసుకొని, అప్పుడు ఆఖరున పేరెట్టుకుంటాయి. మాకు పేరే ప్రప్రథమం, ప్రధానమున్ను. అలూ చూలూలేంది బారసాలా అని అన్నాడనే మా కౌశికపాత్రధారి ఒక పర్యాయం కానూరుదాకా తరిమెచ్చాడో కుర్రాణ్ణి.

చెప్పొద్దూ, నిజానికి పట్టంతా పేరులోనేఉన్నట్టు, గట్టిపేరెట్టి వదిలేస్తే అదేచెక్కుకుపోతుందన్నట్టు, ఎన్ని చెప్పినా, ప్రేక్షకుల దృష్టిని ఆదే ఆకర్షించి తనలో లగ్నంచేసుకొనేది, చివరకు పేరేఅన్నట్టు, ఫక్తు పేరుయొక్క ప్రధానావశ్యకతను గుర్తించకనే పెక్కుసమాజాలు సంస్థలు తేజోవిహీనములై కాలగర్భంలో హారాయింపు అయిపోయాయన్నట్టు మానాటకసమాజ నామనిర్ణయానికి ఎంతో శ్రమించాం. విశాలకుటుంబీకుడు నల్గురుట్టినతర్వాత యిక అక్కడనుంచి ఏదో తూతూ మంత్రంగా జరిపే బారసాలలా ఆషామాషీపని చేసామా, మాసమాజ నామకరణోత్సవము! అమ్మో! అలాగ!!

ఆనాటి మా పాఠ్యగ్రంథాల్లో ఉపలబ్ధమయ్యే సాహిత్యసంపద, మాశక్త్యానుసారంగా మేము సేకరించిన లోకజ్ఞత, యావత్తూకలబోసి, విలియావేసి వార్చి వడబోసి, విశాలవిహంగమ దృష్టితో వెతకిపెట్టిన పేరిది. నాల్గురోజులట్టింది రసాభ్యుదయోల్లాసిని కనడానికి. మూడు రోజులు మాఆదాయానికి అందుబాటులోనున్న పదజాలం పోగెట్టుటకే సరిపోయింది. చివరకు, నాల్గవనాడు, బలిపాడ్యమో, విదియో, సాయం సమయంలో, నూర్కాలుగ్రౌండులో, స్వర్ణసంధ్యాకాంతుల్లో, సంగీతపు చెట్టుక్రింద, 'మృదుసమీరణం' సుగంధియై వీస్తోంటే, మాకృష్ణపాత్రధారి, గతమూడురోజుల ఉపపాదనలు, సవరణలు, వివరించి, విమర్శించి, అంతిమనిర్ణయాన్ని విస్పష్టార్థ వర్ణోచ్చారణతో ప్రకటించేసరికి, మాధర్మజ పాత్రధారి అంగీకారసూచకంగా తలఊపాడు. మాకృష్ణుడు రసవత్క

వితా కళానిధి అనిన్నీ మాధర్మజుడు విద్యలకు భోజుడనిన్నీ మాసగర్వాభిప్రాయం. ఇద్దరూ మాసమాజానికి రెండుకళ్ళూనేమో. వారిద్దరి మనోవిభవం మేళవించి, వారివారి ప్రతిభాభేదసాదృశ్యాలను వినియోగించి యిడిన నామం, తిరుపతివేంకటేశ్వర విద్వత్కవితాపాకంలో, విమర్శనాతీతంగా ఉండాలని మావిశ్వాసమేమో, ఒక్కపెట్టున మా కరతాళధ్వనులు, యీలలు మిన్నుముట్టాయి. చెట్లలో పిట్టలు కలకల రావంచేసి, యీసువార్తను ముక్కునకఱచుకొని దశదిశలా ఎగిరి పోయాయి. భూలోకంలో, తణుకు బోర్డుహైస్కూలు ఆవరణలో పెళ్ళపెట్టుగా బయల్దేరిన యీకోలాహలం ఏమైయుండునా అని, వినిర్మల నీలాంబరవీధిని ధగాల్, జిగాల్ మంటూ ఒక్కుమ్మడిగా చుక్కలు వెలిసాయి.

"The Sun's rim dips, the Stars rush out,
With one stride comes the dark"

అన్న ఆ రెండు Rapid and breathless lines లోను ఆంగ్లకవి Coleredge చిత్రించినదృశ్యం మాకానాడు అనుభూతికొచ్చింది. చంద్రుడు డిట్టే తొంగిచూచినట్టేచూచి అబ్బే ఏదో పిల్లలాట అన్నట్టు చప్పరించి చక్కాపోయాడు. పిల్లలాటట మహాపెద్దమనిషి బయల్దేరాడు, తానుకాగా. అబ్బో ఎవరెరుగరండీ యీపెద్దమనిషి Anticidents? చదువుపేరుచెప్పి, Private అని, చల్లగా గురుగృహంచేరి, అతిగర్హితశృంగారప్రవృత్తితో, గురుద్రోహానికి ఒడిగట్టి విద్యార్థివర్గానికి అపయశస్సుతెచ్చిన యీవంచకుణ్ని మానాటికే విద్యార్థిసంఘాలు బహిష్కరించాయి. ఆఅవమానపంకిలం, క్షాళనచేసుకోలేక చెడి తిరుగుతున్నాడు. పగలు ప్రజలముఖం చూడలేక రాత్రులు రసికజనలోకంలో సంచారమట. తనప్రభావంచూపినా, ప్రణాళికలు అమలుపర్చినా, పెత్తనంచేసినా అక్కడట. నెయ్యమైనా, కయ్యమైనా వయసుకత్తెలతోటీ, వలపుకాండ్రతోటీనట.

విద్యార్థుల కీదుష్టశీలునితో ప్రసక్తియేమిటి. అయినా నాకందు కొచ్చింది వీడిని నోరుచేసుకోడం. మా సమాజంపట్ల యింతనిర్లిప్తత చూపి నందుకు మా కృష్ణుడే పెట్టదలచుకున్నాడు తలవాచేట్లా రేపు చిత్రనళీయప్రదర్శనంలో ధరించబోయే తన బాహుక పాత్రలో చంద్రోపలంబనం 30, 40 పద్యాలు చాలాభాగం గొలుసుకట్టుగా సీసాలుకూడానూ ఒక్కవరసని వీణ్ని, వీడిసేస్తం మన్మధుణ్ని దులిపేసేవే అన్నీ.

బక్కచిక్కిన పాడ్యమిచంద్రుడు పెదిమివిరచినా ప్రశంసించినా మాకేమి లెక్క, గుడ్డికన్ను మూస్తే తెరుస్తేం అన్నట్టు మా సోదరసభ్యులాతని రాకపోకల ఖాతరుచేయకుండా, పల్లీలే కావు, పిల్లిమొగ్గలే కావు, కుప్పిగంతాలు కొట్టేస్తున్నారు. మా భీమార్జునులను పట్ట పగ్గాలు లేకుండా ఉన్నాయి. అలఘుసత్వుడు మా భీముడు నకులుని కాలుదొరకబుచ్చుకొని, పచ్చికతివాసీపై, సరాసరి మూడుబారలు లాగేసాడు. వాడికి ఉబలాటంవచ్చినా, ఆగ్రహంవచ్చినా, ఎవడో ఓకుర్రాడిది కాలో చెయ్యో బెణికిందన్నమాటే. 'నరుండు నొత్తె దిగ్గంతనికాయకర్ణపుటదారణవిత్తము దేవదత్తమున్' అన్నట్టే వందగజాలలోపల యితర నాటకసమాజ సభ్యుడెవడున్నా వాడిగుండెలు తటతటలాడేటట్లు 'ధరణీరాజ్యము వీరభోజ్యమని పెద్దల్' అన్నపద్యము శ్రీరాగంలో దంచాడు అర్జునుడు. సహదేవు డారాగ సౌష్ఠవానికి మంత్రముగ్ధుడైతే మూడురోజుల కల్లా శ్రీరాగం నీకునేర్పి, కృష్ణునితోచెప్పి, గయోపాఖ్యానంలో నీకు సహదేవపాత్ర యిప్పిస్తానని కాబోయ్యే సహదేవునికి అభయహస్తమిచ్చాడు. ఆనందబాష్ప జలపూరితలోచనుడై, నీస్నేహం వదలనని, కృతజ్ఞహృదయంతో సహదేవుడు అర్జునుణ్ని కౌగలించాడు. సాధుసత్వుడు ధర్మజాని చూపుల్లో గౌతమీ నిర్మలగభీరత, రాచఠీవి పుంజీభవించాయి. వర్చస్వి మా కృష్ణునిముఖం పూర్ణిమా కౌముదివలె సౌందర్యశోభితమైంది. కలస్వర ప్రియమధురసంభాషణల దేలుతూ, ధర్మజ కృష్ణులు ప్రముదిత హృదయులై సోదరసభ్యుల ఉత్సాహోద్భటాలను వీక్షిస్తోన్నారు. మా ద్వారపాలురు జయవిజయుల కపుడే, అధికారస్వీకారమైనట్టు,

Military strut లా అడుగడ్తోంది. సమాజానికి గొప్పపేరెట్టి శాశ్వత కీర్తి చేకూర్చినందుకు నారదాదులు 'సరస వచోవిలాసముల' కృష్ణుని సన్నుతి చేసారు. సమాజ హితవృత్తిని తానొనర్చిన స్వల్పకార్యమునకు అంత అభినందనీయమైనది కాని తలపోసాడో అంతా తనస్వయంవ్యక్తిత్వము కాదనుకొన్నాడో, ధర్మరాజసాన్నిధ్యంలో తన్నే వారు కీర్తిస్తోన్నందుకు జిచ్చపడో, కించిత్ ఖిడియంగా తలవంచాడు, కృష్ణుడు. ఆనిమిషాన అతనిహృదయంలో కల్గిన స్పందనాన్ని నేను నిరూపించలేను. చిత్తమున ననురాగమంకురింప నారదుని క్రీగంటచూచాడు. కృష్ణుడు చూచింది తడవుగా నారదుడు కైయ్యెత్తి 'పరబ్రహ్మ, పరమేశ, పురుషోత్తమ, సదానంద' అంటో Prayer song అందుకొన్నాడు నాటకం అప్పుడే పడ్డట్టుగానే. కుర్రాళ్ళందరు, సమాజ పంచమస్వరంలో తమ కిన్నెరకంఠాలను తొలిసారిగా కలిపారు.

వేళకు లంకపొలాలమీదనుంచి ఊరికాడు గయుడు, పచ్చిజామికాయ కొరుకుతో, ఉమ్మేస్తో School final యీడొచ్చినా, బడి గంటకొట్టడంతర్వాయిగా వాడు చెట్లమీదే కాపురం. ఫలభరిత తరుశాఖా శిఖావిహారి. ముక్కామల, ముత్యాలఫిల్లి అప్రాంతాల మేనమామల యింట, తోటపంపుల్లో పెరిగిన బిడ్డేమో, తాడి, కొబ్బరి తలక్రిందుగా యెక్కి వాటిమీదే కాయకొట్టుకుతినే ఆరోహణాకౌశలం కలవాడని ఖ్యాతి. సెలవురోజుల్లో ముత్తయ్యగారి మొక్కమామిడితోట, పరీక్ష రోజుల్లో Time waste కాకుండా ఆలమూరారి అంటుమామిడితోపో, చల్లావారి బత్తాయితోటో వాడి విడిదులు. చల్లావారు వీడికి ఉచ్చులొగ్గి, నిప్పులుబై—తోటలోపండూఫలం సెట్టడాయిరి—అమ్మకు లేచిపోయారు.

మరోనిమిషంలో, పెద్దఉప్పెనలా వచ్చిపడ్డాడు శంకరుడు, బుట్టెడైతే దీపావళీ సశేషము పంచరంగుల బాణాసంచా వేసికొని. "చంపావురా, యిక్కడున్నావా దొంగా! కాళ్ళడిపోయాయి ఊరంతా గాలించాను నీకోసం. విన్నావా, కమ్మరాడిపని ఏమైందో. మనమీద గిరిపడ్డవాడు ఏమవుతాడు అనుకున్నావు లేకపోతే స్వంతాలు

తెచ్చావ్రన్రోయి' అన్నాడు నారదుణ్ని ఉద్దేశించి. ఆనారద శంకర అంత ర్నాటకం అటుంచి మాలో చాలామందికి శంకరుడే[శ్రో]త్ర. అతడు మాకు శంకరపాత్ర ధరించగలడని మేము కల్లోనూ అనుకోటంలేదు. మానారదుడు ఆతనికి అంతరంగికుడు. నారదుడు సంగీతవిద్వాంసుడనే నమ్మకంతో నారదుడు చెప్పినమాటే అయియుండాలి, నారదుణ్ని వదలలేదు. వఠి హడావుడి. ఉబ్బులింగమూ, అల్పసంతోషిన్నీ. విద్యార్థి కాదు, విద్యార్థి పక్షపాతి. అతడు మాట్లాడుతోంటే శ్రోతలకు బోలెడు Foot notes అవసరమవుతాయి. చూడరాదూ. యీ కమ్మరో కుమ్మరో ఎవడు? స్వంతాలేమిటి? ఇంతకు తన విషయం ఏమిటి యిన్నిప్రశ్నలు వేసాడు, ఒక్కొ-గుక్కలో. తర్వాత నారదుడు చెప్పాడు. మూడు పేజీలగ్రంథం అదంతా. దీపావళికి వీధిచివరి కమ్మరసత్యంతో పార్టీ కట్టాడు అందుకు, ఎంతో ఆలోచించి టపాకాయిలూ, తూటాలూ కట్టనిశ్చయించాడు. అందులో ధర్మసూక్ష్మం ఉందట. ఫిరంగుల్లా టపాకాయిలు పేలి, కమ్మరిగుండె బ్రద్దలై పడిపోతే, తూటాలతో కాల్చేయాలని యీరెంటినీ నిర్ణయించానని నారదుని చెవిలో చెప్పినమాటట. ఎవళ్ళతో ఆరెంటిక పేర్లు అడిగాడు. వేక్తే [illegible] ఇస్తే [illegible]లోనే ఉంచుకున్నాడు. వీసమైనా వారలేకుండా సూరేకార గంధకాదుల సరిగాతూచి మండిగలెక్కించి నూరాడు. నూరినతర్వాత కూరడంలో కించెత్ పొరపడి, టపాకాయలు తూటామొరుంమందుతో కట్టాడు. తూటాలు టపాకాయి కాటుకమందుతో కూరాడు. ఈకాస్తే వ్యత్యాసమల్లా. అయితేం, దాంతో, శంకరుడు కట్టినసరకు స్వంతాలంటో శాశ్వతనామం సిద్ధించింది. పంతంతో, స్వంతంగా కట్టుకున్నందుకేగాక, వాటి విశిష్టాహుతి విధానాలమూలానకూడ అవి స్వంతాలంటో పేరెక్కినవి. మరి కమ్మరిపని అయిందిలే అయింది అంటే, శంకరుడు వాడిని తూటాలతో కాల్చాడనీ కాదు, మూడోకన్ను తెరచి మాడ్చేసాడనీ కాదు. పైగా తనచేయి కాల్చుకున్నాడు మొదటితూటాలో. చేతులో పేలిన దాన్ని వదలేస్తో పక్కను జట్కాబండిరాజులసాక కాల్చేసాడు. శంక

రుడు ధృతిసెడి, యిల్లుదూరాడు. కమ్మరిసత్యం, శంకరకైలాస కిటికీ ల్లోకి కన్పించేలా, తారామండలానికంటా జ్వాలలువదలి, పరాక్రమ నృత్యంచేస్తో టపాకాయలేస్తో వీధులంట ఊరేగి, శంకరుణ్ని అవమాన వ్యథా శిథిలిత మనస్కుణ్నిచేసి, చక్కాబోయాడు. కాని విజయ గర్వంతో యిల్లుచేరిన కమ్మరి ఊరుకోక, తనచెల్లెలిని చంకనేసుకొని కాల్పించడంలో, వాడి ముత్యాలమతాబుకెట్ట వాడికాలిమీదేపడి, వాడి పాపం వాడినేకొట్టింది.

కమ్మరి, స్వయంకృత దోషానలదగ్ధుడైనాడని శంకరుడు బలి పాడ్యమి సాయంత్రం విని, విన్నదితడవుగా, స్వశక్తిని శత్రుసంహారం చేసినట్టే, సంతృప్తహృదయుడై, తన సమాజశౌర్యప్రతాపాలతో బాణ సంచా బుట్టసహితం వీధిముఖం చూచేసరి 'ఎరుగుండి గృహదహనాల కొడిగట్టడం మహాపాతకంరా అబ్బాయి' అని శంకరుని మామ్మ పల వించింది. 'పదిబిందెల నీళ్ళు తోడుకొని సిద్ధంచేసుకోనేదాకా ఆగకలవిం' దని శంకరుని భార్య, చనువుపెంపున బ్రతిమాలింది. 'ఈవీధిని కాపు రాలు చేయనివ్వతలచుకోలేదా నాయినా' అని వీధి పెద్దాపిన్నా విరచుకు పడ్డారు. సరే, జట్కాబండి రాజులు 'మీరేనా ఉండాలి, మేమునా ఉండా'లంటో కర్రలేసుకువచ్చారు. శంకరుడు తన ప్రాంతీయుల ధయ మాధ్యాలకు బెచ్చుపడి, నారదుని వెతుక్కుంటో School ground కు వచ్చి పడ్డాడన్నమాట.

పురాణేతిహాస ప్రవీణుడు, నారదుడు అటు శంకరస్వోపరాగం, యిటు సమాజ నామకరణోత్సవశోభ గమనించి, ఏకక్రియాద్వ్యర్థకారీ మంత్రోపాసనచేసి, యింతకన్న మహోత్కృష్ట స్థలసమయాలు నీస్వంతా లకు దొరకబోవు, కానియ్యి, 'ఆహుతిచేసేయి' అని శంకరుని ఉషార్ చేసాడు. స్పర్శదాకా అక్కరలేకుండా, అగ్నిదర్శనమాత్రాన్నే పేలే స్వభావం తూటాలది, మాటామంతీలేకుండా, చీడీలమీద కూర్చున్నవాళ్ళ దుప్పట్ల ల్లోకి దూరేగమనచాతురీ యీ టపాకాయల్ది కాబట్టి, వీటిని కాల్చడానికి ఓ అపూర్వవిధానావలంబన అవసరమైంది. తూటాల మూతులుకోసి, మందే

సి తూటాలను ఏకోన్ముఖంగానూ, చక్రాకారంగానూ 4, 5 చోట్ల అమర్చారు. ప్రతి తూటాకూ, వత్తులు తగిలేట్లా తూటాకు ఏకైచొప్పున టపాకాయలను పేర్చారు. శంకరుడు వాటికి నిప్పుపడేసి పరుగునవచ్చి భీముని వెనుకనుంచుని, నిజమహాత్మ్యం ధృవపరిచాడు. స్వాంతాలు ఫెళఫెళార్భటులతో నిప్పులు కక్కాయి. మైదానమంతా అగ్నిహోత్రపుంజమయింది. కీలి, నాలుకలుకోరుతో ఆకాశమంటాడు. ఈలోగా గయుడు లేతకొబ్బరి తెచ్చి, సంగీతపుచెట్టు నేపికొట్టి, తత్ పావనతోయాలతో బారసాలను మంగళోపకరణ శోభితంచేసాడు. మా ధౌమ్యవేషధారి, యీలాంటి సన్నివేశానికి ఏ పుణ్యాహనాదాలూ, ఆశీర్వాదాలూ చేయాలో అనుభవంచాలక, పెళ్ళిపీటలదగ్గర వినే "అయంముహూర్త సుముహూర్తోస్తు" అన్నమంత్రం అడ్డగోలుగా అనేసి తాను తన పాత్రనిర్వహణ చేసుకొన్నాడు. తత్ నామకరణ శుభతరుణమే మా నాటక సమాజస్థాపనాసుముహూర్తం.

గోడకుకట్టిన సాలాఖరి పరీక్షాఫలితాల లీస్టులో మా పేర్లు కనిపించినపుడుకూడా యింత ఔత్సుక్యమూ ఉత్కంపనమూ అనుభవించి ఉండం. అపుడాశయమల్లా యింటివద్ద కొత్తలాగులూ చొక్కాలూ కోరినవి కుట్టిస్తారు, పైక్లాసు బెంచీలమీద ధీమాగా కూర్చుంటాం అనే. B. H. School బాలభాస్కర సంగీత నాటకసమాజ సభ్యులమైనామంటే పైక్లాసులాంటి అల్పాశయమా? కాదు. ఏదో అవ్యక్త నూతన సామ్రాజ్యంలో అడుగిడినట్టు, నవంనవమైన జవజీవాలు మాకండ్లలోను కండల్లోనూ ప్రవేశించినట్లు, మేము పాత్రలు ధరించబోయే విఖ్యాత వీరులతో తాదాత్మ్యం పొందినట్టూ, మనోవాక్కాయకర్మలా ఆనాటి నుంచి మేము ఆ ఉత్తమనాయక శ్రేణిలోవారమే అయినట్టు మాకళ్ళు మెరుపులీనాయి, అడుగులు ఊతంగాపడ్డాయి. గాత్రాలకు ఝూంకారం వచ్చింది, 'అహం' పట్ల వినూత్నవిశ్వాసం కల్గింది, జీవితానికోనూతన పునర్వికాసం లభించింది. క్షమించాలి. ఈ అనుభూతిలోని యాథార్థ్యమును 15, 18 సంవత్సరాల వయస్సులో పాత్రధారణచేసినవారే గ్రహించ

గలరు. ఇరవది దాటినతర్వాత వేషంవేసినా, వృత్త్యానుసారంగా వేష ధారి అయినా యీ అనుభవం సిద్ధించదు.

ప్రాగ్నగీతం పాడేసి, శాస్త్రోక్తంగా సమాజానికి Three Cheers కొట్టేసి వస్తో అ పారవశ్యంలోనే బడి వరాండాలో వ్రేలాడు తోన్న బడిఘంటు కొట్టాం. అ ఘంటానినాదంలో మా జయజయధ్వా నాలు మేళవించి దిశలు నింపాయి. ఎవరాగంటకొట్టే పిల్లలు అంటో కనుచీకటిలో గద్దిస్తో సమీక్షిస్తూన్న బడి మడేలు తిరపతిగాడు, our 'Oldworld Adam' అలికిడి తగలగానే బోర్డుహైస్కూలు బాలభాస్కర సంగీత నాటకసమాజ భారితవీరులం, మళ్ళా వెనక్కి తిరక్కుండా, యిళ్ళకు దారట్టాం, అనాటికి.

## సమాజయశశ్చంద్రికలు

జీవితయాత్రలో, ఒక్కొకపుడు, స్వల్పాతి స్వల్పకారణాలు 'Trifles light as air' ప్రఖ్యాత అభ్యుదయపరిణామాలకు, ప్రళయాలకూ కూడా దారితీయడం జగద్విదితం. ఈసంభవాన్నే వ్యక్తిగత జీవితం లోను, సాముదాయక జీవితంలోనూ కూడా కాలప్రభావంపేరట అనుభ విస్తోందాం. 'The imp of chance plays no small part in shaping events and chance sometimes works as if with a superb and benificent design' అన్నా డాంగ్లవ్యాసరచయిత A. G. G. తాను నిర్వచించిన సూక్తికి సమర్ధనీయంగా పెక్కు ఉదహ రణలను పేర్కొంటో, చదువరు లచ్చెరువొందేట్లా, శ్యామలాంగి క్లియో పాత్రా నాసికకు ప్రాచీనప్రపంచానికి ముడేసి మాట్లాడాడు. అజగ్వని నాసికాపరిమాణానికి, ప్రాచీనప్రపంచ చరిత్రాపరిణామానికి కనివిని ఎరుగని సన్నిహిత సంబంధమున్నదట. అ మితారి ముక్కు తవురు, పొడవు ఏకాంతచింతాకంత హెచ్చున్నా తగ్గున్నా, వేచినా, తీసినా, హారప్లాభా

అని గత ప్రపంచ చరిత్రయావత్తూ తల్లక్రిందులై, తారుమారై, తలక్రిందులై పూర్తిగా అన్యముఖంగా ఉండునట. తుదిమిదగ్గరనుంచి దేవతార్చన దాకా మారిఉండునన్నాడు చూడండి. 'It is a common place that if Cleopatra's nose had been a shade longer – or shorter for that matter – the whole story of the ancient world would have been altered'. గిరీశం చెప్పినట్లు కథ అడ్డంగా తిరుగునేం! అన్నా! ఆనాడా కాంత నాసిక, కేకించిత్ తేడా పొడాలున్నా, యీనాడు కాలేజీవిద్యార్థులను శుభ్రంగా తలక్రింద తలగడాలుగా ఉపచరిస్తోన్న Bury's history of Greece, Gibbon's Decline and Fall of the Roman Empire, H. G. Well's story of the world, వీటిలోని కథావస్తువు, వాటి నలం, సర్వం వ్యత్యాసంగా ఉండునన్నమాట. జీవితపథంలో యుగరిసడుమా రెండు వేలసంవత్సరాలుపైగా దూరమున్నా చూచారా ఎక్కడకొట్టినదెబ్బ ఎక్కడతగిలిందో. ఆశోభనాంగి సంపెంగరేకుసోయగం, ఎందరసికజన మనోభిరామంగా, ఎందరిపనులు చెరిపి నిలేసేదో, ఎందరెందరు ఆసె గుమ్మాల్లో పడగాపులై పడిఉండేవారో, ముక్కోవతలకొస్తే, జన్మ అంటో ఎత్తినందుకు ఆకాస్తాచూచి మరీచచ్చిపోవచ్చునని, అనిపిస్తుంది. మరిచిత్రందేనికీ? ఆంటోనీ, సీజరులాంటి జగద్వీరులు కిరీటి వాంధాతలే enchantress of the nile అమరిపెపు ముక్కుమచ్చుటకు మంత్రముగ్ధులై, ఆనారీమూర్తికి పాదాక్రాంతులయ్యారాయిరి.

A. G. G. నుడివిన ఉదహరణలో యాదార్థ్యమెంతో, వాక్ప్రమత్కృతియెంతో, ఒక నాసికావిలోకనావిస్మయరసావేశంలో, ప్రపంచమెంతగా ఉద్రూతలూగిందో, నేనునిర్ణయింప సమర్థుడను కాను. కాని మా లెక్కలమాస్టరుగారి నారీరత్న నాసికాప్రభావంమాత్రం, ప్రత్యక్షాంజనేయంగా, విద్యార్థులకు అనుభవైకవేద్యం అయింది. అష్టబాసలా, కోపం ముక్కునుండే దాయిల్లాలికి, సౌందర్య సౌకుమార్యాలతో విద్యార్థులక్షేంపనిగాని, ఆవిడ ముక్కు విరచినా, మూతిముడచినా, మావిద్యార్థి

లోకానికి అదో ఉల్కాపాతమే. ఆపూట మాస్టారు మొదటిగంట లెక్కలక్లాసులో మండిపడిపోవడంకద్దు. అంటించి వదలేసిన అవాయిలా ఎడాపెడా నిప్పులుచెరిగేసే స్వభావం. ఆయనకు యింటివద్దవచ్చిన ఆగ్రహం, గరళకంఠునిలా, శుభ్రంగాదిగమ్రింగి చక్కాగాబడిలో తీర్చుకోవడం అలవాటు. అక్కడ ఆవిడ నేమీఅనక, యిక్కడ అన్నీమమ్మనడం మాగ్రహపాటూనూ. ఆవిడ ఆగ్రహం, ఎప్పుడిదప్పుడు దాఖలాగా, మాకు సద్యోఫలితాల నిచ్చేది. ఆకాత్యాయని కోపఘూర్ణిత అయినా, భాష్పజలపూరితఅయినా, అమాంతంగా మేము శుద్ధ ఎద్దుమొద్దుస్వరూపాలము అయిపొయ్యేవాళ్ళం. వారింటి చిటపట్లు మమ్మన్ని కూడికలు, తీసివ్రేతలు అయినా చేతకాని చచ్చుపెద్దమ్మలను చేసేవి. ఆయన పది పంద్రెండు సంవత్సరాల మేస్టరీలోనూ మాలాంటి నాసిరకం, దాపరించలేదని నిర్వేదనంకల్గేది. ఆయనకు విద్యార్థుల సుఖదుఃఖాలు ఆవిడ ఆగ్రహానుగ్రహాలపై ఆధారపడి ఉండేవంటే సత్యదూరంకాదు. ఆపె పుట్టింటికెడితే, పండులా ఆవిడబాగానేయుంది — పైగా, సారా, చీరా, నలిమిడిముద్దా తెచ్చుకొనేదికూడాను — మధ్యన చచ్చేతిప్పలు మాకు, తిరుగా నట్టింట ఆవిడ అడుగెట్టేవరకు. నిజంగా ప్యాసుగాదలచుకొంటే, శేపక్లదిద్దేరోజుల్లో ఆవిడను ఓకంటితోచూచుకోవలసిన ఆవశ్యకత మాకుకన్పించేది, తత్కార్యనిర్వహణకు దారిఏలాగో, మాకు పాడనూపకపోయినా.

లెక్కలమాస్టరుగారికిగాని వారిగృహిణికిగాని మానాటకసమాజంతో ఏలాంటిప్రసక్తీ లేకపోయినా, మాసమాజ నామకరణోత్సవంరాత్రి వారింట సంభవించిన, అంతఃపురవిషైక, సర్వసామాన్య, అత్యల్పసంఘటన ఒకటి మాసమాజాభ్యుదయ ` శుభోన్నతులకు, కేవలం 'మానుపాద' ప్రాయంగా, కారణభూతమైంది. ఆనాటికి, యడ్వర్టైజుమెంటు పరిభాషలో ప్రకటించే సువిశాల సుందరరంగస్థలమా, అపూర్వ నటీనట సమ్మేళనమా, ఖరీదైన దుస్తులా, స్ప్రింగ్‌కర్టెన్లా, బాలగంధర్వుల అమర గానమనీ, రాళ్లరగించు విమలగానమనీ వాల్‌పోస్టర్లా? ఏఒక్కటుందని

మాకు. పోనీ అప్పుడుకాదు ఏడాదికైనా ఫుట్‌లైట్సుముందు నిల బడ్డామా, ఏమీలేదు, నామకరణంచేసిన మరునాడే మాసమాజయశశ్చం ద్రికలు నల్దిక్కులా ప్రసరించాయంటే, మామాష్టారి అంతఃపురరహస్యమే కారణం, మరొండుకాదు. నమ్మండి నమ్మకపోండి, అసంఘటనే మాష్టా రింట దైవం మాకు అనుగ్రహించకపోతే, మాసమాజం ఊరూ పేరూ లేకుండా, నిస్తేజమై, నిర్వీర్యమై, నీరవమై, ఎంతకాలం నిద్రాణంగా పడి ఉండేదో. అంచేతనే, ఎప్పుడో దర్శిలాపడ్డ మానాటకాల్లో ప్రార్థన గీతం పాడినవెంటనే మానసికంగా లెక్కలమాష్టారి గృహిణికి గౌరీ పూజచేసి మరీ తెరఎత్తడం, మాసమాజ పుణ్యాచారమైంది. తద్రీతుగా ఏ. జి. జీ. సిద్ధాంతస్వారస్యం మాకు ద్యోతకమైంది.

మా ష్టారి గార్హ్యస్థ సంఘటన, ప్రారంభంలో విద్యార్థి లోకానికి విపత్కరమైనా, తొలితాకుడులో బాలురు తల్లడిల్లినా, చివరకు మా సమాజానికి మాత్రం శుభప్రదమైన సత్ఫలితాల్ని ప్రసాదించింది. తత్సం భవంమూలంగా, మా సమాజస్థాపనా విశేషం ఉదయమే ఫిఫ్తుఫారం లెక్కలక్లాసులో పాక్కి, మధ్యాహ్నానికి ప్రధానాచార్యులవారి నోటీసు కెక్కి, సాయంకాల మయ్యేసరికి మాసమాజానికి బడిలో అఫీషియల్ రికగ్నిషను దక్కి, గ్రామమంతా గుబాళించింది. ఇంతవరకు చెప్పి, యింకా మరుగెందుకు? మరేమీలేదు. సమాజ నామకరణం రాత్రి మాష్టరుగారి యిల్లాలు, 'కాకులు దూరని కారడవిలో, చీమలు దూరని చిట్టడవిలో అన్నట్టు దోమలుదూరని దుప్పట్ల వచంలో, సందుంచకుండా ముసుగు బిగతన్నింది. ఉదయం పొయిలో పుడకిడలేదు. ఇంకా ఏంచాయాలి నలుగురిలోకీవచ్చే మగాడికి, అర్ధాంగి, సహధర్మచారిణి అనిపించుకునే ఆవిడ. కొంపత్రవ్వి షేమేమో పంతులగారి ప్రణయగాథలు పొంచి చూచొచ్చి వీధిని పెడ్తా న్నామను కోకండిసుమ్మీ. పాపము శమించుగాక. ఆనాటి విద్యార్థుల కామాత్రం ప్రయోజకత్వంకూడానా. అజ్బే, వరో ప్రవరాఖ్యులండీ. వారింటి కుతకుతల ఫలితాలు రెండు వత్సరాలనుంచి లెక్కలక్లాసుల్లో

అనుభవిస్తోన్నవే కాబట్టి, ఏ ఫలితానికి ఏ కారణమో, ఎంతకెంతో, చూచొచ్చినట్టు చెప్పగలిగే తజ్ఞులు ఉండేవారు మాలో. ఆ ఉదయం మాస్టారు బడికొచ్చేముందు యింకా కాళ్ళల్లో ఏంపల్లేరుకాయలు చల్లిందో, ఏమి ఆద్యంతాలులేని వితండవాదం లేవదీసి మాస్టారికి మనోవైకల్యం కలిగించిందో యింటివద్ద ఆకలహకంఠి, ఆయన క్లాసుకు వస్తోనే కొల్లేటిచాంతాటి సంఖ్యానీకపు రావణా గుణకారం, శుద్ధ బండ లెక్కొకటి బోర్డుమీద వేసి, యిక అక్కడనుంచి ఎంతో రభసంతో, వగరుస్తో, కరలాఘవ ప్రకారాలన్నీ చూపుతో, బోర్డుమీద నీమసుద్ద సాము ప్రారంభించి, ఎక్కడా సూదిమోపడానికైనా సందులేకుండా ఆసంఖ్యాకాలుగా అంకెలనుగుప్పి బోర్డు ఖరాబుచేస్తో, కుర్రాళ్ళను గాభరాచేసారు. సతీ వైమనస్య సంజనిత వ్యథావ్యాకులత ఎట్టి శాంతి సౌలభ్యాది సద్గుణ సంపన్నుణ్ని, ఎంత విద్యార్థ్యాభివృద్ధి నివేశ చిత్తః కలవాణ్ణి, ఏలాంటి ప్రశాంతాంతః కరుణుణ్ని యీలా ఉగ్రుణ్ణిచేసిందిరా అన్పిస్తుంది. స్వతహాగా బహుయోగ్యుడు. వట్టప్పుడు ఆయన బోర్డు మీద నోటిని కట్టేసి పారేసే లెక్కలువేసి గంట అయింది అనిపించే వారు! ఏ. అనువాడు, బి. అనువాడు, సి. అనువాడూ అంటో వారివారి గమన గతుల వైవిధ్యం, క్రియాకౌశల భేదమున్నూ, కొంతమంది ఆడవాళ్ళు కొంతమంది మగవాళ్ళు వేర్వేరు జంటలుగాగాని, కలసి గుత్తగాకాని ఒకానొక పని — అదేదో విద్యార్థులకు తెలియనే అక్కఱలేదట—చేసారం టోనున్నూ, విద్యార్థుల 'కౌతుకము పల్లవింప' కల్పనలుచేసి ఏలాంటి ఉదాత్తరసాన్విత గణితకథా సరిత్సాగరం శ్రావ్యంగా వినిపించేవారు విద్యార్థులను విశ్వసించేవారు. కాని, నోటుబుక్కులు చూచే అల్పత్వం పీవిషునెస్ కల్లోనైనాఉండేదా ఆయనకు. పుస్తకట్టినదాది కొంగట్టుకు కూర్చునేటట్టు బడిలో చేరిందిలగాయితు 365 రోజులూ కుర్రాళ్ళను కాల్చుకుతినే దురభ్యాసంలేకుండా వర్కింగుడేసులో మధ్యమధ్య ఒక రోజు ఆయనకు చక్కగా తలనొప్పి వచ్చేదే. ఎంతసరసుడు. ఎంత సలక్షణమైన ఉపాధ్యాయుడు, భార్యావిధేయుడై పోయినాడుఏమైతేం.

ఇట్టి సమస్త సుగుణోపేతుడీనాడు సైంధవబలంతో విజృంభించిన కోట్ల అంకెల అక్షౌహిణీలు రైగప్పి, ఎటుచూచినా, భిన్నాంకాలు, తీసివేయడాలు, శేషాలు, దశాంశాలు, శతాంశాలు 'కయ్యంపునేల కరంబుఘోరంబయ్యె' అన్నట్టు బోర్డుబల్ల ఎంతో భయానాకమైంది. గురుచరణ సన్నిధినున్న మొదటి రెండు బెంచీలు అనుశ్రుతంగా అలంకరించే గణితశాస్త్రామృతపాన కుతూహలురైన ప్రిణుతగుణోత్తరులు, చిత్తముల గురుపరాయత్తంచేసిన భక్తశిఖామణులు, ఏపది పండ్రెండుగురో దక్క మిగతా క్లాసందరు దిక్కులు చూస్తున్నారు. ఇందరిలోనూ, పుణ్యశ్లోకుడు మానారదుడు మాష్టరుగారికి దొరికిపొయ్యే దుర్యోగం ప్రాప్తించింది, వేళావిశేషం.

సోదర విద్యార్థులకు ముందు బెంచీలు వదలేసి పరిపాటుగా చివర బెంచీనే చూచుకొనే స్వార్థత్యాగి నారదుడపుడు, ముక్కుమీద వ్రేలు వేసుకోదగినంత ధర్మాతిక్రమణ ఏమీచేసి యుండలేదు. అమాటకొస్తే సర్వవికార స్వరూపమైన మనసును అరికట్టి తన లెక్కలనోటు బుక్కుపైననే లగ్నం చేసాడుకూడా, చుట్టుప్రక్కల సోదర విద్యార్థుల వైఖరి కిటికీలోనుంచి ఆచపలిని చెట్టుమీదకు పుట్టమీదకు పోనీకుండా. అయితేం జరిగింది నూడండి. మాష్టరుగారు యింటివద్ద నుంచి మూటగట్టుకొచ్చిన తిక్కనో, లేక తాత్కాలిక బోధనావేశంలోనో బోర్డు వద్దనుంచి హఠాత్ గమనంతో అర్థచంద్రాకారంగా క్లాసువంక తిరగడంలో ఆయనకు చివర బెంచీమీద ఏమికంటబడిందో, ప్లాటుఫారం అద్రువ తక్కున ఆగిపోయాడు. మరి అడుగడలేదు. వాల్గు కాంపౌండు సెంటెన్సులకు సరిపొయ్యే దమ్ముతో, మాంచిభారీ పన్నాలో, ఫెణకలు బ్రద్దలయ్యేట్లా పెంకులూడి పడేలా, సుద్ద చేయియెత్తి 33 కోట్ల 76 లక్షల అంటో పల్క దగ్గఅంకెలకట్టు కాసులపేరు, మధ్యగా, డభై అనే ముడిద్దరఫాట్టున స్టాఫ్ అయిపోయి "ఖై" తిరగవలసిన వంపుతిరక్కుండా "భా" అంటో రోదన ధ్వనిచేసుకుంటో దూసుకుపోయి నారదుడు మీద కాళ్ళిపడింది. మాష్టరుగారికి ఇక మాటలేదు. చేతిలోని సుద్ద యిటుకబొంత – యింకా కేర్రియున్న,

భ్రష్టులు దర్శనం కాని అంధయుగం - ప్లాటుఫారం మీదపడి భిన్నభిన్నాలైంది. నింపుక్లాసులో, అందరిమధ్య, పట్టపగలు, తన కళ్లఎదుట, చివర బెంచీమీద కేవలం హత్యేఏదో జరుగుతోన్నట్టు, హంతకుడు నారదుడన్నట్టు, భయసంభ్రమవిషాద విహ్వలుడై, సుద్దవ్రేళ్ళు ముక్కుపై వేసుకొని, చేష్టలుదక్కి, అమట్టునే కొయ్యబారిపోయారు మాష్టరుగారు. స్ఫృహతప్పే తరుణంలో, నారదునిపై కేంద్రీకరించిన మాష్టరుగారి విషాద దృక్కుల్లో పెక్కుభావాలు ద్యోతకమయినాయి. నారదుని భావి మాష్టారి మనోయవనికపై పడి ఉండాలి. అది చాలా నిరాశాజనకంగా యుండివుండాలి నారదుని ఉద్దేశించి, 'అయ్యో అబ్బాయి, గణితశాస్త్ర తత్వపరిజ్ఞానసారం, నేనింతశ్రమించి తోడిపోస్తూంటే, నోటుబుక్కులోపట్టి చక్కగా దాన్ని బుర్రలో కెక్కించుకోక, అరరే, వలకపోసుకొంటోంటివే' అనసంసిద్ధుడైయుండగా మతిబోయి యుండాలి.

ఆశకం విద్యార్థులను సత్వగుణ సంపన్నులనాలి. బోర్డుబల్లమీద భీభత్సం జరిగినంతసేపూ, కిమన్నాస్తి మాటాడలేరు. సుస్పష్టంగా, మాష్టరుగారి శ్యామలగాత్రం మీదా, నాసికాకపోలాలపైనా బడ్డ సుద్ద బొట్లు, దేన్నితలపుకు తెచ్చినా, పరిహాసానికి బోలెడు మేటర్ కల్గినా, పెదిమలను తన్నుకు పడ్తోన్న నవ్వును నులిమేసి నిశ్శబ్దంగా యున్నారు. నిజంగా, ఆనిగ్రహం వారి ఆదాయానికి మించినపనే. ఆయనకు కేవలం ముంచుకొచ్చిన తర్వాత, లేతవయసూ, బెంచేలు పడ్డారు కాదూ. ఇంత వరకూ బాగానేయున్నాడు. కణుగూ ఫెణుగూ మాట్లాడుతోన్నాడు. ఉన్నదల్లా కాస్త పైత్యధోరణి. కలియదొక్కుతున్నాడు. అలాంటిది, వాతంముద్ద అయిఊరుకున్నాడు. నారదుని మీద పడ్డకళ్ళు పడ్డట్టే ఉన్నాయి ఎత్తిన కనుబొమలు ఎత్తినట్టే, తెరచిననోరు తెరచినట్టే, ఓకాలు ముందరకు, ఓకాలు వెనక్కి. ఏలావేసినవి అలానేఉండె. సుద్దబొంతను జారవిడచిన వ్రేళ్ళు మళ్ళీకలుసుకోకపోయె. శ్వాసఆడదూ! కంటిపాప కదలదూ! లెక్క పదినిమిషాల్లో శిలాప్రతిమ అయిపోయాడా? ఏమనుకుంటారు చెప్పండి కుర్రాళ్ళు? ఓ కుర్రాడెవడో క్లాసులో

అశ్రద్ధగా వున్నందుకు మాష్టారు ఆడుతున్న నాటకం, యిదంతా ఆశ్చర్యాభినయం అని ఒక్కుర్రాడు అనుకోగలడా! ఆశ్చర్యాభినయం చేసిన పంక్తుళ్ళనూ చూచాం. ఇంతచేటు కాళ్ళల్లో నిప్పులుపోయనా! విద్యార్థుల కించిదశ్రద్ధ అఘాయిత్యాలలిస్టులోదేనా? పృధివిపుట్టాక విద్యార్థుల్లో ఒక్క మా నారదుడే కన్పించాడు కాబోలు కాస్త పరాధ్యాన్నంగా ఉన్నవాడు. మాష్టరుగారు చదువుకొనే రోజుల్లో ఏలాంటిశ్రద్ధాళువో మేము ఎరగంగా. అంచేత ఎంత రసాభాసమైనా చేయొచ్చు. చేసాడు. మాష్టారికి ప్రాణం కడంటిపోయినీ, చివరి బెంచీ మీద జరుగుతోన్న ఏదో అత్యాచారమే కారణమనీ, సుందరికళ్ళూ నారదుడి మీద పడ్డాయి.

మాష్టరుగారు యింత తుపానురేపారనీ, అందరికళ్ళూ తన మీదే ఉన్నాయని నారదుడెరుగడు. బెంచీ బొక్కుమీద తలఆన్చి, పెన్సిలును రెండు కొసలాపట్టుకొని పళ్ళకు తగిలీతగలకుండా త్రిప్పుతున్నాడు. అంతలో, లోపల ఎవరకోరకో తల్పుతిట్టినట్టు, పెన్సిల్తో నుదుటిమీద తాళంవేస్తోన్నాడు. దాంతో హృదంతరాళం నుండి, ఏమినూతన భావాలు ఉబికాయో తక్షణం, తనలెక్కల నోటుబుక్కు పుటపైవాలి, వాటిని గీస్తోన్నాడు. చెరుపుతున్నాడు సరిదిద్దుతోన్నాడు. వెనక్కి తగ్గుతున్నాడు. ముందరకు వంగుతున్నాడు. డిఫరెంటు యాంగిల్సులో కల్పనారేఖలను చూచుకుంటోన్నాడు. చకితుడౌతోన్నాడు. మధురాతి మధురమైన భావం ఏదోవచ్చినట్టేవచ్చి చేయిజారి పోయింది కాబోలు. నారదుని అధరాలపై చిరునవ్వు సన్నసన్నగా మెలగింది. చివరకు చిక్కబట్టి దాన్ని నోటుబుక్కుపై పెట్టి ఉండాలి. తన మనోహరరచన, క్రియాకౌశలం చూచుకోంటోన్నాడు. మబ్బులో వెన్నెల్లా కళ్ళల్లోకిఆశారేఖవస్తోతోంది. పోతోంది. నారదునికిదో అపూర్వానుభవమే; భావనకురాని మనోవేదన. అందనిలోతును అందుకుందామని, పొందలేని స్థితిని పొందుదామని, బాధకాని బాధను పడుతోన్నట్టుంది నారదుని ముఖలక్షణం. ఈతరుణంలో నారదుని తిరువేరు. బండలెక్కలతో

పెనుగులాడ్తోన్న ఫిప్తఫారం విద్యార్థి కానేకాడు. కళాసేవానుభవానంద సాగరాంతర్నిమగ్న మానసుడైన కళాతపస్వి. బడితుభిత జగత్తుకు అద్దరిని స్వీయనిర్మిత ప్రశాంతభావనా ప్రపంచంలో, మానస సరోవరసీమల విహరిస్తో రాయంచల తిలకిస్తోన్నాడు. నారదుడు మనలోలేడు.

ఇల్లాలి మాంగళ్యపటిమ కాబోలు కొంతవడికి, సంభ్రమం మంచు లాకరగిపోయి, మాస్టరుగారు తేరుకున్నారు. అవహేళనాపూరిత కఠోర కంఠధ్వనితో, నారదునుద్దేశించి "దొరగారేదో ఉదాత్తవిషయ పర్యాలోచనా నిమగ్నులై లెక్కల క్లాసు మరచారు. దయచేసి తమ నోటు బుక్కునిట పంపగలరా? హోమ్‌వర్కు ఏమాత్రం చేసుకొచ్చారో, నావృత్త్యానుసారంగా నేను చూడవలసిఉంది. ప్రత్యేక వినోదములకు యిది యదను కాదని దొరగారికి చెప్పసాహసిస్తోన్నా" నని, వారి వాక్ప్రౌఢి చూపెట్టారు నారదునిమీద, పిల్లకాకిపై ఉండేలదెబ్బ. ఆనందమయ కళా ప్రపంచంలో నారదుడు, మధురగీతాలో, చక్రవాకబకహంస క్రొంచనాదాలో, 'వీనులకింపెసగ నే శుకకోకిల సుస్వరాలో వింటోన్నాడు కాబోలు, మాస్టరుగారి అపశ్రుతిగాత్రం చెవికి సోకినంతనే, పిడుగుమొత్తినట్టు సంకటపడ్డాడు విషయావగాహనై, నారదుడు వాస్తవిక జగత్తుకు దిగేసరికి కొంత కాలహరణమైంది. లౌకికకళాప్రపంచాల సంఘర్షణాక్లేశం నారదుని కళ్ళలో కన్పిస్తోంది మాస్టరుగారికి నోటుబుక్కుయిచ్చి యథాస్థానంచేరి నారదుడు నమ్రశిరస్కుడై కూర్చున్నాడు. పరిసరాలను అకళింపుచేసుకుంటోన్నాడు. మాస్టరు రక్తాంతలోచనుడై, ఉగ్రుడై యున్నాడు. మొదటిబెంచీ గురుభక్తిపరాయణులు, ముద్దాయి దండనార్హుడు కాని దయాపాత్రుడు కాడని చెప్ప నిశ్చయించుకొన్న జ్యూరీలా నారదునివంక, కరకరాచూస్తోన్నారు. తతిమ్మా సోదరవిద్యార్థుల చూపుల్లో సౌహార్ద్రం, సానుభూతి కన్పించి, నారదుడు కాస్త నిల్దొక్కాడు. 'ఉదయంలేచి ఎవరిముఖం చూచాను, వస్తోనే యీాయన వడివాతను బడ్డానని త్రికాలవేది నారదుడు చింతిస్తోన్నాడు.

పంతులుగారు నోటుబుక్కులోని చిత్తరవుచూచి, నవ్వేస్తే పోయేదే

దానికి, క్లాసందరికంటా పడేట్లా దాన్ని చేత్తోతిప్పుతో, నారదుణ్ని నిలేసి, 'ఎంతమాట ఎంతమాట, ఎన్నడూ సెలవిచ్చారుగారు. దొరగారు యింతటి కళాస్రష్టలా, యింతవిద్వాంసులా. ఇన్నిడిగ్రీలు ఎప్పుడు ఏఏర్యాయియూనివర్సిటీలో సంపాదించారు. అన్నీ ఏవో ఫారిన్ డిగ్రీల్లా ఉన్నాయి. మన నాటువి కావు. ఇంతపొడవు తోకతగిలించుకొచ్చిన పెద్ద మనిషి యీ క్లాసులోనా కూర్చునేది. ఏవోగుణకారాలు వచ్చీ, రాకా తంటాలుపడ్తోన్న పిల్లలువీళ్ళు. నాకొచ్చినమట్టుకు పిల్లలకు చెప్పుకుంటూన్న సామాన్యంమాస్టరును నేను. మిమ్మల్ని యీచిన్న క్లాసులోఉంచి, విద్యా శాఖాధికారులు మీకే కాకుండా లోకానికి ఎంతఅపకృతి చేస్తోన్నారు! క్షమించి తక్షణం హెడ్మాష్టరుగారి యెదటికి దయచేసి, తమడిగ్రీల ఉదంతం సవిస్తరంగా సెలవిస్తేబాగుంటుంది. నేను చెబ్దామనుకుంటే, హైనంమాటటుంచి, అన్నిడిగ్రీలను నోటపట్టలేనేమోననికూడా అను మానం. చక్కగా హెడ్మాష్టరుగారు తమకు చేయవలసింది చేయగలరు. మీరీ లెక్కలగంటలో తయారుచేసిన చిత్తరువును, నాచీటీనీ కూడా, మీవెనకనే తిరుపతిగాడు తేగలడు. రెండునిమిషాల్లో గంటకొట్టడం తోనే నేనూ అక్కడికి వస్తోన్నా'' అన్నారు. వస్తోన్నా, తెస్తోన్నా లాంటి మాటల్లో యింటెంటా నిత్యవాడకాలు అయిన 'స్తో, న్నా' బహు సాధులైనా, అప్పటి సాగదీపులో మాస్టారు ఆరెండుఅక్షరాల్లోను ఎంత కక్ష కూరిపల్కేరోగాని, నీభరతంపట్టిస్తా నిన్ను ద్వీపాంతరవాసం వేయిస్తా. అందుకేవస్తా' అనేటట్టు బహుభయానకంగా ధ్వనించాయి.

ప్రతిభాయుత రూపకల్పనలతో నారదుడు చెక్కిన చిత్తరువు మాసమాజ పరిచితులకు సుగ్రాహ్యమే అయినా, ఒరులకు ఎంతోసమస్యా త్మకంగా తయారైంది. జీవితం జీవించడానికే అన్నట్టు, కళ కళకోసమే పుట్టిందన్నట్టు వెలిసిన బండబొమ్మాస్మృతి. భావరహితమైన రూపసౌష్ఠవం ఆశించాడా నారదుడు? ఆలోచనలు సుళ్ళుచుట్టుకుపోయే చిత్రాన్ని కళాదేవికి కానుకగా యీయాలని కాంక్షించాడు. అంచేత ఆచిత్త రువు, బోలెడు అంతరార్థంతో తొలుకాడ్తోంది. అయినా, మాసమాజ

నామం తెల్సినవాళ్ళకు, దానిఅర్థగ్రహణ, పట్టుమని సెకనట్టదు. అది ఒక్కటీ తెనియనివాళ్ళైతే, పండితాఖండులేకానీ, బుర్రబ్రద్దలుకొట్టు కున్నా లాభంలేదు అక్కడాఉంట నారదుని రచనాచమత్కృతి. పుటకు కుడివైపున ఒకటీ ఎడమవైపున ఒకటీ రెండుహంసలు ముఖాముఖీగా నిల బడిఉంటాయి. అవి, కుసుమఫలభరితాలైన చెరోలతను ముక్కునకరచి ఉంటాయి. అలతలమధ్య ఒకపంక్తిఅయ్యేటట్లు మానాటకనారదుని నిజ నామధేయం గొల్సుకట్టులిపితో వ్రాసిఉంటుంది. దాని దిగువున, సన్నిహి తంగా T. B. H. B. B. S. N. S. అనే బ్లాక్కు లెటర్సు సుస్పష్టంగా చెక్కబడిఉంటాయి. ఇంకా ఎంత detail. ఇటు టికి కుడిపార్శ్వాన్ని అటు యన్సకు యడమపార్శ్వాన్ని, చెవికంటా లాగికదలిన వింటినారిని మనసుకుతెచ్చే ఉజ్వలవేగంతోవచ్చే రెండుయారోమార్కులు ఉంటాయి సమగ్రసుందరమైన చిత్తరువులో, ఏఒక్కభాగం చూచినా దానిలో functional efficiency ద్యోతకమయినప్పుడే అది ఉత్తమకళ అని పించుకుంటుందనీ, అంచేతనే, 'A work of art in addition to looking well, must also speak well and act well" అనిన్నీ, చిత్రకళారసగ్రహణపారీణుడు Ruskin చెప్పిఉన్నాడు. తత్ సూత్రా నుసారంగా విమర్శించినా, నారదునిచిత్రం, నెగ్గేసి నిలబడకలదు. ఎండా కన్నోఎందుకు లతలమట్టుకుచూడండి. వాటిల్లో అందం, ఉపయోగం, అక్కాచెల్లెళ్ళలా మేళవింపబడ్డాయి. ఎదురుపొదుపుగా సిమిట్రికల్గా నిలబడి నారదుని నామముకుబ్లాకులెటర్సుకు బ్రాకెట్లలా సద్వినియోగ మయాయి. అందమంటారా, మందమరుత్తరంగ వీచనలచే కలిగే కలయిక, వికసించియున్న పుష్పాలపరిమళంకూడా యీలతలకు తేవాలని కళాకారు డెంతగా ఆరాటపడ్డాడో అనిపిస్తున్నాయి.

లోపమంటోఉంటే, ఒక్కటే యీచిత్రంలో. కలహంసలకు కించిత్ కాకిరూపువచ్చింది. హంసతో నారదునికి ప్రత్యక్షపరిచయం లేకపోవడమేకారణం. వాడికి ఉన్నదల్లా సాహిత్యపరిచయం వాటితో ఆసంవత్సరం నారదునిక్లాసుకు హంసదూత్యం పాఠ్యభాగం కావడంకల్ల,

నలచరిత్రలో హంసలు మానవీమానవ ప్రపంచయీతిబాధలు, వాగ్సంఘటనం, రాయబారకౌశలం, ముఖ్యంగా పరిణయపుణ్యకార్యనిర్వహణాసక్తి కలిగినవి కావడంవల్ల, వాటిని చిత్రించాలనే అంతరప్రేరణ కలిగియుండాలి. కాని ఆగ్రంథంలో కవి ఎంతసేపూ వాటిగుణగణాలను, సత్కార్య సత్ప్రయత్నాలను కీర్తించాడేగాని, వాటి రూపురేఖలను నిరూపించలేదు. చిత్రకారుడికి కావలసినవే రూపురేఖలు. అంచేత పాపం నారదుడు తద్విషయము ఊహాగానం చేయవలసివచ్చింది. తలకుమించినపని మీద పెట్టుకొన్నాడు. నిత్యంచూచే రెండుచిలకలను చిత్రిస్తే కథానష్టమును, బాధాలేకపోను. ఏమో, ఎవరికీసుపరిచితాలు కాని వాటిని గేయచిత్రంలో కొంత సౌకర్యం లేకపోలేదు. 'కాదు', అని ఎవరైనా విమర్శిస్తే, వెంటనే 'ఎందుకుకాదు' అని నడుంకట్టొచ్చునేమో ఎవరికీ తెలియనివి అయితే, నారదుడు ఎందుకైనా సమానంగా సమర్థుడే. మొత్తంమీద చిత్తరువులో ప్రతిగీతలోను ప్రతిఅక్షరంలోను, నారదుని అపూర్వభావప్రదర్శనశక్తి ప్రస్ఫుటమవుతోంది.

నిత్య నవీనాలైన ఆలతలను, కమియవిచ్చిన ఆ కన్నెపూలను ఆ రాయంచల సర్వాంగసౌష్ఠవాన్ని చిత్తరువులో గుమ్మరించిన నారదుని పాండిత్య ప్రకర్షను చూచి గర్వించదగ్గదిపోయి మాస్టరుగారు చిందులు తొక్కుతూంటే గళమునందాల్పవలసిన అలరుదండను కాలతన్నుతూంటే నారదుడు మాస్టరుగారి నిష్కళా హృదయానికి నివ్వెరపడ్డాడు. నారదుని ముఖంలో జ్ఞానతేజమంకురించి, మందస్మిత వదనుడైనాడు. 'నీకీ సంవత్సరం లెక్కలపేపరులో సున్న సుమా మూఢమతే నారదా' అన్నట్లు మాస్టరుగారి చూపులు సూచిస్తోంటే 'నహీనహీరక్షతి డుకృఞ్‌కరణే మాస్టారూ' అన్నట్టు నారదుని చూపులు చెప్పక చెప్తోన్నాయి. ఇకనైనా లెక్కల్లో గట్టెక్కేమార్గం వెతుక్కోమని మాస్టారు జాలిగా చూస్తోంటే 'శాశ్వత శ్రేయస్సులూ, విలువలూ విస్మరించకండీ మాస్టారూ' అని అంతకన్నా జాలిగా చూస్తున్నాడు నారదుడు. ప్రతి చేష్టలోనూ వారి వారి లౌకిక తాత్త్వికాదర్శ వైవిధ్యం విశదమవుతోంది. ప్రస్తావ

హిరణ్యకశిప విద్యాదర్పం వైవిధ్యం విశదమైంది. నారదుని కాపిన్న వయసునాడే భావాలింత నిర్దుష్టంగా ఏర్పడ్డాయని కాదుసుమండీ. కాస్త కోసలు సాగతీస్తే యీరూపంలోకొస్తాయని దరహాంమీద ధోరణిచెప్పా.

తన్నిదూటినా తన మనోభావ చిత్రణా కౌశలాన్ని తెగనాడినా నారదుడు ఓర్మివహించేవాడే. సద్వివేక వినయశీలములు కల[illegible]డని బడిలో ఖితాబుకొట్టిన బిడ్డ. లక్షణమైనా విలక్షణమైనా ఒక్కటే నారదునిలో ఉన్న గట్టిచిక్కు. 'నాది' అని నారదుడు నమ్మిన సమాజాన్నిగాని, సంస్థనుగాని పల్లెత్తుమాటంటే, కోసుగా ఎగాదిగా చూస్తో విపత్తువత్తున్ని కళ్ళతో కొల్లలేస్తాడు. వేసంగుల్లో గోస్తనదీ తీరాన్ని నర్సాపురపు విద్యార్థి ఒకడు మా బోడ్డుహైస్కూలును బోడిహైస్కూలు అంటో చులకనచేసాడని రోషోద్ధతుడై వాడిని వెతికిపట్టి అతినిష్ఠురముష్ఠిబోడిచి, మేనమామలూరు ఉడాయించి బడితెరిచాక వచ్చాడు. అలాంటి సన్నివేశాల్లో కృష్ణుడేవచ్చి 'పద్దిటు నారదా అననీ, మరేమయినగానీ' వినుపించుకోడు, వెనక్కి తగ్గడు. 'నాది' అనే ప్రవృత్తే వ్యక్తియొక్క అన్ని రకాల విక్రీడలకు మూలమనీ మన అహంకార మమకారాలన్నిటికి 'నా' యే కారణము అనీ బుధులు చెప్పగా వింటాం. ఇక నారదుని విశిష్టత ఎక్కడంటే నారదుని 'నా'కి మన 'నా'తో తారతమ్యం అంతా ఏతం పెట్టు. నారదుని డబ్బు దస్కం కాజేసినా, వాడి క్లాసుపుస్తకాలట్టుకు పోయి వాటి ఊసెత్తకపోయినా, ఏమిరా అన్న పాపాన్నైనాపోడు. మన 'నా' పట్టంతా అలాంటి స్వవిషయంలో మనకు వచ్చేది పోయేదీ ఉంటేనే. మనవి మనం తెచ్చుకొనేదాకా భల్లూకప్పట్టు పట్టేస్తాం. ఇక మనసమాజాన్ని ఎవడైనా నడివీధినిపెట్టి ఏకేస్తున్నాడనేఅనండి మన యితర సామాజికులు ఏంచేస్తారు వాడిని చూచుకోక అన్నట్టు చల్లగా మన 'నా' యిల్లుచేరుతుంది. కాబట్టి చెప్పొచ్చేది నారదుని సమాజహితైకపరత్వం అద్వితీయం. అందులోనూ మా నూతన స్థాపిత నాటక సమాజాన్ని సకల కల్యాణ సంస్థానంగా నమ్మేశాడు నారదుడు.

తనను పంతులుగారు, దొరగారు దొరగారంటో ఎద్దావా చేసినంత

సేపూ కళాస్రష్టలా అంటో అపహసించినంత సేపూ మౌనముద్ర వహించాడు. కన్నెత్తి చూడలేదు కాని మాష్టరుగారు సుతిమించి యిన్నిడిగ్రీలేయేర్పాయి యూనివర్సిటీలో కొట్టుకొచ్చావు అన్నపుడుమాత్రంఅపల్కాడి పరిహాసోక్తుల కుల్కి రోష మదసంక్షుభి భూత చేతస్కుడై గిన్కుమై తోక త్రొక్కిన కృష్ణసర్పరాజుమాడ్కి రోజుతూ, పుస్తకాలసహితం కిటికీ మీదుగా అవతలకురికి కృష్ణునికి కబురుపెట్టి తానెళ్ళి హెడ్మాస్టరుగారి గుమ్మందగ్గర నుంచుని, వ్యాకులిత చిత్తుడై కృష్ణుని రాకనునిరీక్షిస్తోన్నాడు. ఆపద్బాంధవుడు కృష్ణుడు గజేంద్రరక్షణార్థం విసురున వచ్చిన విష్ణువును తలపుకుతెస్తో, పుస్తకాలు, కాలిజోడు ఎక్కడివక్కడవదలేసి ఒక్క తృటిలో వచ్చిపడ్డాడు దూరానికే, ఆత్మగౌరవం దెబ్బతిన్నట్టూ, పౌరుషం రెచ్చినట్టూ కన్పిస్తోన్నాడు నారదుడు-పెదిమలు బిగించి, పాదాలు ఎడమెడంగా వైచి, ఎడంభుజం పైపుకు తలకొంచెంవంచి, ఉఛ్వాస నిశ్వాసాలను దురితంగా విడుస్తోన్నాడు. ముఖం మీద పడ్తోన్న గిరజా పాయను ప్రక్కకు గెంటుకోమరచాడు. వస్తోనే, కృష్ణుడు ప్రగాఢ స్నేహసన్నాహ దోహళమైన చిత్తంతో నారదుని గుచ్చిఎత్తి, నిన్నెవరేంచాసారన్నా అని । నారదుణ్ణి వీపునిమురుతో అడిగాడు. కృష్ణుని ఆప్యాయతకు, నారదునకు కళ్ళల్లో గౌతమి తిరిగింది. ఎంత జాతి హృదయమైనా స్రవించేటంత ప్రేమపూరితంగా ఉంది కృష్ణుని కంఠధ్వని. బాల్యస్నేహంలో ఉండే దివ్యత్వం ద్యోతకమైంది.

ప్రక్కకుచూస్తో, అవమానవ్యధాశిథిలిత హృదయుడవై, నారదుడు, “చావలేక బ్రతికి ఉన్నాననుకో కృష్ణా” అని హృదయవిదారణంగా చెప్పి, అంతలో క్రోధశోకములు ముప్పిరిగొన వోకల్ కార్డ్సు జబ్బెచ్చి మాటరాక నిలబడిపోయాడు. ‘పెనుగాలిచే, త్రిప్పంబడి తప్పంజను నావ చందమ్మున’ అన్నారే పోతన్నగారు, అలా మనసు చెదిరిపోయి యుండనోపు. ఏభావం తెలవుసేరకుండా ఉంది కాబోలు. నారదుని విపత్తునంతను సంక్షేపించిన ఆ ఒక్కవాక్యంతో కరుణామయుడు, కృష్ణుని ప్రాణం కదంటేంది. వెంటనే, కోలుకొని, ‘దైన్యం, స్త్రైణం, విపత్ నివారణోపాయ

సన్నాహసంసిద్ధత పురుషలక్షణం నారదా' అని ధీరతజల్కి, కార్య సాధనాయత్తచిత్తుడై, 'యిక ఏమాత్రం కాలవిలంబన సైరించలేనట్టుగా, నారదుని న్యూనతపరుప సాహసించిన ఆ అల్పాయుష్కు డెవడో, హేతు వేమో, జాగుసేయక' చెప్పెమని, తత్ప్రతీకారగవేషణమందు మునింగి బ్రహ్మరంధ్రం మొదలు పాదాంగుష్ఠంవరకు కరిపించేలా నారదుని భుజాలుపట్టి ఊపాడు. దాంతో నారదుని ముఖంపై అల్లుముకున్న నిరాశా నిర్వేదచ్ఛాయలు పటాపంచలైనై. నారదుని కళ్ళు మెరుపులీనాయి. చూచారా, ఎంతలో తగాయిదా తెచ్చిపెట్టిన నారదుడే నిమిత్తమాత్రుడై, దుష్టశిక్షణా, శిష్టరక్షణా ప్రతినబూనిన మాకృష్ణుడే ప్రధానపాత్ర అయినాడో. అదే వీరపురుష చరితా విశిష్టత.

నారదుడు తన చిత్రరచనా ఉదంతాన్ని, పంతులుగారి. కోపాటోపాదికములను, వ్యంగ్యోక్తులను పూసగుచ్చినట్లు వివరించాగా. బొమలు ముడివడ, రోషాకుల మానసుడై, కృష్ణుడా కథాక్రమం యావత్తూవిని, పంతులుగారు ఆగ్రహావిష్టులై, ఆనార్య ప్రసంగ ప్రవర్తనలకు పాల్పడ్డా, గురుదూషణ దోషానికొడిగట్టకుండా, ధర్మవు తప్పకుండా, తన శిష్యచరితాని కేకించిత్ మాలిన్యం సోకకుండా, నారదుడానాడు లెక్కల క్లాసులో చూపిన రక్కసితాల్మికి, సరే, సమాజంపట్ల ప్రదర్శించిన భక్తి తత్పరతకు నారదుణ్ని అభినందించాడు 'నీ ధర్మమే నీకు విజయం చేకూర్చగలదు. ఉపాధ్యాయుడు విగతదర్పుడు కాగల డిదితప్పదు. మేరువు దిరిగినా నిశ్చయం' ఓడదని చేతిలోనున్న క్రికెట్టీసు లండన్ ఫుల్ లెదరు కేప్పను ప్రేలితో దిర్ధిరతిప్పుతో పల్కాడు. అశ్రిత పక్షపాతి మాకృష్ణుడు.

కృష్ణుడు ప్రధానాచార్యుల వారికై ఎదురు చూస్తూన్నాడు. ఆ గడువులో, సీతకాలపు-కలల రీతిగా, భావన స్వరూపం సన్నసన్నగా తెలియకుండానే మారిపోతోంది. ఒక్క చిత్తరువును చెక్కినంత మాత్రన, నారదుని 'విషయ చింతాయత్తుడై, వాగరములో ద్రోసిడి వాని'గా భావించాడా మాష్టరుగారు. 'సద్గుణాగరిష్ఠుడు నారదుడు

పరిహాసపాత్రుడా? కళాకృషి ఒక నేరమే అయితే, మరికళాకారులతో పనేమి? న్యాయవర్తనకు న్యాయఫలములు గలుగకపోవుట, ఇట్టి మార్మిలి ఇట్టి తెలితి సృష్టిలోనే యున్నదేమో. సంకుచిత భావపరిధులో బంధితుడైన లెక్కల మాష్టరుగారికి కళలగోల, ఏలా కల్గగలదని ఆశించగలమన్నట్టు, లేనవ్వుదయించింది కృష్ణుని పెదిమలమీద. త్రిభువన పావనుడు, జనవంద్యుడు నారదుని నిర్నిమిత్తంగా అవమానించి చిచ్చోచ్చిడి గట్టుకొన్నాడే పాపం మాష్టారని జాలికూడా కల్గింది. ఫలితము లెటు రూపొందినా నారదుని అవమానాదిక వృత్తాంతం, ప్రధానాచార్యుల వారికి సవిస్తరంగా తెలియజేయడం, తన ప్రధాన కర్తవ్యం.

హెడ్మాష్టరుగారు దక్షిణకొస క్లాసు రూములోనుంచి వస్తో వైటయ్యారు. కృష్ణుడు సన్నిద్ధుడయారంభుడై, అడకువదోప చేతిలోని టోపీని తలకు ధరించి నారదునికి ముందునుంచుని హాఫారం బొత్తాములు సరిచూచుకొంటోన్నాడు. కాలోచితముగ పౌర్వాపర్యము విచారించి హెడ్మాష్టరుగారి భావమూహించి, లెక్కలమాష్టరుగారిపై నిందావాక్యమన్నది నోరు జారకుండ, నేరిమిమీఱ నారదరక్షణ చేయవలసియున్నది. సదసద్వివేక సంపన్నుడు, సారాసార విచారదక్షుడు కృష్ణునకు నారద కార్యనిర్వహణ సుసాధ్యమే, అయినా కార్యభారాన్ని అతడి కండ్లు సూచిస్తోన్నాయి. విరటు చేరబోయే నరుని చిత్రించారే తిక్కనగారు 'వేషధారి అయిన విష్ణుండుబోలె' అని, ఆ ఉపమానం మాకృష్ణునికి సరిగావప్పుతోంది. నిజంగా ఆపోజు మా కృష్ణుని సహజవైఖరి కాదు, వేషమే. ఇదివరలో ఒకటిరెండు పర్యాయములు వేసిన వేషమే. పొట్టివడుగు బాపని వేషంలో, 'యీశ్వరుండయ్యు అర్థిరూపంబును గైకొని యడుగవలసెనా' అన్నట్టు బలిమఖాంతర్వేదికా వాటంలో నిలబడ్డాడుగా ఓనాడు. మరోనాడు తానీషాయింటికి రాత్రికి రాత్రివెళ్ళి, అతడి చిరాకులు పరాకులు సరకు సేక, గెడ్డమట్టి బ్రతిమాలాడే. ఈకథావత్సరంలో మాబడిలో అవతరించిన కృష్ణుడు అభక్తజనసులభుడే నని నానమ్మకం. ఈ అవతారంలో వినమ్రుడై హెడ్మాష్టరుగారిని అర్థింప వచ్చాడు. పదవ్యాజంలో త్రిలో

కాధి పత్యం చేపట్టిననాడు కూడ తృణమైన ముట్టాడా.? మరెందులకీ హైరానంతా?

సురరాజు భక్తుడు, గోపన్న భక్తుడు మానారదుడు నేటిభక్తుడు - చాలు. చెప్పేయున్నారుగా పోతన్నగారు.

'జ్ఞానులచే, మానులచే, దాసులచే
యోగసంవిధానుల చేతంబూని నిబద్ధు
డగునే భక్తియుతుల చేతంబోలెన్ ॥'

ఇది నారదుని యుక్తకార్యమైంది. ఎంత అగచాట్లైనా పడుతోన్నాడు. మాకృష్ణుడు యీ చిన్నపరిధిలోనే చూపినత్యాగానికి పులకితుడనయ్యా. మాతాపితలు, మిత్రుడు వీరు ముఖ్వురే హితులన్న పంచతంత్ర సుభాషితంఅనుభూతికొచ్చింది. ధన్యోస్మి ధన్యోస్మి, కృష్ణా, భక్తజనపోష, పరమపుష సోదరపత్ష పాతంతో, విద్యార్థిహితైక బుద్ధితో, నీవు నారదునకై పడ్డ ఆరాటం, నారద కార్యార్థివై, భయభ్రస్తులుప్పిరిగొన దొట్రువడుచు హెడ్మాష్టరుగారి దెస చూపు నిల్పియున్న ఆమహత్తర దృశ్యం, నీవానాడు చూపిన బాల్యస్నేహాంతర్గర్భిత మహనీయత్వం, ఆలేవయసు జగన్మోహన స్వరూపం, నీవిపుడెక్కడయున్నా, నాకు చిరస్మరణీయాలైనై.

హెడ్మాష్టరుగారు దూరాన్నుంచే దీనాననుడైన నారదుని, నారదునికి ఏకైక ఆశాజ్యోతిగా వెలుగొందుచున్న కృష్ణుని వీక్షించి, వస్తూనే అత్యాదర ముఖవికాసంతో, ప్రియహిత భాషణలతో కృష్ణునుద్దేశించి, తనకై నిరీక్షిస్తోన్న యుదంతమేమై యుండునని అడుగుతో కృష్ణుని లోనికి గొంపోయారు. నారదుడు అనుగ్రాహ్యుడగునా, నిగ్రాహ్యుడగునా, దండింపబడ్డ ధర్మవిఘాతుని పగిది యిలుదూరవలసియున్నదా, అభిమతార్థసిద్ధిఘటించి, కృష్ణనామ సంకీర్తనం చేసుకుంటో కలకల్లాడుతో నిర్దోషి నారదుడు క్లాసుకొచ్చునా, నుదుటనేమి వ్రాసియున్నదో, అనతి కాలంలో తేలదగ్గ టెన్సు మోమెంట్సువి. 'నారదునిభావి ఎట్లుపరిణమింప నున్నదో' అని మా మావివిధ ప్రిక్రృత్యానుసారంగా తలపోస్తోన్న నారద హితాహితులం, హెడ్మాష్టరుగారు కృష్ణసహితం లోనదుగిడేసరికి, వచ్చిపడి,

హెడ్మాష్టరుగారి ఆఫీసురూముకు కొలది దూరంలో అందరం చేరాం. వేదాంతం వారి అబ్బాయి, వాడికి మిత్రభేదం కంఠోపాఠం. అంటాడు 'చేసిన కర్మం అనుభవింపక తీరునా, కీడొచ్చేలో ఏకాలమందేది రావలెనో అది రాకమానదు. విధివిధానం ఎంత వానికైనని అప్రతి విధానం. కోటి వేల్పులే అయినా కృష్ణప్రేమే అయినా కాయడం కష్టం'. పురాణం వారి అబ్బాయి, అనేక పురాణ పుణ్యకథాకథన దక్షుడు. యీతడు అగుపిస్తే మా ధర్మజ పాత్రధారి సంబోధన, పద్యరూపంలో యుంటుంది. 'సూతా, కరుణోపేతా, జననుతగుణసంఘాతా, ఘనపుణ్యసమేతా, విగత కలుషవ్రాతా!' ఈతడికి కృష్ణ మహాత్మ్యం బాగానమ్మిన విషయమే హో, వేదాంతంవారి అబ్బాయి మాటలు చిరుచేదుగా ఉన్నాయి. 'నీమెట్ట వేదాంతం నాకర్థము కాదు. కష్టాల పాలయేవాడికి కృష్ణప్రేమ దొరకనే దొరకదనుకోరాదా? కృష్ణప్రేమ అయినా కాయలేదంటో వంకరమాటెం దులకు? 'కలలోనం తను మున్నెఱుంగని మహాకష్టాత్ముడైనట్టి దుర్బలు డాపన్నమయంబునం నిజపదాబ్జాతంబు ఉల్లంబులో ; తలపం తోడన మెచ్చి ఆర్తహరుడై తన్నైన నిచ్చున్ సునిశ్చల భక్తిన్ భజియించువారికిపడే సంపద్విశేషోన్నతల్'. 'నిరంతరం, కృష్ణమంగళ కథాకర్ణన ధ్యానాను గాన నుతులు పల్కుతూ, కృష్ణదర్శన, స్పర్శన, సంభాషణ సహాసన ములుచేసి, చక్రిని దాసునిగా చేసికొన్న మన నారదునికొచ్చిన భయం ఏమీలేదు. చూస్తోవుండు. కృష్ణుడు ఏలాచక్రం అడ్డంవేస్తాడో', అన్నాడు. మాకృష్ణుని అభిజనంలో వాడే, కృష్ణుడి మేనత్తకొడుకు, బంధుకోటిలో కృష్ణునికి జరుగుతోన్న గౌరవమంతా తనకు అవమా నంగా జమకట్టుకుని, కృష్ణునిపై అకారణ వ్యతిక్రమం ఉపక్రమించాడు. చేయగలిగిందల్లా కృష్ణుణ్ని నిర్నిమిత్తంగా తిట్టడం, వాగ్విషయమైన అపకారం. మేనత్తను చూచి కృష్ణుడు ఓర్మివహించిన కొద్దీ వీడు పేట్రేగి పోతోన్నాడు పురాణం వాడు కృష్ణుణ్ని ప్రశంసిస్తే వీడికి అరి కాలిమంట తలకెక్కింది కాబోలు, అందుకున్నాడు. 'మీ భట్రాజా పటాలమంతా వీడికి స్తోత్రపాఠాలు చదువుతోంటే గొప్పోణ్ని అను

కొని, పరాధికారం పైన వేసుకొని హెడ్మాష్టరుగారి దగ్గరకు ఊరేగాడు, తగుదునమ్మా అని, వీడి సంగతి నాకు తెల్సు. హెడ్మాష్టరుగారి దగ్గర తలవాచేట్లా చివాట్లుతిని, ఆలోచిస్తా మన్నారంటే మీరు దానికి థళాథళీ' అంటారు అన్నాడు. ఏదో అబద్ధం కోస్తాడు, మా సహదేవ పాత్రధారికి 'నిజసోదర్లకన్న కృష్ణుడు యిష్టుడేమో, చొక్కాలో నల్లిలా వీడిక్కూడ మన్నిసలుపుతాడేం, నేలనెట్టి రాసేస్తా వీడినిక్కూడ' అంటో ఎగిరి తలమీద తన్నపోయాడు వాణ్ని. 'నీకెందుకొచ్చింది యీలా పేల్తోంటే వూడేస్తాడు వీడి పుర్రె కృష్ణుడే ఎప్పుడో. రోజులు మూడాయి వీడికి' అని పురాణంవాడు శిశుపాలుణ్ని శపించి సహదేవుడికి అడ్డుపడ్డాడు.

బాలురలో, కక్షలు పరిమాదకరాలు కాకపోయినా, నల్లేరులా ఎంతదూరం ప్రాకుతాయో చూడారా. నిజానికి యీ శిశుపాలుడికి నారదుని మీద కాని మా మీద కాని స్వతః కక్ష లేదు. కృష్ణునిమీదే ఉన్నపగంతా. ఆకృష్ణుని స్నేహం ఎందుకు పట్టాలని శిశుపాలుడికి నారదుని మీద కక్ష. 'నారదుడు వీడితో చెప్పి స్నేహాలు చేసుకోవాలా. మధ్యవీడి సామంతం ఏమిటి. అందుకు నారదుడి మీద కక్ష కట్టడం ఏం న్యాయం వీడికి' అని మాకు వీడి మీదకక్ష. 'నారదకృష్ణులమీద నే కక్షకడితే, వీళ్ళు నామీద కక్ష గట్టడం ఏం న్యాయం వీళ్ళకు' అని వాడికి మా అందరమీద కక్ష. ఈమధ్యనో కథకు 'అభిప్రాయాల గొలుసు' ఒకటి పసందుగా తయారుచేసి ఒకానొక సుందరం మెళ్ళో వేసాడు. ఎమ్మె ఫస్టుగా ప్యాసయిన సుందరం వూళ్ళో వూరికే తిరుగుతోంటే, వూరికేనే తిరుగుతోన్న సుందరాన్ని గురించి, వాడిమేలు కోరే పెద్దలకు వివిధాభిప్రాయాలున్నాయనీ, ఈ అభిప్రాయాల్ని గురించిన అభిప్రాయాలు సుందరాని కున్నాయనీ, వూళ్ళో వాళ్ళకున్న 'అఅ' వివిధాభిప్రాయాలను గురించి తన భర్తకు 'ఈఈ' అభిప్రాయాలెందుకుండాలని సుందరం భార్యకు ''ఊఊ'' అభిప్రాయాలు పుట్టుకొచ్చాయనీ, 'ఓఓ' మా గొప్ప అభిప్రాయలే పుట్టుకొచ్చాయి ఏలా

గైతేం సుందరం భార్యకు అని ఓర్వలేని సుందరం వదినగారికి అభి ప్రాయాలు తెగతన్ను కొచ్చాయనీ, యీ ధోరణిలో, లయయుక్తంగా, మూడూళ్ళవాళ్ళ అభిప్రాయాలను కలేసి గొల్సుతయారుచేయ సిద్ధ మయ్యాడు. మేం బి. ఏ పరీక్ష యిచ్చిన వత్సరం, షేక్స్పియరు మీద జాన్ సన్ వ్రాసిన విమర్శమీద, రెలై వ్రాసిన విమర్శన మాకు పాఠ్య గ్రంథం. ఆగ్రంథాన్ని డి. ఏ. పీ పొడి అక్షరాలుగా పేరుగల్గిన ఒక పంతులుగారు మాకు బోధించి, ఏభై పేజీల నోట్సు యిచ్చారు. రామా రావు అనే కుర్రాడు వాటిని లిక్కికి లిక్కీ మక్కికి మక్కీ ఎక్కిం చాడు. ఆనోట్సును దొరకబుచ్చుకొని నరసింహారావు అనే కుర్రాడు అయిదు పేజీల్లోకి, ఆ అయిదు పేజీల నోట్సునూ ప్రభాకరరావు అనే అతడు విద్యార్థుల కోరికపై ఒంటి పేజీలోకి సంక్షేపించారు. తెల్లా రితే ప్రోజు పేపరు అనగా రాత్రి ప్రభాకరరావు ఒంటిపేజీ బహు పాప్యులరైంది. ఆ రాత్రి దానికై తిరగడంలో మాకు ఒకళ్ళకీ నిద్రలేదు ఆది నూటఏభై చేతులమీద నుంచి రావల్సి వచ్చింది. దాన్ని అడగ డానికే ఒక్కొక్కడి దగ్గర పదినిమిషాలట్టింది. 'ఎందుకురా సుబ్ర హ్మణ్యం యింత రాత్రి వచ్చావు?' 'ఒరే, నీదగ్గరకు P or N or R on D. A. P on Relaigh on Johnson on Shakespearఉ వచ్చిందిరా' అని యింతపొడుగు దండకం చదవవల్సి వచ్చింది. ఆసంవ త్సరం మాసెంటర్లో యింగ్లీషు ప్రోజు పేపరులో 80% తప్పారు. అగొల్సు పేరు పేజీ ధర్మమా అని.

ఆశానిరాశలతో కూడుకున్న హృదయాందోళనతో, కృష్ణశాస్త్రి పర్యవసానముకై మేము వేచియున్న అగడువు పొడకైనకొద్దీ దుర్భర మవుతోంది. మా ధామ్యుడు వారిస్తోన్నా వినుపించుకోక, కాశీపుడు హెడ్మాష్టరుగారి గదికేసి పిల్లి అడుగులమీద ఒక్క బారెడు వెళ్ళినట్లే వెళ్ళి, ధరుస్రన వెనక్కి తిరిగి, ఒక్కటే ఒక్క కప్పగంతులో మాలోకి వచ్చిపడ్డాడు. వస్తోనే, సహదేవుడు 'ఏమిట్రా' అని పూర్తిగా అన్నాడో లేదో వాడి నోరు నొక్కేసాడు. ధామ్యుడి గుండె ఆగిపోయింది.

మిగతావాళ్ళం ఉచ్ఛ్వాసనిశ్వాసాలనుకూడా బంధించేసి ఆఫీసుకేసి ప్రాణాలెట్టుకు చూస్తూన్నాం. 'అదుగో హెడ్మాష్టరుగారు మహదోల్లాసంగా, కృష్ణుడి భుజంపై చేయివేసుకొని బయటకు వస్తోన్నారు. తమలపాకు చుట్టుడుంగరాలు చిలకలు ఒక్కొక్కటే కొఱుకుతో లెక్కలమాష్టారు సమీపిస్తూన్నారు. 5వ ఘారం లెక్కలక్లాసు వదలడం తర్వాయిగా ఆయనకు యింటివద్దనుంచి వర్తమానమంది, ఎక్కడివక్కడ వదలిపెట్టి, నారదుని చిత్తరువును హెడ్మాష్టరుగారికి పంపించడమేమరచి, నేరుగా యింటికి వెళ్ళారు.

ఏమాటకామాట అనుకోవాలి. ఆయన ఎన్నడూ గార్హ్యస్థశాస్త్ర మర్యాదలు అతిక్రమించినవాడుకాదు. ఇల్లాలిమాట శాసనంగా పాటించే సధర్ముడు. 'సతి పిల్వంబంచిన పనియేమియని వచ్చి చెప్పిన యుడిగంబు చేయు' నని ఆయనకు ప్రతీతి. ఎంత పనితొందరనున్నా, ఎంతమందలో యున్నా ఆపె పిలుపు చెవినిపడగానే, అది దేహమంతటను విద్యుద్వేగముతో ప్రసరించే, బహు సున్నితమైన మనస్తత్వమట మాష్టారిది. ఆ పిలుపులో ఏలాంటి మహత్తరమైన అధికారవాణిని వింటాడో సామాన్య భర్తలకు అర్థంకాదు. పిలుపుతెచ్చినవారినికూడా అశ్రుపూరిత ప్రేమదృక్కులతో వీక్షించే ఉదారస్వభావుడు. ఒక్కపిలుపుతో, ఎంత దీర్ఘవ్యవధి వ్యధలనైనా మరచి, సర్వాపశ్వతులను లయంచేసి, స్వస్త్రీయందే హృదయం లగ్నంచేసుకునే ఏకపత్నీవ్రతస్థుడు. కాకరకాయస్వరూప కాలకూటాన్నికూడా అమృతోపమానంగా పచనంచేసి పతులను కట్రాటని కట్టేసే యువతులున్నారు. జాజిపూలతో జారుజెడవేసి, తంజావూరి తాంబురా చేసంధించి, భర్తనుద్దేశించి ప్రేమగీతాన్ని కామవర్ధని రాగాలాపనతో మేళవించి, అనురాగపాశం భర్తమెడకేసి కాళ్ళదగ్గర కూర్చోపెట్టుకొనే కాంతలుండవచ్చు. వెలకునెలా కస్సుబుస్సుమంటోనే పతిని సతి భక్తిపరాయణున్ని చేసికొన్న సతీతిలకం, మాష్టారిభార్య. పరపురుషుల కంటబడని చంద్రమతి మాంగళ్యంలా, యీవిడ కస్సుబుస్సులలో అణగిమణగియున్న ఏవో సుగుణాలు, సద్హృదయత మాష్టారిమట్టుకు

కన్పిస్తోంటాయట. ఆవీధిని భర్త అన్న వాడు ఏకించిత్ అవిధేయత చూపినా, తత్క్షణం భార్య బుసగొట్టి, మాస్టారిదగ్గరకెళ్ళి పాఠం చెప్పించుకురామని పంపే పలుకుబడి వచ్చిందట లెక్కలమాస్టారికి. రాత్రి ప్రొద్దుట వేధించిన ప్రణయం యింతక్రితమే సుఖాంతమైయుండాలి. శిష్టకృతుగా భోంచేసి వస్తోండనోపు. ఎక్కడా భూతభవిష్యత్తులతో నిమిత్తంలేకుండా, వర్తమానంలో తేలియాడుతో వచ్చాడు హెడ్మాష్టరు గారి ఆఫీసు గడపదగ్గరకు. హెడ్మాష్టరుగారు నారదునివైపు మాపుతో, "This is a terrible fellow then, Mr. Rao" అన్నారు లెక్కల మాష్టారితో. క్లాసులో నారదునిమీద కల్గిన ఆగ్రహం యింటికెళ్ళడంతోనే చల్లారిపోయిందేమో, ఆయన తన సహజసద్హృదయతతో 'కుర్రాడు చురుకైనవాడండీ' అన్నాడు. 'మరి విన్నావా Mr. Rao వీళ్ళది నాటక సమాజం ఉందట మనబడిలో. వాడు చిత్తరవుగీసి అందులో వేసిన పొడి అక్షరాలు వీళ్ళ సమాజనామమేనట. మనం లిటరరీయసోసియేషనుతో జంటగా బడిలో దీన్ని ప్రోత్సహించి, జ్ఞానసేకరణకు దీన్ని మన బడిలో ఒక ముఖ్యాంగంగా తయారుచేయాలి. నీవీసాయింత్రమే ఫర్నిచరురూము కాళీచేయించి దాన్ని లిటరరీయసోసియేషను సెక్రటరీకి ఒప్పగించాలి' అని హెడ్మాష్టరుగారు లెక్కల మాష్టరుగార్కి చెప్పి, దాని తాళంచెవి మా కృష్ణునికియ్యమన్నారు. హెడ్మాష్టరుగారు తాడికేసులో డిఫెన్సులో మా సమాజప్రస్తావన తేదలచుకొనికూడా, మా సమాజంపట్ల శ్రద్ధవహించారని లోగడ మనవిచేసియున్నా. నిజంగా, పిపాసార్థితునకు చల్లటి మంచినీళ్ళు కంటబడ్డట్టుంది హెడ్మాష్టరుగారికి, మేము నాటకసమాజం బడిలో స్థాపించియున్నామని వినడం. తద్రీత్యా మాబడిలో మా సమాజానికి 'Local habitation and a name' లభించాయి. నేను మా ధర్మజ కృష్ణులం నవ్వుకున్నాం. తాళంవేసుకొనేదీ, తీసుకొనేదీ మాకో గది వచ్చిందన్న బడాయేకాని, దానిలో జాగ్రత్తపెట్టేది హార్మోనియం అయినా మాకులేదు. తర్వాతరోజు ఉదయానికల్లా 'బోర్డుహైస్కూలు బాలభాస్కర సంగీతనాటకసమాజం' అనేపేరుతో ఆగది ముఖద్వారం

పైన నారద కౌశికులు ఒక అట్ట కట్టేసారు. బడి విద్యార్థులంతా అది చదువుకు వెళ్ళడం ప్రారంభించారు. గ్రామంలో మా సమాజం ఖ్యాతి మువ్వలా మోగుతోంది. బడిలో ఏఫంక్షనువచ్చినా 'మన నాటకసమాజాన్ని ఒక ప్రదర్శనం తయారుచేయమని రిక్వెస్టుచేతాం' అని హెడ్మాస్టరుగారు అంటోండడం, మా బడియొక్క ప్రశంస వచ్చినపుడల్లా హెడ్మాస్టరుగారు మా నాటకసమాజ ప్రస్తావన తెస్తోండడం, ఫంక్షన్సులో పెద్దలకు మమ్మన్ని 'Galaxy of Artists' అంటో ప్రశంసావాక్యాలతో పరిచయం చేస్తోండడం, ఎవరోఒకరు, ఉపాధ్యాయులు ఏరోజూ మమ్మన్ని 'మీనాటకం ఎప్పుడు పడుతుందోయి' అని అడుగుతోండడం, గ్రామంలోకూడా ఎందరో మమ్మన్నీ వాకబ్‌చేస్తోండడం, పైస్నేహితులు 'అబ్బాయి మమ్మన్ని మీనాటకానికి తీసికెళ్ళాలిసుమా ముందే చెబ్తోన్నా' అనడం, మా సోదరసోదరీలు 'అన్నయ్యా, నువ్వు మగవేషం వేస్తావా ఆడవేషమా' అంటో అడగడం, 'అది యిప్పుడు చెప్పేదికాదు, అదికాక యితరమేమడిగినా చెప్తాం' అని మేము గాంభీర్యంగా పలికి వారిని ఆకర్షిస్తోండడం, ఏ అరటాకులైనా బజారులోనుంచి తేకపోతే, 'నాటకంమూకలో చేరిపోయారు, యింటిపని శ్రద్ధఏదుస్తుందా వీళ్ళకు' అని ముసిలమ్మలు కక్షలుతీర్చుకోవడం, మా సమాజసభ్యులం ముందు సాగుతోంటే, విద్యార్థిసోదరులు మమ్ములను వేర్వేరుగా చూపుకొంటో, యీతడు కృష్ణుడట, అతడు అర్జునుడట, బలే యాక్టర్లట అని ప్రశంసిస్తోండడం, చివరకు ఒకపర్యాయం మా బోర్డుహైస్కూలు నాటకసమాజ సభ్యులు 'మీ సుమర్భింగుపాత్ర చూడవలెనని వస్తోన్నారు, వీరికి కాస్త ముందువరసలో బెంచీవేయించవలసింది' అని కోరుతో కీ॥ శే॥ పెదురుమాడి శేషగిరిరావుగారికి మా హెడ్మాస్టరుగారు చీటి వ్రాయడం, ఈలా జరుగుతో మేము ఒక నాటకం అప్పట్లో ప్రదర్శించకపోయినా మా యశస్సు దశదిశలా వ్యాపించింది. 'ఇదంతా మా నెక్కులమాస్టారి గృహిణి చేతిచలవ' అని ఆయనకు నాకృతజ్ఞతాపూర్వక వందనశతాలు సమర్పిస్తోన్నా.

# పిల్లతనపు టుత్సాహావేశాలు

వేసంగి శెలవులిచ్చారు. మా పసిఊహలలో మెరుపులు మెరసై. మాసమాజ ముఖ్యసభ్యులలో నలుగురైదుగురం, మేనమామలు, బావలు, వదినలు ఉన్నవాళ్ళం. ఆయా వూళ్ళెళ్ళడానికి రైలెక్కనక్కఱలేదు. ఒకవూరుమాత్రం పడవప్రయాణం. మరీమంచిది. పట్నవాసాలు కావు. ముఖ్యంగా తిండికి తడుముకోనక్కఱలేదుగదా. అక్కలు, బావలు, వదినెలు వున్నవాళ్లు కాబట్టి నాటక ప్రదర్శనాలకు చీరెలు, రవికెలు, ఆభరణాలు అఱువుపుట్టే పుణ్యస్థలాలే. ఆడవేషాల తయారీకి యిరకాటపడనక్కఱలేదు. ముఖాలు చూచుకోడం యుండదు. 'ఆడగ్రంథం సైడు కర్టెనులోనేఅయింది' అనిపించనక్కఱలేదు. సభాసమక్షంలోనే కానియ్యవచ్చు. కాలిమీద కాలేసుకొని రెండుమూడుమూకూడా ఆడవేషాలను స్టేజీమీదకు 'చెలో' అనగలం అన్నమాట. మాసమాజానికి ఆడలక్షణాలు పుణికిపుచ్చుకొన్నవాళ్లు యిద్దరబ్బాయిలుండేవారు. తమవంక ఎవరైనా చూస్తున్నారని తోస్తే అమట్టునే మెలికలు తిరగడం, 'అవును నాయిష్టం నాదీ, నాజోలి ఓఅబ్బాయికెందుకు' అన్నట్టు రెండోప్రక్కకు తిరిగి పండంటి మూతి ముడుచుకోడం, ఈగైనా మీద వాలందే అనవసరంగా ఉలిక్కిపడి బెదురుచూపులు చూడడం, పలకరిస్తే తల పైకెత్తకుండా కాలి బొటనవ్రేళ్ళతో నేలమీద ఏమోవ్రాయడం, కబుర్లు కానిస్తోనే యథాలాపంగా ఏదో రవికగుడ్డలాంటిది చెవికంటూ దారం లాగుతో కుట్టడం, వయ్యారంగా ఒక్కగింజైనా క్రిందపడకుండా, క్రమం తెగకుండా పేక దారం లాగినట్టే ఎంతసేపైనా చింతగింజలాట ఆడడం, కోసుగా గుప్పెడి గవ్వలు రువ్వి ముసిముసినవ్వులు నవ్వడం, చెయ్యిచెయ్యి పట్టుకొని వస్తోన్నాసరే 'నడువలేక నడువలేక నడచుచుండె' అన్నట్టుగానే ఒక అడుగు వెనకే ఉంటోండడం పద్యమైతే కంఠం నొక్కేసుకు పాడడం గద్యమైతే తెగసాగదీసుకోడం, పనిగట్టుకు అలవాటు చేసుకున్నారు. ఏదెల్లావున్నా ఆ ఆడఅబ్బాయిలకిద్దరకు చాన్సు దొరుకుతుంది. వున్న

వూళ్ళో అయితే అల్లరిపడతాం అని భయపడిపోయి ఎక్కడైనా వేయించి తీసుకురామని పంపేస్తోన్నారు వాళ్ళు. అన్నిటికన్నా అదృష్టం, ఆ వూళ్ళవాళ్ళు కంపెనీ నాటకాలు చూచినవాళ్ళు కారు. అంచేత మాదే వాళ్ళకు షాంగ్లీకంపెనీయో, పార్శీకంపెనీయో అవుతుంది దంపైవచ్చు, యింకే కావాలి. అంచేత రిజల్టు తేలేసేలోపల అధమం ఆరూళ్ళైనా ప్రదర్శనాలిస్తో లుంగచుట్టుకు రావాలని సంకల్పించాం.

కాకపోయినా ఏలా పడిఉండగలం. నామకరణంచేసిన ఆ అమృత ముహూర్తంనుంచి ఏకపీఠిని నిష్కళంక యశస్సుతో విరాజిల్లుతోం దాయిరి సమాజం. ఘుమఘుమలాడే బంగారంతో సమాజాన్ని పోల్చు కుంటోన్నాం యింతలింతలివాళ్ళను యిళ్ళల్లో కట్టేసి ఏలా కూర్చునేది. మాకృష్ణుడు కంఠంఎత్తితే శ్రీకృష్ణమురళీ మధురగానాన్ని విన్న గోపికల వలె సభ్యులు సమ్మోహితులవుతారే. రెండో పెదురుమూడి శేషగిరావు గారు తణుకులో పెలిసారని పేరేసుకొన్నాడే. గంధర్వగానంచేసే మా నారదుని మహితిని పూజా పురస్కారాలు లేకుండా తుప్పుపట్టనీయడం కన్న లోకానికి మరేమపచారం ఉంటుంది. ప్రకృతి చిత్రరచనలో పరి పూర్ణప్రజ్ఞానిధి అని క్లాసురూములో కీర్తివహించిన అతని కళావైదగ్ధ్యాన్ని వూళ్ళంట వాల్పోష్టర్లమీద ఒక్కసారి విరజిమ్మవలసిన గురుతర కార్య భారం మాసమాజం ఏనాడూ మఱువలేకుంది. ఆయా గ్రామాల్లోని విప్రవరులు, విద్వజ్జనులు మమ్మల చూడవస్తే, విజ్ఞానఖని, విశుద్ధాత్ముడు, సాధుచరితుడు, సర్వ ధర్మార్థవిదుడు మాధర్మజుడు వార్లకు కృతాంజలియై మనఃప్రియమైన మాటలుచెప్పి మా సమాజానికి వారి స్నేహభావాన్ని, ఆశీస్సులను చేకూర్చగలడు. కృత్రిములతో సంఘర్షణ సంభవిస్తే కొంటె తనం తనలోనే పుట్టుకతో నిక్షిప్తమైయున్న మా కౌసికుడు నారదునితో మంత్రాంగంచేసి నిముషాల శతృవులకు ప్రతీకారం చేయగలడు. అల్లరి మూకలతో తలపడాల్సివస్తే మాభీముని గదావిహారం మాగయుని గంధర్వ యుద్ధం వైరి దుస్సహం అని రుజువులొచ్చిన విషయమే. ఇక మేం చూచుకొనేదల్లా నాట్యకళకు తొలిపూజాసుమంక్రింద ఏనాటకాన్ని

ప్రదర్శిద్దాం అన్నమట్టుకే. ఉదాత్త రసాన్విత కావ్యనాటక ప్రకరాలు పెక్కులు చూచిన మా ధర్మజ కృష్ణులు 'భారతమను పేరబరగు పంచమ వేదం శారాధ్యంబు ప్రజలకు' అనీ, ప్రజలు భారత ప్రతిపాదిత ధర్మము లను నిత్యజీవితంలో జీర్ణించుకొనుటకు అనువైన ప్రదర్శనాలిచ్చుట మా బాధ్యత అనీ, యీ ఉన్నతాశయములతో కాబోలు యిదివరలోనే గయో పాఖ్యానం సహితం మూడు పాండవ నాటకాలు మాచేత రిహార్సల్సు వేయించారు. వాటిలో పండిత పామరజన రంజకమైంది, ప్రదర్శన సౌలభ్యం కల్గింది, గయోపాఖ్యానం గ్రామాలలో ప్రదర్శనయోగ్యం అన్నారు. ఋషితుల్యుడు ధర్మజుడు, కర్మవీరుడు కృష్ణుడు కలసి చేసిన నిర్ణయాన్ని మేమెప్పుడూ శిరసావహిస్తాం. అవిరళ జపహోమ తత్పరుడు, మా ధౌమ్యుడు పర్యటన ముహూర్తం నిశ్చయించాడు. త్రిలోక సంచారి నారదుడు, 'సమాజం దినదిన ప్రవర్ధమానమై నేడు ప్రపంచంమీద పడ్తోంది కాబట్టి, రేపటినుంచి సప్తభాంతరసీమల గజ్జెకట్టనైయుంది కాబట్టి 'బోర్డు హైస్కూలు బాలభాస్కర' అన్న పేరు కించిత్ సంకుచితంగా ధ్వనిస్తోం దేమో. 'ది గ్రేట్ ఇండియన్ బాలభాస్కర' అని సమాజనామాన్ని సవరణచేస్తే సమాజంస్టేటస్ యినుమడించగలదేమో అని భవదీయుని విన్నప మన్నాడు' ధర్మజ కృష్ణులతో. కృష్ణపాదపూజా నిరతుడు నారదుడు చేసిన నూతన భావోద్దీపితమైన సజెషన్ను మేమంతా 'బలే నారదా, బలే' అంటో బలపర్చాం. ధర్మజకృష్ణులంగీకరించారు. 'ది గ్రేట్ ఇండి యన్ బాల భాస్కర సంగీత నాటకసమాజానికి జై' అంటో మేము జయజయ ధ్వానాలిస్తోంటే ధర్మజుడు చేయి యెత్తాడు. పిన్ డ్రాప్డ్ సైలెన్సు. యింట గెల్చి రచ్చగెల్వమన్నారు బుధులు. ముందు స్వగ్రా మంలో విఘ్నేశ్వర పూజగా మంగళాచరణ శ్లోకంగా ఒక్క ప్రదర్శన మిచ్చిమరీ ధౌమ్యదత్త శుభముహూర్తంలో పర్యటన ప్రారంభింతుముగాక. రేపురాత్రి డ్రెస్సురిహార్సల్' అని ధర్మజుడు శాసించాడు. "పుస్తకా పేక్ష ఏ లవలేశం పనికిరాదు. మిగతా నాటక కంపెనీల నటుల వైఖరిని నాటకంనాడు చేస్తాముగా అనీ, ప్రేక్షకులు లేనపుడు యిదికూడా చేసే

డేమిటి అని ఊరుకున్నాంగాని తెలియక కాదని చెప్పడాలులేవు అబ్బాయి. అభినయసహితం పోర్షన్లు తున్నంగా యుండాలి, ఖ్యాలు అందియ్యడా లుండవు ఏమనుకుంటున్నారో" అన్నాడు కృష్ణుడు. తెల్లారితే ఇంగ్లీషు పేపరన్న రాత్రికూడా మేము వహించనంత కార్యభారంతో యిళ్ళుచేరాం. మా ప్రథమ ప్రదర్శనం ఏలా పరిణమించింది, నాకథావస్తువే.

ఆనాటి మా నాటక సమాజపు యక్విప్మెంటు, కంజాయింపులు మనవిచేస్తా. మానాడు యింతింత కంజాయింపులెరుగం ఇప్పటి పరికరాలు, సౌకర్యాలు లేనేలేవు. మారంగస్తలాలు పాటిస్తలాలు, పశువుల దొడ్లున్నూ. వాటికొత్తలు యిప్పుడు తెప్పించి దాఖలుచేయగలం. లిఖిత పూర్వకంగా పడిఉన్నాయి మారంగస్థల పరిమాణం బొంతుయింద్రయ్య గార్కి పోరీకత్తురీత్యా పంచిపెట్టబడ్డ పాటిస్థలపు వాటా పరిమాణమో, రాయిడుగారికి కోర్టువేలంలో వప్పగింత కాబడ్డ పశువులదొడ్డి పరిమాణమో అవుతుంది. నిస్సంశయం. మా థియేటరుకు మావూరి సామర్తి సుబ్బారాయిడుగారి శ్రీరామనవమి పందిరతో కేవలం పేగుసంబంధం, ఆ ఆకు, ఆ వెదురు, ఆ వడపే వదుపూ అదే, ఎక్కడా మిగుళ్ళూ తగుళ్ళూ లేకుండా. శ్రీరామనవమి ఆఖరురాత్రి సామర్తివారిపందిట్లోకివెళ్ళి, దేవుడిదర్శనం చేసుకొనివచ్చి వరుండి, ఉదయాన్ని మా రంగస్థలవీధికి యథాలాపంగా వచ్చిన వాళ్ళకు ముందడుగడదు. కళ్ళు వప్పగించి, మా థియేటర్ను చూస్తో అమట్టునే నిలబడిపోతారు. 'ఏమిటిది, గ్రామం నిద్రమీదయుండగా సామర్తివారి పందిరి యీవీధికి నడచివచ్చిందా! ఆ!' అని నిర్ఘాంతపోతారు. కొంచెంసేపు తలకాయ బ్రద్దలుకొట్టుకొని వాళ్ళతోను వాళ్ళు పోయేవాళ్ళూ ఉండవచ్చు. ఒక చాందసుడ్డోపర్యాయం దానిచుట్టూ తిరిగి అనుమాననివృత్తి చేసికొని బడి కాలస్యంగావెళ్ళి దెబ్బలుతిన్నట్టు వినికిలి.

నిజంగా, ఆ పిన్నవయసు ఉత్సాహావేశాలకు అంతుకట్టలేం, తూచలేం, కొల్వలేం, పోల్చలేం, వర్ణించలేం. లేకపోతే అక్కడ పీకేసేయడం, యిక్కడ కట్టేసేయడం, మధ్యన చేరేసిందెప్పుడండీ భళ్ళున తెల్లవారేసరికల్లా వెళ్సేసింది "ది గ్రేట్ యిండియన్ బాలభాస్కర

సంగీత నాటకసమాజ రంగస్థలం" చాకలిఅమ్మాయిల అడ్డం కుంకుమ బొట్టులా, యింత పొడుగుపేరు అట్టా నుదుటకట్టుకొని. అంతా రాత్రికి రాత్రే అవును. మేమేం మహారథబలం చూచుకోవాలా, వాస్తుపట్టింపులు పెట్టుకోవాలా, అంతా స్వబలం, సమిష్టిఆచరణం. మా బాలబలగం లంకకు వంతెనవేసిన సుగ్రీవసైన్యం. స్థలంవారిదా, సరకువీరిదా, 'మా' 'మా' అంటో మాచెప్తోంటిరి. మీ అతిశయం యక్కడండీ యింతలోను, అంటారా. ఆ! అదే, అదే నేచెప్పదలచుకొన్నదీని. దేశం అంటే మట్టి కాదు, మనిషి అని అమరజీవి అప్పారావుగారు సెలవిచ్చారే, అలాగ సమాజం అంటే స్థలంకాదు, సరకూకాదు, సంఖ్యాకాదు. అక్కడనుంచి ప్రసరించే, కేడియేటు అయ్యే, అమగో ఆ చేవ, చైతన్యం, ఆ జవ, జీవం, ఆ శోభ, సౌందర్యం అవి. అవి విద్యార్థులసొమ్ము. వాళ్ళ Monopoly తలక్రిందుగా తపసుచేసినా, ఒకులకీ దినుసు చిక్కేదికాదు. వయసుమీరిన వాళ్ళు చూచి ఆనందించదగ్గదే.

అయితే బాల్యావస్థలోని చహాల్ చహారాలు ఆ Wild, joyous and frolicksome life చూచి ఆనందానుభూతి పొందగల్గడమాకేది, అంత మాటలమీదఉండా వయసుమీరినవాళ్ళకు? అమ్మో దానికెంత సరిస్కృతి, ఎట్టి విజ్ఞానగరిమ, ఏలాంటి నాగరికవ్యవస్థ కావాలి! జ్ఞానేంద్రియానికి జీవితయాత్ర ఒక 'Great handicap race for Six penny pieces' లా గోచరిస్తుంది. దారంటబో లెడు కుత్సితం, కలుషం, తొక్కుకొస్తాం. మధ్యగా పట్టించుకొచ్చిన ఆ పంకిలం కడిగేసుకోగల్గితే, అదే పదికోట్లు, వేయి క్రతుకర్మలపెట్టు. తొల్లింటి శిశుహృదయాన్ని శుచిగా యుంచడంకన్న, ఉత్కృష్ట అధ్యాత్మిక సాధన, ఆత్మశోధన మరొండు ఉండదని తెలుస్తా. తత్ప్రయత్నంకన్న మనం చేయదగ్గ అధ్యాత్మికాన్వేషణ లేదని భావిస్తా మహాత్మాగాంధీ చంటిబిడ్డల నాడించినా, జవహారలాలు బాలబాలికలతో ఆడుకొన్నా అంతర్యమిదే. 'To keep clean the lens on which any vision shall be printed సుసాధ్యంకాదు. మధ్యాహ్నం తిరిగేసరికి ఆంగ్లేయరచయిత మాంటేగ్

చెప్పినట్టు 'you come off a net loser, your vision of life more or less blurred, your faculty for delight perceptibly enfeebled and your feeling petrified' ఏ చైతన్యవాహినిని చూచినా బెదరపడడం, పెదిమవిరవడం, వయసు తెచ్చే ఐశ్వర్యం. 'Wise in our own esteem' కుర్రాళ్ళనందరిని ఏర్భాయిల లిస్టులోను, మనకన్న వయోవృద్ధుల నందరిని అపస్మారకుల ఎకౌంటులోను జమకట్టేస్తాం. మన పేగ్గను ప్రయోజకుల ఖాతాలో పడేసుకుంటూ. కుర్రాళ్ళు ఏలాంటి కళాకౌశలం చూపినా అది 'శిశు విద్య' కాదని మన స్థిరాభిప్రాయం. పెద్దల ప్రదర్శనాలు వట్టి పాతఊసిరి పచ్చడని మనసాభిప్రాయం. ఈ అహంభావస్వసంపాదనే మన నలుబది సంవత్సరాల లోకానుభవ ఫలితమున్ను. ప్రతీదీ అనవసరంగా కన్పించే ప్రయోజకులం మనమే ప్రపంచానికి అనవసరం అయివుండాలి అని అనుకోలేము. 'Unless you become as a little child, or have not ceased to be one, the best that there is to be had will not come your way' అన్న సత్యం గ్రహించలేం.

## రంగస్థలం - రంగులు - దుస్తులు

ఈనాటి అభిరుచులు, ఆశయాలు అవసరాల దృష్ట్యా, యిప్పటి కళ్ళతో మా నాటక రంగాన్ని చూస్తే మీకెంతో అస్తవ్యస్తత కన్పించొచ్చు. మా హాలు అర్ధవలయాకారమూగాదు, ఏటవాలూ కాదు అంతా ఏక చదును, ఓ షేకోసున్నా, మాగ్రీన్ రూము రూము కాదు. గ్రీన్ అసలే కాదు సిసలుగా మాట్లాడితే. మారంగుల హైన్యం—మీకు పట్టించుకోనే అభిలాష ఉంటేస్తుండి,—మానాటికే అర్ధళం దీనదశకు దిగజారింది. ఓనాడు రంగులరంగంలో కింగుమేకరయి ఉజ్వలతేజంతో ప్రకాశించిన అర్ధళం, దాసర్లుకూడా ముఖం ముందుకు రానీయకపోతే,

పాపం, బెంగెట్టుకుపోయి, నాట్యజగత్తులో నుంచి నిష్క్రమించి, మా నాటికే, అట్లతద్దికి మాలలకు, మొహర్రం పులులకు పూత పెట్టుకుంటూ మాలమూల్ల పొట్టపోసుకొంటోంది. బాదినకొద్దీ ఛాయవచ్చే ధనియాల జాతిరంగుని, చేతుల్లో పులుముకొని, దాంతో తులాసాగా ముఖాలు మెత్తుకోవడం, చెంపలు వాయకొట్టుకోడం, మెడలు వంగదీసుకొని గుద్దుకోవడం, మా అందరికీ చేతనైంది. పరోరి నందుకు బతిమాలి బత్తె మిచ్చి తెచ్చుకోనక్కరలేకుండా. మేకప్పును ప్రత్యేక కళగా గణించాము కనుకనా అందులో నిపుణుణ్ని మా సమాజానికి రవాణా చేసికోడానికి శక్తితగ్గినా ఆసక్తి తగ్గని వృద్ధరసికుల్లాంటి, ఏనాడో రంగు పూసుకోడం మానేసిన వృద్ధనటులు దైవికంగా దొరికితే వాళ్ళు మేకప్పుకు కించిత్ సాయం చేస్తూండేవారు. మొత్తం మీద స్వయం కృషే. మహారాజుల దగ్గరనుంచి విదూషకులదాకా మేం ధరించే దుస్తులు, ఆభరణాలు, ఆయుధాలు మాకు మాప్రక్క ఊరి దాసరిభాగవతుల బిచ్చం. దినవెచ్చం యిచ్చి తెచ్చుకొనేవాళ్ళం. మేం ప్రదర్శించిన ఒక నాటకంలో చిలుక గోరువంకలాంటి లేతవయసు నాయికానాయకులు ఉద్యానవన విహార సన్నివేశంలో దోబుచ్చులాట ఆడ్తోన్నట్టు అభినయించి 'శృంగార రసప్రధాన నాటక ప్రదర్శనాల కొక క్రొత్త పోకడ, నూతన పంథా ప్రసాదించిన ఒరిజినల్ యాక్టర్సు' అని ప్రశంస పొందాము. నిజానికా ఖితాబుకు మేమనర్హులం. ఆ ఖ్యాతియావత్తూ మా హీరోకి కిరీటం యెఱువిచ్చిన దాసరి కోటయ్యకు చెందవలసియుంది. మాకిచ్చింది మా వాడి ఆదాయానికి మించిన కిరీటం కావడం కారణంగా, తల, నుదురు, చెవులు మూడుపాళ్ళు కళ్ళూ కప్పేసింది. అందుమూలంగా మా యువరాజ పాత్రధారి అవసరం వెంబడిని 'చేయిసాచి, సవ్యసాచి' అన్నట్టు చేతులుసాచి నాయికను వెతుక్కొని పోల్చుకోవలసి వచ్చింది. నాయిక పరంగా పద్యం చదువుతో చెలికత్తెను కౌగిట చేర్చుకొంటే రసభంగం అని మీరే అంటారుగా మరి. సూర్యవంశజులే కాని, చంద్రవంశజులే కాని, మా రంగస్థలం అలంకరించే సింహాసనాధీశులకు వస్త్ర

ధారణ విషయంలో ఒక విశిష్టత ఉండేది. కాషాయవస్త్రధారులై విపిన సీమల విహరించునపు డేమోకాని, చంకీదుస్తుల్లో మణిమయ భూషణాలంకృతులై, ప్రేక్షకుల కెన్నడూ మా మహారాజుల కరకమలాలు, పదపద్మాలు కంటపడలేదు. ముఖబింబ దర్శనము మాత్రమే లభించేది. అదైనా కిరీటం ధరించనపుడు. మాకెరువుగా దొరికే చంకీలాగులు కోట్లు మానటుల కధమం మూడురెట్లు పొడవు వలం కల్గినవే. మా కుర్రాళ్ళకపుడు లాగులు తొడగడంలేదు. ఇద్దరం చంకీలాగును అటుఇటు విప్పి పట్టుకొనేది, మరి యిద్దరు మా బాలనటుణ్ని జబ్బలు దొరకబుచ్చుకొని లాగులోనికి దింపేది. అలాంటిది మాకు గ్రిగ్ స్పోర్ట్స్ బాగ్ రేసులో అలవాటైన కార్యక్రమమే. సుళువుగా చేసే వాళ్ళం. మాకో పర్యాయం బాగ్ రేసు ముచ్చటాలభించింది. వేణీ సంహారంలో మా కర్ణుడు, కృపాచార్యుల వారి పెద్దరికం సెట్టకుండా, భూపాళరాగోధృత ఊతాలతో దూసుకోఅంటే దూసుకోఅంటో పద్యంతో, ఎంతో భయానకంగా ఎగబడే తొడతొక్కిడిలో, పాదాల చివర వ్రేలాడుతోన్న చంకీలాగును తొడుక్కొని, కృపాచార్యులవారి వక్షస్థలాన్ని నుగ్గు చేయదగ్గ విసురిని, కౌరవ సభలో కుర్చీలకు కప్పిన నల్లగుడ్డ ముసుగులో పడిపోయి, పాపం వాడు పద్యాం, ఆపినా, రాగం ఆగని కారణంగా, ఆముసుగులోనుంచే రాగ సశేషం విసుగుతో ప్రేక్షకుల ముఖం చూడలేక సైడుకర్టెనులోకి పాకిపోయాడు. విషయం తెలియని ప్రేక్షకు లెంతమందో, కర్ణపతనాన్ని కృపాచార్య బ్రాహ్మణ శాపఫలమనుకొని యుండాలి. అందుకు తగినట్టే, దివ్యశరశిక్షాశాలి, భూవినుతుడు, నిఖిలవేదవిదుడు, అకంపిత శౌర్యుడు కృపుడు కోపఘూర్ణిత నేత్రుడై ఎత్తినచేయి ఎత్తినట్టుగానే, నిలబడిపోయాడేమో, ఏదోమంత్రపిస్తోన్నట్టు ప్రేక్షకులకు కనుపించి మాకు గౌరవం దక్కించాడు.

అన్నప్పుడూ వస్తుందటగానీ, ఒక పర్యాయం గొప్ప ఉపద్రవం చింతాకంతలో తప్పిపోయింది. నాల్గవ యాక్టులో రాదగ్గ నటుడు మూడవయాక్టు వరకు కన్పిస్తోనే యున్నాడు. మూడవయాక్టు అవుతోం

డగా సిద్ధంగా ఉండమని చెప్పాలని చూస్తింగదా కన్పించలేదు. వాడికోసం, గాలించేసాం, దొరకడు. మా గంగన్నల సమీపంలోయున్న చెరువుకు మంచినీళ్ళకెళ్తోండగా చూచానని కుర్రాడొకడు చెపితే యిఖమాకు ప్రాణంలేదు. మంచినీటికి దిగి ఊబిలో కూరుకుపోయాడని నిశ్చయం చేసుకొని మూడు, నాలుగు యాక్ట్సులో రానివాళ్ళం ఆ చెర్వు వంచని కార్యనిర్ణయానికి కూర్చున్నాము. నాటకం తలపెట్టి ఒక కుర్రాణ్ణి పొట్ట పెట్టుకున్నామని గ్రామం అశేషం మమ్మన్ని చంపే స్తారని హడలుతున్నాము. ఆకుర్రాడి అన్న కడుపుగిలిపోయి,'తమ్ముడూ, తమ్ముడూ నేనూ వస్తూన్నానురా, అమ్మ నాన్న అడిగితే ఏం చెప్పనురా' అంటో రెండుసార్లు ఉరకబోయాడు, రెండుసార్లు పడకుండా పట్టిలాగాం. అంతలో కైమంటో నాల్గవ సతీమీద వాడి గాత్రం, వాడిపద్యం నాల్గవ యాక్టులో అచ్చంగా వాడివే వినిపించాయి. ఎగిరి గంతేసి థియేటరు లోకి వెళ్ళిపడ్డాం. ఎక్కడున్నాడని అడిగితిమిగదా, దణ్ణం ప్రక్క నున్న గుడ్డలమూట ధరిని చంకీలాగులో నిద్రపోతోన్నాడట. వీడితల, పాదాలు పైకిలేవు, అంచేత, అటువెళ్ళిన వాళ్ళంతా చంకీలాగును చూసిన వాళ్ళైఅయినా దణ్ణం మీదనుండి జారిపడినజడం అనుకొన్నారు కాని, సజీవ స్వరూపం అనుకోలేదు. అక్కడొచ్చింది పొరబాటు. పైగా దాన్ని చూచి కంటతడిపెట్టి వచ్చారుకూడాను అదివాడు నాల్గవయాక్టులో తొడుక్కోవాలని దాసర్లవెంట రెండు రోజులు తిరిగి తెచ్చుకొని మాధానంగా దాచుకొన్నాడు. పైనుంచేసే ఎవరైనా. తొడిగేయగల రని యీతాకుల చాపమీద దాన్ని పరచి దానితాల్చాకు ఒక కాలిలోకి లాఘవంగా దూరి పిన్నవయసవడంచేత, నిద్ర ఆపుకోలేక పోయాడు. ఇంకా ఓ కాడికి వీడు వడ్డూరు అబ్బాయి త్రిసూలంకన్న వయమే. ఆ త్రిసూలం మరీ లేతదవ్వ. 'అడుదమా, పాడుదామా' అనే మాటలు రెండు అనకలడు కదా అని హరిశ్చంద్రలో లోహితాస్యుడేయించాం. లోహితుడి తల్లి, కలహాకంఠికి దాస్యం చేస్తోన్నపుడు, చెలికాళ్ళతో లోహితుడు వనానికి బోయి సర్పదష్టుడైన సీన్‌లో, సంకీదుస్తులు

పనికిరావని మేష్ట్రచేత చెప్పించినా వినక మారాంపట్టాడు. పోనీ అని అంటుకు సై అన్నాం. చంద్రమతి పిడకా పుడకా చూచుకొని వచ్చేలోగ తగుదునమ్మా అని స్టేజిమధ్య నిద్రపోయి ఊరుకున్నాడు. పరిపరివిధాల సైడుకర్టెనులో నుంచి మేము లేపబోతే, ఒకసారి కళ్ళువిప్పి, కాళ్ళుసాచి 'ఊ' అనిమీద కస్సుమని రెండో ప్రక్కకు తిరిగి పరున్నాడు. నిజానికి మృతిని అభినయించేవాడు, నిద్రపోవడమే మంచిది అనవచ్చుకొందరు. కాని మాభయం వేరు; వాడు మరీకుర్రాడైనందున అనుకున్నంత పనీ చేసాడు నిద్దట్లో. అచంకీలాగును ఎండబెట్టి కోవలసి వచ్చింది. తర్వాత రోజున దాన్ని ఎండబెట్టు దాసర్లకు వప్పచెప్పాం కాని, దాసర్లకు తెలిసిపోయిందేమో అని ఏడాదిదాకా భయం వదలలేదు. మా దుస్తుల మాట తలపెడితే, పిక్విక్కు పేపర్సులో జింగిల్ తన ఎరువు దుస్తులను గురించి వర్ణించిన విషయం స్ఫురణకు వస్తుంది.

"Queer coats - Mysterious dispensations of providence - No Measuring - All the Shortmen get long coats - all the longmen Short ones"

చంకీ వస్త్రాభావకారణంగా చదివిపెట్టిన చిత్రనళీయం చాలకాలం, ప్రదర్శింప సాహసించలేకపోయాం. పెద్ద పెట్టుబడికంపెనీలే, చిత్రనళీయ నాటకానికి అవసరమైన చంకీ అమర్చలేకపోయేవంటే ఎక్కడా తాడూ బొంగరంలేని అర్భకులం మేమెంత యాతనపడాలో వేరే చెప్పాలా? ఒకరూ, యిద్దరూ కాదు. నలుడు, అష్టదిక్పాలురూ, స్వయంవరాపేక్షతో ఏమో Chance అని, ఎగబడ్డ ఒకడైనా పైరాజు, సరే భీమరాజు- పిల్ల తండ్రిరాని పెండ్లి ఏలాచేసేది- పోనీఅని అతడి మంత్రిని వదలేసినా, మొత్తం వద్దంటే పదిమంది తెరెక్కాలి; అందులోనూ ఒక్కసారిగా రావలి, ఒక్కసారిగా పోవాలి, ఒకేరకం డ్రెస్సు కావాలి. ఏకొంచెం దుస్తులు మార్చుకొని పరస్పర సాయసంపత్తులు చేసుకొనే సావకాశం లేదు. బాగా సంఖ్యానీకంతో కూడుకొన్న కృష్ణరాయబారానికికూడా యింతచేటు చంకీ యిబ్బందిపడనక్కరలేదు. ఒక్క రారాజుకి, కృష్ణునికి

ఏలాగో చచ్చి చంకీతొడుగు తేగలిగితే, మిగతా కురువీరుల నెంత ఎగుడు దిగుడు వస్త్రవైవిధ్యంతో సభకురప్పించినా తోసుకుపోతుంది. పెళ్ళి అక్కరలేదని భీష్మించుకొని కూర్చున్న తాతగారికి చంకీబాధ ఏం వచ్చింది? ఇక ద్రోణ కృపాశ్వద్ధామలా, బ్రాహ్మణముంగం ఏలావస్తే ఎవరికి కావాలి? కర్ణ దుశ్శాసనుల కిద్దరికిమాత్రం చెరో చెంకీ వేస్తుకోటూ, ఏదో నామమాత్రంగా కాస్త జరీపోగున్నవైతే చాలు—గిరాటేసి గంట కొట్టేవచ్చు. మరి చిత్రనళీయం అలా వప్పుకుంటుందా. సత్యనారాయణవ్రత ప్రసాదంమాదిరిని, పాత్రధారణవిధానం కథాంశంలోనే కట్టుదిట్టమయి కూర్చుందాయిరి. నూరు నూటఏభై పద్యాలున్న కథానాయకుడు నలుడు ఏలాంటి వస్త్రాభరణాలతో స్వయంవరం సీనులో ప్రవేశిస్తాడో ఒకొక్క పద్యం బ్రతుకిక్క, దిక్పాలురింతమందీకూడా, ఎక్కడా తూచాలు తప్ప కుండా అన్నింటితోనూ ప్రత్యక్షం కావాలి, నలుడివరసలో. ఏకటాకీని వారపారలులేకుండా నలదిక్పాలురకు చంకీ తొడక్కపోతే, మొదట్లోనే దమయంతి చెలికత్తె 'యితడుగాడేయితడు – యీతడు – యీతడే' అని పాడుతో చేసే ఆశ్చర్యాభినయం హాస్యాస్పదమై ఊరకుంటుంది. ఆ అందంచూచాం మెట్టా వెంకటసుబ్బయ్యగారి చిత్రనళీయ ప్రదర్శనంలో. దమయంతి చెలికత్తె మంచి నటనాచాతుర్యంతో ఒకచేయి నడ్డిమీద వేసుకునీ బుగ్గమీదవేసుకొనీ రెండోచేత్తో నలుణ్ని నాకవాసుల్ని చూపుతో వారి సాదృశ్యానికి ఎంతో అచ్చెరువొందినట్టుగా 'యితడు కాడితడు' కంగారుగా పాడ్తోంటే ప్రేక్షకుడో తరుణవయస్కుడు లేచి, 'నీకేదైనా కంటిజబ్బా! ఆ మెల్లకంటి ఆబ్కారీబంట్రోతు పక్కకుర్చీలో యున్న చంకీకోటు, నలుడు. ఆట్టే వెతుక్క' అని కేకేసి దమయంతినీ, చెలికత్తెలనూ బెదరగొట్టాడు.

అపరిపక్వమనస్కుడైన ఆప్రేక్షకుని దృష్టిలో 'మెల్లకంటి ఆబ్కారీబంట్రోతుగా' పరిణమించిన పుణ్యమూర్తి నాటకరీత్యా, సంతతాప్సరోంగనాసేవితుడు, శచీ చిత్తచోరు డింద్రుడుస్మండీ. అనన్య రూపలావణ్యరేఖావిలాసభాసమానయగు భీమనందన పొందుగోరి భూలో

కానికి దిగివచ్చిన దేవేంద్రుడన్యాత్త్రుడా? అందులోనూ, ఖర్మం, అబ్కారీబంట్రోతా? అయితేం. వెంకటసుబ్బయ్యగారి కంపెనీకున్న రెండు చంకీకోట్లలోను ఒకటి నిషధేశ్వరుడు, రెండవది భీమరాజు ధరించిన కార్ణంగా ఓనాడు అగణితసౌఖ్యానుభవశాలి అని వాసికెక్కిన వాసవుని కీనాడు పెండ్లివేళకు చంకీకోటులేక మావూరి చాకలింట అద్దెకుతెచ్చు కొన్న అబ్కారీకోటు దిక్కైంది. యముడు పోలీసు యూనిఫారంలో రావాల్సివచ్చింది. నాకనివాసులే అయినా స్థానభ్రంశమును పొందిన రాణింపరని తేలింది. ఎంత త్రైలోక్యసుందరుడైనా, వర్చస్వి అయినా చంకీలేక పురాణనాటకాల్లో వెలవెలబోయేవాడు. నటనాకౌశలం, గాన మాధుర్యం రెండూకల్గిన బాలురు దొరకడం ఒకయెత్తు, చంకీ దొరకడం ఒకఎత్తుగానూ ఉండేది. అప్పట్లో సాంఘిక నాటకాలే ఉంటే ఎంత సుఖపడుదురో అనిపిస్తుంది. ఉద్యానవనవిహారంలో, కదనరంగంలో, కొల్వుకూటంలో ఎక్కడకానీ, ప్రవేశం మొదలు నిష్క్రమణ వరకు సర్వ వ్యవస్థల్లోను మార్పులేకుండా చంకీలాగును కోటును రాచిరంపాన్ని పెట్టేవారు. వనవాసదుర్యోగం ప్రాప్తించినపుడు, తపసుకు బయల్దేరినపుడు మాత్రం కాషాయివస్త్రాలు ధరించేవారు. అంతచేటు చంకీ వ్యామోహం సన్నివేశాలను అస్వాభావికం చేస్తుందనే కించిత్ అయినా సందేహం ఏల కల్గేదికాదో బోధపడదు.

## శాంతమ్మగారి సైను - అవనికలు

సన్నివేశాల కనుగుణ్యంగా అవనికలుండాలనీ సంఘటనలకు సామ రస్యంగా వాతావరణాన్ని కల్పించాలనీ యిత్యాది సూత్రాలు నీమాలు పాటిద్దమో, మానుదమో తర్వాతమాట. చెప్పొద్దూ మాకు ఉన్నదల్లా సర్వాంగుళ్యాభరణాలకు ఒక్కటే తెర, సర్వాంగుళ్యాభరణాలకు పెళ్లి కొమార్తెకు ఒక్కచీరె ఒక్కరవికె అన్నట్టు. మాకర్టెనుకి సైడుకర్టెను

రవికె లేనేలేదు. మాలో ఎవరిముసలమ్మకీ జ్ఞాపకంలేదు. చింపి ముక్కలుచేసి కట్టాం. హార్మోనియం దాన్లో, ప్రాంప్టరు దాన్లో సమస్త పరికరాలు దాన్లో, గ్రామం అశేషం దాన్లోకి వచ్చి పెడ్తోంటారు నాటకం అయినంతసేపు. మా సైడుకర్టెను ఒక కలగూరగంప. మాకు కోశాగారమైనాఅదే కోష్ఠాగారమైనాఅదే. స్టేజీమీదకు వెడ్తో మానటులు పాత్ర కాగితాలు పడేసిపోయినా ఆభాండాగారంలోనే: టిక్కెట్టుపుస్తకాలు అందులోనుంచే పట్టుకువెళ్ళడం. గళ్ళపెట్టె భద్రతా అక్కడే. బోళా బాణీగా మాట్లాడుతోన్నా మా గళ్ళపెట్టెలో, పోతుందేమో అని భయపడదగ్గదీ పోయేది ఎప్పుడు మీదయావల్ల జేగలేదు. నాటకం అవడంతోటే చూడండి, నాటకం ముందుచూడండి గళ్ళపెట్టెలో కన్పించేదల్లా 4 టిక్కెట్టుపుస్తకాలు వేలెడుపొడుగు యినపజద్ద. మా సైడుకర్టెను తలచుకుంటే టాకెల్ఫు మిసలేనై స్ఫురణకు వస్తుంది.

జ్ఞాపకంవచ్చింది. ముసలమ్మగారదిగాదు, నాగయుడు మేనత్త శాంతమ్మగారు కట్టుకునే పులివార్కు పైనుపంచె చింపి కట్టాం. గయుడు సంధ్యాసమయంలో తెచ్చినపుడు ఎవరిదని భోగట్టా చెయ్యకుడానే అప్పటి తొందర్ని కట్టేశాం. తెల్లవారకుండా మేం నిద్రకళ్ళనుండగానే అమ్మశక్తిలా ఆవిడే వచ్చిపడిందిగా! పక్క జెడుగుమీద ఉన్నాడు కాబోలు గయుడు-మాకు తెలియదు. దూరాన్నుంచి ఆవిడను చూస్తూనే ఫిమేలుగేటంట ఉడాయించి ప్రాణం కాపాడుకొన్నాడు. ఆవిడ సరాసరి మా రంగస్థలంలో అడుగెట్టిందాకా వచ్చే ఉపద్రవాన్ని మేం కానలేక దొరికిపోయాం, ఆవిడ గుప్పెట్లో యిరుక్కుపోయాం. "అయ్యో, అయ్యో మా శేషమ్మపిన్ని చెప్పినమాట నిజమేనర్రా, నాదేనరా పైను నాఖర్మం కాలితే జామిచెట్టుక్రింద ఆరేసి నాకేంఅని యిక్కేశెళ్లానరా యింట్లోకి. ఊరందరికళ్ళు అడ్డమైనవాళ్ళ కళ్ళూ దీనిమీదే పడ్డాయి కాబోలు, నన్ను నాఊళ్ళోనే తెర ఎక్కించేసారుటరా. ఇంకా శాంతమ్మ బ్రతికుండి చేసేదేమిటుందర్రా' అంటూ ఒక్కవరసని ఎక్కడా ఆద్యంతాలు లేకుండా నానాఅల్లరీని. ఇక లాభంలేదనుకున్నాడు మా

కృష్ణపాత్రధారి. ఊరుకుంటే మరీ పేట్రేగిపోతోంది శాంతమ్మ. పేరు శాంతమ్మ కాని ఊరుమొత్తంమీద ఆడజాతిలో పులి. శాపాల అపరశారదావతారం. అందులోనూ తగాదా పులిమార్కు సైనుకి. అంచేత సైడు కర్టెను మాప్రాణానికి పెద్దపులి అయిందంటే నమ్మండి. అప్పటికప్పుడు ఆవిడముఖంలో ఎన్నాకలిపాడో గాత్రం మాకృష్ణుడు “చాలుచాలు ఊరుకోవమ్మా, ఎవళ్ళైనా వింటే నవ్విపోయేరు, యిదేమైనా చీరటమ్మా, చార్ల చీరైనా రంగుచీరైనా అయితేకాని, పోనీ ఏగర్భాదానపు పీటలమీదైనా పెట్టించైతే కాని, ఊళ్ళోవాళ్ళ కానమాలు అందామనుకొన్నా. వెధవవాళ్ళ మురికి ముతక సైనుగుడ్డకు అనవాలే ఋబుమ్మా, అడిగేవాళ్ళు లేక కాని” అంటో వెధవ అన్నశబ్దం దంతాలు కదలేట్లా వత్తిపలికాడు. ‘ఇదిగో యిప్పుడు నీగండ్రగోళానికి ఊరంతా పనికట్టుకు చూడరావాలి కాని, చెప్తోన్నా యింతవరకు ఒక్కళ్ళకు తెలియదు. రెండోకటివాడికి తెలియకుండా పండులా కత్తిరించికట్టామమ్మా. ఒదిలిపోయిందా నీబాధ. నయం, నయం యింకా యీఘుడియవరకు. ఆఖరని వందనాల టైములో ఏ అపస్మారకుడు మహా తెల్సినట్టు, సైడుకర్టెనుకు సైనుయిచ్చిన శాంతమ్మ గార్కి తీర్థిస్సు అన్నాడు కాదు! సంతోషించు యింకా యీ కాడికి’ అని ఆవిడ వికటాట్టహాసపు వెర్రి ఆనిషవ తెలియపర్చాడు. యింతవరకు ఆవిడ కెదురుతిరిగి ఆవిడతో కజ్జాపెట్టుకొన్నవాళ్ళు లేరేమో, ‘వేలుదుండి మాట కారితనం చూపెడ్తాడా’ అని వెర్రిరోషం వచ్చేసిందావిడకు. ‘అంత బాగా శీరంగనీతులు చెప్పేవాడవు మీ అమ్మమ్మది తెచ్చి కట్టలేకపోయావా? మీఅమ్మమ్మ సైనుమడత విడకూడదూ. శాంతమ్మ సైను చింపిపోగులెట్టాలా ఏమైతేం, ఎవర్ని ఏమంటే ఏంలాభం? మావాడు వట్టి వాజమ్మ అయిపోయాడు. వాడ్ని వెర్రివెధవనిచేసి వేషంవేసి ఆడిస్తున్నారు మీయిష్టంవచ్చినట్టు. వాడికి నోట్లో నాలికేఉంటే ‘నేనెందుకు తేవాలి!’ అని అనలేకపోయాడా. మిమ్మన్ని అనేదేమిటి? రానీ యింటికిరానీ, వెధవకి గరిటె కాడకాల్చి వాతపెట్టకపోతే యిదిగో శాంతమ్మని కాదు. నాటకంమూకలో చేరిపోయిన పీనుక్కి పరువు ప్రతిష్టఏమిటి? బుర్ర గొరిగించి అరుగుమీద

పడేస్తా అన్నం గొడ్లకాడాడి నరసని. ఇంకా యీకాడికి అదృష్ట వంతులం. మా చెల్లెలుగారి సీతని యిద్దామని మొన్ననే జామార్లు కట్టుకున్నారు. నాటకాలవాళ్ళల్లో కల్సిపోయాడు. ఆ కాస్త మంగళం అయిపోయింది. చూస్తో పిల్లకంఠం కోసుకోకండి అని రాయించేస్తా యిప్పుడు గోకించేస్తా ఉత్తరంముక్క' అంటో మా గయుడు పెళ్ళికి సైడుకర్టెనుకు ముడేసింది. పెళ్ళి తెంపేస్తుందట. ముందు గెడముక్కలసహితం సైడు కర్టెను వన్, టూ, త్రీ మూడు గుంజులతో దమ్మెత్తి పీకేసింది ధూమాంమ్మ గారు. రెండు గెడముక్కలు రెండుచేతుల్లోను సంధించింది సైను ముక్కలు యిరుపార్శ్వాలా గాలికెగురుతున్నాయి. నన్ను, గయుణ్ణి, కృష్ణుణ్ణి పనిలోపని గ్రామంమీద తనకు యిదివరలో పాత కక్షలున్న వాళ్ళని, గోత్రనామాల సహితం యిళ్ళవరసని చీర జామారు పెట్టినట్టుగా ఆడాళ్ళని, మొగాళ్ళనీ చెడామడా తిట్టుకొంటో చేతుల్లో సైనుగుడ్డలను పార్టీఫ్లాగ్సు లా కసితీరా ఊపుకొంటో వెడ్తోంటే చూడలేకపోయాం ఆభీభత్సం.

కృష్ణుడు శాంతమ్మగార్ల సైడుకర్టెను తగాయిదా 30, 35 సంవత్సరాలక్రితంమాట కాబట్టి అలా చిన్న పరిధిలో, సంకుచితంగా, వ్యక్తిగతంగా జరిగి, చప్పపడి, జారిపోయిందికాని, ప్రస్తుత సంఘపరిణామదశలోనే అయియుంటే, ఎంతో విశాలపరిధిలో వార్గికంగా, అధికసంఖ్యాకులను, లుంగచుట్టుకొంటో మాంచి సమస్యాత్మకంగాను. ఘటనాపూర్ణంగాను తయారుకాదగ్గది. 'నాసైను తేవడమేమి, మీదే తెచ్చుకోక' అని ఆవిడ, 'యీమాత్రానికి యింత అల్లరి చెయ్యాలటమ్మా' అని యీతడు, ఎంతసేపు చూచినా అంతే, ఆ చిన్నపరిధిలోనే, ఆయిద్దరి వ్యక్తులసందునే ప్రసంగ పద్ధతియావత్తూ. తిట్లుకూడా అలాగే, అతన్ని ఆవిడ, ఆవిడను ఆతడు, మాటకుమాట, అంతే. జనాభారీత్యా చూస్తే ఆవిడ అటు ఒక్కమనిషి. యీతడిటు ఒక్కమనిషి. కృష్ణుడికి, దగ్గరున్న నాసాయంలేదు. శాంతమ్మకు, చెప్పిన శేషంపిన్ని సాయంలేదు. చూచారా. నేడే అయితే, ఆతగాయిదా Whole picture మార్చేతుము. నిజానికి, 30, 35

సంవత్సరాల క్రితం అయినా, యీరోజునైనా ఉన్న విషయం అల్లా. ఆవిడకు సైనుంది, మనకు లేదు. మనకు కావాలి. యీ ఒక్కటే. ఈరోజునైతే తగాయిదాను అలాంటి పెర్సనల్ ప్లేన్లో ప్రారంభించనే ప్రారంభించం. దాన్ని అధిక సంఖ్యాకులకు అప్లైచేసే ఉన్నతస్థాయిలోకి మొదట్లోనే ఎక్కించేసేస్తాం. నాటకప్రదర్శనకేకాక దేశమొత్తానికే అభ్యుదయకరమైన ఓ మహోద్యమానికి మన జీవితాలను అంకితంచేసినట్టు పెద్దెత్తుమాటలు హోరెత్తించేస్తాం. చక్కని వాదనావిధానం అవలంబిస్తాం. 'మన అభ్యుదయకరోద్యమానికి సైదుకర్రను ముఖ్యావసరం. సైనులేందే సైదుకర్రను తయారుకాదు. తద్వారా మన ఉద్యమఫలప్రాప్తికి అవసరమైన సైన్లు, 'Inplements of production' మనకులేక మనం యమబాధ పడ్తోన్నామని తెల్పండీ వాటిని దగ్గరపెట్టుకొని కూర్చుంది కాబట్టి, యీ శాంతమ్మ అనే వితంతువులో బూరుజివావర్గం యీపత్తూ మూర్తీభవించింది' అని ప్రచారంచేసి, ఆడిపోసి, అల్లరిపెడ్తాం. ఆవిడను అభివృద్ధి నిరోధకశక్తిలా చిత్రించి, ప్రెస్సులోను, ప్లాట్ఫారంమీదా ఏకేస్తాం. మనవాదం సంఘాల్లో పాకడానికి పోర్టబుల్ గా ఉండేటందుకు, దాని సారాంశాన్ని నినాదరూపంలో ఉత్పత్తి చేస్తాము. జనావళి పాడుకునే మంత్రాలుగా చేస్తాం. అప్పుడు స్వవర్గకక్షార్థం, తణుకునుంచి న్యూఢిల్లీ దాకా ఉన్న వితంతులంతా అటు ఏకమైపోయి వారో పోటీనినాదం లేవదీస్తారు. అలాంటప్పట్లో, రెండుచేతుల్లోను పార్టీఫ్లాగ్స్లా ఆ సైనుగుడ్డలను ఊపుతో వెళ్ళే శాంతమ్మగారికి, గొట్టంబూరాలతో శేషమ్మపిన్ని దార్లో కలుస్తుంది. ఉభయులు "నాటక సైదుకర్రలు నశించాలి. వితంతు సైనులు వర్ధిల్లాలి" అంటూ వీధులంట ఊరేగుతో యింటికడ్తారు.

శాంతమ్మగారు సైదుకర్రను పీకేసుకుపోయింది కాబట్టి మాకున్నది అసలు తెర ఒక్కటిమాత్రమే. సర్వాలంకార సుందరమైన వివాహ మంటపాలను తెరచినా అదే. హృదయవిదారణమైన స్మశానవాటికను కళ్ళకు కట్టినా అదే. శరభ, వరాహ శార్దూల మదద్విరద ప్రకర భయంకర వనమధ్యం అని మా ప్రేక్షకులను హడలకొట్టాలన్నా యీ తెరే

దింపుతాం. సకల కాలకుసుమఫలభరిత పాదపవనసంకీర్ణ సరోవరవిరాజితమైన ఉద్యానవనవిహార సౌఖ్యంతో హాయిహూరుద్దామన్నా యీ తెరే దింపుతాం. ఈ తెరప్రక్కను అర్ధనిమీలతనేత్రుడై, ముక్కుమూసుకొని కమండలధారి మా వశిష్ఠవేషధారి కూర్చుంటే, అదే ధ్యానయోగనిష్ఠాగరిష్ఠులైన మహాతపోధనుల ప్రశాంతప్రదేశం ఋష్యాశ్రమం అని మా ప్రేక్షకులు క్షణమాత్రంగానైనా పరమధ్యానముకుళిత నయనులైతీరాలి. మా అభిమన్యు లక్ష్మణకుమారులు ఉరవడించి కత్తులేసుకు యీ తెరముందుకు ఉరికితే, యిదే రౌద్రభీభత్సభయానక కురుక్షేత్రం అని హడలిపోతూ, హాహారావాలు చేస్తూ, ''వీరలు కాక వీరితో నొండొకరుండు మార్కొనగనోపునే, యివ్విధపు కయ్యము లెక్కడనైన గంటిమే, పాండవ కౌరవోత్తముల బాహువిలాసము లిట్టులుండునే అనుకుంటూ'' వెనక వెనక్కి తగ్గితీరాలి ప్రేక్షకజనం మాకుర్రాళ్ళ క్రొత్తగా నేర్చిన కత్తులసాముకు సాధ్యమైనంత దూరంగా. ఈఒక్క తెరమీద సృష్టిలోఉన్న దృశ్యవైవిధ్యం యావత్తు మేము, ప్రేక్షకులం ఏలా ఊహాగానం చేయగలిగేవాళ్ళమో, అద్భుతమౌతుంది, యీనాడు ఆలోచిస్తే.

ఈ తెరైనా మేం కొన్నది కాదు, కుట్టించింది కాదు, ఓ బాపతు మృతవస్త్రపుఆస్తి. ఆదిలో అది మావూరి భజనసమాజాంది. ఆ భజనసమాజం మూడునాళ్ళ ముచ్చటయింది. 2 శనివారపు భజనలైనతర్వాత మూడవ భజనకు, ప్రసాదాల పంపుళ్ళల్లో విస్తళ్ళుచింపుకొని, భక్తులు శ్రీరామ చరణసన్నిధిని తాళెపుచిప్పలతో బుర్రలు బ్రద్దలుకొట్టుకోవలసి వచ్చింది. నిజానికా తగాదాకార్ణం అంత గడ్డుకాదు. ఏలా సద్దుకున్నా సర్దుకుపోయేదే. ఏలాగా సర్దుకోక అంతదాకా ముదరబెట్టారు. ఏమీలేదు. భజనసమాజాచారాలప్రకారం, భజనానంతరం ప్రసాదం పంచిపెడ్తారని తెల్సి భక్తులు ఎందుకో కన్పెట్టుకొన్నట్టు భజనలో భక్తిశ్రద్ధలు చూపలేదు. చాలామంది పరుండబోయేముందు వచ్చి ప్రసాదం పుచ్చుకొని చేతులు కడుక్కుపోయారు. మొదటి శనివారం అలా అయిందని రెండో శనివారం ముందే ప్రసాదముని ప్రచురంచేస్తే, భజనప్రారంభంలో వాకిలంతా

కిలకిల్లాడులో భక్తులతో నిండిపోయింది. ప్రసాదాలందుకొని, కంఠం దిగకుండానే వీధిలోవాళ్ళు వీధిలోనే కక్కుఱుకట్టుకొని ఎగిరిపోయారు. భక్తులు భజనవేళకు ఒక్కపిట్టలేదు. సమాజస్థాపకుడు, మరోయిద్దరు సభ్యులు బుర్రలు కల్పుకొని, ఆలోచించుకొని, భజన యథావిధిగా చేసిన వాళ్ళకు, చెయ్యనివాళ్ళకు ప్రసాదంలో వ్యత్యాసంగా వాటాలేస్తే సమాజ శ్రేయస్సుకు తోడ్పడుతుందని నిర్ణయించారట. యీమాట పొక్కగానే భక్తుల్లో కొంతమంది భజనపీఠంవద్దకు తాళపుచిప్పల కొరకు వచ్చినట్టేవచ్చి, అప్రక్కనున్న చిట్టిగార్లబుట్ట ఎగరతన్నుకుపోతే, ముందువాళ్ళు వెనక మిగతా సభ్యులు మందిరంచుట్టు మూడు ప్రదక్షిణాలుచేసి కలబడి కొట్టుకున్నారు. అప్పుడు మునసబుకర్ణాలొచ్చి, మనవూరికి భజనసమాజం అచ్చిరాలేదని, పుణ్యం అనుమానం, ప్రాణనష్టం నిజం. అయినప్పట్లో భజన కట్టిపెట్టేయడం శుభావహమని, నచ్చచెప్పి, అలా ఉత్తరాలు వ్రాయించి, సాక్షి వ్రాళ్ళుచేయించి ఆనాటితో భజనసమాజాన్ని శాంతియుతంగా రద్దుచేయించారట. ఆనాటినుంచి మా హయాందాకా యీ తెర మా రామారావు అటకమీద పడిఉంది అహల్యలా. మా రామారావు దానికి శాపవిమోచనంచేసి 9 రోజులు దివారాత్రిలు తన వీధి అరుగు గోడకు ఆన్చి ఉంచాడు. ఎవ్వరు మాది అన్నవాళ్ళు లేకపోవడంతోటే 10వ నాడు సరిగా ఉదయం 9 గంటలకు మాది అయి ఊరుకుంది. వ్యతిరేకభుక్తంకూడానేమో. తెరకు 9 రోజులు దుమ్ముదులిపి, దాంతో మా నాటకసమాజానికి విఘ్నేశ్వరపూజ చేసాం.

ఆ తెరకట్టితేనే విఘ్నేశ్వరపూజ. వేరే చెయ్యక్కరలేదు. ఆ తెర మీద ఉన్నది తెగబలిసిన పందికొక్కు, దాని తలపైన లంకణాలుచేసి పత్యం పుచ్చుకొన్న ఊదరపొట్ట వినాయకుడు మా వినాయకుడిక్కి పురాణాల్లో తగిల్పించిన స్మితవదనం యీ వ్యాధిమూలన్నే కన్పించటం లేదని తోస్తుంది. బహుశహా, లంకణాల రోజుల్లో వచ్చిన ఉండ్రాళ్ళవచ్చు బళ్ళన్నీ, యీ ఎలక ఒకర్తీ పొట్టనెట్టుకొని, పందికొక్కు అయియుండవచ్చు. దాని వెండమీద తెరకుచిల్లుంది మేం మధ్యమధ్య మానాటకం

నాకెం ప్రేక్షకుల ముఖాల్లో చూమకోడానికి వీలుగా. పని బహు కష్టంచెమైనా ఆచిల్లు కాస్తాకుట్టించకుండా యుండడాన్కి అది ప్రబల కారణం. కొంత చిత్రికారుని కళాకౌశలాన్కి రుజువిచ్చేచిల్లు, చేతులారా ఎందుక్కు కుట్టించాలని. నిజం పిల్లి ఏదో, యీ అబద్ధపు ఎలుకను నిజంఎలుక అనుకొని ఉరికి, మెడకొరికి, అంతలో అలికిడి అయ్యేసర్కి, గోడెక్కి పారిపోయింది అనిపిస్తుంది యీచిల్లును పరీక్షగా చూస్తే.

స్టేజి ఎక్కేవాళ్ళల్లో యిప్పటిలా లింగభేదంలేదు. అంతా పుంలింగమే. అంచేత నైతేనేం, మా ఆదాయాన్కి మించిన క్రయప్రయాసలు పడలేకనైతేనేం, ఆడసొంటు లేని బ్రహ్మచారి నాటకాలే వెతుక్కునేవాళ్ళం. అక్కడికి నాటకంలో ఏమూలైనా స్త్రీ పాత్ర తద్దినంలాంటి తప్పనిసరి అయితే దాన్ని సైడుకర్టెనులో కట్టేసి, హార్మోనీష్టుని సైడుకర్టెనుకు అడ్డంగాపెట్టేసి, ఉభయుల సంభాషణా, అవసర మార్పులతో పురుషవేషగాడే కొట్టేసుకు పోయేవాడు. నాటకం రచించిన కవే చూడవస్తే, కళ్ళనీళ్లు కుక్కుకోవలసిందే, యీ ఖూనీ కళ్ళారాచూడలేక. పాపం ఆడాళ్ళ ఘట్టాలు ఎంతో మమకారం గుమ్మరిస్తో వ్రాసి ఉంటాడు. అవ్రాసింది, గుటకలేస్తో హితులకు చదివి వినిపించి ఉంటాడు కాఫీ లిచ్చికూడా.

స్టేజి ఎక్కడంకన్న నాటకం నాడు పగలు యడ్వర్టిజుమెంటు బండిఎక్కి తమకన్న కుర్రాళ్ళకి నాటక కాగితాలు గిరాటేయుడం రాత్రి గేట్లో కుర్చీ 'ఎక్కి తమకన్న కుర్రాళ్ళని టిక్కెట్' అని బెదరకొట్టడం, ఎక్కువ ఉబలాటంగా పోటీలుపడి, కోరుకునే కుర్రాళ్ళుండేవారు మాలో. ఆనాటిక్కి బళ్ళు ఎక్కే కుర్రాళ్ళు కొత్తలాగులు, చొక్కాలు కుట్టించుకు సర్వసిద్ధంగా ఉండేవారు. గేటులో ఉండవల్సిన కుర్రాళ్ళు తలోకర్రా, యీల తెచ్చుకొని నాటకం సామానుతో జాగ్రత్త పెట్టుకొనేవారు. ది గ్రేటు యిండియన్ బాలభాస్కర సంగీత నాటక సమాజగౌరవ ప్రతిష్ఠలు తమ భుజస్కంధాల మీదున్నట్టు వాళ్ళు అట్టహాసం చేసేవారు. పట్టుకోలేక పోయేవాళ్ళం ముఖ్యంగా వాళ్ళను.

మా నాటకాల కప్పుడు ప్రేక్షకాభావం లేదు. అది మా సమాజం విశిష్టత. రఘరెపలాడ్జ్‌లో పైకొచ్చే విద్యార్థులంతా మా సంఘ సభ్యులే. వాళ్ళ కిళ్ళల్లోను బళ్ళల్లోను దెబ్బలు తగలకుండా ఉండే బాధ్యత మా సమాజం తప్పకుండా వహించేది. మైనార్టీల రక్షణ బాధ్యత మా సమాజం ఎన్నడూ విస్మరించలేదు. సభ్యులిళ్ళల్లో యెంతమందిక్కా, ఒడి పంతుళ్ళైవన్మందికి ఫ్రీ టిక్కెట్లు లంచం పెట్టేవాళ్ళం. దరహాంమీద ఆబాపతువారి 300, 350 దాకా వాళ్ళే ఉండేవారు. ముందు అంతా వాళ్ళు కాసేసేవారు. స్టేజిమీద ఎలక కన్నంలోనుంచి వాళ్ళను చూచుకొని కాట్రావులపిల్లి నారాయణరావుగారి నాటకాలకుకూడా యింతమంది రార్రా అని బడాయిలు కొట్టుకునేవాళ్ళం. ఏమాత్రం వేలువిడిచిన సంబంధం మాలో ఏ ఒక్క సభ్యుడుతోటీ లేని దురదృష్టవంతులే, టిక్కెట్లు కొనేవారేమో. టిక్కెట్లు కొనాలన్న ఆంక్ష లేకుండా వుండేది యిరుపైపుల మా 30 మందిలోను ఎవరు అడుకొన్నా రాదల్చుకొన్నవాడు రావచ్చు. గేట్లలో ఉన్న అబ్బాయి ముచ్చట తీర్చాలి, అంతే, టిక్కెట్ అంటాడు. అన్నప్పుడా వచ్చినవాడు అరామీ చేయకుండా ఉంటే, మాలో ఎవ్వరో ఒక సభ్యుడు మావాడురా అనేస్తాము - చాలు, అది ఫ్రీ ప్యాస్. మాకు ఎంతసేపూ, ఏలాగో హాలు అంతా కిక్కిరిసి పోవాలన్న గొడవ తప్పితే మరోటి లేదు. అందువల్లనే, మా సమాజం నాటకాలు మా తణుకు సంతరోజున పడేవి. ఎవరో బద్ధక చక్రవర్తులు తప్ప గ్రామం అశేషం నాటకానికొచ్చేవారు.

## కళాదృష్టి.

కళోపాసననీ, రసాస్వాదననీ యీలాంటి పెద్దపెద్దమాట లెరుగనే ఎరుగం. ఆంధ్రనాట్య కళోద్ధరణకుగాని, జాత్యభ్యుదయానికిగాని తోడ్పడుతున్నామని కాని, మా [illegible] మహాత్కార్యం [illegible]

జరుగుతోందో జరగబోతూందో అనిగాని మేము సుతరామూ అనుకో లేదు. ఎవరూ అనుకొంటోంటే వినలేదు. ఏ నూతనశకానికి పునాదులు వేస్తున్నామనీ, వైతాళికులమనీ మేం తలచలేదు. భేతాళులకు అదివరకే కాము పిల్లకాయలం. కాబట్టి ఏదో నాటకం దొరకబుచ్చుకొనేదీ, పార్టులేసేసేదీ, పడవర్లించేసేదీ, అడ్డంగా ఆడేసేదీ, అంతే యిఖ ఎవరింటికి వారు. యింట్లో నాన్నగారు, బడిలో పంతులుగారు నాటకాలంట్రా ఏర్పాయిాలూ మీకు అని చర్మం వల్చేయకుండాయుంటే అదే పదికోట్లు. మేంగాగా నాటకం వేస్తోన్నామన్న ఈ బలాటం ఒక్కటే మమ్మల్ని ప్రోత్సాహించేది.

యిప్పుడైతే ఎటుతిర్గినా నాటక విమర్శనావ్యాసంగాలు వినిపిస్తాయి కాని, నాటకాలు కన్పించవు. కళఅనే పదంచుట్టూ పరికిణీ కట్టుకొని నృత్యంచేసే ప్రసంగాలే కాని, కళను నిరూపించే ప్రదర్శనాలు కనొద్దుచ్చుకున్నా కానరావు. కళాభివృద్ధి చేయాలనే ప్రబోధాలతో జగత్తు కళామయం అయిపోతోంది. ఒక ప్రక్కనుంచి కమ్యూనిజం, మరో ప్రక్కనుంచి కళా ముంచెత్తుకొస్తోంటే పాపం, యీ బొంగరం ఏమి కానైయుందో అనిపిస్తోంది. మైలురాళ్ళలా ఊరూరా పరిషత్తులు, ఒక్కొక్క పరిషత్కళ్యంలో ఎగరబోస్తోన్న వ్యూక, చుట్టూపడివ్యూళ్ళను రైగప్పుతోంది కాని, కళ్ళంలో గింజదర్శనం కావటంలేదు. వ్యూళ్ళో నాటక ప్రదర్శనం జరగటంలేదు. ఈ విరుద్ధ వాతావరణానికి కారణం ఏమిటంటూరు?

ఏమో, కళయొక్క పతనదశలో విమర్శ ఉద్భవమొందడమే కాక, యిది దాని త్వరపతనానికి కారణభూతం. కాగలదేమో అని కూడా నా సంశయం. విమర్శ ప్రయత్నజన్యం. కళాకాశలం అప్రయత్న లబ్ధి కథావస్తువులో తాదాత్మ్యత పొందాలి కాని, సూత్రాలతో కాదు. నాట్యకళ నేడు డిటీరియరేటవుతోంది. తత్సాహిత్యం పెరుగుతోంది. అప్పట్లో కళా విషయం యింతింత భయంకర పదప్రయోగాలుండేవికావు. "త్రిలిఙ్గనాటకకళా, పూర్వౌన్నత్యాన్ని పునర్జప్తికి

తెచ్చి, ద్విగుణీకృతమైన అభ్యుదయ కళావిశిష్టతకు సర్వతో ముఖంగాను చిరస్థాయిగాను ప్రకటించడం, కుటుంబడియున్న మన నేటి ఆంధ్ర నాటక రంగాన్ని సర్వాథంగులా సంరక్షించడం, ఏతదుపయుక్తాచరణ ప్రక్రియ క్రమణికను" యీ వైఖరి మాటలు Which mean anything or nothing, చిన్నప్పుడే వింటే హడలిపోయి ఒక్క నాటకం ప్రదర్శించ లేకబోదుము. మరోటీ తర్కసమ్మతమైన పరిభాషను చెప్పడానికి ప్రారంభించే సరికి, అసలు కళా స్వరూపమే మాయమై పోతుంది. మనబుద్ధి కళాస్వరూపాన్ని తెల్సుకోలేకుండా పోతుంది.

ఆచార్యా కాకాకా లేల్కరు కళావివేచనకు, కళానందానుభూతికిఉండే తారతమ్యాన్ని ఎంతచిక్కగా విశదీకరించారో చూచారా, "కళానందాన్ని అనుభవిస్తో కళను పూర్తిగా తెల్సుకొనే తేలిక విధానాన్ని వదలిపెట్టి, దాని వివేచన ప్రారంభించడం పుష్పాన్ని ఆనందించడం వదలి, ఒక పదునైన కత్తితో ముక్కలు ముక్కలుచేసి, దానిలోపలి దాని నిర్మాణ విధానాన్ని పరిశీలించినట్టు ఉంటుంది." వివేచనవల్ల కళా ప్రతీతి కల్గినట్టు కన్పించినా, శుద్ధ కళానుభూతి వివేచన ద్వారా, ఎవరికీ కల్గినట్టు కన్పించదు. విమర్శానుసారంగా పాళ్ళేసికట్టిన నాట్యకళ స్వతసిద్ధంకాలేదు. అస్వాభావిక మౌతుంది. పాళ్ళేసి కట్టేవి చిచ్చుబుడ్లు మతాబులు కాని నాటకాలు కావు. పాళ్ళశోభ దీపావళికి కాని నాట్య కళకు కాదు.

ఆచార్యాగారు సెలవిచ్చిన విధానమే అవలంబనీయమని తోచింది. 'పెద్దల శుశ్రూష చేయడంవల్లా, పెద్దల సంపర్కంలోఉండి, వారు నడచే నడవడి కనుచుండడంవల్లా, సదాచార స్వరూపాన్ని అవగతం చేసుకొన్నట్టుగా, కళా రహస్యాన్ని కూడా సంస్కారవంతులు, శిష్టులూ, కళాధురీణులూ అయిన వారి సత్సాంగత్యంవల్లా, వారి కళాప్రవృత్తులపై దృష్టి సారించడంవల్లా, హృదయంగమం చేసుకోవచ్చు. మాకృష్ణపాత్రధారి, జగద్విఖ్యాత నటుడు కీ॥ శే॥ పెదురుమూడి శేషగిరిరావుగారి వరవడిలో తయారై వార్కి మానియేచరు నకలయ్యాడు. వారి మీద మా వాడి కుండియున్న అతిశయంగావమాధురి.

♦ ♦ ♦

## నాటకసమాజ జననం - పులిహోర సంఘాలు.

కర్ణుడిలా ఒక్కసారిగా కవచకుండలాలతోటే పుట్టిందికాదు మా నాటకసమాజం. సమాజం ఆదివరకే పుట్టి పెరుగుతోంది, రేపల్లె వాడలో కృష్ణునిమాడ్కి. నాటకాలు మధ్యగావచ్చాయి. నాటకసమాజం మా విద్యార్థి బాల్యజీవితంలో, ఒకానొక పరిణామదశ. అవస్థాభేదం. విద్యార్థిదశలో బాలురకు సహజంగా గాంగుస్పిరిట్టు ఉంటుంది. ఒక వయస్సు, పోనీ, ఒకక్లాసు కుర్రాళ్ళకు కాస్తోకూస్తో మందలుగా తిరగ బుద్ధివేస్తోంటోంది. అది సమిష్టికార్యాచరణకు దారితీయడం స్వాభావికం. ముంజెలకోతలు, మామిళ్ళవేటలు, ఆనపకాయంతపట్లు, కందికాయ దోపిళ్ళు శనివారాదివారాలకు వేసుకొనేవాళ్ళం. అలా ప్రారంభించి ఒక్క వత్సరం, 'విచ్చలవిడి, వియచ్చరులుమెచ్చ' లంకపొలాల్లో వీర కృత్యాలు చేసిపారేశాం. ఖండవిల్లి, ముక్కామల, తీపర్రు, నల్లజర్ల ప్రాంతాలమోస్తరు కోతిబాధ మనకులేదని కళ్ళు నెత్తికొచ్చిన మా ప్రాంతీయ రైతాంగం ఒక్క వత్సరం గడిచేసరికి అభిప్రాయాలు రివైజుచేసుకున్నారు. లంకపొలాల్లో మేం కావించిన లంకాదహనాలు, సముద్రలంఘనాలు ఒక సుందరాకాండ అవుతై. మా అంగదుడోడు సంధ్యాసమయంలో మామిడిచెట్టు చివాలిరొబ్బమీద చిక్కటిపోయి, దైవబలంచాలక తుమ్మ ఆపుకోలేక దొరికేసేడు. ధృతిచెడి, ఖిన్నుడై రైతువెంట మాపులిపిల్ల పిల్లిపిల్లలా గ్రామంలోకి వెడుతోంటే, 'క్రోధ శోకాలు మనమున బెనగొన' అంచపంచలనుంచి చేష్టలుదక్కి చూచాం. అదృశ్యం శోధిస్తోంది. పొలాలమీద రైతులు స్వలాభపరాయణులై జాగ్రత్తలు పడ్తోన్నారన్న అలికిడి తగల్డంతోనే ఆ వీరవిహారం చాప్పున తగ్గించేసాము బుద్ధిమంతతనంగా. కాస్త వయసూ పెరుగుతోందేమో, సంఘపరిణామంలో వాండరింగుట్రైబ్సు నివాసస్థలాలేర్పర్చుకొని ఆహార వ్యవహారాలవిషయం ముందుజాగ్రత్త నేర్చుకొనేటట్టే, మేమున్ను మా కార్యకలాపం పొలాల్లోనుంచి గ్రామాల్లోకి సీడపట్టుకుమార్చాం.

ముసలమ్మ పెంపకంలోవున్న ఓ సహాధ్యాయి యింట్లో పులిహోర చేసికోడాన్కి స్థిరపచ్చుకొని సమస్త సంబారాలు ఎవళ్ళింటో చేచిక్కినవి వాళ్ళు తెచ్చిపడేసేవాళ్ళం. పిల్లలం కాబట్టి మోతాదు, అంచనామించిన వస్తు సేకరణ చేస్తూవడడంచేత వూళ్ళోనూ, యిళ్ళల్లోనుకూడా కొంత గగ్గోలు పుట్టింది. గ్రామంలో కరివేప వంశక్షయం అయిపోతోంది అని ముసలమ్మలు కర్ర లేసుకొని కరివేపచెట్లక్రిందే కాపరాలుండడం మొదలెట్టారు. పులిహోర పురోభివృద్ధికింగాంటి విరుద్ధ వాతావరణం చూస్తోంటే ఏర్పడి ఊరుకుంది. అంతమాత్రాన్కి వెనుదీసేవాళ్ళంకాం నిజాన్కి. పులిహోర మూలంగా శిశుహత్యాదోషం మెడచుట్టుకునే సంఘట్టనోటి సంభవించేసర్కి యిక కాలు చెయ్యి ఆడలేదు. పులిహోరసంఘాన్కి స్వస్తి చెప్పేసాము.

పొయ్యి అంటించడం ఒక్కటీ చేతగాక యీ దుర్భాగ్యప్రాప్తికి లోనైనాం. మా పులిహోరకెప్పుడు కావల్సిన బిరుసుపదునూరాలేదు, దాన్ని మేమెన్నడూ తిన్నాలేదు వట్టి హైరానేకాని. అన్నం తయారు ఎప్పుడు లైపెండివాటం. మేమే చేసుకొన్నాం కాబట్టి మరోరిని తిట్టుకోడానికేనా రుణంలేదు కాబట్టి హరహరాఅని కళ్ళుమూసుకొని పులిహోర మింగేవాళ్ళం. పులిహోరపాళ్ళు, పోపులు తెల్సిన గట్టిచెయ్యి లేక కాదు. కాకినాడ వంట బ్రాహ్మల కుర్రాడోడు మావూరు యిల్లరికంవచ్చి మాతో బడిలో చదువుకునేవాడు. వాడో యిన్వాస్స అభిమన్యుడు. అభిమన్యుడు వ్యూహం లోకి వెళ్ళగలడు, తిరిగి రాలేడు. మా అభిమన్యుడు వ్యూహం చొరబడ లేడు. ఎవరైనా తీసికెవెడ్తే ఆపైన అంతపనీ చేసిరాగలడు. అన్నంపొయ్యి దిగేవరకు వాడ్కి ఓనమాలురావు. వార్చిన అన్నం వాడిముందర పెట్టండి పేరిల్లిన పులిహోర నిమిషాల అందిస్తాడు. కళ్ళనద్దుకు తినేటట్టుండిట వైఘానసపులిహోర. ఎందుక్కి అందదట వాడన్నమాటే. మెరపకాయ వేయింపు వాడి మాస్టరుపీస్. వాడిచేతిని, వేలెడు పొడుగున దోరగావేగిన యింద్రధనస్సు రంగులమిళావు మెరపాకాయ ఒకటి పులుసెట్టింది మా పింతండ్రిగారివాడు పట్టలేక కటుక్కున కొరికితే, వాడ్కి వైత్రోప

చారాలు చూసాము. యీమధ్యన మా(ప్రాంతాల్లో ఓ అబ్బాయికిళృంగార ప్రబంధాలు పైత్యించాయి. పాపం వాటిల్లో వర్ణనలన్ని నిజం అను కొన్నాడుకాబోలు, పుష్పాలకు ముచ్చికదగ్గర ఒకతెర మకరందం ఉన్నట్టు ఆడపిల్లలకు అడుగుపెదిమిమీద అధరసుధారసం అనే ఒక తెర తేనిపూత ఉంటుందని ఆ వెర్రిబాగులాడు మోసపోయి పట్టలేక సాహ సించేసరిక్కి గూబగుయ్యిమని ఆపిల్లలోతు గ్రహించలేకపోయాడు. అచ్చు ఆదేవాటం మా సహాధ్యాయి చేతిపులిహోర మెరపకాయలు.

ఏమైతేం, వాడి పనివాడితనం పల్లెత్తైనా మాకు ఉపకరింపలేదు. పొయ్యిరాజితేనా పనివాడితనాలచూకా రావడానిక్కి. నిజానిక్కి పొయ్యి రాజేయడం అతి సునాయాసంగా జరిగేపని ఆడచేతులకి. మగచేతులకిది కళ్ళనీళ్ళపర్యంతం తెస్తుంది. మొన్న అటా వారం కాలేదు, తాలూకాఫీసు గుమాస్తాగారొరు స్వయంపాకానికి నడుంకట్టి, అన్నిపన్లు ఆడాళ్ళకక్కడా అందకుండా అమర్చుకొని, చీరె తర్వాయిగా ఆడపోలిక పుణికిపుచ్చుకొని, ఎవరో కేక వేస్తేకూడా 'వస్తూన్నా' నంటో సాగతీస్తో భిడియపడి పాపం అంత నిర్వహించాడు. పొయ్యి రాజేసుకోడందగ్గర సుఖం కళ్ళనీళ్ళు పొయ్యిలో కార్చి ఆ ఉన్న నిప్పు ఆర్పేసాడు. వాకట్లోకి వచ్చాక భార్య నవ్వుందని ఉడికి మిగతా సగం అక్కడ కార్చాడు. కావల్సినమాట వార్చాడుకాడు అన్నం. కొంతమంది పెడలుమీదనుంచి సైకిలు ఎందుక్కి ఎక్కలేరు?జన్మంతా కమ్మిమీదనుంచే. గుర్రమెక్కినంత క్రతువుచేస్తారు, ముద్దొస్తాడు ఒకొక్కడు యిట్టే పెడలుమీదనుంచి ఎక్కి నిమిషంలో నాల్గువీధులు చక్కపెట్టికాని పైగా కాఫీహోటల్లో 2 యిడ్లీ కప్పుకాఫీ కొట్టేసొస్తాడు. యింకా వీడు కమ్మిమీద కాలెట్టుకొని తప్పుకోండి, తప్పుకోండి అంటూంటేనే. యివ్వి కొన్ని పొడుపుడు కథల్లాంటివండీ. ఎవరేనా చేస్తే యింతేనా అన్పిస్తుంది. మనం చెయ్యబోతే తల కాయ బద్దలుకొట్టుకోవలసివస్తుంది. బహుశః మీఉద్దేశ్యం, యుద్ధభూమిలో ఉన్నంతసేపు అర్జునుణ్ని కొట్టదల్చుకొన్న శక్త్యైస్త్రం కర్ణుడికి స్ఫురించ నట్టు పొయ్యిదగ్గర ఉన్నంతసేపు మాకు విసెనకర్రమాట జ్ఞాపకం ఉండక

యింటికెళ్ళిన తర్వాత జ్ఞాపకం వచ్చేదనికాబోలు. ఆమాటకొస్తే మా పోచమ్మత్తకు విసినికర్ర అక్కరనేలేదు. రెండు బుగ్గలు ఒక్కసారి పూరించి, ఎన్ని బ్లాడర్లగాలి ఆరెండు బుగ్గల్లోను పట్టేసేదో, చిత్రమౌతుంది, ఒక్కసారి వాటిని గింజపట్టని చిక్కుడుకాయతప్పల్లా చేసేస్తే అయ్యా సెగలు మంటలు .ఒక్క ఊరంటించగల్గినవి .నఖముఖాలా నాలికలుకొర్తో వచ్చిపడేవి. అది ఆవిడ అదృష్టం. ఆవిడభర్తదీని. అన్ని చేతులా విసినకర్ర సమానఫలితాల్ని యీయలేదు. గాల్ని పొయ్యిలోకే పంపే హస్తలాఘవం ఉండాలి, విసరగానే సరిగాదు. సభలో విసినకర్రలిచ్చినపుడు ఒక్కొక్కడు విసురుకుంటే, పందులా, పిసరైనా గాలి పైవాళ్ళకు సోకకుండా వాడు ఎక్కడకావాలనుకొంటాడో ఫక్తు ఆశరీరభాగం మట్టుకే తగిలి ఊరుకుంటుంది, బోలెడుగాలి దాచుకొని యింటికొచ్చి విసురుకోడానికి. చేతకానివాడు విసినకర్రపడితే గుడ్డాడి చేతిదీపం, తన ఒక్కడికీ ఉక్కాను ఊళ్ళో అందర్కీ హాయిన్ని. మేమెప్పుడు విసిరినా పొయ్యిలో బూడిదఅంతా ముఖాలను తన్నడమేకాని, నిప్పంటుకోలేదు. చివరికది శాపం అనుకొన్నాము. జాలేస్తుంది. ఒక్కొకళ్ళమే, పొడుగునా నేలమీద దండాలుతీస్తోన్నట్టు పరుండి, పొయ్యిదగ్గర మూతి, ఎదర గోడకేసి కాళ్ళు గిరాటేసి ఊత్తే మాకళ్ళు చింతనిప్పులు, ముక్కులు గొళ్ళకడవలు. పొయిలో నిప్పురవలదే. తలచుకుంటే యిప్పటికీ వళ్ళు రవులుతుంది. స్త్రీపురుష వివక్షత అప్రాధాన్యపు లింగభేదాన్నిపట్టి ఎందుకు చేస్తోన్నామో అర్థంకాదు. సిసలుగా చేయాలంటే పొయిరాజేయగల్గినవారంతా స్త్రీలు, రాజేయలేనివాళ్ళంతా పురుషులు అని యీలా సూత్రబద్ధంగా స్త్రీపురుష వర్గవిభజన చేయాలి, మీలో కొంతమందికి కోపం వచ్చినాసరే.

పులిహోరసంఘం తుదివిషాదఘట్టం. మా సహాధ్యాయి తండ్రి గ్రామాంతరం వెళ్ళాడన్న ధిలాసాతో వాళ్ళ పనువులపాక బాగుచేసికొని దాన్లో పొయివేసి, పులిహోరప్రయత్నం చేసికొన్నాం. తింటే యిద్దారే తిన్నట్టు, తప్పితే కాశీలో వదలేశాం అనుకుందామన్న దృఢ

నిశ్చయంతో యిష్టదేవతాప్రార్థన చేసికొని ప్రారంభించాం. మావూరి విశ్వబ్రాహ్మణ విద్యార్థి సోదరుణ్ని బతిమాలి అతడిచేత కుంపటిగొట్టం తెప్పించి ఊదించాం. అతడు వంట చూడకూడదని మా బ్రాహ్మణ కుర్రాళ్ళు పట్టుపట్టారు. యిప్పటిలా కాదు. యీవిషయాల్లో చాలా సంకుచితభావాలు, వెర్రితిక్కలు ఉండేవి. శుద్ధ అనవసరపు నీమాలమీద ప్రాణంపెడ్డి భల్లూకపట్టుపట్టేవారు. కాని పులిహోరమీద ఉన్న మమకారం కొద్దీ అతడు కళ్ళుమూసుకొని ఊదడానికి అనుజ్ఞయిచ్చారు. అతడు కళ్ళుమూసుకొని వళ్ళెరక్కుండా ఊదేశాడు ఫక్తు అందుకేవచ్చాడు కాబట్టి. దేనికైనా అయిపట్టు తెల్సినవాడే ఉండాలి కాని పట్టిచేతులు వంద ఉంటేఏంలాభమంటో అతడిని అభినందించి, అతడికి పులిహోర పెట్టడం మాట ఏమీ ఎత్తకుండా గడుస్తనంగా పంపేశాము. వాడాలా గుమ్మం దాటింది తడవుగా అరటిఆకుల్లోకి అన్నపుగిన్నె బోర్లిస్తిమికదా అయ్యో కర్మాగారాల్లో కరిగిన సీసపుధారాపాతపు ధోరణిని చిక్కగా ఆకు నాల్గుమూల్లకు పాకడం ప్రారంభించింది కేవలం ఘనపదార్థంకాదు, కేవలం ద్రవంకాదు. చల్లపడ్డమట్టుకు మోల్డెన్ లెడ్డులాగో ఫెర్రో కాంక్రీట్ లాగో గడ్డకట్టుకొస్తోంది. ఆ ఆకులచుట్టూ జబ్బలుకట్టుకొని దాని ప్రవాహవేగం, అవస్థాభేదం చూస్తో, నిశ్చేష్టితులమై నిలబడిపోయాం, లేబరేటరీహాలులో ఉపాధ్యాయుడు యక్సుపెరిమెంటు చేస్తోంటే, చూచింది, చేసింది, గ్రహించింది, అనుభవంలోకి తెచ్చుకొంటోన్నట్టు.

యింతలో మాసహాధ్యాయి నాన్నగారికి ప్రయాణం ఆగిపోయిందట, వాకిట్లోకి వచ్చిన అలికిడి మాకుతగిలి, అమాంతంగా చెట్టో పిట్టయి గోడలుదూకి పారిపోయాం, ఎక్కడివి అక్కడవదలిపెట్టి. ఇక విన్న విషయం. మాసహాధ్యాయి చెల్లెలు, 2, 3, సంగీరాల వయస్సు ఆదొడ్లో ఆడుకొంటో ఆడుకొంటో యీవైపింది ఊబిలోకుక్కుకపోతో కెవ్వుమంది. ఆపిల్ల అమ్మమ్మ వృద్ధు చూచి చచ్చిపోయిందర్రా పిల్ల లాగేయండర్రా అంటో పొలిబొబ్బ పెట్టింది. ముందు పిల్లను లాగేయండిర్రా అంటో చేరినవాళ్ళు కేకలేస్తోండగానే ఆపిల్ల [illegible]

నూతుల్లోపడ్డ పిల్లలనే లాగేసాడన్న కితాబు, అతడు వచ్చి కాలూది, పిల్లచేతుల క్రిందనుంచి తన చేతులు పోనిచ్చి, తొక్కిపట్టి దమ్ముమీద లాగేడేమో పిల్ల సహితం వెనక్కిపడ్డాడు. నడుంలో మెడ నరం లాంటిది పట్టి మూడురోజులు తోమించుకున్నాడు. పిల్లబ్రతికింది, కాని ఉండమింగి ఉంటుందనీ, లోపలి పేగులన్నీ ఏకపేగుగా అంటుకుపోయి ఉంటాయనన్నీ, సాధిగ్గావాటిని విడతీయించాలని, నాటు డాక్టర్ల దగ్గర తచ్చికిత్సకు అవుసరమైన పరికరాలుండవని, ఎందుకైనా ప్రాణంతో పనికాబట్టి విశాఖపట్నం ఆసుపత్రికి తక్షణం పిల్లను తీసికెళ్ళడం ఉత్తమోత్తమమనిన్నీ చేరిన అమ్మలక్కలు పైసలుచేసారు. మాకు యిళ్ళదగ్గర చచ్చే దెబ్బలు తగిల్తేతగిలాయ కాని పిల్లబ్రతికింది. అఘాయిత్యం తప్పింది. మళ్ళా పులిహోరంటో మేం పాయిరాజయ్యలేదు. అశుభ ముహూర్తంతో పులిహోర సంఘాన్కి స్వస్తిచెప్పాం. గ్రామంలో శిశువులు బ్రతికే యోగం ఉంది యింతకు, మాకు పిచ్చెత్తకుండా ఉండే యోగం ఉంది అసలుమాట.

ఆ పులిహోర సంఘమే నాటక సమాజమైంది. నాటకంలో ప్రాణాపాయం ఉండదనిన్నీ, మాకు నల్గురు రాగవరసలలో పద్యం చదివేవాళ్ళున్నారనిన్నీ, మండపాకలో విద్యార్థులు నాటకం వేసారు బాగుందని వినలేకనున్నూ, సంఘాన్ని పెట్టి దానికి నాటకం స్వీచ్చి యిచ్చాం. స్వీచ్చి యిచ్చామంటే ఈ నాటకాలు ఆడుకుపోయాం అని కాదు. నాటకసమాజ నామకరణంమాత్రం చేశాం. మా ప్రథమ పుష్పం, గయోపాఖ్యాన ప్రదర్శనం. దాన్లో సుభద్రా శంకరవేషధారులను నాజన్మలో మరచిపోలేను. యిప్పటికీ, కోరింది సానుకూలం గాక, కాళ్ళు విరగ తన్నుకొన్నా కార్యసాఫల్యం గాక, నైరాశ్యం అలుముకొని, అందోళ నాయుతమైనమనసుతో కళ్లుమూస్తే, ఆఉభయులు కలలోకి వస్తారు.

♦ ♦ ♦

# శ ం క రు డు.

మా శంకరుడు, స్కూలుఫైనలు మూడవ సం॥రం కూడా తప్పి, చదువుకు నీళ్ళువదలి యింటిదగ్గర ఖరాగా కూర్చున్నాడు. ఖరాకర్మం ఏంలేండి. శుభకార్యం చేసికొన్నాడు. మానాటకానికి 6, 7 మాసముల క్రితం, భార్య కాపురాని కొచ్చింది. పరీక్ష తప్పిందని యివ్వి తప్పవుగా, కాస్త విసురుతగ్గొచ్చు కాని. పాపం నాటకాలంటే మాత్రం వేపరొట్ట కట్టేసేవాడు. వెర్రిపైత్యం. కృత్రిమం ఎరుగడు, అకలంకుడు తల్లితండ్రులులేరు. ముసలమ్మగారి పెంపకంలో మురిపెంగా పెరుగుతున్నాడు. 10, 15 ఎకరాల కొంద్ర, గాది, గేదె ఉన్నాయి. మస్తుగా భోంచేయడం, రాగవరసని పద్యాలు చదివేవాళ్ళంటే చెవికోసుకునే వాడు, వాళ్ళకు వెట్టిచాకిరీ చేయడమున్ను. మా నాలుగైదు ఫారాల విద్యార్థులకన్న మరో 4 ఏళ్ళవయస్సు, మరో రెండు గుప్పెళ్ళున్నాడు అంచేత మాతో కలసిమెలసి ఉండేయీాడుకాక పోయినా, విద్యార్థి వాసనలు పోలేదు. Charles Lamb చెప్పినట్టు 'The Toga Viralis never Sate on him gracefully' కుర్రాళ్ళతో కూర్చుంటే వికారంగా ఉంటాడు. పెద్దాళ్ళతో, సుతి కల్పుకోలేడు. ఏవర్గాన్కీ అత్తని త్రిశంకు స్వర్గనివాసి, నాటక పద్యాలంటే పడి చచ్చిపోయేవాడు. కాని శుద్ధ కరప్రిపిడి గాత్రం. కర్రషిడిగాత్రగాళ్ళ నారోజుల్లో అనర్హులుగా, అప్రాంక్తేయులుగా ఏరి పారేశేవాళ్ళం నాటకపు కాస్టులోనుంచి, మిగతా నాట్యకళాకౌశలం ఏమున్నా ఎంతఉన్నా, అపాత్రులైనా సంఘాన్ని పట్టుకువేళ్ళాడేవాళ్ళను తెరలు వేళ్ళాడైడానిక్కి, స్త్రీపాత్రలకు చీరెలు కట్టడానికి, పయిటి పరికరాలు, కుండబంతులు దూలుబంతులు తయారు చేయడానికి వినియోగించుకునేవాళ్ళం. సంగీతమే గీటురాయి అప్పట్లో. సుతిలోకల్పి 4 పద్యాలు చదవగల్గినవాడు సమాజంమీద సమస్త నిరంకుశాధికారాలూ చెలాయించేవాడు వాడి టిరనీ భరించలేక ప్రాణం విసిగినప్పుడు అయన పొడ్డాడుగా అయన్ని పట్టుకోలేం అని మాలోమేము

చెవులు కొరుక్కునేవాళ్ళం. అయినా వాడిఎదట అనడానికి దమ్ములుండేవికావు. నాట్యకళ సంగీతానికి బానిసఅయిన పాపిష్ఠిరోజులవి. యీనాడైతే నాట్యకళకే సంగీతం చెలికత్తె అయింది. రోజులు తారుమారయ్యాయి. సాంఘికనాటకాలు చారిత్రాత్మకనాటకాలు విద్వజ్జనులకిపుడు అభిరుచి. వాటిల్లో ఎప్పుడు, ఎక్కడ నోటీసు టుక్కెట్ వస్తుందో అని హడలుతో సేవచేస్తోంది సంగీతం. రసవద్ఘట్టాల్లో సంగీతాన్ని బరిమీదకు రానీయటంలేదు. విశ్రామసమయ సన్నివేశాల్లోను, పూజా సమయాల్లోను, అంతర్నాటకాల్లోను మూలమూల్ల కన్పించీకన్పించకుండా తిరుగుతోంది. యిది నాట్యకళకు, సంగీతకళకుకూడా శుభపరిణామమే. నాట్యకళ హాయిగా స్వేచ్ఛావాయువులు పీల్చుకొంటోంది. సంగీతం స్వతంత్రంగా కచ్చేరీలు చేసుకుని గౌరవం నిలబెట్టుకొంటోంది. మధ్య మనకెందుకు బెంగ.

మా శంకరునికి ఒకటో, ఒకటిన్నరో పద్యాలున్న పాత్ర నిర్వహించి నాట్యజగత్తులో ఖ్యాతిగడించి, మండపాక విద్యార్థి నాటకబృందాన్ని కంట తడిపెట్టించాలని వాంఛ పుట్టింది. చూస్తోంటే ఏనుగతొండం లావైంది. గట్టిగా పట్టిందిలేండి! అంతలో వదలేటట్లా లేదేమో, పాపం జాలేసింది నోరువిడిచి అడిగాడు. మా సమాజాభ్యుదయం తన స్వకార్యంగా భావించి ఏకాగ్రచిత్తతతో, నిద్రాహారాలు లేకుండా కాళ్లు విరక్కొట్టుకొంటోన్నవాణ్ణి కాదనడ్డం దోషం అనిపించి, పోనీ వీడికి శంకరుడు పారేయండోయి; ఒకటేపద్యం; అదేనా చివరవస్తుంది; తెల్లత్తడం వగైరాపనులకు అడ్డూరానక్కరలేదు అని పరిష్కరించాం సంగీతం వచ్చిన మొగాళ్ళం నల్గురం. మానిర్ణయం చెవినేసుకున్నాడు. అంతే. ఎగిరి పోయాడు తూరీగలా తన మేనమామగారి ఊరు. అతడి మేనమామగారింటో అటకమీద హార్మోనియముండదట, తనభార్య సర్వజితులో నేర్చుకొంటో పెళ్ళి అయిందికదా అనేబడాయికొంత, స్కూలుఫైనలు తప్పిన వాడి అందాన్కీ సంగీతంకూడానా అనే నిరసన కొంత, యింకా ఎందుకు యీ గోల అని అటకమీద పారేసిన బాపతు. ఎక్షాయకీని రాత్రికిరాత్రి తణుకు తొల్గించుకొచ్చాడు దాన్ని. అప్పటికి నాటకం వారంతక్కువ వుంది.

నమ్మండి, నమ్మకపోండి యీ పది, పందొమ్మిది రోజులు గ్రామస్థు
లకు నిద్రలు లేవు. దివారాత్రాలొక్కవరసని పందిరి పట్టిమంచంమీద
కొయ్యా ఆడుతూనేవుంది. కుయ్యో, మొయ్యో అని ఏకధారగా మ్రోత
వినిపిస్తోనేవుంది ఊరంతా. శంకరుడు పాఠంచేస్తోన్న పద్యంలో మొదటి
మూడుపాదాల్లోను కృష్ణార్జున గయులు చేసిన తలోతప్పు శంకరుడు వివ
రిస్తాడు. అంచేత సంధి వప్పుఅని ఆఖరిపాదంలో చెప్పి కృష్ణార్జునులచేత
రాజీనామాపిటీషను పడేయిస్తాడు. ఏదో మిషపెట్టి శంకరునిభార్య
శుభ్రంగా పుట్టింటికెళ్ళింది నాటకంరోజుకి వచ్చేషరతుమీద. తనభార్య
తనప్రతిభ చూడాలని శంకరుడు మరీదేవుళ్ళాడాడు మరి. ఏమాటకామాట
అనుకోవాలి పండంటి పిల్లకాబట్టి వీడి రసాభాసానికి ఊరుకొంది. మరొక
త్తయితే యీకొయ్యను తీసికెళ్ళి నీళ్ళపొయ్యిలో కుక్కవలసినమాట.
స్కూలుఫైనలు మూడేళ్ళు తప్పాడని తెల్సీకూడా పెళ్లి బజారుగిరాకీ
మూలంగా వీడిగొప్పకాదు .మధ్యన, తన నాన్నగారు 1000 కట్నం
గుమ్మరించాడా. అప్పుడది గొప్ప కట్నాల్లోదిలెండి. వీడి బ్రతుక్కి
సాయం మరోవెయ్యి సిగ్గుభిడియం లేకుండా అలకపాన్పెక్కి గుంజాడా.
తాను కాపురానికొచ్చేటప్పుడు పుట్టింటినుంచి తెచ్చుకున్నదా యీ
పందిరిమంచం, పరుపూనూ, యీమంచంమీద యిష్టంవచ్చినట్టు మొగ్గలేసు
కొనీ, విరిగేదాకా ఊపేసుకోనీ, ఉంచుకొనీ సమస్తహక్కులు తనవేనా?
యింకోళ్ళకు దీన్ని ముట్టుకోడానికి అధికారం ఉందా? అలాంటప్పుడు
ఆమంచందగ్గర సర్వాంగాలంకార సుందరంగా తాను నుంచుంటే ఎక్కడా
తనలెక్కలేకుండా తన్ని తోసిరాముడు చేసేసి యీ హార్మోనియం ఎక్కు
తుందా. తనకళ్ళముందు తనతాలూకు భర్త దీనిని పట్టుకుని వదలడా యిరు
వదినాల్గుగంటలూనూ. యీ పిల్లే నల్లత్రాచులాటిపిల్ల ఐతే మాశంకరయ్యా
సంగతి, హార్మోనియం సంగతీ ఏంజరగవల్సిందో; మరొకటీ ఎంత పతిభక్తికల్గిన
పిల్లయినా మరీ శ్రుతులు పయిటిపర్రికేసీ, పద్యం పెనుమంట్రికేసీ
వెడ్తోంటే తాను పుట్టింటికి వెడ్తుంది. అందులో విడ్డూర్యం ఏమీలేదు.
ఆపిల్లను పన్లెత్తుమాట అనడానికి నేవప్పుకోను. వీడి ఒక్కపద్యం మనదం

చేసేలోపల శుభాశుభాలు గ్రామంలో జరిగినవి పది పంగ్రెండింటుదాకా లెక్కకొచ్చాయి అని చెప్పుకొన్నారు. వీడి పక్కింటివారి అమ్మాయికి అరోజుల్లోనే శుభ కార్యం అవడంవల్ల, ఏమి అపిల్లఅదృష్టం, ప్రథమ ప్రణయ సౌఖ్యం మూడు రాత్రిలు అవిరామంగా, అత్యుత్సాహంగా వాయిద్యంతో చేసికొంది. ఎవరికి లభ్యమవుతుంది యీ ముచ్చట అని అనుకొన్నారట తోడి వయస్సు కార్యాలుకావల్సిన పిల్లలు. అన్యాయం పైవాళ్ళకు ఏం తెలుస్తుంది అపిల్లపడ్డ చిత్తక్షోభ. ఉబలాటంగా ముద్దుకు ముందరకు జరిగేసరికల్లా 'బొయ్యి' మంటూ పక్కింట్లోనుండి వారొమ్మి నియం తుమ్మడం పాలకీకి ముసుగు శకునంరావడంకాదండీ. తయారీతిన్న వాళ్ళుకారు, నూతన దంపతులు బెంబేలుపడిపోరండీ ! యీదుశ్శకునానికి. పోనీ అని సర్దుకుపోయి ఏదో వాళ్ళధోరణిని వాళ్ళుంటే, యిక అక్కడ నుంచి 'తప్పు, తప్పు తప్పో'అంటూ ఓ పేకాకిగోలా, శోకమూనా? మధ్యన వీడిపుట్టేదో మునిగినట్లు. యిక వాళ్ళకు మనస్సు విరిగిపోయి దిగాలుపడి కూర్చుంటే అప్పుడు 'ఒప్పు' అంటూ నాల్గవపాదం పూర్తిచేస్తాడా. మీరంతా కళోపాసకులు చెప్పండీ. రక్తికట్టే ఘట్టాల్లో ఎప్పటికప్పుడు అడియన్సులోనుంచి ఏదో ఓ అల్లరి బయల్దేరుతోంటే మూడురాత్రులుకాదు, ముప్పదిమూడు రాత్రులు ఆడిమాత్రం నాటకం రక్తికట్టించగలరా? వాళ్ళకు అలాంటి రసభంగం కల్గించాడు. వీడిని, వీడిపద్యాన్ని నిలువునా చీరి ఎండేస్తే దోషం ఉందా ?

నాటకంరోజొచ్చింది. షరతుప్రకారం శంకరుడు భార్యావచ్చింది. తోడ్తోనే ఆపెకు గదిగుమ్మంలో యాక్సిడెంటువచ్చింది. మరీప్రమాదం కాదు. ఒక్క పిండికట్టుతో సాయంత్రానికి సర్దుకుంది. తెల్లవారగట్ల రైలుదిగి కాకులుకూసేవేళకు యిల్లుచేరుకొని, వీధిలో గుమ్మం తుడుచుకొంటోయున్న ముసలమ్మగారికి నమస్కరించుకొని ఎంతో ఆప్యాయంగా వస్తూ గది తలుపుగెంటి లోపలికి అడుగెట్టేసరికి గభీలున ఆపె లేతపాదంమీద ఊతంకొద్దీ శంకరుడురికాడు, గత పది పందొమ్మిది రోజులనుంచి పూజాపునస్కారాలులేక బూజట్టిపోయి, నఖముఖాలా

తెగ పెరిగిన బరివాస్సుతో. పాదం బాధ అటుంచి డార్విన్ పరిణామ వాదాన్ని స్ఫురణకు తెచ్చే యీ వికారస్వరూపాన్ని హఠాత్తుగా చూచే సరికి పిల్లకు కళ్ళు జలపరించింది. నిజానికి మా శంకరుడాలాంటి సరాగా లాడే తేలిక మనిషి కాడు. వేళాకోళం అన్నది అతని యింటావంటా లేదు. లోపం అంటూ వుంటే, అది లోపమే అయితే తలపెట్టిన పనిలో ఒళ్ళెరక్కుండా ఐక్యం అయిపోతాడు. కృష్ణార్జునులమధ్య ఏవిసురున, ఏ ఊతంతో ఉరకాలో జంపులు సాధనచేస్తోన్నాడు. పోజులు చూచుకొంటోన్నాడు. రెండవది శివుడు మహాతపశ్శాలి కాబట్టి మీసం గెడ్డం ఎంత పెంచితే అంత మంచిదన్నారట ఎవరో. అంతే, అమాటపట్టుకు కూర్చుని కత్తి పడనిచ్చాడు కాడు యిన్నిరోజులనుంచీ. విషయం తెల్సుకొని శంకరుడి భార్య నవ్వాలో, ఏంచెయ్యాలో తెలియక కడుపులో పెట్టుకు ఊరుకుంది.

అప్పటికి పదిరోజులక్రితం రాజమండ్రీ వెళ్ళి స్వయంగా వ్రయ ప్రయాసలకు లోనై చేయించుకొచ్చిన శంకరుని త్రిశూలం నువ్వులబస్తా పడి వరిగిందో, విరిగిందో, వంకరతిరిగిందో నాటకంరోజు పగల్లా మండుటెండలో శిలార్ సాహేబు సీనారేకుఖార్ఖానాదగ్గర కూర్చొని బాగుచేయించుకొచ్చాడు. చేసిన పొరపాటల్లా కోరినడబ్బు యిస్తాను, నీ చమత్కారం అంతా వినియోగించి బాగుచేయమన్నాట్ట సాహేబును. సిలారుసాహేబును యిస్లాం మతప్రచారావేశం ప్రేరేపించిందో లేక యిస్లామిక్ కల్చరు వంటబట్టినవాడైన కారణంగా తన విజ్ఞాన, సాహిత్య సాంప్రదాయానుసారమైన సౌందర్యపిపాస ప్రోత్సహించిందో, తెలీదు, కాని అతని చేతిని తయారైన స్వరూపం చూచేసరికి శోకసంవిగ్న మానసులమై కన్నీరు తుడుచుకొన్నాము. మీరీనాడు దాన్ని చూస్తే "సాంబా, సద్గుణకదంబా ఇస్లాంమతస్వీకారం ఏ అవతారంలో చేసావయ్యా" అని విషాదవిహ్వలులౌతారు. హరహరా అది పీర్లపంజాల్లో పెట్టే చేతివేళ్ళలాంటి మూర్తి కాని ఎక్కడా ఏకోశాన్ని శంకరుడన్న హిందూమతదైవం చేసంధించి త్రిపురాసుర సంహారం చేసిన త్రిశూల

స్వరూపం కాజేశాడు. “యిదేంపనిరా నిన్నుసరికెయ్యా, నీకొచ్చిన వేళ్ళకు సమాజం అంతా ప్రాయశ్చిత్తం చేయించుకుంటేగాని యిళ్ళల్లో మెతుకులు దొరకవురా” అందాం అనుకొన్నాంగాని అపూట వాడి ఉబలాట హృద్వేగాలకు గోళీకాయ అడ్డంతగిలినా పెళ్ళపెట్టుగా బోర్ల పడేటట్లున్నాడు. ఏవో ఉత్పాతాలు పుట్టడానికే యీ నాటకం తల పెట్టాం. కానున్నది కాకమానదని వైరాగ్యవృత్తితో ఆ సీనారేకు కురూపితంకె చూడ్డం మానేసాము. కాని రాత్రిల్లా మాశంకరుని సంకర త్రిశూలం, హిందూముస్లిమ్ ఏకమతచిహ్నం మాకు కళ్ళకుస్తోనేయుంది.

తనవీధి పెదవ్వాళ్ళ దబ్బిబుట్టలలోనుంచి ఓగంపెడైతే తావళా లున్నూ అవీధి వంటపొయ్యల్లోనుంచి పెద్దతాటాకుబుట్టెడు వెలిబూడిద కచికాయున్నూ పోగేసుకొని, దార్లోవస్తో నాటకంలోకి తీసికెళ్ళి ముందు కుర్చీలో కూర్చోపెడ్తానని మూడోక్లాసు జంగాల సుబ్రాడికి హామీయిచ్చి వాడు తీర్థంలోకొనుక్కున్న రబ్బరుపాము సహితం, యీ శివప్రీతికరమైన అమూల్యాభరణాలతో రాత్రి 11, 11-30 గంటలకు వచ్చిపడ్డాడు, మేము రంగులుపులుముకునే, మీరనుకునే, గ్రీనురూమువద్దకు. ఒక్కసారిగా కొట్టొచ్చినట్టు కన్నుమన్నారు మాసమాజం వాడిని. తెరలేవదు. దిగదు. మాసంఘం పేరుచెప్పి వాడికొక్కడికే దాంతోచనువు. రెండోయాక్టు కావస్తోంది. మా యమయాతన అట్లా ఉంచండి. విద్యార్థద్యమాలను ప్రోత్సహించే సహృదయుడో ప్లీడరుగారు ప్రేయరుఅయి తెరెత్తడంతోనే ‘సుంచరలతాకుసుమ’ అంటూ శ్రీకృష్ణుడు సైడ్డుకర్టెనులోనుంచి రావడం తర్వాయిగా ఉన్నప్పుడు, కుర్రవాళ్ళ నాటకంకాబట్టి పెద్దకోరికలు పెట్టుకోకండి అని పరిచయవాక్యాలు పలికి ప్రేక్షకులను సుహృదయు లను చేశామనే సత్సంకల్పంతో స్టేజీఎక్కి మొదటిమాట సోదరులారా అన్నాడు. రెండవ మాట చచ్చానండోయి అన్నాడు అంతే యిక ఒక్కొరగడు. సోదరులారా అన్నతర్వాత మమ్ములను చూపుతోన్నట్టు పక్కకు తిరిగేసరికి దభీలున తెర ఆయన కుడిభుజంమీదపడి, ఎడమభుజాన్ని కొట్టేసుకొని తర్వాత ఆయన కిందిపొన్ను పేలికగ్రను

పెళుక్కున విరిచేసిందేమో, ఓముక్క వెళ్ళి, ఎంతో భక్తియుతంగా ముందుకుర్చీలో మేం కూర్చోబెట్టుకొన్న మా పంతులుగారి చెంపను దూసుకుపోయింది. వెండికట్టు రివ్వున మెరపు మెరసినట్టుగా ప్రేక్షకుల శిరస్సులపైనుంచి నేరుగా పోయి బేడకానులో కూర్చున్నవాడి ఎవడివొళ్ళో పడిందో, వాడికి మానాటకం ఎంతో బాగా రక్తి కట్టిఉంటుంది. దక్షిణసహితం నాటకం దొరికిందిగా. ప్రేక్షకుల్లోయున్న డాక్టరుగారు యీ హతగాత్రుల నిద్దరిని బండిమీద వేసుకొనిపోయారు. పాపం ఏలాఉందో వళ్ళీ ఆరాత్రి వాళ్ళురాలేదు. మాకు కబురూ అందలేదు. కాబట్టి రాత్రి శంకరుణ్ణి చూచేసరికి వాణ్ణి వళ్ళేద్దామని పుట్టిందంటే ఆశ్చర్యంలేదు. యింతకు మా ఆగ్రహానుగ్రహాలు వాడికి కించిత్తైనా చొరుతున్నాయిగనకనా. ఉదమానున్నంచే వాడికి నాటకపు గుడ్లుపడ్డాయి. ఎంతసేపూ, తను, తనపద్యం, తన బూడిదబుస్సన్నవేషం యీలిక్కనున్నాడు.

♦ ♦ ♦

## సు భ ద్ర.

శంకరుడీలాంటి తిక్కశంకరాయి అయితే, సుభద్రవేషధారి మా ప్రాణాన్కి మహమ్మారే అయాడు, యిదేంపనిఅని. అతడు మా ఊరికి నేటీవుగ్రోత్తుకాదు. మా తణుకు మొక్కమామిడికాదు. ఏలూరు అంటు. మావూరికి చుట్టంచూపు. మా కర్ణంగారి రెండోఅల్లుడు. సెలవుల్లో వచ్చి పోయే వేసంగిపిట్ట. అంచేత అతనిమీద్ధ మాకు స్వతంత్రంలేదు. అతనితో చనువూలేదు. పైగా పట్నవాసపుకుర్రాడన్న పక్క బెదురుకూడాఉంది మాకు. మా తణుకు అప్పుడు పట్నవాసంకాదు, పల్లెటూరుకాదు. దానికి తగినట్టుపోకేళా, యక్సపర్టు కోతలరాముడున్న అతడు. చూస్తేంటే, వాడీ, మాసందున గిరీశ వెంకటేశాల వైవిధ్యం ఏర్పడింది, వాడు గొప్పవాడని మేము మానసికంగా వప్పుకోకపోయినా. మేం శుద్ధ (Home-Keeping

youths) కూపస్థమండూకాలమయిరి. మా ప్రపంచజ్ఞానం తణుకు ఎల్లలు హద్దులు దాటింది కాదు. మా భూగోళజ్ఞానం మా తణుకు యూనియన్, నత్తారామేశ్వరతీర్థం, మా మేనమామగారి ఊరు, మేం పెళ్ళికెళ్ళిన తాళ్ళపూడీమట్టుకే. మేం చేసిన నావికాయాత్రల్లా పైనచెప్పిన తాళ్ళపూడి పెళ్ళికి నిడదవోలు మదుగుమీదుగా పడవమీద వెళ్ళడం కారపుసెలగలు బటాణీలు భక్షిస్తో. నిడదవోలుదగ్గర పడవ కాస్సేపు కట్టేస్తే రైలుచూచి మావాళ్ళు మాకోసం కంగారుపడి కలియదొక్కుతోంటే, తప్పిపోకుండా వచ్చి వాళ్ళను ఆనందభరితుల్ని చేసాము, అయినా అలాంటి సాహస కార్యా లెప్పుడు చేయకండని మావాళ్ళు మందలించి, పెళ్ళినుంచి తిర్గొచ్చినతర్వాత, రైలు స్వతంత్రంగా చూచీ, బ్రతికివచ్చినందుకు వెంకటే శ్వర్లువారికి దీపారాధనచేసారు. పెళ్ళిళ్ళల్లో ముసలిరాంబొందు పంతుల్లు దాపరించి అబ్బాయిలు ఏంచదువుతున్నారమ్మా అంటో లాలనగా చేరదీసి యిఖ అక్కడనుంచి ఒక్కవరసని యెలిమెంటరీ లెక్కల ప్రశ్న లేసి మమ్మన్ని మా పెద్దాళ్ళముందర బంధుకోటిసమక్షంలోను పొడుచుకుతింటోంటే, మేమా రాబొందుల టాలన్సులో చిక్కడిపోయే వాళ్ళమే కాని, పెళ్ళిసమయంలో బోలెడు అవకాశాలు, మార్గాలు ఉంటాయి, మొదట్లోనే వాళ్ళను తప్పించుకుదూకేసే తెల్వితేట లెరుగం. కర్ణంగారి అల్లుడు అసాధ్యుడు. మాకర్ణం తమ్ముడింటో పెళ్ళికోపంతు లూరేగితే, వీడాపంతుల పొడుండబ్బి ముందుదాచాసాడు. ఆయనకు మలోయి ముష్టిముక్కతో వాకటంట వచ్చిపెళ్ళేవాళ్ళను, మీరా మీరా అని, పొడెంపట్టుకు చేయిజాపుతోంటే, ఎక్కడో పొడెం కొట్టుకొచ్చి మళ్ళా కుర్రాళ్ళను కూలేస్తాడేమో అనే, దూరదృష్టితో ఒక గళ్ళఅట్ట, చదరంగంభరణి తెచ్చి, ఆయనముంచెట్టి తప్పుకొన్నాడు. ఉపద్రవం తప్పింది. వాడికి మాకుకూడా స్వాతంత్ర్యసము పార్జన చేసాడు. ఆపంతులు పెళ్ళి అయిదురోజులు అగొడవనుండిపోయాడు.

యీ సుభద్రపాత్రధారి గ్లోబుట్రాటరుబ్రీడ్డు. తరచు రైళ్లమీద, గాలి తిరుగళ్ళలో ఎవళ్ళతో ఎక్కడో కన్పిస్తూనేయుంటాడుట. స్వంత శుభ

కార్యానికికూడా నైజామురైలు ఎక్కుతోంటే కాని పట్టుకొని తీసికొచ్చి, ఓచేత్తో అతన్ని పట్టుకొని రెండోచేత్తో ముహూర్తం పెట్టారట. ఏర్పాటయేకాని ఏదోతిప్పట్లో యింత లోకజ్ఞత ప్రయోజకత్వం సంచికట్టు చేర్చాడు. కొత్తవాళ్ళముందు నదురు బెదురు లేకుండా ధక్కా మొక్కీలకు ఆగే బిరుసు వచ్చింది. దేశద్రిమ్మరులకు మతిపోయినా నాలుక తిరుగుతుంది. పట్టుపట్టి ముచ్చెమటలు పట్టేటట్టు మేం ఎంతో వ్యాకర్ణయుక్తంగా, కష్టసుఖాలు అన్నీ చూచుకొని ఒక్క యింగ్లీషువాక్యం తయారుచేసి ప్రయోగించేలోపల వాడినాలికంట క్లాజో, ఫ్రేజో తెలియనివి నాలుగైదు పాదరసంలా పాకేవి. నిజాన్కి అంతా చెత్తకాదు, కొన్ని చేపైనమాటలూ ఉండేవి. అంతా గుల్లకాదు కొంత గట్టీ ఉండేది. ఏమైతేం అది శిక్షవిద్యకాదని పరీక్షలో అలావ్రాస్తే 1%రాదని ఎగ్జామినర్ పేపరుచింపి పోగులెట్టేస్తాడని, మాది నూటికి నూరుమార్కులు పుచ్చుకొనే మడిగట్టుకొన్న భాషఅని మాధిలాసా. మాకు వాడికి ఉన్నవ్యత్యాసం. అలా సరిపెట్టుకొనేవాళ్ళం. ఈపల్లెటూరు గబ్బిలాయిలు ఏమనుకుంటున్నారో కూడా వాడు ఖాదరుచేయలేదు. వాడికి గ్రామరు రాదని సూచించి కొంతపొగరు అణుద్దామని అనుకున్నాం కాని మొదట్లోనే వాడు మా నోళ్ళకు తాళంవేశాడు. వ్యాకర్ణం చదివినవాళ్ళు మాట్లాడబోతే బుర్రగుంజా భోంచేస్తారా అన్నట్టుంటుందని, దొరలకది పరమాసహ్యం అనీ యాదాలాపంగా ఓ కారిక లేవదీసాడు. యిదెంతవరకు నిజమో మాకనుభవంలేదు. మేం దొర్లనే చూడలేదు మిస్సులిన్ మిషనరీని తప్పితే. ఆపె తప్పటడుగుల తెలుగుతో బోధనచేయడమే విన్నాం. మా యిన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుకూడా దొరకాదు. ఏమైతేం కర్ణం అల్లుడిముందు నోరు ఎత్తలేకపోయాం. యిక వాడు కోరెంతదగ్గుపట్టిన కుఱ్ఱాడిలా గుక్కతిరక్కుండా తెలుగు యింగ్లీషు మిళావుపాకంలో వ్యాకర్ణానికి అతీతుడైపోయి, lengthened string of broken sentences వాడి యిష్టంవచ్చినట్టు with extraordinary volubility చెడా మడా చెక్కేస్తోంటే అనుమూ మినుమూ అనకుండా కళ్ళువప్పజెప్పి పడిఉండే

దుష్కాలం మా తణుకు విద్యార్థులకు ప్రాప్తించింది. మాలో నాలుగో ఫారం కుర్రాడ్డోడు మీరూరుకోండి నేను వాణ్ణి గుళ్ళోకి తీసుకొచ్చి Abou Ben Adhem తప్పుచెప్పమని పందెం కాస్తా. మీరు వీలుచూచి ఒక్కసారిగా లేవిడీ కొట్టెయ్యండన్నాడు. పిల్లకాకికి ఏం తెల్సు ఉండేలు దెబ్బ. బాగానేయుంది వ్యూహం. అవతల వాణ్ని పందెంలోకి దింపడమేలా? జగజ్జంత్రీగాడు మొదటే నవ్వేపారేస్తాడు. ధర్మరాజు గనకనా, మోసం జరుగుతుందని ఎరుగుండీ పందెంలోకూర్చుని అసరమైతే కర్ణం కూతురినికూడా ఒడ్డడానికి. ఎందుకొచ్చినమాట, అయితే గియితే ఒక్కచోట వాడు దొరకొచ్చు. వాడికోమచ్చ ఉంది. స్కూలుఫైనలు తప్పాడని, కాదని అస్పష్టంగావుంది వాడి చదువువిషయం. అక్కడ కాస్త సందుదొరికితే ఏడ్పించి యీడ్చిపారేయొచ్చు అనుకున్నాం. కాని ఏదో కేంబ్రిడ్జి సీనియర్ కి చదువుతున్నానన్నాడు. ఈదేశ పరీక్షే కాదట. దాన్నిపట్టి వాడినాకౌంకద్దామా అంటే ఆకేంబ్రిడ్జి సీనియరు ఎఫే, బియ్యేలా సిష్టవిద్య అవునో కాదో తెలియదు. ఏగళ్ళీలోదో ఎరుగం. అదిప్యాసైతే ఏంఉద్యోగమో తెలియదు. మావూళ్ళో ఎవరికీ తెలియదు. ఎంతదూరం చూచినా తేలింది ఒకటే. మా అమాయకత్వం, అజ్ఞానావస్థ చూచి సొమ్ము చేసుకొని ఆలా పేట్రేగిపోయాడన్నమాట. మేం ఏమీచేయలేక వాడికేమీ రాదని తెల్సుండీకూడా కుక్కినపేలల్లా పడిఉన్నామన్నమాట. ఆలాంటి వాడికి మాలాంటి పల్లెటూరిపిల్లకాయలు తగిల్తే అడిగారా! నల్లేరుమీద బండే. షికారుకెడదామని పిలిస్తేకూడా వెళ్ళేవాళ్ళం కాదు. వాడూమేము కల్సి మాట్లాడుతోంటే మావూరు తెల్సి తెలియని వాడెవడైనా చూచి, మనవాళ్ళు పెద్దమ్మలోయి అనిపోతాడేమో అన్నభయమే మాకు. యింత వరకు ఏదో పరువుగానే బ్రతుకుతున్నాం ఊళ్ళో.

కర్ణంగారి అల్లుడు విషయంలో యింత బెంగ దిగమింగి బ్రతుకుతున్నామని ఊరివాళ్ళకు తెలియదు. కర్ణంగారి అల్లుడు సుభద్రకు పెట్టిందిపేరట మాలో వేయించండోయి అన్నారు ఒకళ్ళిద్దరు. ఏదో ఆషామాషీగా అన్నమాటకు అవును కాదు అని వాగ్వాదమెందుకొచ్చిందని

ఊ, ఆ, అనకుండా ఊరకట్టి ఊరుకున్నాం. తెల్లవారేసరికి కర్ణంగారి అల్లుడు సుభద్రిట అని ఊళ్ళో పాక్కింది. యిదోవిధంగా విషమఘట్టమే. సుభద్ర కాస్త ముదురు టెంక. మాశంకరుడీడువాడు, కొద్దినెలలు తక్కువగా. అధమం రెండేళ్ళకిత్రం కోతకొచ్చిన గెడ్డం. బిర్రబిగుసుకూడా ఖర్మం. మా అర్జునుడు బొత్తుగా లేత, సుభద్ర ముదురుపాకం అయితే బాగుంటుందా, అని అక్కడక్కడ అన్నాం అక్కడకీ. యింతకన్న కుర్రఅర్జునుడితో వేసి సుపత్ఛగా యాక్టుచేస్తే, ఒవేషన్ అలాకురిసిపోయింది. ఆవిషయం నాకు వదలేయండి, నేకొట్టుకుపోతానన్నాడు. అతడికే భిడియం లేకపోతే మనకెందుకనుకున్నాను నేను. యిక మా అర్జునుడు, ఎంతసేపు పెద్దపెళ్ళాం వస్తోందన్న ఉబలాటమే కాని, తన్ని స్టేజీమీద చూచిన వాళ్ళు తన్ని సుభద్రకు తమ్ముడే అనుకుంటారో, భర్తే అనుకుంటారో కించెత్తైనా పట్టించుకోలేదు. పైగా సుభద్ర కళ్ళు చెవులను అందుకోవాలని చూస్తున్నాయుట అంటో ఏరసికుడో అన్నమాట దొర్లించుకొచ్చాడు, అక్కడికి ఏవేవి అందుకుంటే అందమో మహతెల్సినవాడిలా. అదేం ప్రమాదమోరా పాపం కళ్ళకు చెవులకు మధ్య యిాపక్క ఒకటి ఆపక్క ఒకటి రెండు మేదరతడికలు కుట్టించి కట్టుకోమనరా. తీరా కల్సుకుపోతే తర్వాత ఏంచెయ్యగలం అందాం అనుకున్నా, మావాడు తన ఆదాయాన్ని మించినమాట చేసేసికొచ్చినందుకు వ[illegible]మండి.

[illegible] తకు యిా gack of all trades నాటకానికి ఏ మాత్రం గట్టి చెయ్యో చూచిన వాళ్ళెవ్వరూ లేరు. ఏదైనా వాడికోతే, ఏలూరు స్పోర్ట్సు క్లబ్బువారితో సుభద్ర వేసానంటో స్వాతిశయం వెళ్ళబెట్టుకున్నాడట. ఆమాటట్టుకొని యింతహంగామానున్న. అది ఎంతవరకు నిజమో ఒక్కళ్ళెరుగం. మొన్ననే వద్దును, ఏలూరు స్పోర్ట్సుక్లబ్బు వాళ్ళకు నా పేరు అచ్చు కొట్టించుకున్న మూలంగా నాల్గు వేలొచ్చాయి గయోపాఖ్యానాన్ని, అంచేత వాళ్ళు నాకు టీ పార్టీ యియ్యాలని ఎంతో బలవంతపెట్టి అపుచేసారు. తప్పిందికాదు పాపం వాళ్ళు సరదాపడ్తోంటే అని వాడు అడ్డంగా కోసేస్తే మాఅర్జునుడు వాణ్ణి విల్సునానమ్మేస్తాడు. మేం

యిక్కడ టీ పార్టీలంటే నేనా ఎరగంగా, ఎవళ్ళ నాన్నగారి పెనకాల ఆయన బాల పటాలం పొత్తు పంచలు కట్టుకొని, చిన్న మరచెంబులుచ్చుకొని భోజనాల కెళ్ళడమే కాని, ఏమాత్రం పాటగాడో తెలియదు. ఒక్క పద్యం రాగవరసని చదివిన పాపాన్ని పోలేదు. మేము మరీ యిబ్బంది పెడ్తే సన్నకంఠంతో చిటికలేస్తో దురితంలో ఏవో ద్వంద్వాలు మాటలని, య్యివ్వి మట్లోయి, నాజూకు తెల్సిన నటులు వీటిని పాడుతున్నారు, ఇది ఫాషను అయిపోయింది ప్రతిచోటా అని బుఖాయించాడు. పద్యం చదవలేదు. చివరికి రిహార్సలుకు వస్తారా అని అతి వినయంగా అడిగితే నాకూ రిహార్సలుటోయి అర్జున్ అంటో, అర్ధనిమీలత నేత్రుడు అయి, అర్జనుడి బుగ్గ వేల్తో యిట్టేఅని యిదో పోజోయి, యీలాంటివి లక్షలు కురిపించేస్తాను నాంటకలోకి అంటో సన్నగా విజలు వేసికొంటో కర్ణంగారింటికేసి పోయాడు.

ఏమనుకుంటే ఏం లాభం. కాలం ఖర్మం ఆలాగెంటుకొచ్చాయి. సుభద్ర మాకు తప్పింది కాదు. నిజానికీ సుభద్రను మేం కోరితెచ్చుకొన్నామూ. స్త్రీ పాత్రిలతో మావిధానం పైన మనవిచేసాగా, సుభద్రను శుభ్రంగా సైడుకర్టెనులో, యింటరన్ చేసి స్టేజీమీదనుంచి అర్జనుడు చేత కృష్ణుని మాట ఎత్తవద్దని అక్షులు పక్షులు హాడలతిట్టేద్దుం. అన్ని ఆడ అవతారాలు మా ప్రాంప్టరు ఆలా ఎత్తేస్తోంటాడు అక్కడ కూర్చునే మాకృష్ణుడు నాటక క్రమంలోనుంచి ముగ్గురి ఆడవాళ్ళను కత్తిరించేసాడు సైడుకర్టెనులో రుక్మిణి ఉన్నట్టు అటుచూస్తో, రుక్మిణిని సంబోధించి అదుగో వస్తున్నావు. అక్కడ ఆగు అర్జనుడు విషయం నేను వినిపించుకోను. తక్షణం యింటికి వెళ్ళు. వెళ్ళేటప్పుడు, సత్యభామతో కూడా రావద్దని చెప్పి, దార్లో మా అమ్మ కనిపిస్తే మాఅమ్మతో కూడా అంతే చెప్పేయి? అంటాడు. ఆలావదల్చుకోదగ్గ సుభద్ర విరుచుకుమీదడింది.

విద్యార్థి నాటకాల్లో ముఖ్యంగా ఆడబాధ ఎక్కడంటే, పాత్ర నిర్వహణం దగ్గర కానేకాదు. మేకప్పు విషయంలో. ఒక్కొక్కటే అందీయలేము. ఓటీ మేం తేగల్గినవి కావు పైగా, మాలో ఒక్కడికి

చీర విప్పే వయస్సైనా లేదు, కట్టడం మాటటుంచి, చచ్చి కట్టామయ్యో, తత్సంబంధం తర్వాత సవరింపులు తెలియవు. ఏవయసు వేషధారికి, ఏ వడుపు, ఎంతవలం ఉండాలో ఆ పరికరాలు అంతా అగమ్యగోచరం. యింటి దగ్గర యీ మాట తలపెడ్తే వీపు చిట్లేస్తారు చాంతాడు తీసి. పైచనువులుండే ఆదాయం కూడా కాదు ఏ పైపిల్ల సాయసంపత్తులైనా తీసుకొందామంటే రెండో కంటివాడిక్కూడా తెలియకుండా. యిదో ఉపాధి కింద జీవించే ప్రొఫెషనల్సు ఆరోజుల్లో ఉండేవారు కారు కన్నొదుబ్బ కొన్నా. అన్నిటికన్నా ప్రమాదం ఆడవేషం తయారు కత్తిమీద సాము. పదున్ని, పాకాన్ని పడిందా పగ్గాలేసి పట్టుకోలేం ప్రేక్షకుల్ని. చింతాకంత బెసిగిందా చంటిబిడ్డప్రాణానిక్కూ రాంబాళమ్మో మరిడీ మహాలక్ష్మమ్మో అయితీరిందన్న మాటే. తన కంతా తెల్సునని, తానంతా చేస్కు పోతానని, సుభద్ర పాత్రధారి కోస్తే యీ బురదలో దిగబడ్డాను,

అన్నీ చెప్పి, నాటకంరోజు పగలు రాలేదీ అబ్బాయి. నాటకం రోజు ఉదయానికి తణుకులో తనను చూస్తారని మాటయిచ్చాడు. వాడు తెలుగుమాట్లాడినా యింగ్లీషుకట్టు. కాని మాకావిషయం ఎక్కువ అమర్దా లేదు. ఊరుకుంటే ఆవేళకు ఏమవునో, తీరి కూర్చుండి మా నారదుడు అర్జునుడువంక, వంకరచూపు చూస్తో, సుభద్ర అంటే లోకువ వెలిబుచ్చుతోన్నట్టుగా, అబ్బే గయోపాఖ్యానంలో సుభద్ర ఓసుభద్రేటండీ. దానికంత పట్టింపక్కరలేదు, అంటో నిరసనగా నాలిక తాటించాడు. అప్పుడు రాత్రి 8-30 అయింది. నిజానికి అతడన్నది మాలో ఎవరైనా అనేమాటే. యింకాస్సేపుంటే విరక్తికొద్దీ అర్జునుడే అనునామాటకాస్తా. మరి వేళావిశేషాలు అంటోంటారు. వేటిని? వీటినే. శుద్ధ అకారణ అగ్రహాల్నే. సుభద్రను ఎవరో తీసిపారేస్తున్నట్టు. భర్త అయినవాడు తను, యింతోడిభర్త దొరికాడు ఎలాగైతేం, ఆమె గౌరవప్రతిష్ఠలను ప్రాణాలొడ్డయినా కాపాడవలసిన పరీక్షాసమయం వచ్చినట్టు చర్రున తారాజువ్వలా లేచాడు అర్జునుడు. యింత అంతర్నాటకం యిక్కడ

జరిగింది అని నాకేం తెల్సు, అర్జునుడు కృష్ణుడు చక్రాన్ని ముచ్చిబంగారం లేకు ఊడిపోయింది కాస్త అంటించేయరా అన్నా మామూలుగా. నేనసలు ఎక్కనే ఎక్కను. మీకంత చూడాలని సరదానేయుంటే చచ్చినట్టు సుభద్రను వెతకి తెచ్చుకొని నా చేత వేయించుకు చూడండి. లేకపోతే నాతో మాట్లాడకండంటో అట్టేపోయి ముఖాలుకడుక్కునే బిందెదగ్గర సబ్బుచేతపట్టి అటుతిరిగి కూర్చున్నాడు భీష్మించుకొని. వీడిని ఎవరేమన్నారోయి అంటూ ఒక్కడు మాట్లాడడు. ఆ కాస్త ముగ్గు పెట్టేసి యింకో మూలకు తన్ను కానట్టుగా దాటేసాడు కలహాభోజనుడు. ఎవడికి కోపంవచ్చినా సిద్ధాన్నం చెడిపోతుంది. అందులో అర్జునుడు పద్యాల కారక్టరు. మనిపూసి మారేడుకాయ చేయడానికి వీల్లేదు. యిది గ్రహించుకునే ఏమో ఆ అకారణ ఆవేశం, అతిశయమున్ను. నకులుడికి అలకొస్తే చూసేవారెవరు. యింటికెళ్ళి నల్లుల కుక్కిమంచం ఎక్కాలి. అర్జునుడు కాబట్టి వచ్చింది హటాత్సంక్షోభం. కథకడ్డమొస్తే వచ్చాగాని, నాటకం సంబంధాలు పట్టి సెల్లోయిడ్డు సంబంధాలేనా. నాటకంభార్యలు శుద్ధమైన పుండలేగా. వీళ్ళనే మరో నాటకంలో యింకోవైపుకు లాగి మరోరివిడంపక్కను కూర్చోపెడ్తామా? నాటకం భర్తలూ ఓభర్తలే, లక్కపిల్లిగుల్లసరుకు, అవునా. అలాంటప్పుడు 'నా' పెట్టుకుంటే ఒక్క నాటకం పడ్తుందా. చేతులు మార్చినపుడల్లా యిఖ మంచం పడ్తోండమా. దీనికే అర్జునుడు యింత హంగామా చేసాడు. నిజంభార్యమాటే అయితే ఆరోజున వీడు మా సమాజంలో సగంమందిని తినేసి ప్రేక్షకుల్లో ఒకళ్ళిద్దరి బిడ్డల్ని కూడా అమాంతంగా పప్పు అన్నంలో పచ్చిమిరపకాయ కొరుక్కున్నట్టు మెడలు కొరికేసి, మొండాలు వీధులో పడేసునన్న మాటేనా, మళ్ళోటా. వీడి చర్యావీడునూ. కాకపోయినా అంతంత కోపాలాండి! వాడిల్లు బంగారమైన కాపురం! కాస్త కోపాన్ని దిగ మింగుకోవద్దండీ మనిషి అంటో పేరుపెట్టి, బట్టకట్టి, వీధులోకి పంపిస్తే.

యిక అక్కడనుంచి అయ్యా కర్ణంగారింటికి కాలుకాలిన పిల్లుల్లా ఒకరితర్వాత ఒకరం తిరుగుతోన్నాం, సుభద్ర వచ్చాడాండి అంటో.

సమాజమంతా అట్టుడికిపోతూన్నట్టు ఉడికిపోతోంది. ప్రాణాలు అర చేతుల్లో పెట్టుకు కూర్చున్నాం, పాలకోసం రాయిమోత వచ్చింది. లేకపోతే గయోపాఖ్యానంలో సుభద్రకోసం మతులోయి కలియద్రొక్కు కోడవమా, సిగ్గు సిగ్గు. మండపాక నాటకబృందం యీమాట వింటే ఎంత లోకువ, తలవంపులున్ను.

చూసేవాళ్ళం చూస్తోనేయున్నాం. అడుగుఅడుక్కీ మనిషి మని షికి దార్లంట. మరెక్కడనుంచి ఊడిపడ్డాడో మహానుభావుడు వస్తోనే అల్లో! మై డార్లింగ్ అర్జున్! అప్పుడే కోటూ వేసేశావే — ఏదీ, యుక్సలెంట్ ఏంజలిక్. నేనెంతసేపులే — just a second అంటో లోపలి కడుగే శాడు. నన్ను చూచి, Good evening - unavoidable గా అయింది అలస్యం — Kept the whole troup waiting, perhaps sorry యీ పార్టన్కి రావడం అంటే Lot of worry అండి. ఏలా చేస్తారండీ ప్రయాణా లిక్కడిప్రజలు. Bad roads, awful every where bandies bolting and passengers joiting అంటో షర్టు తీసి యీతాకులచాపమీద పారేసి అర్జున్, మై లవ్ బార్బర్ ప్లీజ్ అన్నాడు, భర్తఅయినందువల్ల మంగలాణ్ణి చూసిపెట్టే బాధ్యతంతా మా అర్జునుడిదే అయినట్టు అసలు మావాడు మంగలిక త్తిసహితం చెరువుగట్టు మీదకు ఎదురుగుండాశెళ్ళి తననుతీసుకొచ్చేమాట అన్నట్టున్ను. గత గంట, గంటన్నరనుంచి యీపరాయివాడు -మాకేం పేగుసంబంధమా వీడు- వీడిమూలంగా మేముపడ్డ క్షోభచాలదూ? పైగా వస్తూనే యీఅమాం గళ్యం ఏమిటి మంగలి అంటో, శుభప్రదంగా మేం నాటకం ఆడుకోం టోంటే. అమాంగళ్యంమాట అటువుంచి అప్పుడు మంగలి అవడం మాకుత్తుక పట్టుకోవడమే. మాలో శంకరుడుతప్పితే మరెవరిది రోమబాధ వయస్సుకాదు. అశంకరుణ్ణి మంగలి ముట్టుకోఅక్కరలేకుండానే జరిగిం దని మనవిచేసాగా. అందువల్ల మంగల్ని స్టేజీలో కట్టేసుకోకుండానే ప్రారంభించాము. యింతకు పెళ్ళిళ్ళరోజులు. 6 మైళ్ళలోపున అరాత్రి మంగలిదర్శనమౌతుందని మాకు ధైర్యంలేదు. సెలునలు నేషీరేజర్లూ

ఉద్భవించని ధుర్భిక్షపు రోజులవి క్షురకర్మకి. అసలే దుర్భిణీ, అందులో గర్భిణీ అన్నట్టు గడ్డం మాయబెట్టుకొస్తాడా? రాత్రి నాటకం అని తెల్సు కదా, తన ఐశ్వర్యం తనకి తెలియంది కాదుగదా? ఉదయం కాస్త గెడ్డం తడిపించుకు తగులడకూడదూ. దాన్ని రాత్రిఅంతా పరుండే వేళదాకా నిగ్ఘింపెట్టిసెట్టి మాప్రాణాలుచ్చుకోవాలా. యింతోడి మీసం, గెడ్డం యీాయనముఖాన్నే మొలచినట్టు. ది గ్రేట్ యిండియన్ బాలభాస్కర సంగీత నాటకసమాజాని కింతకన్న యిక్కట్టు యింకేముంటుందండీ. వీడిని మెమ్మదిగా మంచినీళ్ళకని కోర్టు నూతిదగ్గరకు తీసికెళ్ళినట్టే తీసికెళ్ళి దాల్లోకి గెంటేసి, పొద్దున్న కరణంగారొచ్చి మాఅల్లుడేడంటే, ఏమో అంటే ఏమో, అందాం అనిపించింది. వీడిని ఉప్పుపాతర వేయించాలని ఒక్కొక్కళ్ళకుంది, కాని కక్కలేం, మింగలేం. ఏమైనా పల్లెత్తుమాటంటే మాఅర్జునుడు పూసుగుమీదపడ్తాడాయిరి. అంచేత హరహరా అని వీణ్ణి బుజానేసుకొని మంగలిగూడాన్కి ఎగబడ్డాం ముందునల్గురం వెనక నల్గురమున్ను. వెనకాపిక్వికి యను ఒకదరిద్రపుగుర్రాన్ని వదుల్చుకోలేక ఏడుస్తో, వళ్ళుమండిపోతో వెంటపెట్టుకు వెళ్ళినట్టు. గూడెం అంతా వెతికితే గుప్పెడిమంగళ్ళులేరు. యిక వీడూ, చచ్చాటప్పుడుకూడా గొప్పలే.

Most extraordinary thing I ever met with in my life, most awkward simply ridiculus- ten of us to go for a wretched barber begging and walking Tanuku roads all night. Dreadful situation-miserable plight. ఏంఊరండి యిది. మాఏలూరు అయితే రోడ్డుమొగలో నుంచుని మంగలీ అంటేచాలు 100 మంది మంగళ్ళొచ్చి బిసీజి చేస్తారే. 100 పొదులు అలా క్షైవారం పెట్టేస్తారే. వాడిమాటచూస్తే ఏలూరు కాపరం కేవలం మంగలగూడెంలో నివాసమన్పించింది. ఏలూరులో శకునం పట్టుదలఉన్న వాళ్ళు ఏదైనా కార్యం తలపెట్టుకుంటే ముందు దగ్గరఊరికెళ్ళి మంచి శకునమయ్యాక వచ్చి ఏలూరులో పని ప్రారంభించవలసి వస్తుందన్న మాట. ఏలూరిపిల్లకాయలు పరీక్షకేలా ప్యాసౌతున్నారో, పరీక్షకు బయల్దేరేటప్పటిల్లాక

వారో" అని మంగలపోది ప్రత్యక్షమైతే ఏలూరు ఆడపిల్లలను అత్తవారింటికి కాపురాలకు పంపిస్తారా? ఏలా? గుమ్మంలోనే మంగలిపోదిగా?

## క్షు ర క ర సి కు డు; వా యి ద్య గా డు; తే లు మ ం త్ర గా డు.

మంగలగూడెం వీధిమొగకు వెళ్ళాం పండువెన్నెల్లో. ఒక యింటి ముందు తాటాకుచాపమీద కూర్చుని ఉన్నాడు, 30 సం॥ల వయసు లోపు వాడు. పక్కను అప్పగారి ఓదార్పుమాటలు వినిపిస్తోన్నాయి. "ఔనురా చేరదేసికళ్ళే ఏంచేస్తాం మనపిల్లకాదు. పోయింది. పోయినవాళ్ళు తిరిగొస్తారా? కానిని గెంజినీళ్ళుచ్చుకుని పెలయింది. అందులోను యీ పది రోజులనుంచి అపూట కాపూట మరీ కునుకేనా లేకుండా ఏకధారగా ఏడ్చి పోతోంటివి' అని అప్పగారంటోంటే ఎవడో పాపం శిశుమరణ బాధితుడైన తండ్రి కాబోలు అనుకొన్నాం. కాదు సతీవియోగ దుఃఖసముద్రంలో దరిగానిక కొట్టుకుపోతోన్న పతి అని .తేలింది తర్వాతమాటల్లో చంటి పిల్ల జారిపోలేదు. పెద్దపిల్లే లేచిపోతే యిఖ అక్కడినుంచి వెన్నెల్లో చాపవేసుకొని నిష్ఠకృతుగా కూర్చొని చంద్రుణ్ణి చుక్కల్ని ఒక్కవరసని ఆడిపోసేస్తోన్నాడు అబాహుకుడు. తెల్లారితే పౌర్ణమి కాబట్టి పాకం మరీముదిరిందన్నమాట. అందుకనే అప్పగారు యీ పదిరోజులనుంచీ పూటపూటకూ మరీ అలమరుగుతున్నావంది. "మొగాడు అలా బెంబేలు పడ్తాడట్రా. ఎల్లుండి వెళ్ళి నల్గురిలోకి పిల్చి గడ్డెట్టించి విడాకులు తెస్తాను. లో అంటే కోటిమంది. మూడోనాటికల్లా ఇంకోత్తిని కట్టానులే' గెంజి నీళ్ళు త్రాగు అని యింట్లోకి తీసుకుపోయింది. అలా వియోగదుఃఖంతోన్న క్షురకరసికు డేంపని చేయను అని యింకా పైకి సాగాం.

రెండిళ్ళపైన అరుగుమీద మంచి నిద్రమీదున్నాడు మరోమంగలి. [illegible] వాయిద్యగాడైయుండాలి. స్వప్నజగత్తులో ఎక్కడో

ఏ సాలిపేట వీరభద్రోత్సవంలోనో మరోడోలువాయిద్యగాడితో ఎదర పడి వాడికన్న వీడు, వీడికన్న వాడు, ఒకడినిగెంటుకు ఒకడు ఉద్ధృతంగా, దురితంలో ఎడాపెడా వాయించేస్తో శివభక్తులను శివాలు తొక్కిస్తోన్న స్వీయచరిత్రాఘట్టంలో మాంచి రసకందాయం ఘడియ అయియుండాలి. మేం లేపింది తడవుగా ఊగుతో లేచి కూర్చుని రెండు ఊపులైనతర్వాత మూడవ ఊపుకు తలతో గోడకో ముక్తాయింపు కొట్టాడు. దాంతో వాస్తవికజగత్తుకి దిగి, కళ్ళువిప్పి, పెద్దవిచేసుకొని మమ్మలను చూచి, ''రోజురోజు ఎవళ్ళో ఒకళ్ళు కునుకేసేవేళకు వచ్చిపడ్తోంటారు చెప్పలేక చస్తూన్నాం, పోండయ్యా వీధిచివరకి, వెంకటేశు అని కేక వెయ్యండయ్యా పల్కుతాడు'' అంటోనే గిర్రున అటుతిరిగి, చర్రున కాళ్ళుచాచి గుర్రెట్టేసాడు. కొంతమందికి Priliminaries to Sleep అంటోనే ఉండవు. ఆవలింత అక్కరలేదు. చిటిక అసలే అక్కరలేదు. నడుము యీలా వాల్తోంటేనే గుర్రు అలా వచ్చేస్తోంటుంది. వాడి కడుపు చల్లగా మరోడి యడ్రస్సు యిచ్చాడు.

అక్కడనుంచి శ్రీ వెంకటేశు నామం హరినామస్మరణ చేసి కొంటో చివ్వరింటికెళ్ళి వెంకటేసూ అని కేకేసాము. వీధిలో బోర్లించిన గంపమీద తలపెట్టుకు రోజుతున్నాడు శ్లేష్మదగ్గట. శతవృద్ధు. ఎందుకొచ్చామో అడగక్కరలేకుండగానే. మా తొందర గ్రహించినట్టుగానే, మీలో ఎవరికయ్యా అన్నాడు. సుభద్రనుచూపితే అక్కడ దిమ్మమీద కూర్చోమనిచెప్పి లోపలికెళ్ళి వచ్చాడు. నీళ్ళు, దీపం ఏవని సుభద్ర అడిగితే, ఏమీ అక్కరలేదు చూసుకోవయ్యా నిమిషం పని అని వెంకటేసు అన్నాడు. ఎంతకాలంనుంచి చేసినచెయ్యో వెన్నెలవెలుగే చాలు కాబోలు అనుకొని ఏదైనా, తొందరగా పనిలో దిగుతోయున్నందుకు పరమహర్ష సంపూర్ణహృదయులమైనాం. సుభద్ర ముఖం ముందుకు వెంకటేసుకేసి ఛాచి, ఎడంచెంప ఎత్తుకొని కూర్చున్నాడు. ''కాలో వేలో అనుకొన్నాను, పరుండగా అటకమీదనుండి పడిందా లేక పక్కలోనే తిరుగుతోందయ్యా'' అంటోనే, సుభద్ర సమాధానమింకా వినకుండానే

ఆ ఎత్తిన చెంపమీద ఛెళ్ళున ఒక్క చెంపకాయ పుచ్చుకొన్నాడు వెంక టేసు. వెంటనే చిటికలేస్తో, ఏదో రొబ్బపుచ్చుకొని చెంపకేసి విసురుతో మంత్రమేస్తోన్నట్టుండేలోపల మేం గొల్లుమన్నాం ఒక్కపెట్టున. సుభద్ర దిమ్మమీద ఒడుదుడుగ్గా కూర్చుని యున్నాడేమో యీ లెంపకాయతో కిందపడి, అక్కడనుంచే, చేతికిదొరిన యిటికబొంత పుచ్చుకొని 'జగ ముక్కజంపడగ జక్కంజేతు నిన్నిక్కడన్' అని చక్రం చేసంధించి భీష్ముడిమీదకు లంఘించే కృష్ణుని పోజులో ఓకాలు వెనక్కి ఓకాలు ముందుకువేసి, వీడి బుర్ర యిప్పుడు యిక్కడ బద్దలుకొట్టేస్తా మీరంతా చూస్తోంటే. మాటేనా వినుపించుకోకుండా లెంపకాయ కొట్టేస్తాడా, ఎవణ్ని అనుకొన్నాడు అంటో ఎగబడ్డాడు. పదిమంది మూగి, అడ్డంపడి, అర్థాలు చెప్పుకోడంలో, వెంకటేసు 4 జిల్లాలమీద పేరుమ్రోగిన తేలు మంత్రగాడని, అనునిత్యం వేసంగుల్లో పదిమంది పదిహేనుగురు ఏడుస్తో వచ్చి నవ్వుతో వెడ్తారనీ, వెంకటేసూ అంటే ఎందుకొచ్చారనికూడా అతడడగక్కరలేదనీ, తేలుకుట్టినవాడు తనదగ్గిరకొచ్చే యింకా ఎందుకు బాధపడాలనే, నిండు ప్రేమాతిశయాలతో ఊరు పేరు అడిగేనా కాల హరణం చేయకుండా, తక్షణం తేలుకుట్టుకు లెంపపెట్టు వైద్యం ముందు చేసి తదుపరి ఏదో రొబ్బుతో మంత్రించి నవ్విస్తో పంపించే పుణ్యాత్ముడని తేలింది.

ఏది ఏలాఉన్నా సుభద్ర ఒక పరమసత్యం గ్రహించాడు. ఆ దెబ్బతో జ్ఞానోదయం అయిందికాబోలు, తర్వాత ఎప్పుడో 'పూర్వపు ముండావాళ్ళది మంచి పిండపుష్టిసుమండి, అలా ముసలినక్కలా కన్పిం చాడా వెంకటేసు, వాడి దుంపతెగ, చచ్చేదెబ్బ కొట్టాడండీ. దంతం కదిలింది' అన్నాడు. పనిలోపని మాకూ ఒక విషయం అనుభవంలోకి వచ్చింది. ఎవడితోనైనా వ్యాపారం కల్గితే, అనుకోడాలు, ఊజ్జాయిం పులు, ఎపాంక్సిమేషన్లు పనికిరావు. ఉభయులం సుస్పష్టంగా మాటలకు అర్థాలుచెప్పుకొని ఉదహారణపూర్వకంగా పనిలో దిగాలి. క్షురకర్మే అనండి, మంగలీ పనిచేస్తావా అంటే, వాడు చేస్తాననిచెప్పి, మంచితీర్థం

పుచ్చుకొనివెళ్ళినా పనే. నోరువిడిచి నాకు క్షవురం చేస్తావా అని అడగాలి. అదీ చాలకపోవచ్చు. చేస్తానని వాడొచ్చి పొళలాడేసి, ఏంచెయ్యకుండా వెళ్ళినా క్షవురమే. తిరుక్షవరమే మోకూడా ఆమాట కొస్తే. అంచేత బుద్ధిమంతుడైనవాడు ఎదరివాడి చేతిలో కత్తివుందన్న ధైర్యం చిక్కబట్టుకొని, అప్పుడు తలవంచుకొని, దంమ అనాలి. వెంక టేసుకు మాకు అనుకోడాల్లో వ్యత్యాసంవల్లనేగా సుభద్రకు చెంపపగిలింది. 10, 15 సం॥రాలు కాపురాలుచేసీ, ఒకరినొకరు నఖశిఖపర్యంతం గ్రంహించుకొనికూడా కొందరు భార్యాభర్తలు కాట్లాడి విడాకులుచ్చు కోడం కలదంటే, in the ultimate analysis కార్ణం, అనుకోడాలే. పదిఏళ్ళకొకసారి జనక్షయం చేసిపోతోన్న యుద్ధాలవెనకాల, గట్టిగా పరీక్షిస్తే ఉన్న ప్రిబలకారణం అనుకోడాలే.

యింతబాధా యింకా చాలనట్టుగా, గూడంలో మాకు అంతః కలహంకూడాను. మంగలిగూడెంనుంచి ఏనిమిషానికానిమిషం, గూడెం పరిస్థితులు రంగస్థలానిక్ S. O. S. యిస్తోన్నా, వెంటనే సుభద్రను పంపించవలసిందిగా మాకు అర్జనుడుగారిదగ్గరనుంచి తాఖీదు. దాంతో మాతోకూడాయున్న సభ్యులు ఒక్కుమ్మడిగా నామీద లేచారు. యీ సుభద్రార్జనుల పొగరుమోత్తనాలు యిక భరించలేము. నాటకం ఆడుకొనే యోగంలేకుండా, ఆలో లక్ష్మణా అని యీగూడెంలో యీలా హత మారిపోతున్నాం. యిచ్చట పని అయ్యాకకూడా, కూర్చుని సుభద్రతో సరాగాలాడుతోన్నట్టు తన సుభద్రను తనకు పంపేయమని, ధ్వనిస్తోంది వీడి హుకుం. సుభద్ర గెడ్డంకోసం మనమింతమందీచావాలి. వీడొక్కడు వాడికావాలీ. నీకు బాగుందా యీమాట అంటో నన్ను ఘూబట్టారు. వెనక్కి తిరగకుండా థియేటరు దారిపట్టారు. అవును పదిమందిస్నేహితులం పెళ్ళికెళ్ళినపుడు, పదిమందిలోను పెళ్ళికొడుకు ఒకడిని కాగలించుకొని, నీవు వస్తావోరావో అని జడిసాగ్రా. వచ్చావు, ప్రాణంపోసావురా అంటే, మిగతా తొమ్మండుగుర్ని, యిళ్ళకెళ్ళిపోండి, పాపం శ్రమపడివచ్చారు అని పెళ్ళికొడుకు అన్నట్టుగా భావించి ప్రియాణాలు కట్టేవాళ్ళా

ఉంటారు. ఎన్నిరకాలూ లేకపోతే యీ రథగమనం యీలా ఎందు కుంటుంది.

నేను, సుభద్ర గూడెంలో దిగపడిపోయాం. వాళ్ళు వెళ్ళినకాడి నుంచి సుభద్ర నన్ను కోతట్టాడు. ఎంతవాడిని ఎక్కడనుంచి ఎక్కడకు తీసుకొచ్చి all in the name of a barber అవమానం చేస్తోన్నారో you are seeing, I hope అన్నాడు, నా వాంగ్మూలం తీసుకొని మా సమాజం యావన్మందిమీద తెల్లవారేకా తెగేసి కేసుపెట్టేటట్టు. అక్కడ నుంచి మొదలెట్టాడు. 'నాసంగతి యీ గబ్బిలాయల కేంతెలుస్తుంది. యిదంతా ఓ శుద్ధవిలేజి డన్నియాడ్లు, స్పోర్ట్సుక్లబ్బు డ్రామారో జానకుర్చీలో కూర్చోబెట్టి ఏలూరు మున్సిపల్ చైర్మన్ you know him perhaps స్వయంగా చిప్పలో నీళ్ళుపట్టుకొని ప్రక్కనమంచుని, యాక్టర్సు యాక్టింగు విషయంలో నాతో మాటాడుతో గెడ్డం గీకించాడు నాకు. పాపం పదే పదే జ్ఞాపకం వస్తోంటాడు, "poor fellow tahasildar, I forget his name. bad memory, కొవ్వొత్తిస్తాండుపట్టుకొని రెండోప్రక్క నుంచున్నాడు. నుంచోడూ, He invited the Dt. Collector to see me particularly on the stage" అంటో ఉన్న కిటుకల్లా అక్కడ అన్నట్టు కన్నుగీటాడు. కొయ్యాడం చూచాను కాని కోతల్లో యింత చౌర్జన్యం, యింత దుర్వినయం నేను చూడలేదు. అగడుగా డీలతో సైనా' నా సీను అయింది సైడుకర్టెనులోకి వెడ్డినికదా కాస్తగాలి పోసుకో నిస్తారా. ఎంతమంది' ఎంతమందిElite of the place. అంతా అక్కడే. చుట్టేశారు. కారక్టరు మీదఉండగా ఫోటోతీయించి కాపీలు పుచ్చు కొంటామంటో ఒక ఉపపాదన. అప్పుడే ఆ రెండుఘుళ్ళల్లోనే నా యడ్రస్సులు తీసుకోడాలుకూడాను' పొరుగూళ్ళనుంచి నాటకానికొచ్చిన వాళ్ళు. స్టేజివెనుక నాకోసం అరేంజిమెంట్సుచేసేసిసిద్ధంగా పెట్టేరు. నేను చూడనేలేదు. ఎందుకో పిలుస్తున్నాడు అనుకొన్నాను క్లబ్బుప్రెసిడెంటు. What nice arrangements lots of biscuit and chocolate-Bubling tea, puri, and samia, sweets ఎన్ని varities. ఎన్ని

varities లేక వాళ్ళకేం. మస్తుగా పలికింది మనమూలాన్ని ఎన్నైనా తెస్తారు. Simply staggering-capital stuff. వీళ్ళబ్రతుకు వీళ్ళందం చూచా యిందాకా వస్తోనే వ్హా, యీ ఆకుల చాపమీద పెట్టారు వన్ బుట్టా అండ్ వన్ బింద. హారిబుల్! విడోస్ మెనపరొట్టి, కెనాల్ ఫ్రిష్ వాటరూ ఆపైన ఎరగరుగా కంట్రీ ఫోక్స్ వతిరస్టిక్స్. వీళ్ళా మాట్లాడొస్తారు. అందుకు నాకుమంట. I wonder వీళ్ళకోసం నేను కోటా వేస్తున్నాననుకొంటోన్నారేమో shame. I made a promise to my better half to appear on the stage at her father's place- repeated requests. A sacred pact all. Tell them, I must keep it" అంటో అలాపోతున్నాడు ఒక్కవరసని all on the high· ropes. యిక భరించలేకపోయా. వాడి ఒకొక్క మాట ఓ గరిటెడు ఆద్యం పోస్తోన్నట్టుంది అగ్నిహోత్రంమీద 'అయ్యా అయ్యా మీమాటలు విన్నకొద్దీ దుఃఖం పట్టలేకుండా ఉన్నా. మీ పాత రోజాలు, ఓనాటి మీ ఉచ్ఛదశ, నిజమేకానీండి, కాకపోనీండి, నన్ను ఒంటిగాడినిచేసి మీరాలా తలపోసుకొని, ఒక్కవరసని ఏడిస్తే ఏంలాభమండి. కాస్త ధైర్యం తెచ్చుకోండి. ఎంతెంతవాళ్ళకైనా కష్టపురోజులొస్తాయి. వస్తేమాత్రం బారుమని చంపైనా? మీయిష్టంవచ్చినట్టు. పాపం మంగలాడిచేతిని చెంపకాయతిని యిఖ ప్రిజలమొఖం చూడలేదు. నిజమే. అది ఏడిస్తే పోయేదెబ్బకనకనా, చస్తే పోవాలేమోకాని మరచిపోండి. మిమ్మన్ని కాదనుకోండి. ఎవడో ఎందుకు పనికిరాని శుద్ధ దరిద్రుడు తిన్నాడనుకోండి. కాస్త నిల్దొక్కండి యీపాటికి. ముందుపని చూసుకోండి. మీకు, మీకోసం నాఖర్మంకొద్దీ నాకు ప్రస్తుతం ప్రాణావసరంగా కావల్సింది ఒక్కమంగలి. తమ రీగూడాని కెందుకొచ్చారో. సెమరేసుకొని, మంగల్ని వెతుక్కోండి. యథాశక్తి నా శక్తివంచన లేకుండా నేను పడి వెతుకుతా. ఇప్పుడు రాత్రి 11-30 దాటిం . క్షమించాలి' అన్నా తెలసే అన్నానో తెలియకే అన్నానో వంటిమంటలో. మళ్ళా థియేటరుకు వెళ్ళేదాకా కోతలు లేవు. క లు కట్టిపెట్టాడు.

మళ్ళా గెడ్డంకోతకు బయల్దేరాం ముందాద్రపి వెనకాల నేనున్నా.

♦ ♦ ♦

## గజకచ్ఛపాలు; లక్ష్మ్మడు, మా దేవుడు.

ఆ వెంకటేసు యింటిదగ్గర చేరిన మాకలో అక్కడ, కాశీమజిలీ క్లిష్ట సమయాల్లో రాజకుమారుడికి మంత్రికుమారుడికి, అవసరమైన ఆచోకీలు కావల్సిన భోగట్టాలు యియ్యడానికి ఊరు చివర పూరింటిలో మెలుస్తోంటుండే అచ్చు అలాంటి పేదరాసి పెద్దమ్మ కన్పించింది. మాకీయిక్కట్టు దాటే తరుణోపాయం చెప్పమని రెండు కాళ్ళు పట్టుకున్నామంటే అతిశయోక్తి కాదు. వసుదేవుడికి తప్పింది కనకనా, అతడి కూతురేగా యీసుభద్ర. "నాయన్లూ మంగళ్ళకు నాల్గురాళ్ళు యిళ్ళకు తెచ్చుకొసే పెళ్ళిళ్ళరోజులు. మీకు దొరకరు. యీప్రక్క వీధిని లక్ష్మ్మడు వాడి తమ్ముడూ. మొన్న నే బరంపురంనుంచి వచ్చాడు పదేళ్ళకి మొన్న మాదేవుడు. లక్ష్మ్మడింటి ప్రక్క పాడడ్డ యిల్లువాడిదే, వాళ్ళిద్దరేయున్నారు యిళ్ళదగ్గర గూడేని కంతకీ, అదుగో కంశాలు వినిపిస్తోన్నాయి, రాండి వాళ్ళకు వప్పగిస్తాను, మీపనిఅవుతుం"దని తీసికెళ్ళింది. లోపలికెళ్ళి, చెప్పి, దొడ్డిదారిని యింటికి పోయిందికాబోలు. లక్ష్మ్మడుకొడుకు గుంటడోడు, నిండా తొమ్మిది ఏండ్లుండవు, పీట నీళ్ళు పట్టుకొచ్చాడు. సుభద్ర గెడ్డంమాట ఏలాఉన్నా, పక్కని కూర్చున్న నాబొందుల లాగంతా తడిసిముద్ద అయింది. యీగోళీకాయగాడు యీరాత్రి సుభద్రమీద పనినేర్చుకుంటాడేమోరా దైవమా అని మా కాందోళనగా యుంది. దీనికి సాయం, లక్ష్మ్మడింటి దొడ్డివైపున ఊయాల ఊగినట్టుఏదో కిలవరం, ఓసారి లక్ష్మ్మడు దొడ్డికేసి దగ్గరదగ్గరగా వస్తోంది. ఓసారిదూరదూరంగా ప్రక్కయింటికేసి పోతోంది. యీ యింటి వాళ్ళంతా అగుమ్మంకేసి ఆయింటివాళ్ళంతా యీగుమ్మంకేసి వెడ్తో, వస్తో మధ్యమధ్య ఎదురు సన్నాహాలవుతోన్న అలికిడి. ఓటో రెండో తప్పితే విన్పిస్తోన్నవి అన్ని ఆడక లే, చప్పుడంతా గాజుల చప్పుడే. మాకు పూర్వాపరాలు తెలియవు.

అంతలో పూనినట్టు అరుగుమీదకు వచ్చి పడ్డాడ్డోడు నల్లగా మడ్డి ఓడుతో నూనె సిద్దిలా ఉన్నాడు. ఒంటిమీద చేయవేస్తే జర్రున జారే జిడ్డు. ముచ్చెమటలు పట్టి ఉన్నాడు, కడ్డీలాంటి వజ్ర ఘనఘటిత కఠిన కాయుడు. అంగవస్త్రధారి అద్దైనా విరచికట్టాడు. అప్పుడు అవసరమైతే కుస్తీపట్టేటట్టున్నాడు కాని, పనిచేసి పావలా డబ్బులు పుచ్చుకోవాలన్నట్టు కన్పించడు. వాడే పెద్దమ్మ చెప్పిన మంగలి లక్ష్మణాఖ్యుండు కాబోలు. మేం చేసిన తప్పేలేద గూడానికి వచ్చాక ఎవ్వరిని పల్లెత్తు మాట అనలేదు. మరెందుకో లక్ష్మడి కళ్ళునిప్పులు కక్కుతున్నాయి. నోటంట, ముక్కుంటా, సెగలూ పొగలూ వస్తోన్నాయి. రోజుతూ, వస్తోనే నిర్దాక్షిణ్యంగా కన్నబిడ్డ అనేనా ఆలోచన లేకుండా, కొడుకును సేసావులే అంటో చేతికొద్దీ గెంటేసాడేమో, అడుపులోనే, నిల్దొక్కుకో లేక ఆలేత కూన, నీళ్ళగిన్నె సహితం వచ్చి నాఒళ్ళో పడ్డాడు బ యమంటో. నిర్హేతుక రాక్షస కృత్యం. నిరపరాధి ఆబిడ్డ. తాను చేసిన అత్యాచారమే లేనట్టుగా, అటుతిరిగైనా చూడకుండా, అంత దురుసుగాను, దభీలున సుభద్ర, గడ్డం దొరకబుచ్చుకొని లక్ష్మడు సుభద్ర చెవిపైపు కెత్తాడుకత్తి. పనిచేసే ముందు గడ్డానికి ఎదర వాలు ఎటున్నాయో, ఎక్కడైనా, సుళ్ళు గుండాలు ఉన్నాయో మరేమూలైనా గొప్పులున్నాయో వేలిస్పర్శతో మనసుకు పట్టించుకోడం, క్షురక సాంప్రదాయం. సకారణం కూడాను. ఏనీతినీమాలు పెట్టుకొన్నట్టు తోచదు. అలాంటి గొడవలు మరే మంగలికైనా ఏమో కాని, లక్ష్మడికి కావన్నట్టు, వాడిష్టంవచ్చినట్టు అటు, యిటు, యదర, వాలూ, బరుకు బరుకుమంటో కత్తిహోరెత్తి పోయేలా చెవిదగ్గర నుంచి కంఠంముడికంటా కుడిపార్శ్వం పెచ్చులూడేట్లా చెక్కేసాడు. కత్తి ఆవిసురున పరాక్రమ నృత్యం చేస్తోంటే, ఊ, ఆ అంటేనే కాటేస్తుందేమో, అని ఎక్కడ ఉచ్ఛ్వాస నిశ్వాసాలేనా తీసుకోకుండా, సుభద్ర ప్రాణం లక్ష్మడు చేతిలో పెట్టి, కళ్ళు వప్పగించి కూర్చున్నాం. లక్ష్మడు చేతి సందునుంచి కర్ణం అల్లుడు, యీ చిత్రవధకన్న ఒక్కసారే కత్తి నామెడకేసి చంపెయ్యమన వయ్యా నీకు పుణ్యం ఉంటుంది అన్నట్టు.

నావంక చూస్తే, నాగుండె తరుక్కుపోయింది. పాపం గొప్పలకు పోయాడు కాని, ఎవర్ని ఏం మోసం చేసాడని, ఏలూరి అబ్బాయికీ పాట్లురావాలి. ముందుంది ముసుళ్ళ పండుగ అన్నట్టు శెంకలేసు లెంప కాయ చెంప యింకా దిగబడేఉంది. నిమ్మకాయంత వాపు, దాని వంచుల్ని స్ఫుటంగా పాటకరించి శెంకలేసు వ్రేళ్ళు దీపంవెల్గిన నిగనిగ లాడ్తోన్నాయి. అక్కడ కత్తిపడితే ప్రాణంపోతుంది అది తథ్యం. అచెంప చేయించకుండా వదల్డం ఏలా. మరి నాటకమో. నాటకమా ప్రాణమా అనే జీవిత సమస్య పరిష్కరించరావల్సిరానా, మాఆదాయాన్కి మేం. బ్రతికుంటో ఉంటే నాటకం లేకపోయినా బెంగలేదని, యింక చెయ్య నక్కరలేదు. అపుచెయ్యి అబ్బాయి అని అందామాఅంటే, మధ్యం దిన మార్తాండుడిలా ఉగ్రుడై యున్నాడు లక్ష్మడు. అఉన్మాదావస్థలో వాడు మామాట అపార్థం చేసికొని మమ్మల్ని పొడిచి తాను పొడుచుకోగలడు. యింకా ఏం అఘాయిత్యాలు చూడవలసి ఉందో భగవంతుడా అని కళ్ళు మూసుకొని దాశరధీ శతకంలో నాకొచ్చిన నాల్గు పద్యాలు లోపలచదువు కుంటున్నా. కర్ణం అల్లుడు భయభ్రాంతుడై దీనదశలో ఉన్నాడు.

ఎప్పటినుండో రాజుతో రాజుతోయున్న అగ్ని పర్వతం ఒకటి అమాంతంగా అప్పటి కప్పుడు లక్ష్మడు బుర్రలో బ్రద్దలైయుండాలి. కర్ణం అల్లుడు గెడ్డం చేతిలో ఉండగానే, అతడి కళ్ళల్లో కళ్ళెట్టి ''పట్ను వాసపువోడివని జడుసుకుంటూనంట్రా, బ్రతుకుదామనే సాయింటికాడ కొచ్చావంట్రా, నిన్నిక్కడ నిల్వ్వాసా కోసేసి కాకులకు గెద్దలకు వెయ్యక పోతే నేను లక్ష్మడిని కానోయి'' అంటో, అన్నంత పనిచేసి చూపెట్టే టట్టు, ఆవేశయుతంగా, కత్తి కాలిమీద పెట్టి టపీ టపీ నూరేస్తోన్నాడు. మధ్యమధ్య వ్రేలితో కత్తివాడి చూచుకొని మురిసిపోతున్నాడు. కత్తి వాడీ మెరుస్తోంది, లక్ష్మడు భుజాటోపం పెరుస్తోంది. కత్తినూరినకొద్దీ ఏదో పైశాచిక మనోవృత్తం వాడిలో రూపొందుతోంది కాబోలు. బుర్ర, రామకీర్తన, రక్తం, కోసేరు, మొండెం, మెడ యీలాంటి భయానక శబ్దవ్యాళాల్ని దొంతర్ల దొంతర్లగా దులిపేస్తోన్నాడు కత్తి నూరినంతసేపూ.

ఏమిటీ పిల్లి బ్రహ్మ హత్య ? పిచికమీద చంద్రాయుధమా! ఏలూరి అబ్బా యిమీద యింతపగ పట్టాడెందుకు వీడు! కర్ణం అల్లుడు సెలవులకొచ్చిన ప్పుడు, పట్నవాసపు కుర్రాడు. యీడొచ్చినవాడు కాబట్టి వీళ్ళ గూడెం కేసి వచ్చినట్టే వచ్చి, వీడి వాళ్ళెవరైనా చెర్వుకు నీళ్ళకెడుతోంటే యీలేసాడా? అసలు ఏదైనా ఉందేమో కొంపత్రవ్వి. వచ్చి వచ్చి వీడి చేతులోనే పడ్డాం. ప్రతీమాట కర్ణం అల్లుడికి అతిక్రమాటేనే. పట్న వాసపువోడికని జడుసుకోనంటాడు. అవును కర్ణం అల్లుడు పట్నవాస పువాడు. ఆబాధ మేమూ పడ్డాంగా. పట్నవాసపు వాడినన్నే స్వాతి శయం అతడు మాటాడే ప్రతి అక్షరంలోను ప్రత్యక్షం అవుతోనే యుంటుందిగా.

అయితే లోగడ ఏలూరు అబ్బాయి గూడెంలో స్వర్యామాత్రంగా నేనాచేసిన పాతనేరమేయుంటే దానికి యింత హంగామా, ఓపార్ష్వం పనిచేయడందాకా నేనాలక్ష్మడికి ఏం అవుసరంవచ్చింది. కత్తి విప్పుతోనే పోటో, కాటో, వేటో వేసేస్తే వద్దన్నామా? ఆనేరం ఫక్తు యీలజాతి లఘుసాంప్రదాయమే అయితే, ఒక్క లెంపకాయ చాలకపోయిందా అభాగ్యానికి. వెంకటేసు లాగితీసుకోగా మిగిలిన చెంప వీడు తీసుకొన్నా. ఏనాడో పండంటి రెండుచెంపలు మంగలిగాడేనికి మీదుకట్టామనుకొని చక్కగా వచ్చేతుమే. మాకు లక్ష్మడు చర్య అంతా అనూహ్యంగాను అయోమయంగాను ఉంది. దీర్ఘాలోచనకు వ్యవధిలేదు. కాలాసన్నమైంది. పోనీ యిదే సమయమనుకొని పలాయనంకాడానికి గడ్డంమీదయున్న వాడి చెయ్యి దఖీలున విదలించుకొంటేనో! అమ్మో, గభీలున మాలో ఒకడిని కార్తవీర్యార్జునునిలా చంకలోపెట్టేసి, కిచకిచలాడిస్తాడు. శంకరుడిలా, రెండోవాడ్ని బొటనవ్రేలుక్రింద పెట్టి నల్లినిరాసేసినట్టు రాసేయగలడు, నామరూపాలులేకుండా. ఆమాట అనుకుంటేనే అమ్మ, నాన్న, పాపా యిలు అంతా జ్ఞాపకంవస్తోన్నారు. ఏంచేసినా నేను సుభద్ర ఒక్క సారిగా చేయాలికూడా. ఒక్కడు ముందు తొందరపడితే, దిగడ్డవాడు హాళామల్ అవడం తథ్యం. నేనూ సుభద్రా ఒకరివంక వకరు చూచు

కొంటోన్నాం. కత్తి కర్ణం అల్లుడి కుడిపార్శ్వంకేసి చూస్తోంది. వస్తోంది. పడ్డంతర్వాయి.

యింతలో "ఓరయ్యో! మాదేవుడు దడిపీకేసి అమ్మను జుట్టుపట్టుకు పడగొట్టి యీడ్చుకుపోతున్నాడురోయి. రారోయి అయ్యా" అంటో లక్ష్మడు కూతురు కాబోలు దొడ్డిగుమ్మంలోనుంచి, వీధి అరుగుకేసి ఒక్కటే కేకేసి, ముఖం చూపెట్టిందో లేదో స్టేషన్లో అగని రైలు కూసు కుంటో దూరానికి పరుగున పోతోన్నట్టుగా, మాతృదేవతా సంరక్షణార్థం రివ్వున శరవేగంతో ఎగిరిపోయింది. శబ్దభేది అస్త్రలక్షణ మాహాత్మ్యమనంతో లక్ష్మడు, కేకదారినే, చీరేస్తా, పాతేస్తా, పొడిచేస్తా అంటో సింహగర్జనచేస్తో, దార్లో యిద్దరు ముసిలమ్మలను ముగ్గురు పడుచమ్మలను పడగొట్టుకొని రెండే పట్టిలతో యుద్ధరంగంలో పడ్డాడు. కులకాంతాపహారణవార్త విన్నప్పటి లక్ష్మడి భయానకస్వరూపం, మరుపురాదు. యుగాంత కాలానలుడై వెడ్తోనే యిల్లాలిని చెఱవిడిపించి, మాదేవుడితో దడిదగ్గర తలపడియుండాలి. అదే 'హుంకారాలు, అదల్పులు, రంకెలు, ధిక్కరణాలు' వినిపిస్తోన్నాయి. పోరు ఘోరం అవుతోండాలి, హోరు మాంచి పోటుమీద ఉంది. భీమజరాసంధుల మల్లయుద్ధం ఏనాటిమాటో. ఘటోత్కచ అలంబాసుల మల్లయుద్ధం ఎంతవరకు నిజమోకాని, యీ సోదర్లిరువురు, ఎక్కడా ఎక్కువ తక్కువలు లేకుండా, 'ఒండొరులం బట్టియు, గిట్టియు, నడచియుం, బొడిచియుం, దాచియు, దోచియు, సింహగజేంద్రాల్లా, వజ్రపర్వతాల్లా' బాహాగర్వోద్ధండత కలపడ్డ ఆ దృశ్యం, 'అన్యోన్య దుర్దమదోర్దండ పటుప్రహారజనితధ్వానంబు బ్రహ్మాండంబునిండన్' అన్నట్టు వినబడ్డ ఆశబ్దం, మా నాటక కారణంగా మాకు మంగలిగూడెంలో లభించాయి.

సుభద్రకు కుడిపార్శ్వం దిగడిపోతే పోయింది కాని, ముఖ్యంగా మాకు చిక్కువిడింది. కర్ణం అల్లుడు, లక్ష్మడు చేతిలోఉన్నపుడు అరుగుమీద చూపిన అగ్రహార్భాటాలు, చేసిన ప్రతినలు, అన్నీ మాదేవుణ్ణి ఉద్దేశించే అనిన్నీ, మేమప్పుడు నిమిత్తమాత్రంగా ధరిలో ఉన్నవాళ్ళం.

మట్టుకే కాని, మరోటి కాదనిన్నీ స్పష్టమయింది. వారి వైరకారణమేదో మూగిన జనంవల్ల తెల్సింది. లక్ష్మడు, మాదేవుడు ఏకోదరులు. ఉభయులు వాలిసుగ్రీవుల్లాంటి, వ్యాయామకర్కశ స్థిరకాయులు. పది సం॥రాల క్రితం అన్న లక్ష్మడు తమ్ముడు మాదేవుణ్ణి మోసంచేసి, పైత్రికమైన ధనం కాజేస్తే, మాదేవుడు ఉదరపోషణార్థం బరంపురంవెళ్ళి ధనసేకరణ చేసుకొని మూడురోజులక్రితంవచ్చాడు. యీలోపల లక్ష్మడు మాదేవుడి గుమ్మందాకా దురాక్రమణచేసి, సరిహద్దు దడిని వాడి గుమ్మంమీదే కట్టేసి కాలుమీద కాలేసుకు కూర్చున్నాడు, వీడు రాబోయేదాకా అని. కాబట్టి అర్థనిమిత్తమై అంటే రొక్కం 112 రూపాయిలకు పూర్వవైరం; ప్రస్తుత అన్యాయాక్రమణ, అంతా పోగుచేసి స్థలం 3 గజాలు; వీటి కార్ణంగా గత మూడురోజులనుంచి దివారాత్రిలు గూడెంలో నిద్రలు లేకుండా మాదేవలక్ష్మలు గజకచ్ఛపమై ఖరిని పెనగి పోరుతున్నారు. ఈ రాత్రి గడవదనుకొంటోన్నట్టే, వాళ్ళ తగాయిదా టైపాయిడ్డు క్రైసిస్సు మా నాటకంరాత్రి వచ్చింది. మా నాటక ముహూర్తబలమే యిదంతా. యింకా ఎక్కడెక్కడ ఏంఉత్పాతాలు పుట్టాయో యీ ముహూర్తానికి.

యింతలో ఆపాదమస్తకం రక్తసిక్తంగా లక్ష్మడు, అతడి కాల్లో కాలేసుకుంటో జుట్టు విరియబోసుకొని నీళ్ళబిందెతో అతడి అర్థాంగి, ఆ వెంటన్ వారిఏకైకపుత్రిక ఎంతోవిలాసంగా, వయ్యారంగావిజయగర్వంతో లోపలనుంచి అరుగుమీదకు వచ్చారు. లక్ష్మడి గృహిణి నీళ్ళబిందె దింపి యుద్ధభూమినుంచి విజయలక్ష్మీ సమేతుడైవచ్చిన భర్తపక్కను ప్రముదిత హృదయయై నుంచుంటే వేణీసంహార పంచమాంక ప్రదర్శనం కాబోతుందేమో అనుకున్నా. దుష్టుడు దుశ్శాసన ప్రతిమానుడు మాదేవుడు పట్టి పడగొట్టిన దాది ముడవక మలినమై విరియబోసిఉన్న తన ద్రౌపది కురులను తన రక్తసిక్తపు హస్తంతో లక్ష్మడు ముడివేసే సన్నివేశం చూస్తామేమో అనుకున్నా. మెళ్ళో ప్రేవులు తర్వాయిగా భీమరూపంలోయున్నాడు లక్ష్మడు. లక్ష్మడు శుభ్రంగా స్నానంచేసి చల్లబడ్డాడు. కళ్ళల్లోకి మానవత్వం వచ్చింది. మాటల్లోకి మార్దవంవచ్చింది.

సశేషం ఏలూరిగెడ్డం పొందిగ్గా చేస్తోంటే మాకు ధైర్యంవచ్చింది. పనిలో పని నన్ను వేధించిన అనుమానం నివృత్తి చేసుకొన్నా. నీ వంటినిండా పడ్డ రక్తపు పెల్లుచూచి నీబుర్ర పగిలిందో అనుకున్నాగాని తల శుభ్రంగానే ఉందే. మరి శత్రురక్తం చిమ్మిందా అని అడిగా. "అమ్మ నాబుర్రమీద దెబ్బ పడడమే? యిక మాదేవుడి బ్రతుక్కి అడికి కత్తిపోటుదాకా ఎందుకు. రక్తం కాదు. బురంపురం సావాసాలుమరిగి, కారామసాలా అంట అది అలోటుచేసాడు మాదేవుడు. గుండెల్లో గుప్పెటతో మొడిచే సరికల్లా బోక్కురమన్నాడు నావళ్ళంతా పడింది. అందుకే వస్తోనే నీలోసుకున్నా"నన్నాడు లక్ష్మడు. అబ్బ ఎంతభారతం. ఏలా కారాము సాలాంతం అయిందిరా భగవాన్ అనుకొన్నా.

## గొల్ల రాధమ్మ

మంగలిగూడెంనుంచి థియేటరుకొచ్చే దార్లోనే గొల్లభామరాధమ్మ దుకాణం. మాకు రాధమ్మ పెత్తల్లి పింతల్లిలాంటి సన్నిహితం. చదువు చెప్పే బోర్డు హైస్కూలు మాకు పెత్తల్లిఅయితే, బడికెళ్ళేటప్పుడు బటాణీలుపెట్టే రాధమ్మ మాకు పింతల్లి. రాధమ్మకొట్టు పంచపాళీకి వరాబడి కన్పిస్తోంటుంది. రాధమ్మ పంచపాళీలో కూర్చుంటే బడిగంట చెవులో కొడ్తోన్నట్టే ఉంటుంది. 15 నిమిషాలో అరగంటో ముందుగా బడికొచ్చిన కుర్రాళ్ళకదోమజిలీ. ఆపెదగ్గర పిప్పరమెంట్లు, బిస్కట్లు, బటాణీలు, నిమ్మతొనలు వగైరా కొనుక్కునేవాళ్ళం. రాధమ్మ బటాణీఫరంతు మాడుశంతుల కష్టమర్లం మాస్కూలు విద్యార్థులమే. పైవాళ్ళతో పోటీ వస్తే అకొట్టుదగ్గర మామాటే చెల్లేది. మాకన్నా ముందుచాచిన చెయ్యి అయినా నవ్వులో వెనకపెట్టి, ముందు మాకిచ్చిపంపించేది. వయస్సువచ్చిన వక్రబుద్ధి ఒకడెవడో, వీళ్ళేక్కువ ఏమిటి అన్నట్టు మావంక చూస్తో ముందు నాకియ్యమని సామంతంచేస్తే మాబాగా వాడికి వాతపెట్టింది.

వెళ్ళాం కొడ్తుందేమిటయ్యా నిన్ను అంది అతడిని. రాధమ్మ మాటకాతడు తెల్లపోయాడు. ఎందుకందో తెలియకపోయినా మేం ఫక్కున నవ్వాం. అంతలో అననేఅంది. బడిపిల్లలువాళ్ళు ఆలస్యంగా క్లాసులోకి వెడితే పాపం దెబ్బలుతింటారు, అని జాలిగాముఖంపెట్టి చెప్పింది. బడిబుడతలు పలకరిస్తే కలకలలాడుతో పలికే పదును ఆపె మనస్తత్వం. కదిపితే కంది రీగకాదు ప్రక్కకొట్టు పల్లాలమ్మలా. రాధమ్మ మమకారం మా యింటోడి డబ్బుకోసం తెచ్చిపెట్టుకొన్నది కాదు. అంతఃకరణయా కల్గిన ఆప్యాయత. అంచేతనేరేమో మా విద్యావిషయం పట్టించుకొనేది. బడిగంటలో క్లాసు వదలి పైపైన తచ్చాడనిచ్చేదికాదు.

పాపం, రాధమ్మ గుడ్లెట్టనిపెట్ట. మాకా పంచపాళీలో ఎప్పుడూ పుంజూ కన్పించలేదు, రాధమ్మనొసట పావలాకాసంత కుంకుమబొట్టు కన్పించినా. అసలు ఏదైనా ఓపుంజూఅంటో ఉందా, ఉంటే రాత్రిళ్ళు వచ్చి, కోడికూతవేళ ఎగిరిపోతోందా? 27, 28 సం॥ రా చ్చినా అవివాహితగానే ఉండిపోయిన ఓల్డు మైడ్ అయియుండాలి; కాకపోతే, దేశాంతరగతుడైన భర్తరాకకు ఎదురుచూస్తోన్న పెనొలాపీ అయియుండాలి; అగ్నిసాక్షిగా వివాహమాడిన చపలుడెవడో నన్ను సాక్ష్యాలేమి చేస్తాయని, మరోనేస్తం పట్టియుండాలి. కాక స్పర్శ నాలింగన సంభాషణాది సంసారసుఖాన్ని రుచిచూడకుండానే లేతవయసునాడే భర్తకు పరలోకప్రాప్తిఘటించిన విగతభర్తృక అయినకార్ణంగా, వైధవ్యం వినికిలే కాని, అనుభవైక వేద్యం కానందున, పసుపుకుంకాలను, మాంగళ్యాన్ని వర్జించకుండా, కన్యాత్వాన్ని కాపాడుకొంటోయున్న సుశీలఅయియుండాలి. ఏదెట్లాయున్నా రాధమ్మకు విషయోపభోగాపేక్ష ఏమాలా ఉన్నట్టు కన్పించదు. మానవజీవితం సాగరంఅనీ, అందులో జవ్వనం పెద్దతుపాననీ, అతుపాన్ని తట్టుకోడానికి టిమనిషికి సాధ్యంగాక హరహరా అని కొట్టుకుపోవచ్చనీ, చెప్పేపాస్తకాలమాటలు రాగమ్మపట్ల సత్యదూరంగా కన్పిస్తాయి. హృదయం కామసంకల్పాది స్థానమనే సూక్తికి రాధమ్మకేసులో యాదార్థ్యత కన్పించదు. ఓల్డు మైడ్ కి ఉండే

జలసీకాని, పెనలోపీలాంటిది చేసేపాతివ్రత్య ప్రదర్శనంకాని, పచ్చని పిల్లలనుచూచి కళ్ళొద్దుకొనే పూర్వసువాసినుల ఉక్రోషంకాని, భర్తృవియోగదుఃఖంలో దురపిల్లుతున్నానని భర్తనీ, బ్రహ్మనీ, సృష్టినీ దులిపేశే కాఠిన్యంకాని రాధమ్మ యింటా వంటా లేవు. విద్యనభ్యసిస్తోన్న బాల బాలికలంటే ప్రాణంయిచ్చేది. వారి ఆనందమే తన ఆనందంగా భావించే విశాలహృదయ. బిడ్డలులేనిదైనా మాతృత్వంలోఉండే మహనీయత్వమామెలో మూర్తీభవించింది.

రోజురోజూ మేం రాధమ్మగడపతొక్కుతోన్నా ఆమె మగఆసరావిషయం శోగట్టానేచేయలేదంటే, ఆనాటి హైస్కూలువిద్యార్థులు ఎంతఅమాయికంగా ఉండేవారో గ్రహించవచ్చు. ఈరోజులేఅయితే ఒక్కొక్కడు రొమ్ములమీద చెయ్యివేసి నీకొచ్చినభయంలేదని నచ్చచెప్పి నమ్మిస్తాడు. పుంజులేని లోపంలేదని ధైర్యంచెప్తాడు. పుంజంటూనే ఉంటే దాన్నిపట్టుకొని కాళ్ళు విరగ్గానావేస్తాడు. అసలు ఏమిటో తేల్చుకోవలసిన అవసరంపడ్తుంది. తెల్సుకొనేదాకా కాలుకాలినపిల్లి అయిపోతాడు. శ్రావణ మంగళవారాల్లోను, బొమ్మలనోముల్లోను మధ్యన విద్యార్థులు చేసేదేముందని వాళ్ళకు వంటికి పులకరం తగుల్తోంది యిప్పుడు. విన్నాంగా యీమధ్య ఏబడిలోనో శ్రావణమంగళవారాలకు సెలవీయలేదని హైస్కూలువిద్యార్థులు Strike చేసారని, "హెడ్మాష్టర్ల నిరంకుశత్వం నశించాలి. శ్రావణమంగళవారాలు వర్ధిల్లాలి" అంటో నినాదాలు చేసికొంటో వీధులంట గోడగోడకు పోస్టర్లు అంటిస్తో ఊరేగి వనితాలోకం పట్ల ఆధునికవిద్యార్థులకు బలిసిన ప్రేమాతిశయాలకు రుజువిచ్చారట. యీసదుద్యమానికి అంకితమై నిరంతర సేవానిరతితో ప్రచారం సాగిస్తోండగానే, తదుద్యమమధ్యలో అభివృద్ధినిరోధక విద్యాధికారవర్గం పబ్లిక్ పరీక్షలుపెట్టి పీడించనైయున్నారని; "వాచర్లు నశించాలి, Question paper leakage వర్ధిల్లాలి" అని ఊరేగవల్సివచ్చిందట. ప్రభుత్వం వాచర్లనే చివాట్లుపెట్టారా?

## సుభద్ర చీరెసింగారం, విగ్గు వెలుగు.

కర్ణంఅల్లుడికి చీరెసింగారంకూడా పైనేశావాలి. థియేటరులో తజ్ఞులులేరు. మేకప్పుక్రమానికి రంగువేసుకుండా ముందేచీరకట్టడం భిన్నంఅయినా, అంతా ఆరాత్రి తొడతొక్కిడి అయినకార్ణంగా, డ్రాగ్లోనే మారాధమ్మచేత చీరకట్టించి రంగస్థలానికి తీసుకుపోవాలని ఆలోచించి ఆపెతలుపు కొట్టాను. మెలుకువగానే ఉంది. మొల్లరామాయణం, అక్షరా లేరుకుంటూ చదువుతోంది. ఏకాండో మాహాత్మ్యభాగం. మాకృష్ణు దక్కడ నాటకంతొందర్ని రెండురోజులక్రితం బడినుంచితస్తే మరచిపోయితచ్చాట్ట. వేలుపందుగాఉన్న ఆపుస్తకంతోనే తల్పుతీసింది. కర్ణంఅల్లుడితో ఒక్కపని సవ్యంగాను సాంతంగాను జరుగుతుందా. జరగనిస్తాడా, నేనన్నానని అనుకోకండి వీడిని నరికేసినా దోషంలేదు. లక్ష్మ్ముడు పనిలోపని ఆకాస్తా చేసేస్తే మాకు శనేవిరగడైపోను. ఎక్కడకు తీసికెళ్ళండి, పీకిమీదకు తెచ్చే ఔధవగుణంవుంది వీడికి అసల్లో. క్రింద పెడ్తే పంటలుండవు, పైనపెడ్తే వర్షాలుండవు అంటారే ఫక్తు ఆలాంటి వాడు. అనుకోనేదేమిటి మాఖర్మంకొద్దీ మాకు దాపరించాడు. మాకు రాధమ్మలో రెండోఫారంనుంచీ చనువు. కడుపునపుట్టిన పిల్లలకన్న ఎక్కువగా చూచుకొంటోంది మమ్మన్ని. ఆమెకు మనసునొప్పిస్తాడా, రెండు మూడునిమిషాలు కళ్ళుమూసుకుంటే పోయేదానికి. వాడెక్కడ కళ్ళు మూస్తాడండీ. వీళ్లైతే రాధమ్మకళ్ళు మూశామని వాడుచూస్తోంటేను. ఆవేశించినవాడిలా ఆమెవంక చూస్తోన్నాడు. నఖశిఖ పరీక్ష. చాటుచూపులు, కొంటెచూపులూ, అన్ని వంకరవలపులూ ఆరెండునిమిషాల్లోనే నటించాడు అంతనాటకమున్నా. అసలు ఆ షీబ్రీజా తగిలాటప్పటికే కళ్ళు పట్టొదిలిపోయింది కాబోలు పీనుక్కి. శరీరోష్ణస్థితిలో మార్పొచ్చినట్టున్నాడు. 'మరేరియారసికుడిలా, నిట్టనిలువున నీరసించిపోయాడు.' కళ్ళుతేలేసి వాడు బ్యూటీ అంటే, అప్పటికి నాకందిన లోకానుభవాన్ని పట్టి, వ్యాకర్ణ వాసన్ని పట్టి, బ్యూటీ Abstract noun గానే అర్థంచేసుకొని

ఆ పంచపాళీలో పతంబొమ్మలోనో, తీర్థంబొమ్మలోనో ఎంతో అందం ఉంది కామాలుననుకొని, రాధమ్మని వదలిపెట్టి పంచపాళీఅంతా కలియ చూచా. రాధమ్మలాంటి Proper noun ని బ్యూటీ అంటారు అని తెలియదు. అందకత్తెలను బ్యూటిఫుల్ గరల్ అనాలనే అభిప్రాయం. యీశు అక్కడనుంచి బీదచూపులు చూడ్డం మొదలెట్టాడు, ఏదో దాహం అవుతోన్న ముఖం పెట్టాడు పెదెమలు తడుపుకుంటోన్నాడు. మంచినీళ్ళు అవుతున్నాయా అన్నాను. అబ్బే అన్నాడు. మంచినీళ్ళకు తగ్గే దాహం కానట్టు. కర్ణంఅల్లుడిది యింతకందూతితత్వం అని ముందే తెలిస్తే కవచం తొడిగినట్టుగా దుప్పటీకప్పుకొనిమరీ చీరెకట్టడం ప్రారంభించును రాధమ్మ. ఏమైతేం ముందు మాకు తెలియదు. కలలోను యీలాంటికల్మ షాలు ఎరుగని పారతికర్పూరపుబిళ్ళ మారాధమ్మ. వీడిగుణం మొదట్లోనే పసికట్టలేకపోయింది. అబ్బే అసలు వీధితలుపుతీసేసరికే, కథల్లో చెప్తారే చుట్టుపట్ట మైలుదూరంలో మనిషిఉన్నా రాక్షసులు ఎక్కడో నరవా సన వేస్తోందని గ్రహిస్తారని, ఆలా కర్ణంఅల్లుడి ముక్కులు పొంగడం ప్రారంభించాయి. పంచాపాళీ, పక్కను పొందిగ్గాగది, పరాయిమనిషి లేకపోవడం ఊఫ్ అంటే ఆరిపోయే బుడ్డిదీపం, కనుకొలకుల్లోనుంచి లాగే కాడో, ఓచ్చేకాడో. యింతకన్నా వాడికి ఏంకావాలి ఉసులు. ఓపని మీద మేంఉంటే మరోపనితొందరను వాడున్నట్టు కన్పించాడు చూస్తోంటే. వీడు బుర్రలో యింతఅంతకాన్నాటకం ఆడుకొంటోన్నాడని రాధమ్మ ఎరగదుపాపం. నిజానికి వాడిలో రోగం అప్పుడే ప్రకోపిస్తోంది. మధ్యమధ్య శుద్ధఅనవసరపు అకాలపు నిట్టూర్పులుకూడా విడుస్తున్నాడు.

గదిగుమ్మానికి ముఖమెదురుగా కర్ణం అల్లుడిని కుంచోపెట్టింది, చీరమడత విప్పింది, యీ పంచపాళీలోనే ఆ ఒక్క బుడ్డిదీపం ఉంటు. గదిలో చీకటి. చీరె కట్టడం ప్రారంభించేముందు పైటకొంగు వీపుమీదను మీపాదవ్వున జారితే బాగుంటుందో అని రాధమ్మ అకొంగు కర్ణం అల్లుడు భుజంపైనుంచి వీపుమీదకు వేస్తూ అంచనా చూస్తోంటే, మరేదో అంత కన్నా తొందరగా ధ్యాపకొచ్చింది తనకూ ఒకటి తోచినట్టు కర్ణంఅల్లుడు

గుణం ఎక్కడికి పోతుందండీ, తేలూతేలూ నన్నుకుట్టకే మమ్మా అంటే తేలు మానిందా, పామూపామూ నన్నుకరవకేమమ్మా పాలోస్తాను అంటే పాం మానిందా ఎప్పుడైనా ఎక్కడైనా దానిపని అది చేసితీరిందికాని. అబ్బే అందాకా ఎందుకంటో తన్ని కానట్టుగా రాధమ్మ చేయివెంటనే చేయి పోనిస్తాడా యిటుతిరిగిఉండి వెనక్కి. ఆడమనిషితోపని కొస్త చూచుకు చేయిచాపవద్దూ? రాధమ్మ తేలుకుట్టినట్టుగా ప్రక్కకురికి చీర వదిలేసింది. చీర నేలమీద పడింది. వాడు మీటత్రొక్కిన స్ప్రింగులా దభీలున చీకటిగదిలోకి ఉఱికాడు. గదిలోనుంచి యివతలకు రాడు. రామంటే నాపంచి గదిలోకి గిరాటేయి వస్తానంటాడు. చెప్పడు. నీపంచి యిక్కడ లేదంటాను నేను. వాగ్వాదం అక్కరలేకుండా రాధమ్మ దాని కడుపుచల్లగా నేలమీదచీరె తీస్తే దానిక్రింద ఉంది. అది గదిలోకి పారెయ్యి అని ప్రక్కకు తప్పుకొంది. కాకపోయినా ఏంమనిషి యీ వచ్చిన అబ్బాయి అంటో. వెలపలఉన్న ఆడపిల్లకు గిరాటేసినట్టుగా వాడి పంచెతీసి గదిగుమ్మంలోకి పారేసా, యిక రా బాబూ చంపక అంటో. మునిమునినవ్వులు నవ్వుకొంటో యింతవిద్దెం తానుగాగా చేసినట్టు యివతల కొచ్చాడు. కాని సిగ్గుపడిపోయాడు. దానితో వాడికి ఉడుకూ తగ్గింది. మాకు ఉపద్రవం తప్పింది. యీదభా చీరె పిల్లిలా కట్టించుకొన్నాడు. పరాభవం అయిందిగామరి. కాని రాధమ్మ మనసు విరిచేసాడు. వాడి శీలాన్ని సాంప్రదాయాన్ని పూర్తిగా శంకించింది. కర్ణంఅల్లుడివంక కళ్ళు నిలపకుండా కసాబిసా చీరె కట్టేసింది. యింకా నేనేదో లోపంఅన్నట్టు ఆపెవంక చూస్తోంటే అహజన్మఎత్తి ఆపని నాచేత్తో నేచేయలేను పొండి అంది. నాల్గు గుడ్డపీలికలు లుంగచుట్టడం అంత అఘాయిత్యాల లిస్టులో చేర్చక్కరలేదు నిజాన్కి. కర్ణంఅల్లుడంటే ఎంతఅసహ్యపడిందో యింకా వెళ్ళరేం అన్నట్టు గొణ్ణెంమీద చేయవేసుకు నుంచుంది.

అప్పుడు గడపదాటి సుభద్రకు ముసుగేసి ఒంటెద్దు బండిలో కూర్చొబెట్టి సందులంట నాటకపు పాకకు చేర్చాను. కాని దారి అంతటా బండివంక చూసినపుడల్లా ఒళ్ళు భగ్గుమనేది. ఎంతోమమకారంగా

బుజ్జగించే రాధమ్మ మనసుకు కష్టంతోచిందంటే, మాకది చాలా ఖేదకారణం. కృష్ణుడికి కోపం రాగలదు బడి సరదాకే సన్నగిలి పోతుంది. నాకు యిష్టులైన వాళ్ళందరకు నామీద వీడిమూలాన కష్టంతోచనా? వీడొక్కడు Sindibad the Sailor లోలా నన్నొక్కొక్కనా నాకేదో అప్పుడైనట్టు, వీడి అవుసరం నాకేదో ఉన్నట్టునూ, అని ఆవేదన బయల్దేరేది బండి వంకచూచి నప్పుడల్లా. బండికుముపుతోంది అంటో చీదరపడ్డం సౌదభ్యం మాడాను బాడిలోనుంచి, ఇంకా నేను వాడిని అక్షరాలా మెయ్యడం దిగడిపోయిందన్నట్టు. పగవాడికైనా నాటకాలొద్దురా అని అనిపించనా వీడొక్కడి మూలానా.

కర్ణం అల్లునికి లక్ష్మడిటో క్షవరం, రాధమ్మ యింట్లో సింగారం అయాయి. యిక రంగస్థలంలో రంగు రసాభాసం, విగ్గు తెలుగుకావాలి. దాసరి నూకాలికి కర్ణంగారిద్వారా విగ్గుకు మధ్యాహ్నం కబురుచేస్తే విగ్గు పొట్లంకట్టి పంపించాడు. అది పదును చేయాలని మాకు తెలియదు. పగలల్లా సుభద్ర మాకు చిక్కకపోయిన కార్ణంగా, విగ్గుబాగు అజకురాలేదు. దాసరి పంపించిన పొట్లం పొట్లంలానే ఉండిపోయింది. విగ్గువేళకు పొట్లం విప్పిలింకదా, దానికి వెనకపార్శ్వం లోపించింది. చుంచు కొట్టేసుకుపోయింది, దాని తలకాయ కెందుక్క కావల్సివచ్చిందో విగ్గు. ముందుపార్శ్వం ఉప్పరతల కంపలా చూస్తే అన్నహితవు తప్పుతోంది. అది వినియోగం చేయాలంటే మూడే గత్యంతరాలు. కంప ముఖంమీదకు గాని మెడలమీదకుగాని జారిపోకుండానున్ను, వెనకపార్శ్వం ప్రేక్షక జనానికి కన్పించకుండానున్ను చేయాలంటే తలకు నాల్గుప్రక్కలా కమ్మేటట్టు, వాసిన చుట్టినట్టు, గట్టిగా ముసుగేసి చెవుల వెనకనుంచి పైటకొంగుని బిగిగా పోనియ్యాలి. కాని అర్జనుడు ఎదురుగుండా కన్పిస్తోంటే, ప్రేక్షకుల కీముసుగు అర్థంకాదు. ప్రేక్షకులకు అర్థంకాని నాటకం ఆడిన ప్రయోజనమూలేదు. మా ఉద్దేశ్యంకాదు. రెండో ఆల్టర్నేటీవు. నటుడు అష్టావధానాది సామర్థ్యాలు కల్గిన ధీశాలి అయియుండాలి. ఒకచేయి విగ్గుకు, ఒకచేయి పయిటకు మీదుకట్టి, హావభావ

ప్రకటన యీవత్తు భక్త కళ్ళ రెప్పలు దులపడం, మొఖాన్కి మడతలు వేయడం, ముక్కు పొంగించడం, తెప్పటచేయడం, అవసరంకొద్దీ తగు మాత్రంగా ఔచిత్యం చెడకుండా పళ్ళు యికిలించడం, యిత్యాది ఆంగిక సామురీత్యా చేయగల్గిన ఏకాగ్రచిత్తుడైయుండాలి. ఒకచో అర్జునుడు చనువుపెంపున సుభద్రను చేరదీసుకొని లాలనచేసినా, సుభద్ర ఎంత మాత్రం తెల్లిపడకూడదు. చోటియ్యకూడదు. భర్తేఅయినా ప్రాణమే అయినా, దైవమేఅయినా, తనకు విగ్గే అన్న విషయం మరవరాదు. యాక్రొబాటిక్ ఫీట్సు చేయగల్గిన నేర్పరైయుండాలి. సముద్రం పీకలా వెనక్కి వెనక కాళ్ళమీద, దీపంవెల్తురున కాగితంమీదపడి ప్రక్కనడక సే కాగితం చివరకు జరిగే క్రిమిజాతిలా, వంగకుండా, వంకర తిరక్కుండా సైడ్కర్టెన్ లోకి చక్రునచేరే గమనచాతుర్యం కల్గియుండాలి. సవరాల తోరణం ఒకటి కట్టి, ఆతోరణం కొసలు చెవులకు ముడివేయడం ఆపద్ధర్మమే. యిన్నిచేసినా మానవుడికి మరపు సహజంకాబట్టి సమాజం కూడా విగ్గును, పైటచెంగును ఓకంటితో కాపాడుకొంటూ, అప్రమత్తులై యుండాలి. కడ్డీలంటి వాళ్ళకిద్దరికి చెడ్డీలుతొడిగి, కర్రలు చేతిలోపెట్టి సైడుకర్టెనులో, అటు యిటూ, స్త్రీ వేషధారికి ఎడాపెడా నిలేయడం, సమాజానికి కనీస కర్తవ్యం.

♦ ♦ ♦

## శంకరునికి ఫాలనేత్ర ప్రాప్తి.

ఏలాగో సర్దుకుపోదాం అని ఎంత ఓర్పుపట్టినా మన తరంటండీ కార్యనిర్వహణ, విధి ప్రాతికూల్యమైనపుడు. పులిమీద పుట్ర మరో ఉత్పాతం పుట్టింది. మా శంకరుడు అఖరిసీనులో రాదగ్గవాడైనా, అందరి కన్న ముందు తయారై, తెరలోపల త్రిశూలం ఎత్తుతోను దింపుతోను పోజులు చూచుకొంటోను కలియదొక్కుతున్నాడు. సుభద్ర ముఖానికి మరోనాల్గు పూతలు చిక్కగా రంగుపట్టించిందేమో, యింకా తడి

…రలేదు. లేచివెళ్ళి ఆరుబయట శాస్త్ర విధుడుకొంటో నుంచోమని విసన కర్ర యిచ్చాం అక్కడికి. మా లోపంలేదు. సుభద్ర అద్దం వదలలేక వదలలేక ఆఖరిపర్యాయం అందం చూచుకొంటోంది; లేవడం తర్వాయి.

మన వేషం ఏలా ఉందంటావు అబ్బాయి అని శంకరుడడిగితే మా నారదుడు అన్నాట్టఖర్మం — యింతకు ఎవర్నేమంటే ఏంలాభం, మా సాహసం – చేయి శరీరాన్ని సోకే చోటల్లా నల్పులు కన్పిస్తున్నాయని. అది రంగుపూత లోపంగా కలహాశనుడు అనడం ఏలాఉంది, యీ సాంబయ్య వినడం ఏలాఉంది. శ్రీకృష్ణుడు రాసుకునే నీలిరంగుగాని, మరోపాత్ర ముఖాన్కి పులుముకునే రంగు అయితే కాని, అది వారి శరీర చ్ఛాయను ప్రదర్శించే రంగు కాబట్టి హెచ్చుతగ్గులుండకుండాలి కాని శంక రుడికిబూడిదశరీరచ్ఛాయ అని ఎవరన్నారండీ, శంకరునకది ఒంటికి పట్టించు కునే పైరంగుకదా. అట్లాంటిసమయంలో అసలు శంకరుడైతేమాత్రం బూడిదరాసుకుంటే చెమటకు బూడిద నల్లబడదా, చేతులు తగిలినచోట్ల నల్లపడదా? ఆయాచోట్ల తిరుగా తిరుగా బూడిద మెత్తుతోండడం ఎందుక్కు, మెత్తితేమాత్రం అది అగి ఏడుస్తుందా. అట్లా రాయడం మొదలెడ్తే నల్లకొట్లో బూడిదఅంతా రెండెడ్లబళ్ళమీద తెప్పించి రాపినా ఎక్కడో ఒకచోట తెలుపు చెరగుతో నేయుంటుంది. యితరపాత్రలు చెరిగినచోట్ల తిరుగా రాసుకుంటున్నారుకదా అని శంకరుమా అదేపనా? పిడిక్కి బిచ్చానిక్కి ఓటే మంత్రమా? యీ మాత్రానికి నాట్యకళాజ్ఞానం అక్కర లేదు. ప్రపంచజ్ఞానం అంటూ ఏ లేశమైనా ఉంటే తెల్సిదే. దక్షుడన్నట్టు అదిలేకేగా శంకరునితో యీయాతనఅంతా. శంకరుడీలా నిమిషనిమిషానిక్కి పూతలుపెట్టి హింసిస్తాడని తెలిస్తే, శుభ్రంగా యింత సున్నపుగుల్ల పుచ్చు కొని, వండించి వెల్లవేయించే తీసుకొత్తుం. ఏమైతేం ముందు తెలియలేదు. దాని ఫలితం అనుభవించాం.

నారదుడి మాటపుచ్చుకొని, చెరిగినచోట్ల జములుపూతలెట్టాలని సుభద్ర అద్దం ప్రక్క అద్దం దగ్గరకు కచికలబుట్టసహితం వచ్చాడు, శంకరుడు. తీరా ముఖం అద్దంలో చూచుకుంటూ ఓ పెద్ద కచిక చితిపేసాడు.

రాసుకుసేముందు. యిట్టే చూచాడుకదా, అది పైఒక్కపొర తప్పితే, లోపలంతా కారునలుపు కాటుకమసి. డబ్బాలోనుంచి సున్నిపిండి తీసికోడంలో గుప్పిట్లోకి సున్నిపిండిసహితం ఏ జర్రియైనా వచ్చి గుప్పిట్లో కదలుతోన్నట్టులోస్తే, చర్రున ఒక్కఊపున గుప్పిట విప్పళించేసి, ప్రక్కకు విసరికొట్టేస్తామే. అలా శంకరుడు, ఛీ, దీన్నితగలయ్యా వచ్చి వచ్చి యిదొచ్చింది అంటో ప్రక్కకు విసిరేసాడు ఆ గుప్పెడి మసిగుండనీ. విసరడంమాట అటుంచి ఆ తిట్టుమాత్రం ఏంసనిగా ఏడ్చాడు. తగులడితేనే కచిక అయింది. తగులడిపోయి కూర్చున్నదానిని పట్టుకొని, దీన్ని తగలెయ్యా అనడం అదీ ఓకోపమే? అదీ ఓశాపమే? చిర్రికచికకుకూడా వేళాకోళం అయిపోనా మా శంకరుడి శాపం. శంకరుడు విసిరికొట్టిన మసిగుండ, సూటుగా దగ్గరకొచ్చి, గురిచూచి, కళ్ళల్లో బుక్కాకొట్టి నట్టు, తన అద్దందగ్గరనుంచి లేస్తోలేస్తోఉన్న సుభద్ర తడిచెంపను ఫాట్టువ పిసరైనా బీరోకుండా కొట్టుకుని, అమట్టునే అక్కడ అంటుకుపోయింది. అదివరకున్న గులాబీరంగు కోటామీద, మసిబొగ్గుకీటు ఒకటి వేసిన ట్టయింది. బాహుకుడు ముఖాన్ని బూచాడికివేసినట్టు మసిబొగ్గురంగు వేస్తారే, కేవలం ఆలా తయారైంది ఆ పార్శ్వం యావత్తు. మరోటీ, వంటపొయ్యిలో పుట్టిన కచిక్కి ఒక గుణవిశేషం నైసర్గికం. వెలిబూడిద కచకతో ముఖప్రక్షాళనచేసే లాక్షిణికులు, వంటపొయ్యి కచికల్లో ఆరు రసాల కచికలు ఉంటాయని చెప్పగా విన్నా. పొయ్యి ఆర్పేయడంలో వంటచేతులనీళ్ళు పడవచ్చు. పొయ్యి ఆర్పేసిన తర్వాత వడ్డనపూర్వం, వంటిల్లు ఊడ్చుకోవడంలో, కత్తిపీట ధరిని హతశేషుల్లా పడిఉన్న వంకాయి, మెరపకాయి, యిత్యాది శాకాల ముచికలు, మొండాలు, గింజలు పొయ్యిలోకి చేరవచ్చు, లేక ఎత్తిపోతకు వీలుగా అవీ యివీకూడా ఓగిన్నెలోకే ఎక్కవచ్చు. కాబట్టి శంకరుడు ^^పిన కచికలో ఓ మెరప గింజ పడలేదని ఎవరు హామీ యీయగలరు. ఆవీధిని ఏ అమ్మమ్మవండిన వంటపొయ్యి కచికలోఅవి. సుభద్ర కళ్ళు చెవులను అందుకోవాలని చూస్తున్నాయి అని అర్జునుడు అన్నాడే ఆకళ్ళల్లో ఒక కన్ను ముక్కు

కేసి ముడుచుకుని మూసుకుపోయింది. అర్జునుడి విశాలాక్షి ఏకాక్షిఅయింది, యీమసిలో ఏంగింజఉందో. కళ్ళకు, చెవులకు యిత్యాది యింద్రియాలకు Sympathetic action ఉంటుందని నా స్వానుభవం. సుభద్ర రెండో కన్నుకూడా చికిలించవలసివచ్చింది, యింకా ఓకాడికి అదృష్టవంతులమే. మిగతా నాటకంపడ్తే యోగంఉంది. మసి, చెంపనుపడ్డాక సుభద్ర అద్దం చూచుకోడం పడలేదు. వెంటనే అద్దమే చూచుకుంటే, కడిగేసి తిరుగా కోటావేస్తేగాని రంగంమీదకు వెళ్ళకపోను. తిరుగా రంగేసేసరికి తెల్లారును.

అద్దం దగ్గరనుంచి లేస్తోండగా మసిపడి, ముఖ్యంగా కన్ను భగ్గుమన్న కార్ణంగా, సుభద్ర తోకతొక్కిన తాచులా బుస్సుమని తల తిప్పకుండా, మసిత్రోవనే పడగఎత్తి, శంకరుడిని కాటేసేసింది. అంటే చేతికందిన రంగుల పళ్ళెం చేతికొద్దీ విసిరిందేమో, శంకరుడి ఫాల భాగం అర్ధరూపాయి కాసంత చిట్లి, చమర్చింది. తస్మాత్, కారణాత్ మాశంకరునికి అప్రయత్న లబ్దంగా మూడవ కన్ను సిద్ధించింది. కొంగ్రొత్త రక్తం చమురుస్తోండడం వల్ల బేడకాసు వాళ్ళకు కూడా స్పష్టంగా కన్పిస్తుంది. మా శంకరుడు పెర్ఫెక్టు ఫాలనేత్రుడైనాడు. ఆదెబ్బబాధతో శివనృత్యం ప్రారంభించాడు. నటరాజ నామం సార్ధకంచేసాడు కాలపక్వ జన సమాజ సంహరణ క్రీడాభిలాషియైన శూలిపోలిక ప్రళయకాల తాండవం చేస్తో విజృంభించాడు. కర్ణం భయంనాకేమిటి? వీడిని యిక్కడ చంపేసి రక్తం బొట్టుపెట్టుకుంటా నంటోన్నాడు. సమాజం యావన్మందీ నడుం కట్టుకొని శంకరుడి కాళ్ళమీదపడ్డాం. దైవాల్లో శివుడు అల్పసంతోషి అంటారు. ఆనాడు లోకకళ్యాణార్ధం శంకరుడు కాలకూటం మ్రింగి ఏడుజగాల యులజడి మాన్చినట్లే మాశంకరుడు, సమాజాభ్యుదయ సిద్యర్ధం అంత కోపం దిగమ్రింగి శాంతించాడు. "అదృష్టం, అవసరం రెండూ కల్సివచ్చినట్టు ఫాలభాగంలో యీలాంటి దెబ్బ మరే శంకర వేషధారికి ఏనాడు లభ్యంఅయిందయ్యా" అని వాడికి వినిపించే దూరంలో మేం అనుకొంటోంటే ప్రసన్న వదనుడైనాడు మాశంకరుడు. రక్తం తుడవనిచ్చాడు కాదు. కట్టు కట్టనిచ్చాడు కాదు.

## భయంకర స్వరూపిణి సుభద్ర ప్రవేశం-భీభత్సం.

కాష్ఠ కంటిబాధ తగ్గిన తర్వాత అద్దం అద్దం అని అలమరిగిందీ సుభద్ర. అద్దాలెక్కడున్నాయి. ఈ అల్లరిలో పగిలిపోతాయని ఎవరి అద్దాలు వాళ్ళు తమతమ్ముళ్ళచేత యిళ్ళకు పంపడం అయిపోయింది. కంటి బాధ నీకు తప్పితే, పైన పద్దేదేలేదు. కొద్దిగా అద్దేస్తే పోయీదే, అన్నాం, ఆపత్కాలంలో ఎంత అబద్ధమైనా ఆడేయడానికి శాస్త్రమే అధికారం యిస్తోంది కాబట్టి. నిజానికి ఆమసి తుడిచేయడం, బ్రహ్మతరం కాదు. పూర్వ సంపాదిత పాప సంచయంలా పట్టేసిందా కళేబరధారి, సుభద్ర వేషధారిని; మేమల్లా చేయకల్గింది ఆమసిని ఎక్కువ తక్కువలు లేకుండా, ముఖమంతా సమానంగా సద్దాము. అద్దంలేదుగా, అప్పుడు వాడు చూచుకోలేదుగా, మాకేం అని కొంతా, అరాత్రి వాడు మమ్మన్ని పెట్టిన క్షోభకు కసితీర్చుకోవాలని కొంత.

ప్రేక్షకుల్లో కలవరం బయల్దేరింది. కర్ణంగారి గ్రామంలోఉన్న పలుకుబడి అయితేనేం, కర్ణంగారి ప్రచారం అయితేనేం, వారి అల్లుడు రంగంమీదికి రావాలని ఉవ్విళ్ళూర్తున్నారు. చాలా చమత్కారంగా యాక్టుచేస్తాడని, మన నాటు కుర్రాళ్ళలా కాదని, పట్నవాసం హొయ లంతా చూపెడ్తాడని, యీ సుభద్ర పాత్రకే ఏలూరు స్పోర్ట్సు క్లబ్బువారి షీల్డు కొట్టేసాడని, మావూరు పెత్తందారుకూడా కర్ణంగారితో ఆలోచించి, పావుకాసు గోల్డు మెడల్ యీరాత్రి సుభద్ర కొంగుకు, తణుకు పురపౌర సమక్షాన కడ్తాడని తెగచెప్పుకొంటోన్నారు. కర్ణంగారి అమ్మాయి, మాశంకరుడి భార్య, స్త్రీల ప్రత్యేక స్థలంలో కూర్చుని తమ భర్తల సందర్శన భాగ్యం తమకెప్పుడు లభించునా అని నిమిషమో యుగంగా గడుప్తున్నారు. యింత ఏవేషధారి స్టేజిమీదకు వచ్చినా అనవసరమైనట్టు శుద్ధ కాలహరణం కాని మరోటికాదన్నట్టు ఛప్పరించేస్తోన్నారు వాళ్ళిద్దరు సుభద్రను చూడాలని యీలలు కరతాళ ధ్వనులు ఒక్కవరసని చెలరేగి పోతున్నాయి. గ్రామోద్యోగస్థుల యిళ్ళల్లోను పెద్దల యిళ్ళల్లోను

ఉన్న స్త్రీ జనాన్నికూడా సుభద్ర వచ్చేవేళయింది అని కాగడాలిచ్చి చాకళ్ళను పంపించి థియేటరుకు చేర్చారు. సుభద్ర సీను అయిన తర్వాత కొట్టదగ్గ యింటర్వెలు ఔట్ బెల్లు యీ నాడు ప్రేక్షకుల కోర్కెపై సుభద్ర సీనుకు పూర్వం కొట్టడమయింది. బయటకు వెళ్ళివచ్చిన జనం, యీ తొడతొక్కిడిలో దూరిన పైజనం స్థానాలలంకరించేసి, యిసికేస్తే రాలకుండా ఉన్నారు. రోడ్లు, మిగతా గ్రామం నిర్మానుష్యమైంది అగంటలో. చోరులు తమ యింట్లో తాము తిరిగినట్టు స్వతంత్రంగా యిళ్ళవెంట తిరిగి, కబుర్లు చెప్పుకుంటో ఆస్తిపాస్తులను దోచుకుపోతున్నా, ఏమిటి, అనే దిక్కులేదు గ్రామంలో, అగంటలో.

తెరలోపలి నిజపరిస్థితికి తెర అవతలి భ్రాంతికి నిమిష నిమిషానికి పెరిగిపోతోన్న ఆ వ్యత్యాసం మాకు హృదయాందోళన కల్గిస్తోంది. ఆ రెంటికిమధ్యన అపారాఖాతం ఏర్పడిపోతోంది. ప్రకృతిశక్తుల మహా కంపం లాంటిది ఏదో ఆరాత్రి రాకతప్పదని మేము భయపడిపోతున్నాం. సుభద్ర స్టేజిమీదకు వెడితే ప్రేక్షకులు మమ్మల్ని ప్రాణాలతో యిళ్ళకు వెళ్ళనిస్తారని ధైర్యంలేదు. మాకలహాశనుడు మూటాముళ్ళీ సర్దుకుసిద్ధంగా ఉన్నాడు ఉడాయించడానికి. మా లెక్కలమాస్టారు తెరప్రక్కకు వచ్చి అబ్బాయిలు యిక ఆలస్యంచేస్తే పాక అంటించేటట్టున్నారు ప్రేక్షకులు. నాటకం తర్వాతచూద్దాం. సుభద్రను ఒక్కసారి యీ సైడుకర్టెను లోనుంచి ఆసైడుకర్టెనులోకి జస్టు నడిపించండి, మాట్లాడించక్కరలేదు. దాంతో ప్రేక్షకులు తృప్తింపచేసినట్టయిపోయి కిమన్నాస్తి మాట్లాడరు. యిక ఎంతఆలస్యంచేసినా మిమ్మల్ని అనేవాళ్ళు ఉండరు అంటో సలహా యిచ్చారు. మంచి టెంపోతో నడుస్తోన్న నాటకం, రక్తికడుతోన్న నాటకం, సుభద్ర అలక్ష్యంవల్ల చెడకొట్టుకోకండి. చెప్పాను, మీయిష్టం తర్వాతగా అని వెళ్ళారాయన. పాపం నిజపరిస్థితులు ఆయనకు తెలియవు.

వెంటనే సుభద్రకు తలకిందిద్ది జగన్మోహినిలా ఉన్నావని మెచ్చు రిచ్చారు. అద్దం లేదుగా. ఏమన్నా చెల్లుతుంది. ఊ యిక దంచేయ్, ఛరాయించేయ్, అంటో అంతా ఉక్కుమ్మడిగా ఉషార్ యిచ్చాం. యిక

సెకనాలశ్యమైనా పెళ్ళిపెట్టుగా హాల్లో భూకంపం బయల్దేరగలదనిఒకటి, రెండోది యీలోపల ఖర్మంచాలక సుభద్రకు అద్దంమాట జ్ఞప్తికివస్తే ఇంతా మొదటికొస్తుంది...స్టేజిమీదకువెళ్ళడే. వెనక్కితిరిగి నావ. కచూస్తే Any of your pastilles please అన్నాడు. అది ఏమిటో మాకు తెలియదు. అద్దమే అనుకొన్నాం మాభయంకొద్దీ. On అని చెయ్యి చాపాడు. తెలుగునచెప్పు ఉందేమో చూస్తానన్నాడు మాగయుడు. Don't you know, Pastilles of the Newyork Brand what a calamity అంటాడుకాని తెలిసేట్లా తెల్గున చెప్పడు. తెలియటం లేదన్నాం తెల్లబోయి. What I mean by pastilles, Throat pills-regular hell అన్నాడు ఎంతో ఆగ్రహంగా. నాటకానికి పైనుంచి తెప్పించుకునే త్రోట్టుపిల్సు ఉంటాయని యెరగం. శ్లేష్మాన్ని కోసేసే రసరాట్టుమాత్రలేమో అవి. వాటికే యింగ్లీషుమాటేమో అగి.. కాస్త మనోన్ని మశానమో మాత్రకట్టుగాచేసి వాడికంతాన్నేతుము. కాని అవునో కాదో రంగు తేడావస్తే ముఖాన్నేసి కొడ్తాడు. ఏంచెయ్యాం. నారదుడొచ్చి భయపడకండి శంకరుడు ఒక ఏబులం మిరియాలు, వీసెడు బెల్లం పొట్లాలు కట్టించుకొచ్చి సంచిలో దాచాడు తనపథ్యంవేళకు తినాలని. కొసినిని వాడికి తెలియకుండా కొట్టుకొస్తాను. పనికొస్తాయేమో అడగమన్నాడు. నువ్వాడుగంటే నువ్వాడుగని ఎవరంతట వాళ్ళం అడగడానికి సిగ్గుపడిపోతున్నాం. ఏదో యితరదేశాల పెద్దకంపెనీల మందు కావల్సినవాడిక్కి అంతా ఎరిగిఉన్న మిరియం బెల్లం అంటేనే ఏంలోకువో అని "Ten to stare at me, not one to get pastilles. A set of country boors ever seen" అంటో గద్దిరించాడు. యీలోపల నారదుడువెళ్ళి శంకరుని గోనిసంచిలోనుంచి బెల్లపచ్చు ముక్క కొట్టుకొచ్చాడు. మిరియంపొట్లం ఎక్కడుందో రొంటినే కట్టుకున్నాడో శంకరుడుసంచిలో లేదు. సుభద్రకంటే గింజవిదపడు, పైగా మండిపడిపోతాడేమో. మళ్ళీ అడేమిఅల్లరో అనుకుంటోంటే ఏదోపొట్లం మరోటి దొరికింది ఆసంచిలో. విప్పిచూస్తే నువ్వులు. శంకరుడికి మూడే జీవి

తంలో ప్రాణసమానాలు. క్రొత్తగావచ్చిన భార్య. మధ్యగా వచ్చిన నాటకంపద్యాలు, చిన్నప్పటినుంచీ అలవాటై అంటిపెట్టుకున్న చిమ్మిలి. వెధవవాళ్ళకు మినపరొట్టిఏలాగో మాశంకరుడికి చిమ్మిలి అలా. ఓ గుప్పెడైతే అనువ్వులుకూడా కొట్టుకొచ్చాడు నారదుడు. బెల్లంముక్క ఎడం చేతిలోను, నువ్వుగింజలు కుడిచేతిలోను పట్టుకొని సుభద్రకెదురుగా నుంచున్నాడు, పనికొస్తే పుచ్చుకుంటాడు, కాకపోతే కాస్సేపు అరచివాడే ఊరుకొంటాడని. వ టిని చూస్తోనే, That's What your country fools eat, perhaps in these parts on drama night-wretched stuff అంటో నారదుడి బెల్లంముక్కచేతిని నేలకు, నువ్వులచేతిని ఆకాశానికి విసిరికొట్టాడు, సుభద్రవేషధారి. బెల్లంముక్క కోసులుతీరి ఉందేమో సైడుకర్టెనులో హార్మోనియంమీద చేతులుపెట్టుకు కూర్చున్న హార్మోనిస్టు చేతివ్రేళ్ళకు ఫెడీలునతగిలి, వాడిప్రాణం జిల్లార్చుకుపోయింది. వాయించదగ్గది యింకా బోలెడు ముందుంది. బెల్లందెబ్బ అయితేమాత్రం నొప్పి తీపిగాఉంటుందామరి. బెల్లంబుట్టలో తేలు కుట్టినవాడినోటికి మంచి తీర్థం పట్టిస్తే తియ్యగా ఉంటుందనీ, చింతపండుబుట్టలో తేలైతే నీళ్ళు పళ్ళుకూడా పులుస్తాయని, మెరపకాయబుట్టలో తేలైతే ఆనీళ్ళే కారమెత్తిపోయి నాలికమీద మంటలు బయల్దేరుతాయని వినికిలి. నాకనుభవం చాలదు. బుద్ధిమంతులెవరైనా యీపరిశోధనచేసి విషయం యిదమిద్ధంఅని నిర్ణయంచేస్తే లోకహితార్థం, ప్రపంచ పదార్థ విజ్ఞానానిక్క తోడ్పడగలరని నా హెచ్చరిక. నారదుడి రెండోచేతిలో నువ్వుగింజలు ఎగిరివెళ్ళి నాటక ప్రారంభంలో సూత్రధారుడు శుభప్రదంగా ప్రేక్షకులపై చల్లే పుష్పాల్లా సభాసదుల శిరస్సులపై పడ్డాయి. యింకా ఏం అశుభం కావాలండి. క్షురమయింది, గుడం, తిలలు అయ్యాయి, ఇకల్లా శృంగిభేరము ప్రతిష్ఠతు అంటే పూర్తిఅయిందన్నమాట కర్మకాండ. ప్రేక్షకులు అది గమనించే స్థితిలో లేరుకాబట్టి సరిపోయింది. అదే గమనిస్తే ప్రేక్షకులు రాళ్ళవర్షం కురిపించి మమ్మన్నారాత్రి అక్కడ పచ్చడి చెయ్యకపోయారా? ముద్దుగా పుష్పవర్షం కోరుతారుగాని ప్రేక్షకులు శిలావర్షం ఒప్పుకొం

టూకా? చంపే తురక్కుడెట్టి. అందుకనే ఎప్పుడూ అప్పటికప్పుడు తైలు సంచీతో రైలుదిగి వచ్చేవాడికి ఎంత నాట్యాచారి గాని పేలాంటి చిరు తాంకితుడు కాని కేరెక్టరు ఇయ్యవద్దు. అది గ్రామానికే కీడు అని మొత్తు తుంటా. మన రిహార్సల్సులోను, మన కష్టసుఖాల్లోను పాల్గొగల్గినవాడే మనకి శ్రేయోదాయకం. అందులో విద్యార్థి నాటకాల్లో ముఖ్యంగా సత్సాంప్రదాయం స్వభావ సౌజన్యాదులు లేనివాళ్ళను ధనికమైనా చేర నీయకూడదు అని నా మనవి.

గయుడు, నేను రహస్యాలోచన చేసాం. అర్జనుడు స్టేజీమీదనుంచి సుభద్రకోసం సైడు కర్టెనువంక చూస్తోన్నాడు. సుభద్ర పొందిగ్గా స్టేజీ మీదకు వెడ్తూడామంచిదే, లేకపోతే, ఏదో ఓటిఅవుతుంది, సుభద్రను స్టేజిమీదకు గెంటుదాం" అనుకొని యిద్దరం యిరుపార్శ్వాలా నుంచు న్నాము. విగ్గుమరచిపోకు, పైట మర్చిబోకు, కొంపముంచబోకుసుమా అని చెప్తోవేఉన్నాం. పట్నవాసపువాడు, మామాటా, లెక్కా వాడికి కావాలా. మొదట్లోనే యింప్రెషన్ క్రియేటు చేసేయాలి, The first blow is half the battle అనుకున్నాడు కాబోలు. నాటకంఅంటే చెడుగుడే అనుకున్నాడో, కుస్తీఅనుకున్నాడో, సర్కస్సు అనుకున్నాడో కవివ్రాసినమాటలు వదలేశాడు. తలమీదనుంచి పైటమీదనుంచి చేతులు తీసేశాడు. ఎక్కడా పొస్తకంలోలేదు, పొంప్టరు గోల, అర్జునా! అంటో చేతులురెండు, గాల్లోకిగిరాటేసి అర్జునుడికేసి ఆలాపోతున్నాడు స్త్రీత్వం అంత, మాటలమీదుందా. చీరకట్టేనే అయిపోయిందా! అబ్బో, దానికెన్నియుండాలి. మరెన్ని లేకుండాలి! ముందుమాట, సిగ్గు భిడియం చంపుకొంటేగాని ఆడవేషంతో స్టేజి యెక్కలేం. యెక్కినకాడినుంచి సిగ్గు భిడియం గుమ్మరిస్తేగాని మర్యాదగా దిగలేం. ఎక్కడా, ఏకోకాన్నీ భయం భక్తీ, ఎగ్గూ సిగ్గూ, అదుపూ ఆజ్ఞా అన్నవిలేకుండా మగవీరుడిలా అర్జునునిమీదకు ఎగబడ్డ యీ సుభద్రపాత్రను చూస్తే, ఏకొంచెం వస్తు పాత్ర రసౌచిత్యచింతగల ప్రేక్షకుడైనా పిడుగుమొత్తినట్టు సంకటపడ తారు. హాతోస్మి, హాతోస్మి, 'ఇంతలో వెచ్చటనుండి వచ్చె దరహే

క్షణకున్ మనుసిగ్గుదొంతరల్' అన్నట్టి సిగ్గులభరణి సుభద్ర యీ దాశాసీ యేనా దైవమా, అని శోకభరాక్రాంతస్వాంతుడై, ఉత్తరీయంతో అశ్రుపూరిత నేత్రాలను వత్తుకుంటో చతికలపడిపోతాడు. అర్జునుడు అరణ్యావాసంలో ఉండగా పుట్టిల్లుపట్టి యీలా తయారైంది సుభద్ర, అని ప్రేక్షకుల్లో ఏయువకుడైనా పొరబడ్డాడేం, మామగారొచ్చి గడపసేసి తలకాయ బ్రద్దలుకొట్టుకున్నా యిక పెళ్ళామును పుట్టింటికి పంపడు. వేషాలువేశాం, మానాం, కాని యింత భీభత్సమా. సుభద్ర స్టేజీమీద అడుగెట్టింది. అంతే.

అయ్యా నాటికి నేటికి నాజన్మలో వినలేదు. వేయిమందిజనం ఐక్యకంఠంతో ఒక్కటే ఒక్క బొబ్బపెట్టారు 'ఓరి బాబో' అని. వివిధ ప్రవృత్తులు, మనస్తత్వాలు, కుల, మత, వర్గవిభేదాలు ఉన్న వేయిమంది ప్రజ, పరస్పరాన్వేషణ సంభాషణలక్కరలేకుండా ఒక్క త్రుటిలో, ఏకాభిప్రాయానికివచ్చి, ఏకగ్రీవంగాచేసిన ప్రకటన వినడం నేను అదే తొలిసారి. అదే తుదిసారి. అంత వైవిధ్యమా జనంలో? యింతసామరస్యమా యీ ఒక్క విషయంలోను? అవును, సూర్యుడు తూర్పునఉదయిస్తాడన్న విషయంలో భిన్నాభిప్రాయ మెందుకుంటుందిలెండి. పెద్ద పిన్న, ఆడ, మగ వివక్షతలేకుండా ఉలిక్కిపడ్డారు. పెత్తందారువత్తుడు అంతా 4 సం॥రాల వయస్సు స్టేజివద్గర కూర్చోపెట్టినకుర్రాడు కెవ్వనకేకేసి స్పృహతప్పాడు. పిల్లలు హడలి చచ్చిపోతారు. ముందు వాళ్ళను వెనక్కి ఎక్కడివాళ్ళను అక్కడలాగేసి మరీరెండోపని చేయండి అని. సంఘశ్రేయస్సుకోరిన ఒక పెద్దమనిషి అరుస్తున్నాడు. ఆయనకు పిల్లలు లేరు. పిల్లలున్నవాళ్ళు రామేదే అంటే కృష్ణ డెక్కడండీ; నాటకం వద్దే అంటే కాళ్ళల్లో నిప్పులోసావే వచ్చేదాకా అంటే, అంతఏడుస్తో తీసికొచ్చినందుకే ముద్దు యిల్లా ముక్కలైపోయిందండోయి అంటో; ఎవరి చిన్నపిల్లలను, పెద్దపిల్లలను వాళ్ళు కాళ్ళుకాలిన పిల్లుల్లా పడి కౌతుక్కుంటున్నారు. నిశ్చేష్టితులై, వెర్రిచూపులు చూసే మనుష్యులకు లెక్కలేదు, స్పృహఉన్నవాళ్ళని, లేనివాళ్ళనుకూడా అంచెలమీద

లాగేస్తున్నారు స్త్రీల ప్రత్యేకస్థలంలోనుంచి. కర్ణంగారి మూడో అమ్మాయి బావకు దెయ్యంపట్టిందే అక్కా-య్యా అంటో బారుమంది. ఇంటికి రానీ, వీడికి యింక వీధిలో నేవేస్తా మడతమంచం అంటోన్నట్టు సుభద్రవంక చూస్తో, గాజులు చప్పుడుచేసికొంటో, కళ్ళు కుక్కుకుంటో, యిరుగమ్మా పొరుగమ్మల ముఖాలవంక చూడకుండా చెల్లాయిని చంకనేసుకొని యింటికి దారిపట్టింది, సుభద్రవేషధారి సతీరత్నం. భర్తసౌరు చూతామని భర్తఖ్యాతి పంచుకుందామని, వాడి కోతలునమ్మి వచ్చింది పాపం. ఇక స్టేజిమీద దగ్గరలో ఉన్న మా అర్జనుడు చెప్పనక్కరేలేదు. సుభద్ర రెండుచేతులు సైడుకర్టెనులోనుంచి చాపేటప్పటికే దిగ్గునలేచి ఒంటిచేత్తో కుర్చీని ముందుకులాగి తయారుగానుంచున్నాడు ఎదర సైడుకర్టెనుకేసి అక్కడ అడ్డం ఏంలేదుగదాఅని చూచుకొంటో. తనవైపుకు సుభద్ర అడుగేసేసరికి బెదురుచూపులుచూస్తో ఒకఅడుగు వెనక్కేసినట్టేవేసి, యికధైర్యం చాలలేదు కాబోలు, ఏకంగా రెండో సైడుకర్టెనువంకకు గిర్రున తిరిగి, ఒక్క-పెట్టున హరహరాఅని కుర్చీసహితంవెళ్ళి లోపలపడ్డాడు. ముందు బ్రతికిబాగుంటే నాటకంమాట తర్వాతచూచుకోవచ్చునని. ఏమైతేం మా అర్జనుడు మాకుబ్రతికాడు. అంతేచాలు. వాడివంకేచూస్తో వెళ్ళిందాయిరి సుభద్ర. ఆవెళ్ళింది ఎక్కడసుభద్రండీ. హిడింబండీబాబు. తప్పితే దశమహావిద్యల్లో చెప్పబడిన మహాభయంకర స్వరూపిణి ధూమవతి కావాలి. మసిముఖానికిసాయం, ఎడంచెవిమీదకు జారిపోయి, చెవిపట్టున గాల్లోఊగుతోయున్న కంపవిగ్గు, రొమ్ములదగ్గరనుంచి నడుంకేసి అనిమిషానిక్కి అనిమిషం వచ్చిపడిపోతూన్న తాటికాయలఎత్తు, చినాలిరంగు వేసిన నాలిక. తలంతా అంటుక త్తిరిక్రాఫు, యింకా ఏంకావాలండీ పిల్లలు కొయ్యలైపోడానికేనా, ఆడాళ్ళకు వాంతులు రావడానికైనా, ముగాళ్ళకు మతులోవడానికైనా. చర్రున తెరదింపేశాతాం అంటే అది పడదు, లేవదు.

♦ ♦ ♦

# పరిహాస శిల్పం.

సుభద్ర వేషధారి మాదిరీని ఉత్థాన పతనాలను ఒక్క-రాత్రిలో అనుభవించిన వ్యక్తి మళ్ళీ మాకు లభిస్తాడా కడుపునిండా ఏడ్పించుకోడానికి? అందులోనూ, వాడి మూలంగా క్షోభపడి ఉన్న ప్రాణాలాయిరి మాబాలబలగం. మేం నేర్చియున్న పరిహాస పాండితి, ఉక్తివైచిత్రి, వాక్చాతుర్యం, వెక్కి-రింత వాఙ్మయం తెగేసి దంచేయడానికి యింతకన్న అదును పదును ఎప్పుడు లభిస్తాయి మరి? అంచేత సుభద్ర వేషధారి లేవి డీఘట్టం, ఉపనిక వెనక, ఆనాటి విద్యార్థి సాంప్రదాయానుసారంగా, సాంతంగా, సమగ్రసుందరంగా, వినిపింప కుతూహలురై యున్నారు మాకుర్రాళ్ళు.

పరిహాస శిల్పకౌశలం అన్ని రకాల్లోను ప్రదర్శించే దక్షులున్నారు మాకు. మావేళాకోళాల్లో, వెక్కి-రింతల్లో మోటు, సున్నితం, సరసం, విరసం, వినోదం, వికారం, కలకలనవ్వూ అవసరమైతే కలపటం అన్నీ దొరుకుతాయి కళాపిపాసులకు. బోలెడు వెరైటీసు అద్భుతంగా పేక ముక్క-ల్లా పడిపోతోంటాయి. పాపం అయదర కుర్రాడు, మాదొంగా టలో యీ ముక్క-లన్నీ మూటకట్టుకుని దొంగఅయి పోతోంటాడు. అతడి ముఖాన్ని విషాద చ్ఛాయలు అలుముకుంటోంటాయి. స్మితం మొదలు అట్టహాసంవరకు మన లాక్షణికులు చెప్పే ఆరువిధాల హాసాల్లోను అంది వేసిన చేతులున్నాయి మాబృందంలో. కూడిన జనం మా పరిహాస ఏకాంకికలలో ప్రత్యక్షమయ్యే ఉత్తమ, మధ్యమ, అధమ జాతులకు అబ్బుర పడే వారు. మాధర్మజ కృష్ణులు ఉత్తమజాతి శిల్పులు. వారి ప్రసంగాల్లో వల్గారిటీ, లెవిటీ పీసమెత్తైనా దొరకవు. మా నారదుడు మధ్యముడు సునిశితమైన బుద్ధేకాని నైతికబలం తక్కు-వ. పరిహాస సన్నివేశాల్లో నారదుణ్ని చూస్తే డాక్టరు జెకిల్, మిస్టరు హైడ్లు జ్ఞప్తికి వస్తారు. ధర్మజ కృష్ణుల సమక్షంలో చాలా హైస్టాండర్డ్సు రీచయ్యేవాడు. కాళీ కునితో బుజాలు కల్పుకుతిరిగే ఘళ్ళల్లో ఎంత రసాభాసానికైనా, అధర్మ ప్రవర్తనకైనా, సాధుహింసకైనా ఒడిగట్టేవాడు. కానికుడు అధమజాతి

నీలివార్తలు, నీలాపనిందలు, నిక్‌నేమ్సు వాడి సంచికట్టు. కుకల్పనల పుట్ట, కౌసికుడు. వాడి పరిహాసచర్యల్లో కృత్యాకృత్యవివక్షత మృగ్యం. ఒక్కొక్కడి ప్రాణానికి, కౌసికుడు ఏలినాటి శనయ్యే వాడు. నారద కౌసికుల అనుభవం కల్గిన ఒక పెద్దమనిషి అన్నమాట జ్ఞప్తికి వస్తుంది. "విద్య నేర్వడంతో సరిగాదు. దాని వినియోగంలో ధర్మబుద్ధి ఉండాలి. విద్యయొక్క ధర్మరహిత వినియోగఫలితం పరహితం కాదు, పరహింస".

కౌశిక నారదులిద్దరు కలిస్తే, అడిగేదా, అగ్నికి వాయువు సాయ పడ్డట్టే. చిన్నప్పుడు, కభాష, యిత్యాది కాకి భాషలు మాట్లాడి ఎదరి బుద్ధిమంతులనో ఏడిపించేవారు మా సమాజం రోజులకు దుష్పాండిత్యంలో బాగా రగడదేరి, వాక్యాలను చివరనుంచి మొదటికి బోర్లేసి మాట్లాడే పైశాచిక పద్ధతులను నేర్చి, సుందోప సుందుల్లా శత్రువును చంపేసేవారు. జంటకవుల్లా తలో చరణం పూరించుకుంటూ పోతో తిట్లకావ్యం పూర్తి చేసేవారు. భరతవాక్యం బూతులబుంగ బుర్రమీద కర్రదెబ్బ కట్టెను ట్రాప్సు, అన్నప్పుడూ ఎదరబడి తిట్టరు. ఎదరవాడికి వినిపించే దూరంలో నిలబడి, ఏదో యిష్టాగోష్ఠి మాట్లాడు కొంటోన్నట్టు పైకి కన్పించడం. ఒకడు ప్రసక్తాను ప్రసక్తంగా ఆఎదర వ్యక్తి పేరెత్తడం, విన్నావా, పాపం 'ట' అంటో ఏదో అభూతకల్పన లేవదీసి, అందుకు తానెంతో జాలిపడ్తోన్నట్టు. తన దా విషయంలో భిన్నాభిప్రాయమన్నట్టు రెండోవాడు ప్రారంభించి నానా కారుకూతలున్ను. యింతసేపూ శత్రువు మాడిపోతోండడం. మాడువాసన మైలూకొట్టడం. "ధర్మరాజు సన్నాయినొక్కులకు, కృష్ణుని వేణుగానానికి లొంగుతారోయి శతృవులు, యీలాదశకంఠం కావాలి గాని" అని దరువెయ్యడమున్ను జరిగేది. అనేక మంది సాధుజనులు యీ రాక్షసుల హింసాకాండకు ప్రతిక్రియ చేయాలని ప్రయత్నించి విఫలులయ్యారు. కర్ణం అల్లుడిలాంటి సామాన్యుల లెక్క ఏమిటి. యిదివరలో ఒక పర్యాయం, పెద్దపులివంటి ప్రఖ్యాత మంత్రోపాసకుణ్ణి ముక్కు శౌర్యలు మూసి మూడు చెర్వుల నీళ్ళు త్రాగించాడు మా జిత్తులమారి నారదుడు. ఆవృత్తాంతం మనవి చేస్తా.

♦ ♦ ♦

# వ్యాఘ్ర గోమాయు సంవాదం; కృష్ణుని ఉపన్యాసం.

వ్యాఘ్రేశ్వరశాస్త్రి మా ప్రాంతాల్లో చాలా ప్రఖ్యాతి పొందిన మంత్రోపాసకుడు. ఈయన్నే చెళ్ళపిళ్ళవారు వారి కాశీయాత్రలో ప్రశంసించారు. ఈ మంత్రోపాసకుడు చాలా గట్టివాడని, అతని పినతండ్రికొమారునితో కలిగిన మదురు దావాలో పినతండ్రి కొడుక్కి చేతబడిచేసి మదురు కొట్టేసాడని వినికిడిన్నీ. వీధిభాగవతం ఆడ్తోండగా తనకు ఆహ్వానం జరగలేదన్న, ఆగ్రహంతో సభకు చేరినట్టేచేరి యేవోగింజలు నోట్లోవేసుకొని ఒక్క గింజ కటుక్కున కొరికేసరికల్లా మద్దిల పటుక్కున పగిలిపోయిందనీ, యింకోగింజ మొదటిదానికన్న కాస్త పెద్దది కాబోలు దంతాలంట త్రిప్పుతోంటే భామవేషం ఊగిసలాడ్డం మొదలెట్టిందని, దంతాల మధ్య ఆగింజ టక్కుమనే సరికల్లా భామవేషం గ్రామ మునసబు కాళ్ళమీద పెటుక్కున విరుచుకు పడిపోయిందనీ, భాగవతపు హాస్యకుడు సభకు నమస్కరించి, మంత్రింపించిన మహానుభావు లెవరో తిరుగుడు మంత్రంవేసి పుణ్యం కట్టుకోవలసిందని, సవినయంగా తడికళ్ళతో ప్రార్థించాడనీ, అంతలో గ్రామమునసబు, వళ్లోయున్న భామవేషంతోనే, ఆమంత్రం పెట్టిన వాడెవడో చెప్పండి బుర్ర పగలగొట్టానని శుద్ధ తెల్వితక్కువ ప్రసంగం చేసాడని, సభికులు యావన్మందీ మాకోసమైనా తిప్పుడు మంత్రంవేయమని అనిర్దిష్టంగా సభ వంక చూస్తూ కోరారనీ, అంతట భామవేషం లేచిందనీ, సక్రమంగా భామకలాపం వినిపించిందనీ, కాని భాగవతం ఆడినవాళ్ళూ చూచినవాళ్ళూ యిళ్ళకెళ్ళి పోయినా, గ్రామ మునసబు మాత్రం లాంచేతో నడివీధిలో, ఉదయం తొమ్మిది గంటలదాకా, ఎవరు యింటికి రామన్నా, మందహాసంచేస్తూ రాకుండా కూర్చొండి పోయాడనీ, యీశాస్త్రుల్ల యొక్క మంత్రశక్తి మహాత్మ్యం తెల్సిన హాలెవరి సలహామైనో మునసబు కొమారుడు నవధాన్యాలు దక్షిణ సహితం. యీయనకు ముట్టచెప్పాడనీ, యీమంత్రోపాసకుడు వాటిని మూటకట్టుకొని అపూర్వపాలిమేర కెళ్ళేసరికి, మునసబు నడివీధి విడిచి యింటికి వెళ్ళాడనీ, ప్రతీతి.

ఈ మంత్రోపాసకుని మరదలు కొడుకు, కాకినాడ కుర్రాడు, 5వ ఫారం చదివేవాడు పెళ్ళిళ్ళరోజుల్లో మావూరు వచ్చాడు. వాడు Goldsmith's vicar of wakefiled లో మొదటివాక్యం; Charles Lamb's Adventures of ulysses లో Clytemnestra my wicked wife forgetting the vows etc. మరోవాక్యం కంఠస్థంచేసి ఉన్నాడు. ఆవాక్యాలా గ్రంథాల్లోవనీ, వాడు వల్లెవేసి పెట్టుకున్నవని మొదట్లో మాకు తెలియదు. అమాత్రం పోల్చే అంగ్ల భాషాజ్ఞానం ఆ పెళ్ళిళ్ళల్లో చేరిన పెద్దవాళ్ళకూలేదు. వాడికి ధైర్యం చిక్కింది. మేం పెద్దవాళ్ళతోకలసి కూర్చున్న ఉత్సాహసమయాల్లో మాసందుకు వచ్చినట్టేవచ్చి, మా బాలురలో ఎవడినో యిట్టే పలకరించి What news అనేవాడు. దొరకబుచ్చుకొని యింగ్లీషులో సమాధానం యీయడం అభ్యాసం లేకపోవడం అటుంచి, న్యూస్ అడుక్కొని చెప్పుకోవడం అనుమాయితేలేదు మా పల్లెటూరి బాల్యజీవితంలో. అంచేత అనుమూ మినుమూ అనకుండా ఎత్తడిపోయేవాళ్ళం. ఆ వాటంచూచి వాడు తాను వల్లించిఉన్న వాక్యాన్ని నయాగరాజలపాతవేగంతో మా పైకి వదలేవాడు. మేము మిడిగుడ్లు వేసేవాళ్ళం. చివరకు వాడు వాకట్లో తిరుగుతున్నాడంటే మేము మూలగదుల్లో అజ్ఞాతవాసం చేయవలసి రావడమో లేక కేవలం లంకపొలం, అరణ్యావాసానికే పోవడమోకూడా కల్గింది, ఒకటి రెండు పూటలు. తద్రీతుగా కాకినాడ కుర్రాడు, రకం మార్చి, పగలు మొదటిది చదివితే సాయింత్రం రెండోది చదువుతో, ఫక్తు ఆరెండు వాక్యాలతోను రెండు పెళ్ళిళ్ళల్లో పెద్దపీట వేయించు కొన్నాడు. మేము శిష్యపరమాణువుల్లా నోరుకట్టుకు కూర్చున్నాం. మన పెద్దమ్మలు ఆకుర్రాడి కాలిగోటికి పోలరంటో మంత్రోపాసకుడు అనేసే డట ఆ శాస్త్రమాట. చివరకు మూడో పెళ్ళిలో దొరికిపోయాడు కాకినాడ అబ్బాయి. కాస్త చిన్నఎత్తులో యీలాంటి టప్పాలుకొట్టే కొంటెతనం మా నారదుడికి ఉంది కాబట్టి, పామును పామే కరచెనుఅన్న సామ్యంగా వాడు కాకినాడ కుర్రాడిమీద ఫగపట్టాడు. కాకినాడ అబ్బాయి మూట

కట్టుకొంటోన్న పొగడ్తలన్నీ, తనసొమ్ము, తన వచ్చుబళ్ళు ఎగరేసుకు పోతోన్నట్టు భావించి ఊరుకున్నాడు నారదుడు. తాను రాహుగ్రస్తమైన సూర్యబింబంగా పోల్చుకొని ఖేదించాడు. యీ ఈర్ష్యాగ్నికి యింధనమైపోయి ఛా ఎందుకీజన్మ అన్నాడు. కాకినాడవాని అగడం భరించలేకపోయాడు. మనకు అర్థాలు తెలియకపోయినా, కాకినాడవాడి వాక్యాలు ఒక్కరీతిగా ధ్వనిస్తాయి పసికట్టండన్నాడు. అవును నారదుడు చెప్పింది నిజమే అని గ్రహించాం. ఇంగ్లీషురాని పెద్దవాళ్ళకు యీ కొంటెతనం, మోసం ఎలా తెలియపర్చగలమా అని చింతాక్రాంతులమైయున్నాము. నారదుడు ఓ గమ్మత్తుచేస్తాను చూస్తోండండి అన్నాడు. కాకినాడ కుర్రాడు వాకట్లో మాట్లాడుతోండగా, ప్రక్కగది గుమ్మంలో ఎవ్వరికి కన్పించకుండా కూర్చుని, ఆవాక్యాలకు తెలుగులిపిని షార్టుహాండు తీసి, తత్క్షణం, గాదికిందకెళ్ళి పాతాళహోమం చేసేటంత పూనికతో బ్రహ్మకు తెలియకుండా, పది పదిహేను తెనుగులిపిని నకళ్ళుతీసి, వాటిని వెంటనే పెద్దవాళ్ళకు అతిరహస్యంగా పంచిపెట్టాడు. పగలు భోజనానంతరం కాకినాడ అబ్బాయి పెద్దల సమక్షంలో యథాప్రకారం గజ్జకట్టాడు. పాపం యింత చాటునాటకం జరిగిందని ఎరుగడు. ఆ పెద్దలు ఏవో కాగితంముక్కలు చూచుకొంటోన్నారనుకొన్నాడు కాని, తన గొడవని ఎరగడు. కాకినాడ అబ్బాయి కంఠం సవరించుకొని కీ, యియ్యనక్కరలేకుండానే, మా కౌశికునివంక చూస్తో, వాట్ న్యూస్ ఓల్డు న్యూస్ ఏం అనిమాత్రం అని యిక అక్కడనుంచి 'I was ever of opinion' అంటో తన రోకళ్ళపాట ప్రారంభించేసరికి పదిమందీ పట్టుకో అంటే పట్టుకో అన్నారు. ఏలా దూకేసాడో రాత్రి భోజనాలవేళకు లేడు కాకినాడ అబ్బాయి.

యిప్పుడు కన్పించడేం మీ విద్వాంసుడని ఎటకారంగా నారదుడు మంత్రోపాసకుణ్ణి అడిగితే ఆయన లజ్జితుడైనాడు. రాత్రి భోజనాల్లో నారదుడు 'సిగ్గేలాగున లేకపోయె యిస్సీ గాథిరాట్పుత్రి, ఏ ఎగ్గూహింపక' అన్న హరిశ్చంద్ర పద్యాన్ని అవసరమార్పులతో అన్యాప

దేశంగా మంత్రోపాసకునిమీద, విజయగర్వంతో ఘూర్మ్మని శేహంగి రాగంలో దంచాడు. సరసం ఎరిగినవాళ్ళు నవ్వుకొనిఉంటారు. మంత్రో పాసకుడు ముక్కోపి, ముఖ్యంగా పరభాషా పక్షపాతి. కాకినాడ అబ్బాయి బంధుత్వంమూలాన స్వవిషయం అయిందికొంత. నారదుణ్ని ఉద్దేశించి, ''అబ్బో యీరకాల్ని చాలాచూచాను. యివి శుద్ధ మారని దమ్మిడీలు. కూడెట్టనా గుడ్డపెట్టనా యీ నాటకపు పద్యాలు, చూస్తో ఉండు చిప్ప చేతికివస్తుంది వీళ్ళకు. మన్నుకొట్టుకుపోతారు, నాల్గు యింగ్లీషుముక్కలు నేర్చుకొని, నల్గురిలోను ఓహో అనిపించుకోవాలి యీవేషాలకేం'' అంటో అంటచెయ్యి అధమం 5 సార్లేనా వెనక్కి మందరకి లాక్కొనిఉంటాడు. చూచారా, వరి పిలవని పేరంటానికొచ్చి కస్సుమన్నాడు. మధ్యన యీ శాస్త్రుల్లకి ఫుస్సు ఎందుకనుకొన్నాడు కాబోలు, మా నారదుడు ఆయనమీద బుస్సుమన్నాడు. నారదుణ్ని యీ గొడవ ఏమిటి అని మందలిస్తోన్నట్టు, కౌశికుడు యిస్ అన్నాడు. అక్కడనుంచి అయ్యా మాబంటూ అందరు ఒకరితర్వాత ఒకరు ఆ 'యిస్'ని దొరకబుచ్చుకొని గొల్సుకట్టుగా పది పదిహేను నిమిషాలు సాగ దీశారు. దాంతో మంత్రోపాసకుడు అల్లరిపడిపోతాం కుర్రాళ్ళతోపని అని ఊరుకొన్నాడు. ఊరుకోనిస్తే నారదుడు గొప్పఏమిటి. మరోపద్యం అందుకొన్నాడు. యీ దఫా ''భరతఖండంబు చక్కని పాడియావు హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ తెల్లవారను గడుసరి గొల్లవారు పితుకుచున్నారు మూతులు బిగియగట్టి'' అన్నది. రాగం అఠాణ. అప్పటికి బాబూజీబిపిన్‌చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనంచేసి కొద్దికాలం అయిం దేమో. బోడి నారాయణరావులాంటి దేశభక్తులు నోళ్ళు విప్పుతున్నారు. దేశభక్తి పద్యాలు మూలమూల్ల విద్యార్థులనోట వినిపిస్తోన్నాయి. వీటిని చదివితే యీ శాస్త్రుల్లలాంటి శ్రోత్రియులు అగ్గి అయిపోతున్నారు. చదివినవాళ్ళనే కాకుండా విన్నవాళ్ళనుకూడా కుంభిణీవాళ్ళు కట్టుకు పోతార్రా. మీకేం దొర్లిందిరా యివ్వేమొదలెట్టారు అని ఏడ్చిపోతు న్నారు కొందరు కర్మిష్ఠులు. పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, రాజభక్తి

దైవభక్తి అనేగాని దేశభక్తి అంటోకూడా ఓభక్తి ఉందని ఎరుగని అమాయకులు సామాన్యజనం. దేశభక్తి పద్యాలు, గేయాలు చదువుతోంటే ఆయోమయంగా చూస్తున్నారువాళ్ళు.

"భరతఖండంబు చక్కని పాడియావు," పద్యం చదివితే శాస్త్రుర్లు కంఠాన్ని ఊటిపోసుకుంటాడని నారదుడు ఎరుగుండే మొదలెట్టాడు. అందులోను అఠాణారాగంతో. ఒక్కొక్క సంగతి ఒక్క ముడిబిగించినట్టే ఆ రాగపు నడక. ఆఖరిని, మూడు ముక్తాయింపు లొచ్చినట్టు, అంత్యమవుతుంది. అవ్వి ఊతంగా కొడ్తోంటే ఆఖరి ముళ్ళుపడిపోయి శాస్త్రుర్లు ఉక్కిరిబిక్కిరి అయిపోతాడు. రాగ సంచారంలో, అభినయానికి మంచి సావుకాశం ఉంది. పల్లెటూరి పడుచులు, వీధిల్లో ఎదరబడి, కాట్లాడుకొంటోన్న సన్నివేశాన్ని స్ఫురణకు తెస్తాయి ఆరాగపు యమకగమకాలు. శుభ్రంగా చల్దిఅన్నాలు కొట్టేసి, సావుకాశంగా ఎడంచేతులు నడ్డపై వేసుకొని, కుడిగాజుల చేతులు గాల్లోకి విసిరేసి, శతృవుని సంభోదిస్తో, శతసహస్ర శాపాలాప దండక పఠనంచేస్తో ఎదురు సన్నాహాలకు ఎగబడే పల్లెటూరి ప్రౌఢలు ఆలపించేదీ అఠాణారాగమే. శత్రువును నిదానంగా చూస్తో యీ రాగంతో పద్యం చదువుతోంటే, రాయిమీద కత్తిని ధూకుడుగా నూరుతోన్నట్టో, చేయి పొంకంగా వెనక్కీముందరకు లాక్కొంటో బుగ్గలు పొడుస్తోన్నట్టో, వేరే అభినయంతో నిమిత్తం లేకుండానే, చూపరులకు భయసంభ్రమాలు కల్గుతాయి. రాగం పద్యం యింకా చాల నట్టుగానే నారదుడు, ఎదర, పంక్తిలో కూర్చున్న శాస్త్రుర్లుని చూచీ చూడనట్టుగా చేతి జో కాయింపులతో అభినయంకూడా పట్టాడు. యీ పద్యం చదివినా, విన్నా గతులుండవు, రౌరవాది నరకాలు ప్రాప్తిస్తాయి అన్న శాస్త్రుర్లు విశ్వాసం అటుంచి, వేలడుండి, యీ శుంఠ తన్ని వెక్కిరిపిస్తాడా అనే దురహంకారంతో శాస్త్రుర్లుకి శ్లేష్మం ఎగతన్నింది. పెళ్ళివాకట్లో శాస్త్రుర్లు చచ్చిపోతాడేమో అన్న భీతితో, మా కృష్ణుడు, "చను నే యింతటి సాహసంబు. ఏనాటికెవ్వండు ఊడొ అతని నిచ్చల్ గొల్వనా మెచ్చుగన్" అన్న లాయల్టీ పద్యం చాలా

హృద్యంగా, సురటి రాగంలో చదివి పద్యాలకా పూటకు సమాప్తి చెప్పాడు. శ్లేష్మరోగ పీడితుడికి, తేనెతో రసరాట్టు రంగరించి నాకించినట్టుంది కాబోలు శాస్త్రుర్లకు మా కృష్ణుని పద్యం వాడి పుణ్యమా యని తెప్పరిల్లాడు. తేరుకున్నాడు. శాస్త్రుర్లు పెంకిఘటమేమో ఆ మట్టున ఊరుకుంటాడా! ఎటువంటి పద్యం, ఎటువంటి పద్యం, రత్నంలాంటి పద్యం చదివాడీ రెండో కుర్రాడు. వీడి చంక నాకు నేర్చుకో, బాగుపడ్తావు అంటూ నారదుణ్ని అనార్యంగా అసభ్యంగా మాటలు మిగిలాడు పిచ్చికోపంలో. "శాస్త్రుర్లుగారూ, నాకీ గోకీశాస్త్రిలు మీరు నేర్చుకొన్నారేమో కాని, మేం యిప్పుడు బడిలో జీతాలుకట్టి నేర్చుకొంటూన్నాం. ఖర్మం మీ అలవాటు, అభ్యాసం నాకు నేర్పకండి. మీకో దణ్ణం" అంటూ బహుశాంతంగా ఆచాది పల్కి నారదుడు మాకుర్ర పటాలానికి కన్నుగీటాడు. మేమంతా బలే బలే నారదా అంటూ గోవిందం కొట్టాం. దాంతో శాస్త్రుర్లు రోషం పట్టలేక, 'గంటనుంచి వీడి అండ్రెబ్బ చూస్తున్నా, యిక ఊరుకునే వాణ్నికాను వీడి భరతఖండం ఏమిటో చూపెడ్తా వీడికి అంటూ విస్తరిదగ్గరనుంచి లేచి, బలం అంతా గుప్పెట్లోకి తెస్తోన్నట్టు నరాలుపొంగేలా గుప్పెడి బిగించుకొంటూ, రుపాయి కాసంత కుంకుమబొట్టుతో, జీబురుమంటోన్న మూరెడుగెడ్డంతో జై కాళీ అంటూ ఆపంక్తినుంచి ఎదట పంక్తికి ఒక్కటే ఉరుకు అమాంతంగా నారదుడు మీద పడ్డాడు. ఈలోపల నారదుడు నల్లికిల్లి పాములా ఎటు తప్పుకున్నాడో ఆయన కాళ్ళల్లోనుంచి బ్రహ్మకు తెలీకుండా దాటేసాడు. అడేం పిచ్చికోపమయ్యా పిల్లలతో కాక పోయినా అని అందామని అందరికీ నాలికచివర ఉందికాని పైకి అనడానికి మాత్రం ఎవర్కీ దమ్ములు చాలవు. మంత్రోపాసకుడు అన్నభీతీ, ప్రభుపక్షాన్ని పబ్లికు ప్రాసిక్యూటరుగా వకాల్తానామా పట్టి, నడుంకట్టిన జట్టిని గ్రామం యావత్తు కల్సికూడా కాదనడం ప్రమాదకరం అనే భయమూ, భోక్తలను ఆవహించి ఉండాలి. లేకపోతే ప్రతి ఒక్కడు అలా నిశ్శబ్ద ప్రేక్షక స్థానం అలంకరించడు.

నాల్గువందలమందీ మజ్జిగకు ఎదురుచూస్తోన్నారు. మామిడిపండ్లు కూడా వడ్డిస్తారారాత్రి. ఎంతో శ్రమప్రయాసలమీద తెప్పించిన పందూరారిమామిడిపండ్లు, కడియంపండ్లు, కావులువిప్పారని భోక్తలు గుటకలేస్తోన్నారు. మజ్జిగబానలు, మామిడిపళ్ళు, ఉప్పు, నిమ్మకాయలు, దొన్నెలు, సత్తెప్పాలాలు మజ్జిగసరంజామా సర్వస్వమూ కొట్టుగదిలో ఉంది. రావాలి. కొట్టుగదివైపునుంచి ఎవరు వస్తోన్నట్టు కన్పించినా మామిడిపండ్లొస్తోన్నట్టే ముందుపంక్తుల తలపైనుంచిచూస్తో, తీరాకాకపోతే తమనుకానట్టు సద్దుకొని చతికిలబడుతున్నారు. తీరా మామిడిపళ్ళవేళకు నిద్రకుపడ్డావేమిరా అని ఎవళ్ళపిల్లల్ని వాళ్ళు లేపుకుంటోన్నారు. కళ్ళకు నీళ్ళురాస్తున్నారు విస్తళ్ళదగ్గర. పందూరారిపండు ప్రాశస్త్యం కథలక్రింద చెప్పుకుంటోన్నారు. మిగతా మామిడిజాతులు అంగుడికే తీపి కాని పందూరివారిపండు తిన్నవాడిమాటకుకూడా తీపివస్తుందట. ఆపండు కుళ్ళడం ఎరగదని ప్రఖ్యాతి. కావు విప్పినతర్వాత 20 రోజులు పెట్టినా ముసలిముత్తైదువ శోభ తెచ్చుకుంటుందికాని చెడదు. ఆపండు తిన్నతర్వాత 15 రోజులు ఏపదార్థం నాలికమీద పెట్టుకొన్నా చవ్వన అయిపోతుందట, అన్నహితవు ఉండనేఉండదట. హిమశైలశృంగవాసియైన ప్రావాకర్ణుడనే ఘూకమో, కాకమో పాండవుల అరణ్యావాసంలో,—ద్వైతవనవాసంలో అంటారు, వనవయినం స్పష్టంగాలేదు.—ద్రౌపది యథాలాపంగా కూర్చునిఉండగా ఆపెవళ్ళో పడేసిందట, యీఫలాన్ని. చుట్టుప్రక్కల మామిడిచెట్లు కనిపించవు యిదేం మాయఫలమో అని ద్రుపదరాజపుత్రి ఆలోచనాయత్తచిత్తయైయుండగా, ఆకాశవాణి ముమ్మారు మద్దెలదెబ్బలుకొట్టినట్టుగా 'తిన్నె, తిన్నె' అందని, లచ్చయ్యావధాన్లుగారు కాలక్షేపార్థం ఒకయితిహాసం లేవదీసి భాషాపరిణామదశల్లో పాండవులనాటి అన్నది యీనాటికి పందూరారి మామిడిపండయిందని ప్రతీతి అని సెలవిచ్చారు.

ఈలా పందూరారి మామిడిపండుప్రశంసలో నిమగ్నులై కొందరు, ఊహాగానంతో తన్మయులైకొందరు, ఎదురుచూపులుచూస్తో అందరూ

కన్పెట్టుకొనిఉండగా, పెళ్ళిపెద్ద, పెళ్ళికూతురి వేలువిడిచిన మేనమామ— కొట్టుపెత్తనం అయింది,—వడ్డనపరివారం రిక్తహస్తాలతో, ఏమిటిది అంటే ఏమిటిది అంటో దిగాలుపడి వస్తోన్నారు. ''తియ్యడంలోను వెయ్యడంలోను దానంతట అదేపడిందా, ఎవడైనా దూరాడా, లోపలఘుడియ పట్టింది. బాదినా రావటంలేదు తల్పులు'' అనే మాటలు భోక్తలకు కర్ణశూలాయమానంగా వినిపించాయి. పంక్తుల్ని నైరాశ్యం అలుముకుంటోంది.

♦ ♦ ♦

## కృష్ణుని ఉపన్యాసం.

మా కృష్ణుడు చర్రునలేచి వెళ్ళొచ్చి ''అయ్యా కూర్చోండి, కూర్చోండి. మరివచ్చిన ఉపద్రవంలేదు. శాస్త్రుల్లుగారు చంపేస్తాడని హడలిపోయి మా నారదుడు ప్రాణరక్షణార్థం కొట్టుగదిలో దూరాడు. ప్రాణంఅంటే శాస్త్రుల్లగారిలాగే వాడికీ తీపే. ఏంచెయ్యం. ఎందుకందుకు కోపం. పైవాళ్ళం ఆలోచించుకోదగ్గ విషయం వచ్చింది యిక. ఆచీకటికోణంలో వాడిక ప్రాణం విడవతగ్గదా, పైకొచ్చి శాస్త్రుల్లగారి చేతిలో ప్రాణార్పణ చేయదగ్గదా. పెద్దలు నిర్ణయించాలి. ఏలా కావాలంటే అలాగే చేయిస్తాను. వాడి చావుబ్రతుకులు శాస్త్రుల్లగారి అగ్రహాను గ్రహాలమీద ఆధారపడిఉన్నాయి. రక్షించినా భక్షించినా ఆయనే కాబట్టి, యిక వాడిబ్రతుకు అబద్ధం. వాడు బ్రతికి బట్టకట్టడానికి నేనే కాదు మీరు యావన్మందీ నడుంకట్టినా అది శుష్క—ప్రయాస, వ్యర్థం. ఇప్పటికింకా శాస్త్రుల్లగారికళ్ళు చింతనిప్పుల్లా ఏలాఉన్నాయో చూడండి. ఆఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎంతవేడిగావస్తున్నాయో చూస్తున్నారా, గుప్పెట సడలినట్టు ఏమాలా కన్పించదు. నారదునికి ఆయువు మూడిందికాబట్టే 'అట్లైక బెడ్డవిసరి కాలాహి రేపి, తత్ఫలమునొందు బాలువిధంబున' శాస్త్రుల్లగారిని చూస్తూకూడా, దేశభక్తిపద్యంచదివి వారితో తలకుమీరిన వైరం తెచ్చుకున్నాడు తీరికూర్చుండి. వాడు భరతఖం అన్నప్పుడే, శాస్త్రుల్లిగారి

వంక చూస్తోన్న నేను, నారదా నాయినా నీకునూరేళ్ళునిండాయిరా! చేయి జారిపోయావా అనుకున్నా. నారదుడు యిక మావాడు కాడు. మాకు లేడు. అందుకు మాకు బెంగ అక్కర్లేదు. స్నేహితులమటో వాడు మమ్మన్ని నమ్మిఉన్నాడు కాబట్టి, రక్షించకల్గనీ, రక్షించలేకపోనీ, అందుకు యత్నంచేయడం మాకనీసకర్తవ్యం. తోడిమానవు డన్న కారణం చాలు మీలోపుణ్యాత్ములకు, అందుకు సాహసించకల్గితే. శాస్త్రుల్లుగారు అలా నిప్పులు కక్కుతోంటే, సాహసించకల్గే వారుండరని ఎరుగుండీ కూడా, నా మమకారంకొద్దీ, నేను వెర్రిఆశతో, పోనీ నారదుడు బ్రతికితేం అనేవారు ఒక్కరైనా ఉండకపోతారా యింతసభలోను, అని నావయసుకు మీరినపని పైనివేసుకున్నా. నారదుడు ఒకటిఅయితే నేను రెండు, అనే దిగా రంగంలోకి. మీకు ఒక్కమనవి చేసుకుపోదామని వచ్చా.

పద్యంలో ప్రభుతిరస్కృతి కన్పిస్తోన్నమాట వాస్తవమే. ప్రభువు విష్ణుఅంశా సంభూతుడని శాస్త్రుల్లుగార్లు రోజ్యారోకళ్ళా పాడుతోన్న పాట కాదనటానికి నేనెంతవాణ్ని. కాని ప్రభుత్వమే యీనేరానికి ఉరిశిక్షకాని మరోమరణదండన కాని శాసించలేదు. శాస్త్రుల్లుగారుమాత్రం నారదుణ్ని బలికోరుతున్నారన్నా, నారదుడిరక్తం బొట్టుపెట్టుకోదలచుకున్నారన్నా, అపారపారావారం, అనన్యసామాన్యం అయిన వారిరాజభక్తికది ప్రబలనిదర్శనమే. వారి ప్రభుభక్తికది నిల్వుటద్దమే. ఇటీవల రాజమంత్రివర్గెరా కొన్నిపట్నాలు చెడిపోతోన్నరోజుల్లో, దేశభక్తి అనే దారిద్ర్యదేవతను మనగ్రామంధరిమానా రానీయకుండా, యీగ్రామం యొక్క శుచి శుభ్రతలను కాపాడే పుణ్యాత్ముడు మనకు పెట్టనికోటలా లభించినందుకు, మీతోపాటు నేనూ గర్విస్తోన్నా.

అయినా, భరతఖండం అనేటప్పటికే శాస్త్రుల్లుగారికి మతిపోతుందని, అంతులేని చిత్తక్షోభ కల్గుతుందని నారదుడికి తెల్సునో తెలియదో. బాల్యచాపల్యాన్ని వాడు దానిని ఒక అత్యాచారంగా తలచియుండకపోవచ్చును యింతకు మనగ్రామంలో పోలీసులు లేరు. పెళ్ళికికూడా ఉద్యోగస్తులు

ఎవరూ రాలేదు. వీధితలుపు వేసే వడ్డన ప్రారంభించారు. మన్ని కాని, శాస్త్రుగ్లుగారిని కాని, పోలీసులు కట్టుకొనిపోతారన్న భయం ఎవర్కీ ఉండ నక్కరలేదు. శాస్త్రుగ్లుగారు కర్పితే యింత అఘాయిత్యం తణుకులో నారదుడు చేసాడని ప్రభుత్వానికి పితూరీ చేయగల్గిన వ్యవహార్త లేదు మన ఊరుమొత్తంమీద. యింతకు శాస్త్రుగ్లుగారు పంచప్రాణాలుగా ప్రేమి స్తోన్న బ్రిటిష్ ప్రభుత్వంపైనగాని, వారికి ప్రియతముడైన జార్జిప్రభువుమీద గాని నారదుడి నీరసపు పద్యంతో యీగవాలలేదు. వీడిగాత్రం యీ గోడలు దాటలేదు. అలాంటప్పుడు సప్తసముద్రాలావతల ఎక్కడో మనం చూడని ప్రాసాదాల్లో సుఖాన రాజ్యభోగాలు అనుభవిస్తోన్న ఒక వ్యక్తి పేరట, సరదాగా పిల్లలతో కలసి పంక్తిభోజనానికి వచ్చిన మనవూరి పిల్ల కాయ ప్రాణాలు నిల్పునా మనం పుచ్చుకోవడంలో కాస్త పరమార్థ మాలోచించమని కోర్తున్నా. 'భరతఖండంబు' అన్న పద్యం మేం చదవము అని ఎక్కడవిన్నా చదివేవాళ్ళను బెడ్డలుపుచ్చుకు కొట్టి వాళ్ళ ఊరుపేరుసహితం తెచ్చి శాస్త్రుగ్లువార్కి నివేదించి నిరంతరం జార్జిప్రభువును, మేరి రాణిని త్రికాల సంధ్యావందనంగా స్తవంచేస్తో దేశభక్తుడనే దుర్మార్గుడెవడూ మనఊళ్ళో అడుగెట్టకుండా వేయికళ్ళతో కాచుకొంటో తణుక్కి ప్రభుభక్తిపరాయణుల పుట్టిల్లని ప్రఖ్యాతి వాడవాడల చేకూర్చ డాన్కి మాప్రాణాలర్పిస్తామని మావిద్యార్థుల తరఫునశాస్త్రుగ్లుగార్కి కోరినహామీ యిద్యుడాన్కి, సిద్ధంగాయున్నాను.

మరి నారదుణ్ని రక్షించాలంటే రెండే గత్యంతరాలు. శాస్త్రుగ్లుగారు కొట్టుగది తలుపువద్దకు వెళ్ళి నాదేపొరపాటు. విస్సు చంపను. బయటకురా అని అభయహస్తమిచ్చి తీసుకురావాలి. అది వార్కి యిష్టంకాక పోతే శాస్త్రుగ్లుగారిని ఒంటిగుమ్మమే ఉన్న గదిలోపెట్టి, గదికి తాళంవేసి తాళంచెవి నాచేతికిచ్చిమరీ నారదుణ్ని పైకితీయాలి. యీజాగ్రత్తలు పడకుండా నారదుణ్ని బయటకు రమ్మనమన్నామంటే నరహత్యాదోషం మధ్యన మీమెడకు చుట్టుకొంటుంది. నారదుడి వాసన తగిలేటప్పటికల్లా బ్రహ్మరాక్షసిలా శాస్త్రుగ్లుగారు వాడిపైన పడి వాడి మెడ కొరికేస్తాడు.

అదిరూఢీ. అప్పుడు యీ నాల్గువందలమందీ కల్సి అడ్డంపడ్డా కాయలేం. నిజం ఏదీ నిర్ణయించండి!'' కౌరవసభలో ద్రౌపదికి న్యాయం చెప్పండని వికర్ణుడు పెద్దలను అర్థించినట్టుగా, అర్థించాడు. మాబాలకృష్ణుడు. పండూరారి మామిడిపండు తెంటామో మానామో కాని యెంత రసవంతంగా రుచికరంగా ఉన్నాయోయి యాజులూ, ఈకుర్రాడిమాటలు అనుకుంటు న్నారు పంక్తుల్లో.

పంక్తులమధ్య నిలబడి నిమ్మకు నీరోసినట్టుగా కృష్ణుడు భోక్తల కీ హెచ్చరిక చేసేసరికి నారదుడు బ్రతకాలి అన్న అభిప్రాయం వారి కళ్ళల్లో ప్రత్యక్షమైంది. జనవాక్యం నారదుడిపైపే మొగ్గిందని శాస్త్రుల్లు బెదరాడో, భోక్తల మజ్జిగవడ్డనకీజన్మలో అడ్డంపడితే మళ్ళీజన్మలో వుంత లంట గొడ్డుగేదెలను మేపుకుంటో పాడిచుక్క లేకుండా పోతానని భయ పడ్డాడో, దీర్ఘకోపం లాఘవం కాదనే పరివర్తన దైవికంగా కల్గిందో, చీకటిగదిలో తాను బంధితుడవడాన్కి మనసిచ్చగింపలేదో— రాజభక్తి సడలిమాత్రం కాదు. భరతఖండంబులాంటి పద్యాలు చదువొచ్చునవిమాత్రం కాదు—. ఏమైతేం, కృష్ణుడు, శాస్త్రుల్లు, ముందూ, వెనక పెళ్ళిపెద్ద పిల్లకు వేలువిడిచిన మేనమామ, వడ్డనబలగం, మాగాయిబద్ద, మంచితీర్థం వడ్డించే యిద్దరు ముసలమ్మలు కొట్టుగదికొద్దకు వెళ్ళారు. తూ, చాలు తప్పకుండా కృష్ణుడు అనమన్న రీతుగా శాస్త్రుల్లుచేత అనిపించి, నారదుణ్ని సమాధాన పరచి నారదుడు సహితం మజ్జిగ మామిడిపండ్లు పంక్తులకు చేరేసారు. రూపంలేకుండా మామిడిపండ్లను పీల్చేశారు, పీకేశారు బ్రాహ్మణ్యం మజ్జిగ జుర్రేశారు. శాస్త్రుల్లు నైష్టికుడు కాబట్టి మళ్ళీ విస్తరదగ్గర అంతమందీ చూస్తోంటే చేరడాన్కి బాగోగులాలోచించుకొని వేరే పిట్టఅరుగుమీద కూర్చుని 2 పెద్ద సత్తెప్పాలాల నిమ్మరసభరితం మజ్జిగ ఒక్కడజను నారి కేళఫల పరిమాణం మామిడిపండ్లుమాత్రం మాట్లాడుతో ఊదేశాడు. శాస్త్రుల్లుగారు మధ్యగా లేవవల్సివచ్చింది, పాపం కడుపు నిండిందోలేదో అన్నీ పెళ్ళిపెద్ద పరామర్శిస్తోంటే త్రేణ్చి గోడకు జార్లపడ్డాడు. కొట్టు గదిలో పెట్టడంచేత కామాలు కొన్ని పెద్దపండ్లను ఎలకలు కొరికాయండీ

అని శాస్త్రుర్లు పాడెంపట్టు పీలుస్తో పెళ్ళిపెద్దతో భోజనానంతర ప్రసంగంలో అంటోంటే మానారదుడు 'అయ్యో ఆకాయలు కొంపత్రవ్వి మాకొచ్చాయేమిటి. పంచూరారి మామిడిపళ్ళు వైనం తెలియక ఏవోఅని కొరికి బాగాలేవని వదలేస్తో వచ్చాను కొన్ని కొట్టుగది కాపురంచేసినప్పుడన్నాడు. ఓరి ఎంతనాటకం ఆడావురా? ఎంతకైనా తగినవాడవురా! గుంటనక్క అని శాస్త్రుర్లు నారదుడికి నామకరణంచేసి ఆశీర్వదించాడు. వ్యాఘ్రంతో చెలగాటాలాడాను. దాని పంజాదెబ్బ తినకుండా బ్రతికి యీవలపడ్డాను. అంతేచాలంటో శాస్త్రుర్లుగారి నిజ నామోత్కృష్టతను స్తవంచేస్తో నమస్కరించాడు నారదుడు. శాస్త్రీనారద సమరం సుఖాంతమే అయింది అని కృష్ణుడు భరతవాక్యం చదివాడు.

## సుభద్రా గర్వభంగం.

మంగలి గూడింలో వెంకటేసు చేతి చెంపకాయ నాందీ శ్లోకంతో ప్రారంభించిన సుభద్రా గర్వభంగ ప్రదర్శనానికి, భరతవాక్యం అవనిక వెనక చదివి, మంగళం పాడేసాం. స్టేజీ మీదనుంచి, సుభద్ర సైడ్డు కర్టెన్లోకి అడుగిడేసరికి, దూరదూరంగాను, దగ్గర దగ్గరలోను కనిపెట్టుకొన్న మాబాల పఠాలం, కనుగీట్లతోను, తర్జనీ సైగలతోను, సన్నసన్నటి యీలలతోను, కూడ బలుక్కుంటో వచ్చిపడ్తోన్నారు. సుభద్ర ఎటూ దారిచేసుకొని దాటడానికి వీల్లేకుండా, సంగరోత్సవ సంభృతోత్సాహులై చుట్టూ ఏలా చుట్టేసారో చూచారా. పాపం, పలుకుబడి మంటగలసి, పద భ్రష్టుడై, విరథుడై, సింహాసనాద్యుతుడైన కర్ణం అల్లుని దృశ్యం నిష్పాక్షికులకెంతో కరుణా రసబరితంగా కన్పించొచ్చు. కాని మా భీమసేన, ఘటోత్కజ శైబ్య చేకితాన ద్రౌపదేయుల బారినుండి, అతని రక్షించి, ఎవరు ప్రాణ భిక్ష పెట్టగల రీ దుర్యోగంలో. ఆ ధర్మాత్ముడొక్కడే కాయాలి. కాని కర్ణం అల్లునికి రోజులు బాగాలేవు.

'నరులు మృదువితడనంగా బరగు యుధిష్ఠిరుడుకూడా నేడతి నిష్ఠురుడై నట్టున్నాడే'. ఆ అనవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వం ఏమూలా కన్పించదేం, యీనాటి ధర్మజుని కళ్ళల్లో. కోపత్రవ్వి, సంభాషణతో నిమిత్తం లేకుండా, మా భీమసేనుడు, కలియబడి, వీపు విరగబాదిచి, కర్ణం అల్లుని కళేబరాన్ని యీడ్చుకువెళ్ళి నగరద్వారంలో గిరాటేయకు కదా, కుడిగుప్పిడి నరాలు పొంగుతున్నాయి! అమ్మో! అప్పుడే తమకు సర్వసిద్ధంగా భోజ్యం లభించినట్టు, మా శిష్టశ్రేణికి కొలది దూరంలో పొంచి కూర్చుని మా కౌసికాది రాబొందులు ముక్కులు గీరుకొని పదునెట్టుకొంటూన్నాయే! ధర్మరాజ కృష్ణులు రసజ్ఞులు, రసభంగం కానీయరు. యింతకు ధర్మరాజుతో వ్యవహారం కత్తిమీద సాము. చిలిపితనం, ధూర్తలక్షణం మావాళ్ళే చూపితే ముందు వీళ్ళ భరతమే పట్టి శత్రువునే కాచే లక్షణమంటిగా ధర్మజుడిది. అలాంటి హఠాత్ సంఘట్టన ఏదో కాయాలికాని, కర్ణం అల్లుడు కాలం ఖర్మం మూడినట్టే కన్పిస్తోన్నాడు. "Fate rests upon him. He is already a doomed man" ఎవడు చేసుకొన్న పాప ఫలం వాడు అనుభవించడం 'poetic justice'.

ధర్మరాజు కాఠిన్యం కర్ణంఅల్లుడిమీద కానట్టుంది. కర్ణం అల్లుడివంక చూస్తున్నాడు, అర్జునునివంకా చూస్తున్నాడు. కళ్ళల్లో ఎర్రచార కన్పిస్తోంది. మేమూరక ఉద్రిక్తుల మవుతోన్నామనికూడా కుపితుడు అవుతున్నాడా? యీబలగాన్ని చేయిచేసుకోనీకుండా తానే సన్నసన్నగా మరీ తలవాయకుండా రెండంటించి కర్ణంఅల్లుణ్ణి కృష్ణుడికి వప్పగించి కోట అవతల వదలిరామనదలచుకొన్నట్టుంది వ్యవహారం. కాని కుర్రాళ్ళు బలి కోరుతున్నారు. ఏలా సమర్థిద్దాం అని అడుగుతోన్నట్టు కృష్ణుడివంక తిరిగాడు. అంతలో చెప్పాగా గయుడు చిలిపితనం సాహసం కలిపి కూరిన చిచ్చుబుడ్డి అనీ పొలంవాసన్ను వదలలేదనీ 'చూస్తారేమిరా యింకా వీడి మొఖంమీద కాండ్రించి ఉమ్మివేయక' అన్నాడు కర్ణంఅల్లుడిని గురిచేసి. ఈ అనార్య అసభ్య ప్రలాపంతో ధర్మజుడు నిర్విణ్ణుడై నీపాత్రకు

తగినమాట నీనోటంట వచ్చింది. కృష్ణుడిమీద నిష్ఠీవనం వేసినందుకు నీనాటకమే తలపెట్టి యింతగా కృతార్థులమైనాం. అప్పుడైతే బ్రతికి బయటపడ్డావు అర్జునుడు కాపాడు కాబట్టి. యిప్పుడు నీ దుశ్చరితానికి యిక్కడ నిన్ను కాచేవాళ్ళు లేరని ఎరిగుండు. కృష్ణుడిమీద నిష్ఠీవనంవేస్తే నిన్నర్జునుడు కాపాడాడు కాని, సుభద్రమీదేవేస్తే నిన్ను వల్చేయగలడు జాగ్రత్త. యీపూటకు సుభద్ర లేకపోతేం అని నారదుడు అన్నంత మాత్రాన్నే నాటకప్పాక అంటించడాన్కి ఒడిగట్టిన సూరాపసూరుడు. అర్జునుడు సుభద్రమీద నిష్ఠీవనమేపడ్తే నిన్ను కాస్తాడనుకొంటోన్నావా? కల్ల. అర్జునుడికి మన అందరికన్న మన నాటకంకన్న సుభద్రపైన ప్రేమ పెంపులుండడంచేతనే యీరాత్రి యి లాంటి మహత్తరసన్నివేశం మహాను భావుడు ఏలూరిఅబ్బాయి పరిచయభాగ్యం మనకు మనమూలంగా మన గ్రామస్థులకు లభ్యం అయ్యాయి. మళ్ళా మీనాటకం ఎప్పుడని గ్రామ స్థులు అడగవల్సిన అవసరం లేకుండా. అందరికీ తనివితీరింది యిక్కడికి. యింతలింతలి ప్రతిభావంతులం మనంతెచ్చుకొన్నది అనుభవించాం ఖ్యాతో అపఖ్యాతో. గులివిందపూసల వైఖరిని మాట్లాడుకొంటోన్నాం పైగా'' నని సమాజాన్నే దెబ్బకొట్టాడు ధర్మరాజు. అంతతో ఆగక ''ఏమోయి అర్జునా అంతేకాదు'' అంటో ధర్మరాజు అర్జునుణ్ని సంబోధించాడు. సై అన్నట్టు తల ఊపాడు కృష్ణుడు. ఎండపడ్డాం వళ్ళుమండింది అని చెప్పడానికీమధ్య ఓరచయిత, ''దక్షాధ్వరంలో వీరభద్రుడి కాలితన్ను తిని పళ్ళూడకొట్టుకొన్న సూర్యుడుకూడా మావంక చూచి పకపకానవ్వాడు'' అన్నాడు. అలాగ వెంకటేసు చంపకాయతో దంతాలు కదలిన కర్ణం అల్లుడుకూడా యీ సంక్షోభం యావత్తుకు కార్ణం తానే అయియుండి, మిమ్మన్నే మందలించాడులే మీధర్మరాజు అయిందా అన్నట్టు మమ్మన్ని చూచి నవ్వాడు. యింకొక్క నిమిషంలో చావనున్నాడనుకొన్నవాడు నవ్వానా. కాలవైపరీత్యం, ఘటనాఅంటారు దీన్నే. దాంతో మాసమాజం యావన్మందికి లోపల కాలుకుపోతోంది. పైకి భగ్గుమనడం తర్వాయి. ద్రౌపదీ వస్త్రాపహారణ సమయంలో దింపివతలలు `త్తకుండా కార్ణం

ధర్మరాజే అయినా, ధర్మానికి కట్టుబడి పాండవులు పరాభవానికి కుమిలి నట్లుగా తలలొంచుకు నుంచున్నాము. ఉత్పాతచిహ్నాలు, విప్లవ లక్షణాలు పొడసూపుతున్నాయి. ఎట్లా పరిణమిస్తుందోతుదకు అని కృష్ణుడుకూడా ఖిన్నుడైయున్నాడు.

ఇంతలో అర్జునుడు ఏంకల్పించుకున్నాడో, నాటకరసాభాసాని కేవత్తుకూ కారణం తన పెంకిపట్టేనని ధర్మరాజు తన్ని అందరిలోను మాడ్చాడనే ఉపసమోత్తనం ఎగతన్ని, "ఎవళ్ళో నన్ను ఎల్లాగాతిడ్తారు. అప్పుడు నీవు నన్ను కాస్తావనుకున్నానుగాని నీవే నన్ను తిడ్తావు అని అనుకోలేదురా అన్నయ్యా నేనిక ఎవరితో చెప్పుకోనురా అన్నయ్యా" అంటూ ధర్మరాజు మోకాళ్ళమీద తలెట్టి అర్జునుడు బోలుబోలుమని ఏడ్వడంప్రారంభించాడు. భారత భీముడికి మాభీముడు నకలేననంటిగా. ఒక రోజున తనతల్లిమీద కోపంవచ్చి ఆవిడ అలికినగుమ్మం గడ్డపారతో పొడి చేసి తర్వాతరోజున ఆవిడమీద పెరిగ్రేమకలిగి ఆవిడను నీళ్ళైనా అందీయనీయకుండా యావత్తుగుమ్మం ఒక్కడు మండుటెండలోనుంచుని కట్టాడన్న మాభీముడు ఖ్యాతివినే, కించెత్తుసుతిలో కలవకపోయినా పద్యంపొంకం చెడనీయడుకదా అని, భీమపాత్రకు అతన్ని పెతికాం. వాడికి ధర్మరాజు మాటలు అర్థమయ్యో లేక అర్జునుడు కంటతడిపెట్టినందుకు హృదయం స్రవించో, అత్యుగ్రుడైపోయి "పరీక్షలకేనా ఎప్పుడు యింతశ్రద్ధగా తయారుకాలేదు. పడకర్లించేసి పాతికరిహార్సల్సేసి, సిద్ధంచేసుకొన్న నాటకాన్ని ధ్వంసంచేసిన త్రాష్టాన్ని - గుడ్లొట్టుకు ఏలా చూస్తోన్నాడో చూడు గుడ్లగూబలా - యీ ఆషాఢభూతిని అనవుకాని మధ్యగా కుర్రాడినిచేసి అమాయకుడు అర్జునుణ్ని ఏడిపిస్తావా. పైవాళ్ళకు ఎప్పుడూ మంచివాడివిన్ని కూడాఉన్నవాళ్ళకు కొరకంచున్నూ కౌశికుడన్నట్టు. గుణం పోనిచ్చుకొన్నావుకావు. సమాజం అంతా ఏడ్చిపోతున్నారు నీమూలంగా, నీపైతే ఏమనుకొంటోన్నావో యేమో అని భీముడు ధర్మజుడిని దులిపేసి, రివ్వున చెయ్యెత్తుకొని వీడ్ని చీల్చి ప్రేగులు మెళ్ళో వేసుకోకపోతే నన్ను ప్రేరేపారి అబ్బాయని పిలవవద్దు అంటూ - ప్రేరేపార్కి కొట్లా

టల్లోను, పోట్లాటల్లోను ఆంధ్రదేశంలో ఏలాంటి ప్రతిష్ఠఉందో, ప్రేరే పారి అబ్బాయి అన్నవాడు యింతకు ఒక్కమనిషైనా, ఎక్కడైనా కొట్టాడోలేదో నిజానికి మాకేమీ తెలియదు. అలాంటి ఘోరప్రతిజ్ఞ చేసి, నిప్పులుకక్కుతో కర్ణం అల్లుడి మెడకు ఎగబడ్డాడు. చర్రున వెనక నుంచి కృష్ణుడు భీముడి నడుంవేసుకొని, ''పొగరుగలవానిని పొడచుట పోలుగాక...చచ్చిపోయిన పామునే చంపనేలా'' అంటో తద్భావాను గుణ్యమైన శ్రీరాగంలో, ''చచ్చిపోయిన పామునే చంపనేల'' అన్న శబ్దగుచ్ఛాన్ని మూడు స్థాయిల్లో ముమ్మారు పల్కుతో - మా కృష్ణుడికి రాగంమీద ఎంత హోల్డు ఉందో అద్భుతమవుతుంది. పాము అన్న శబ్దం లోకి గాత్రం ఊతం అంతా తెస్తో - ఆశబ్దం పల్కేటప్పుడు స్పష్టంగా తగ్గనితో కర్ణం అల్లుడ్ని నిరూపిస్తో, కుర్రాళ్ళకు కర్ణం అల్లుడిమీద పేరు కొనిఉన్న యావత్తు కక్షా యీ ఒక్కపద్యంతోను తీరేలా, పెద్దాళ్ళు కేవలం Music of the Spheres వింటోన్నట్టు తన్మయులయేలా, చేతనైన చేతుల్లో సంగీతానికేలాంటి సద్వినియోగ సావకాశాలున్నా యిరా, తెల్సింది కాదు అని వ్యర్థవాదాభిలాషులైన విమర్శకులకు నచ్చేలా 'లయ పెంచుతూ, మధ్య లయ దించుతూ, పాట రయమెంచుతూ' అయ్యా మూడు నిమిషాలాలా పాడేసాడు. ఆడేసాడు. మా కృష్ణుడి గాత్రగాంభీర్యమాధుర్యాలేమో కాని, మాంచి యమకగమకాల్తో, ఆరోహణావరోహణాల్తో మా కృష్ణుడు శ్రీరాగం సంగతులు విసురుతోంటే దేవదుందుభులు మ్రోసాయంటే అతిశయోక్తి కాదు. ఆ కళాకౌశలం ఏమో కాని, ఆ ఒక్కపద్యంలోను, క్రోధ కరుణారసాల్ని అటు ధర్మరాజును కలియకట్టడానికి, యిటు కుర్రాళ్ళకు కక్షతీరడాన్కి ఎంత నేర్పుగా పంచాడండీ. ఒక స్థాయిలో కుర్రాళ్ళకోసం 'చచ్చిన పామునే చంప' అని చదివేటపుడు పాంచజన్యం పూరించినట్లుండనా. ఆ పదాలే మరోస్థాయిలో ధర్మజుడికోసం చదివేటపుడు మురళి మ్రోయించి నట్లుండనా. అటు క్రోధం, యిటు కరుణా ఏలా గుమ్మరించాడూ! అంత ఝూంకారం యింత జాలి ఎక్కడ దాగిఉన్నాయి మా కృష్ణుడి చిన్న

గుండెలో యింత కాలాన్నుంచి, అన్పించింది. పదవిరుపుల్లో, రాగసంగతుల నిర్నయంలో క్రోధకరుణారసాల్ని రెంటిని చూపుతో మాకృష్ణుడి పోల్కేను పద్యం చదివి నెగ్గినవార్ని ఒక్కరినేవిన్నా నాటికినేటికి. డి. వి. సుబ్బారావుగారు దుష్టబుద్ధిపాత్రలో చంద్రహాసుడిని చంపించడాన్కి తానుచేసిన వివిధప్రయత్నాలు విఫలమైనతరి, చంద్రహాసుణ్ని ఆదరిస్తోన్నట్టు కౌగలించుకొంటాడు. నిజానికి కంఠందాకా క్రోధాగ్ని ఉంది. చంద్రహాసుడు కురార్రైన కాగ్గంగా చంద్రహాసుడితల దుష్టబుద్ధి గెడ్డంక్రింద ఉంటుంది, ఆ కౌగిలిసమయంలో. దుష్టబుద్ధి హావభావాలు ప్రేక్షకులకు కన్పిస్తోంటాయి, ముఖం ప్రేక్షకులవైపుకు ఉండడంచేత. సన్నివేశం అది పద్యంలోపాదం. 'పాపిదైవము నీకెంత పాటుదెచ్చె' ప్రేక్షకులవంక చూస్తో పాపి అను పదాన్ని విడదీసి చంద్రహాసునిమీద తనకున్న కోపమంతా పాపి అన్న రెండు అక్షరాల్లోను కక్కేస్తాడు. ప్రేక్షకులవంక చూస్తో ఆ ఒక్కమాటా అని, అంతలోనే చంద్రహాసుడివంక తిరిగి 'పాపి దైవము నీకెంత పాటుదెచ్చె' అన్నది యంతో జాలిగా కలిపి చదువుతాడు. శ్రీ సుబ్బారావుగారు పద్యపఠనలో అనన్యసామాన్యమైన పనివాడితినం చూపెట్టారు. మేం ఎక్కువ నాటకాలు ప్రదర్శించి సంచారాలు చేయలేదుకాని ఆ పెద్దపేర్లవార్కి నటనాకౌశలంలో గానమాధురిలో మా కృష్ణుడు తీసిపోడని, చిన్న మెత్తు గోరోజనం మా సమాజాన్కి ఎప్పుడూ ఉండేది. సంగీతంఅంటారా మా కృష్ణుడి కంఠం, కిన్నెర కంఠం. కలస్వనం, పంచమస్వరపూరితం. అప్పటి మా కృష్ణుడి అందం మాటలకందదు. మొదటియాక్టులో స్టేజీమీదకు వెళ్ళివచ్చిన మేకప్పులోనే సర్వాంగాలంకారసుందరంగా ఉన్నాడు సమున్నతాంగుడు. విరచి కట్టింది వంగపండుఛాయ షట్టుతాపితా వాడి అన్నకు అత్తారెట్టింది. తలకు కట్టింది బర్హిపింఛం, మాయింటో విసనికర్రవి నెమలికళ్ళు పీక్కొచ్చి కుట్టాం. మొలకుచుట్టింది, దాసరి కోటయ్య చంకీపటకా యిస్తానని యియ్యకపోతే, నారదుడు చింపుకొచ్చిన వాడి వదినెగారి చీరె జరీఅంచు. చేపట్టింది అమధ్యావన్నామే ముచ్చిబంగారం అంటించిన చక్రం. మెడ

కట్టుకున్నది కృష్ణుడి అక్కకు అత్తారెట్టిన బంగారపుగొలుసు. అన్నిటికన్నా మిన్న బంగారు కెత్తుకెత్తు బాల్యవయసు, చక్కటిఛాయ, కడుపు నిండే కనుముక్కుతీరు, వర్చస్సు, వలం, చివళ్ళ ఉంగరాలు చుట్టుకొని తల త్రిప్పేటప్పటికల్లా వస్తుగా వీపుమీద ఎగిరిపడ్తోయున్న గిరజాజుట్టు. ఒంటిగా పాకదాటనిస్తే ఏ దేవకన్యకలు ఎగరేసుకుపోతారో అన్నట్టున్నాడు అంగరసశృంగారంలో. వాడు పద్యం చదివాటప్పటికి వాడిచుట్టు పండువెన్నెల కాచినట్టుంది. నిజం కృష్ణుడు మాకు సాక్షాత్కరించినట్టున్నాడారాత్రి. చెవుల తుప్పు వదలకొట్టాడు. మనసులో మడ్డి విరగకొట్టాడు. హృదయాల్లో మబ్బు విడకొట్టాడంటే నమ్మండి. పోతన్నగారికి ఏలాంటి మహదోజ్వలరూపంలో కృష్ణుడు సాక్షాత్కరించాడో కాని మా సమాజానికీ రూపంలో దొరికాడు

ఆ పద్యం అంత హృద్యంగా, రసభరితంగా ఉందీఅంటే కారణం లేకపోలేదు. రంగస్థలంమీద నటులుపాడేవి సామాన్యంగా, అర్థంమట్టుకు తెలుసుకుచదివే పద్యాలుమాత్రమే. యిది కృష్ణుడు అనుభవంలోకొచ్చిన పద్యం స్వీయనిర్మిత స్వతంత్రసాహిత్యం. తాను అనుభూతి పొందాడు కాబట్టే ప్రేక్షకులకు కళానుభూతి కల్గింది. ఉద్వేగపూరిత హృదయానికే అనుభూతి కల్గుతుంది. అటు మహత్వకవిత్వపటుత్వాలే అనండి, యిటు నాటకరంగ రసవద్ఘట్టాలే అనండి హృదయోద్వేగం కల్గితేనే కథావస్తువుతో తన్మయుడై ఐక్యం అవుతాడు కళోపాసకుడు, అనుభూతి పొందుతాడు. మనకు ఆనందానుభూతి కల్గుతుంది. రంగస్తలంమీది నాటకం చదివి ఆడేదయింది. కట్టెను వెనుక ప్రదర్శించింది స్వానుభవం, స్వవిషయం అయింది కృష్ణుడికి. తర్వాత మళ్ళీ గోస్తనదికాల్వలో పాడద్ద పడవమీద సాయంసమయంలో కూర్చున్నపుడు కృష్ణుణ్ని బలవంతపెట్టి పాడిస్తే ఆపద్యమే, ఆనిండు తేలేకపోయాడు. తదాది మా సమాజనటులకు రాబోయే సీనులోకి కావల్సిన రసం ఏకాంతంగా కూర్చుని, మనసుకు పట్టించుకొనిమరీ స్టేజీమీదకు రావడం అలవాటయింది.

ఆ పద్యంతో భీముడు మంత్రిముగ్ధుడైన కారణంగా కర్ణం అల్లుడి మెడనుంచి చేతులు జారిపోయాయి. ఆతడు, కృష్ణుడు చేతిలో కీలుబొమ్మ

అయినాడు. ధర్మజుడిమీద తొందరపడ్తినన్న బెంగ ముఖంలో సూచిస్తోన్నాడు భీముడు. కృష్ణుడు భీముని ధర్మరాజు సామీప్యంకుచేర్చి “యిది వరదా కా ఏమో అనుకున్నాం. యిక మనం వేణీసంహార నాటకం ప్రదర్శించగలం అని ధైర్యం చిక్కింది. దుశ్శాసనుడి ప్రేగులు మెళ్ళోవేసుకు రాగల భీముడు మనకి దొరికాడు. నీవు ఊఁ అని భీముడిని ఆశీర్వదిస్తే మన భీముడు హీరోగా కాస్టువేసి నీకు చూపిస్తానన్నాడు కృష్ణుడు. ధర్మజుడు భీముణ్ని ప్రసన్నచిత్తుడై ఆశీర్వదించాడు. భీముని వినమ్రశీర్షాన్ని చేత్తో నిమిరాడు. ధర్మజుని కరుణారసప్రీతి విస్తారితవిలోకనంతో భీముడు పొంగిపోయాడు. ‘వదనమున దరహాసరసము దలుకొత్త’ మా కృష్ణుడు యింకెంత సేపు యీ కర్ణం అల్లుడితో మనకీజాగారం, ముందు కర్తవ్యం ఆలోచిద్దాం రండని ధర్మజ భీమార్జునులతో రెండో సైడ్డుకర్టెను లోకి వెళ్ళాడు. దుర్యోధనుడి అవసాన కాలంలో ‘యింకెంతసేపీ శవ జాగరణం’ అంటో కృష్ణుడు చెర్యువద్దనుంచి పాండవులను తరలించుకు పోయిన దృశ్యం నాకంటబడింది. వెడ్తో కృష్ణుడు తనకి కన్ను గీటాడంటాడు నారదుడు. నేను చూడలేదు. దాని సత్యాసత్యాలకు నేను జవాబ్దారీ కాదు. నారదుడి మాట నాకు నమ్మకం తక్కువ. కాని కర్తృత్వం తనమీద పెట్టుకోకుండా, నారద కౌసికులు కర్ణం అల్లుడిని పీకి పాకంపట్టాలన్న ఉద్దేశ్యం కాకపోతే, ధర్మజుడిని మరోప్రక్కకు కృష్ణుడు ఆవేళకే తరలించుకుపోవలసిన అవసర కార్యం ఏమీ కన్పించదు.

ఏమైతేం, కోరుకొన్న ముహూర్తం, కోరుకొన్నట్టు దొరికింది నారద కౌశికులకు వాళ్ళకీ సున్నితాలు రుచించటంలేదు. సృష్ట్యాది నేటి వరకు సంగీతానికి చింతకాయలు రాల్లేదని నారదుడి నమ్మకం. కుక్కకాటికి చెప్పుదెబ్బ వైద్యం అని కౌసికుడిని విశ్వాసం. “రాత్రల్లా చెంపకాయలో చెప్పుదెబ్బలో తింటోన్నాడు. యిఖ యీపాటికి కాస్త మెనపరొట్టి పెట్టరా నారదుడు. పాపం తింటాడు కర్ణం అల్లుడు అని కౌసికు డుపక్రమించాడు. వాడి Line of thought ఒరుల కనూహ్యం. వాడికి తెలియాలి నారదుడికి తెలియాలి ఎక్కడ ములిగి ఎక్కడ తేల్తాడో.

పారుభయులు సుందోప సుందులంటినిగా. వెంటనే మెనపరొట్టి ఖ్యా అందుకొని నారదుడు 'ఎంతమాట అన్నావు ఎంతమాట అన్నావు. ఏలూరు స్పోర్ట్సు క్లబువారి షీల్డు కొట్టేసిన జగద్విఖ్యాత నటుడికి రొట్టిపెట్ట మంటావుటా? యీ మహానుభావుణ్ని చూచే అంటూన్నావా చూడక అంటోన్నావా. వెధవముండ అనుకొన్నావట్రా మెనపరొట్టి కొరకడాన్కి. అమ్మో నాకు చేతులురావురా వీడికి విడోస్ మెనపరొట్టి పెట్టడానికి. మెనపరొట్టి పెట్టమని, నిజంగా, అనీమాటేనా, నీది' అన్నాడు.

కౌసికుడు—నారదా, గడుస్తనంగా మాట్లాడా ననుకొంటోన్నావేమో కాని, నీగుణం చూపెట్టుకొన్నావు. కాస్త మెనపరొట్టి ముక్కకు, ముఖం చూచుకొని పెట్టాల్సి వస్తుందని, వాడి ముఖంలో వైధవ్యం ఆలా ప్రత్యక్షంగా ఉట్టిపడుతోంటే కూడా, దొంగ అనుమానం అభినయిస్తావా? పెట్టకపోతే పెట్టనని చెప్పేయి. తన ఖర్మం అనుకొని, ఏడుస్తో యింటికి పోతాడు,

నారదుడు—ఎందు బొగడొందు నారదుండీ నాడు ఒక్కరొట్టి ముక్కకు, కక్కూర్తి పడ్డాడన్న అపకీర్తికి పాల్పడవలసి వచ్చిందా. హా విధిబలము నేమనందును. కౌసికా, యింత పలుకైనా, విరక్కొట్టకుండా అమ్చుకచ్చు వాడి నోట కుక్కుతా. నీవు మాత్రం నాఅనుమానం వదల్చి నీసత్యప్రమాణ పూర్తిగా, పీ నోటితో వాడిని వెధవ ముండా అను.

కౌసికుడు—నారదా ఒక్క సారికాదు, మూడుసార్లు మాళ్ళొమ్మత పిక్కటిల్ల, అంటోన్నా. యిదే భూమ్యాకాశాలు, విద్యార్థి సోదర బృందం సాక్షిగా, 'నేనే బాలభాస్కర సమాజపు కౌసికుడనేని' అంటో అప్పటికప్పుడు అల్లేసి ఎలుగెత్తి, చెయ్యెత్తి, బుర్రా రాఘవాచార్లుగారి నమోనా కిరకిర్లతో భూపాళిరాగంలో ఝుమాయించాడు.

కౌసికుడింత వగర్చినా, యింకా తాను నమ్మనట్టుగా 'చాలుచాలు, నీఅబద్ధాలు నువ్వున్ను. నయం నయుం యింకా కర్ణం అల్లుడికి గడ్డెట్ట

మన్నావుకావు, నీపుణ్యమాయిరి అన్నాడు నారదుడు మరోక్రొత్త భావానికి దారితీస్తో. కాసికుడూ భావానికి పదునుపెట్టి, పన్నెలు దిద్దుతో 'గడ్డి పెట్టమనడాన్కి నేనంత తెల్వితక్కువవాడినా, పాలిచ్చే మనదొడ్డి పశువులకే గడ్డి దొరకటంలేదు. ఊళ్ళంటపడి తిరుగుతో, పొరుగూరి నుంచి వచ్చిన వర్తి ఉల్కా పశువుకూడా గడ్డి ఎక్కడనుంచి తేగలం' అన్నాడు. పొరిగూరి గొడ్డేఅను ఏమితిని బ్రతుకు తుందిరా గడ్డి లేకపోతే అంటో నారదుడెంతో జాలి అభినయించాడు. ఏం తిని బ్రతుకుతుందో దాని ముఖం మీదే వ్రాసి ఉంది. చదువుకో నన్నడగడమెందుకు అన్నాడు కాసికుడు.

నారదుడు— నువ్వే చదువు వాడి నుమట వ్రాసిఉన్న భోజ్యం ఏదో. వివిధపశుభాష వేదినని, పశుసిద్ధాంతినని, పశువులనుదుటి వ్రాతలు గిట్టల రేఖలుచూచి వాటి భూత భవిష్యత్తులు, వాటి క్షీరసంపదామిత ఆ భావాలు చెప్పగలనని స్టూడెంట్సు సర్కిల్సులో కోసావుగా. నీమాటట్టుకొని సోమంచారి అబ్బాయి వాళ్ళ పిఠాపురం గేదెను నీకు చూపిన మూడ్రోజుల్లో ఫూటేగా అది యీ మకుపోత. నీవు అన్నట్టే జరిగింది అని అంతా చెప్పుకున్నారుగా.

కాసికుడు—సోదరా, నారదా, నావిద్యపట్ల నీకున్న విశ్వాసానికి ఎంతయు కృతజ్ఞుడను. కాని ప్రస్తుతం రేఖలు పసికట్టడాన్కి వీల్లేకుండా ఉంది కర్ణంఅల్లుడి మసిముఖం. అయినా నా నేర్చింది, నా తెల్సింది వినియోగించి చదువుతా అంటో 'పుల్లివిస్తరాకు' అని ఒక్కొక్క అక్షరమే విడదీసి చదివాడు కర్ణం అల్లుడినుదిటి మీద అడ్డంగా తనవ్రేలు జరుపుతో. కుర్రాళ్ళంతా చప్పట్లు, యీలలు కొడ్తో పుల్లివిస్తరాకో అంటో కర్ణం అల్లుడిని అల్లరిచేసారు. తినడాన్కి పెట్టేరు మానేరు' కాస్త దప్పితీరడానికైనా ఏదైనా యివ్వండి పాపం అన్నాడు కాసికుడు. పట్నవాసాల్లో దాహంతీరడాన్కి నటీనటులేవో బుడ్లు కొడ్తారట మనకేవవి. కనాల్ ఫ్రెష్షు వాటర్ అయున త్రాగడుగా, అన్నాడు నారదుడు. ఏమీ యియ్యక్కర

లేదు, సబ్బు, బిందెలో నీళ్ళు జాగ్రత్త పెట్టారా పాపం ముఖమేనా కడుక్కుపోతాడు అని కౌసికుడు నాటి మాట జ్ఞాపకం చేసేసరికో కుర్రాడు పరిగెత్తుకెళ్ళి సబ్బు దాచేసాడు మరోడు నీళ్ళబిందెమీద పీటేసుకు కూర్చున్నాడు. కర్ణం అల్లుడు, పూవులమ్మిన చోట కట్టెలమ్మవలసి వచ్చిందని, విధిని దూరుతో, చెర్వుకెళ్ళిచచ్చి ఆమసిని కడుక్కోని, ఏపుంతలంట, ఎవరికంటా పడకుండా ఏలూరు దాటాడో మళ్ళా వేసంగుల్దాకా తిరుకు రాలేదు. పొద్దున్నేవచ్చి కర్ణం అడిగితే, పాపం రాత్రి బాగానే ఉన్నాడండి అయినా ఎంతకావాలండి అంటో మరణవార్త చెబుతోన్నట్టు మాటలు సాగించి ఆయన కంగారుగా చూస్తోంటే ఏలూరు వెళ్ళి ఉంటాడండి అని సవినయంగా పూర్తిచేసాడు నాందుడు. యింత గోల అయింది అని ధర్మజ కృష్ణులకు తెలియలేదు. ఏమయ్యాడని వారడిగితే, ఏమో వెధవ పుల్లివిస్తరాకులు ఎన్ని గాలికి కొట్టుకు పోవు. పోనిద్దురూ వాటని లెక్క వేస్తాముగనుకనా అన్నాడు. కౌసికుడు. వెళ్ళిపోయినవాడి మీదకూడా పరుసం మాటలు, పగ వదల్లేని కౌసికునికి పరివర్తన తేలేం, యిది శుష్క ప్రయత్నం అన్నట్టు ధర్మజుడు ఖిన్నుడైనాడు. యీ సుభద్రా గర్వభంగం సాంతంగా చదివినా విన్నా, స్వసామేజేతగ, బాధ్యతారహిత నటీనటుల పైశాచిక పీడతప్పి, తలపెట్టుకొన్న నాటక ప్రదర్శనం నిర్విఘ్నంగా దిగ్విజయంగా జరుగుతుందని భరతవాక్యం.

♦ ♦ ♦

## శంకర విజయము.

సంభవాగ్రిగమనంతో నాటకరంగం ప్రళయకల్లోల సంక్షుభిత మైందని, ప్రనాదులతో పెల్లగిల్లినట్లు ప్రకృతికంపించిందని, మనవిచేసి యున్నా. పోయినవారు పోగా హతశేషులైతేనేం, గతశేషులైతేనేం,

హాలంట పల్చపల్చగా, అంతా పదిపదులుమాత్రం ఉంటారు ప్రేక్షకులు. వారైనా సశేషనాటకప్రదర్శన విలోకినాభిలాషులైన కళాపిపాసులు కారు. యథాలాపంగా దారివెంటబోతో, ప్రేక్షకజనసమూహంత్రోపిడిని తట్టుకోలేక, కొట్టుకొచ్చి లోపలపడ్డ పాంథులందామా, యిటీవలి హటాత్సంక్షోభంలో జనం తీతపట్టినపుడు వీరుకూడా దారిచూచుకొని దాటియుందురు. అంత భయానక సంఘటన స్టేజిమీద సంభవించినా, చలించకుండా నిర్లాక్ష్యారంటే, చావలేక బ్రతుకుతూ, బ్రతకడాన్కి బాధపడ్తో యున్న క్షుభితహృదయులైయుండాలి. ఒంటిగాకూర్చుంటేనే ఏదో దుర్భరమనోవేదన, చిత్తక్షోభ కలిగే భగ్నజీవులైయుండాలి. సర్వసంగములందునభిలాషవర్జించి, అరిషడ్వర్గం జయించిన జితేంద్రియులేఅయితే, పరమహంసాభిగమ్యమైన పదంకోరి, చిత్తాలను హరిపరాయత్తంచేసి, యోగనిద్రలో పరిసరాలనువిస్మరించిన మహాత్ములేఅయితే, అసలు ఆదిలో మాకుర్రాళ్ళనాటకంచూచే విషయవాంఛ ఎందుకుకలిగిందో అనూహ్యం. ఇల్లాలి అంపపుకోత భరించలేక సభాఁన్ని వేశాలను, నాటకపుపాకలను శరణ్యంగాచేరే రిప్పు ఎప్పుడూ ఓగుప్పెడుంటారు. స్త్రీల ప్రత్యేకస్థలానికంతకు, మాశంకరునిభార్య ఒక్కతే, గార్హ్యస్థ్యధర్మాతిక్రమణ చేయనిచ్చగింపక, రెప్పవాల్చక భర్తరాకకెదురుచూస్తో బిక్కుబిక్కుమంటో కూర్చుని యిక్కట్టుపడ్తోంది జీవరాసి కనుమూసియున్న నిశీథసమయం. గేట్లలోమాత్రం, నాటకప్రదర్శనచిహ్న లేకొంచెంగానో కన్పిస్తోనే ఉన్నాయి. మాసమాజపు ఐచ్చికద్వారపాలురు రెండుసెట్ల జయవిజయులు, తిరుగావత్సరంవరకు తమకీఅధికార ఐశ్వర్యయోగం పట్టదనికాబోలు, ప్రేక్షకజనం హాలువీడి వెళ్ళినతర్వాతకూడా అప్రమత్తతతో గేట్లలో పచారుచేస్తోనేయున్నారు.

వారికి తగినట్టుగానే యింకా లోపలచూచి ఆనందించదగ్గదేముందనో; ఎవడో బాలుడు పదేపదే లోపలకు దూరబడ యత్నిస్తున్నాడు. విఫలుడౌతున్నాడు. పది నిమిషాలకోతూరి గేట్లలో గగ్గోలగుతోంది. సుభద్ర తెచ్చిపెట్టిన సంఘటన మా యావళ్ళక్తులను తోడి పుచ్చుకొంది

కాబట్టి ఆబాలుని కించెదలజడిని మేమంతగా పాటించుటలేదు. కాని కలతనిద్ర వతుగా మధ్యమధ్య వస్తో పోతో ఆ గలాభా మమ్మొపరిక్క చీదరబెడ్తోనేయుంది. భావి కర్తవ్య నిర్ణయానికి దొరకొన్న పుడల్లా గుమ్మాల్లో గల్లంతు రేగుతోంది. కృష్ణునిదృష్టి చెలిస్తోంది. ధర్మరాజు యితికర్తవ్యతా మూఢుడైయున్నాడు. మేము యావన్మంది దిగులుపడి దీన దశలో నుంటచే గేట్లవయినం ఎవరం పట్టించుకోలేదు అప్పట్లో. మా కృష్ణుని దర్శింపవచ్చిన పరమభాగవతోత్తములు సనకదాదులు మామేష్ట రులెవరూ కారుకదా! వార్లను గదాయుతులైన మా జయవిజయులు కుటిలా త్మకులై అధికార గర్వంచేత వారించుటలేమకద. మా రంగస్థలం రాయుడుగారి గొడ్లపాక అని ఆగొడ్లపాకనంటి ఉత్తాలంబగు తాలవన ముందని చెప్పిన జ్ఞాపకం. "ధీరులు చోరకుటుతురందు ధేనుకుడుంటన్" ఉదయం ఆ ధేనుకాసురుడు తాటాకుకళ్ళిన మా కొసికుని "జూఅచుఅ చూచుచు శౌర్యముపటివోవగ నింతనంత పదములదన్న" మాకృష్ణుడిఅన్న ఆ ధేనుకాసురుడి కాళ్ళు విరగేయపూని రాయదుగారాగ్రహింతురన్న భయముచే అప్పట్లో వచ్చేశాడు. ఆ ధేనుకాసురుడీ నిశీధంలో విజృంభించి గేట్లు కెగబడలేమగద.

ఈలాంటి విపరీతపరిస్థితుల్లో, సశేషనాటకప్రదర్శనం కానిచ్చి, ఎవర్ని సంతోషబెట్టనని తలచి, చేయునదిలేక, నిద్రరాక, నష్టమతులమై, హార్మోనియంచుట్టూ కూర్చున్నాం, జారిపోయిన చంటిబిడ్డ నెట్టుకొని చుట్టూకూర్చున్నట్లు. పటుక్కున మధ్యగా తెగిపోయిన నాటకానికి మంగళంముద్దు అనవసరం, మంగళసూత్రం తెగిపోయిన అభాగ్యరజస్వ లకు పేరంటాలి విందెందుకొచ్చింది అన్నాడు ధర్మజుడు. కట్టేసి యిచ్చిన వార్కి పంపించేతామని హార్మోనియంను కృష్ణ డిట్టేనొక్కేసర్కి, కునుకేముందు దీపపుమినుకులా, అవసానాసన్నమయిన ప్రాణి కొత్తుణం తెల్వికల్గినట్టు, ఆఖరిపర్యాయం కయ్యిమంది హార్మోనియం. అంతదనుకా శంకరుడెక్కడ రోగతల్పంమీద కనుమూసియున్నాడో, హార్మోనియం చప్పుడికి చటుక్కునలేచి, ఏకాంచెం గతవిషయం తెలియదుకాబోలు, నాది

యిప్పుడేనా అంటో పెద్దఉప్పెనలా వచ్చిపడ్డాడు. తాను పద్యంచదవ కుండానే నాటకం అవుచేశామంటేనే ఎక్కడగుండెపగిలి అమాంతంగా ప్రాణం వదలేస్తాడోనని భయంకల్గింది కృష్ణుడికి. అంచేత, భక్తానురక్త దయాసక్తవిలోకనుడైన మాకృష్ణుడు, శంకరుని సంభావించి, ప్రేక్షకు లనుచూచుకొని, యింకాతెరెత్తడం సముచితమేమో చెప్పమన్నాడు. శంకరుడు తెరవెలకకన్నంలోనుంచి చూచుకొని, అబ్బో అజనం ఎక్కువ, కొల్లలు, ఒకపద్యమేగా నాది అన్నాడు, అక్కడికి పద్యానికింతమంది ప్రేక్షకులుండాలని లెక్కఉన్నట్టు. ఇంతమందిబ్రాహ్మణ్యానికి యిన్ని బియ్యంపొయ్యాలని, యింతసూరేకారానికి యింతగంధకం పడ్తుందని లెక్కున్నట్టు. ఏఒక్క పద్యపఠన సిద్ధ్యర్థం, ఫాలభాగంపగిలి రక్తసిక్త మైనా, ఏడులోకాల్ని అంటించేయకుండా ఓర్మివహించియున్నాడో, ఆఒక్కపద్యం చదివే సావుకాశంలేకుండా నాటకసమాప్తిచేస్తే శంకరు డాబెంగని మంచంపట్టేయగలడని ధర్మజుడూ భయపడ్డాడు. పంచమాం కంలో, నేనేఅంటే, నేనేఅంటో కృష్ణార్జునులు ప్రతినలుపల్కే ఘట్టం ప్రారంభించి అయిందనిపిద్దాం పోనీ అని ధర్మజ కృష్ణులు పరిష్కరిం చారు. దాంతో శంకరుడు ఆనందభాష్పాసిక్తకపోలుడయి, ఎవరికందా లనో, తెరకన్నంలోనుంచి, 'వోయ్, వుస్, నిన్నే, యిప్పుడేచూస్తోందు' అని సన్నగా యీలస్థాయీని పలికి, భస్మంగుప్పిళ్ళతో మీదోసుకొని పూతపెట్టుకొంటోన్నాడు, అక్కడకు సర్వస్వం, ఎంతోసరసంగా అను కొన్నట్టుగానే, సంతుష్టిగా జరిగినట్టారాత్రి. చెడొచ్చినప్పుడు ఏదో విధంగా ఛాప్పున తెంపుచేసుకొనే నేర్పులేని అభస్మారకులతో మరీముప్పు.

నటీనటుకు లెంతప్రతిభాసంపత్తులు కలవారైనా, పూర్వాంకాలను సక్రమంగా, సమగ్రంగా, ప్రదర్శించుకొంటోవస్తేనేతప్ప, నాటకాన్ని రక్తికట్టించలేరు. పూర్వాపరసమన్వయరహితంగా, మధ్యగాఎక్కడో అందుకొని, ఆ పరిమితావుకాశంలో రసానుభూతికల్గించడం దుస్సాధ్యం. కొమ్ములు తిరిగినవాళ్ళైకానీండి, కళావిష్కరరహస్యంఅది. కాని అప్పట్లో మనఃస్థితీ, పరిస్థితీకూడా జబ్బిచ్చినా, నాటకకథావస్తువు వెనుకనుంచి

కల్పుకుంటో రాకపోయినా, నేనే అని మాకృష్ణుడు సుతిలో గాత్రం కలిపేసరికే రససముద్రం జాలువారింది. అలాంటి జీవకళ అతడిగాత్రంలో ఉంది. ఇక మా అర్జును డానాటి బుర్రా రాఘవాచార్యులుగారి బాణీలో నేనే అని ఘూమనిభూపాళరాగం అందుకొని ఆరంభపు 'నే' మీద శత సహస్రాలుగా కిరకిరలు విసిరేస్తోంటే, మా శంకరు డాహృదయం, తనఒంటి పద్యం, కడవలాది రసం గుమ్మరించాలనే సత్ప్రయత్నంలో, ఎంతో శ్ర మించి కుమ్మరావనుంచి స్వహస్తాలతో మోసి తెచ్చి స్టేజీపైన బోర్లించి అమర్చిపెట్టిన పాతిక ముప్పై పెద్దకుండల్లోనుంచి, భంభం రావాలు ప్రతి ధ్వనించాయి. అపద్యద్వయంతో, కొద్దిపాటిప్రేక్షకులే ఆయిరి, శబాస్, అంటో తల్లూచారు. నేనే కాదు, మాకృష్ణార్జునులను, చారణ సిద్ధ గంధ ర్వాములుకూడా, వారి గంధర్వగానరవానికి అగ్గించియుండాలి. 'కుసుమ మముల వృష్టి బోరనగురిసెనంత విభవమొప్పార దేవదుందుభులు మొరసె గడక వీతెంచె గంధర్వగానరవము' అంటే స్వోత్కర్ష కాదు. సుదృఢ సుదీర్ఘసుందరబాహులు, తరుణభాస్కరశోభాభాసమానులు, చెంమ్కీ వస్త్రాలంకృతులు అయిన మాకృష్ణార్జునుల ముఖద్యుతులు వారిని దేవాంశ సంభవులని చెప్పకయేచెప్పచున్నవి. మా అర్జునుడు చేపట్టాడు గాండీవం. అరిభయంకరం. మాకృష్ణుడు చేసంధించాడు సహస్రకరసహస్రసమస్వహా మహాఃపటలభాసురం, సుదర్శనచక్రం. వాటి నాఉదయమే తయారుచేసి, ఆమధ్యాహ్నమే రంగురంగులు ముచ్చిబంగారపుతొడుగు దట్టంగావేసి యున్నారేమో, అవి దగద్ధగాయమానంగా ప్రకాశిస్తో, ఫుట్టులైట్లకాం తిలో కదలిందితడవుగా చకచకిత చంచలావిశతివిద్యుల్లతల్లా చూపరుల కండ్లను మిఱుమిట్లు గొల్పుతున్నాయి. వీరశిరోమణులా జగజెట్టి లిరువురు భుజాస్ఫాలనాలు గావించేసరికి విస్మయవిస్ఫారితలోచనులమై వారల వీక్షిస్తున్నాం. ఆజోదులిద్దరు ఒకటేబాణం, ఒకటేప్రాణం అన్ననిశ్చ యంమీద ఎదురుపొదులుగా నిలబడ్డారు. అదే శంకరు డురకవలసిన ఘట్టం. అక్కడే ఉంది మాశంకరుడు, గతయిరువదిరోజులనుంచి తయారీ తింటోన్న ఒంటిపద్యం. తప్పులతడక పద్యం. క్షమించాలి కవి నిండా

కాదు. మాశంకర నిందా కాదు. నాభావం విస్తృతంచేసికొంటున్నా. ఆపద్యం మొదటిమూడుపాదాల్లోను, కృష్ణార్జునగయులు చేసిన తలో తప్పు వివరిస్తాడు శంకరుడు. అంచేత సంధివప్పు అని ఆఖరిపాదంలో నిర్ణయంచేసి, యుద్ధంఆపుచేసి, ఆ యదుపాండవవీరులను యిళ్ళకు పంపేయాలి.

చెప్పడమైతే సులువుగానే చెప్పానుగాని, యీ సంఘటనలో చింతాకంతవారవచ్చినా యిదే త్రిజగత్సంతాప హేతువు అవుతుంది. సెకనైనా తడవుసేయకుండా శంకరుడు స్టేజిమీదకురకాలి. క్షణమాత్రంగా శంకరుడీపట్టున జాప్యంచేసినా సృష్టియే తలక్రిందులయ్యే ప్రమాదకర ఘట్టం అని మనవిచేసాగా. ఈలాంటి ప్రాణాపకరతరుణంలో ఏలరాడు, శంకరుడేలరాడని సమస్త ప్రాణిసంఘాతాలూ భయమందుతున్నాయి. స్టేజిమీద బ్రహ్మాస్త్ర నారాయణాస్త్రాలు త్రిజగద్భయదా కృతిదాల్చి కృష్ణార్జునుల కుత్తుకల నుత్తరింప సర్వసిద్ధంగా సంధించి ఉన్నాయి. ఊర్జిత శాత్రవసేనా దుర్జయుడు అర్జునుడు చెవికంటా లాగి ఎక్కుపెట్టిన గాండీవం ఎప్పుడెప్పుడని నాలికలు కోస్తోంది. కృష్ణుని వ్రేలిని ఝురీ వేగంతోదిర్దిరతిగుగుతో అత్యంతనిష్ఠుర సంతర్జన ఘోషణ మహాటోపం చేస్తోంది, అదే సుదర్శనం. 'జగద్భద్రాస సంధాయి కృష్ణుడే అస్తమిస్తే అస్తమింపనిబెది ఎవస్తమింప' అన్న అర్జునుని పరితాపం నిజం అవుతుంది. యిక నైన దుర్విపాకమున అర్జునుడే నేలకూలాడా కృపాశ్వత్థామ గాంగేయ సూర్యసుత ద్రోణాది వీరుల నింకెవరు నిలువరింపగలరు. మేము వర్ణించి రిహార్సల్సువేసి పెట్టిన పాండవ విజయ ప్రదర్శనానికింకేమి తెగవు? శంకరుని జాగారం రెప్పపాటు కాలమే అన్నా, సహించలేకున్నాము మా భావనాబలంచే మాస్టేజీమీద మేము సృజించుకొన్న సమస్త సముద్ర పర్వతారణ్య సమేతమైన భూమి యావత్తు మా కాళ్ళక్రింద కంపిస్తోన్నట్టు మా హృదయాంతరాళాల్లో ఆవేదన బయల్దేరింది. అంచేత మాసమాజ సభ్యులం యావన్మంది యీశా! జగదీశా! భక్తపరితోషణ! భూషణ! పాప శోషణా! కృపామయలోచన! పాపమోచనా! అంటో శంకర సహస్ర

నామస్తోత్రంచేస్తో జాగుసేయక కటాక్షించవయ్యా, కదలిరావయ్యా అని కృతప్రణాములమై ప్రార్థించాము. మానారదుడు తాంబూరాసుతిలో,

హరహరశంకర గిరిజాబంధో

శివశివశంభో భూతపతే

కైలాసాధిప కరుణాసింధో

అంటో పాటే మొదలెట్టాడు. 'అయ్యో అంత తొందరైతే ఏలా. యిక లెక్క—రెండు కచికలు దిగడ్డాయి. అవికూడా అంటించుకొని యిదే వస్తోన్నా'' నన్నాడు శంకరుడు. కచికలున్నాయికదా అని అంటించు కుంటాడా లేక శరీరాన్కి కావల్సింది పూసుకుంటాడా ఎంత కైలాసా న్నుంచి దిగివచ్చిన శంకరుడైనా అని తోచింది కాని, పశుపతితో మనకు వాదమేమిటని ప్రేక్షకులంతాకలసి గుప్పెడులేరు వారైనా బూడిద హత్తె లేదనికాని అలంకారలోపమనికాని పల్లెత్తుమాట నోరెత్తేవారు కారయ్యా. అసలు మన నాటకగొడవని కూర్చున్నవారు కారయ్యా, మహానుభావా, దయసేయుంగదవయ్యా, ఆద్యంతవికారశూన్యా!సుధీజనతావన విశ్వభావనా అని కృతాంజలులమై పరిపరి విధాల తిరుగా మొక్కాము. పూతలెట్టటం మానేసి అయిందిలేండి యిక కచికలూ అయిపోయినాయి అంటో ఆదర భరితనేత్ర విస్తారుడై మావంక చూచాడు.

మాకృష్ణుడు రసస్వరూపుడు. డయాగనల్ పోజులో నుంచున్న వాడామట్టునే నిలబడి ఎత్తినచేయి ఎత్తినట్టే ఉంచి మంత్రధ్యాన పూర్వ కంగా కండ్లుమూసుకొన్నట్టు వ్యవధినికప్పటానికి సమయానుకూలాభినయం చేస్తో, ప్రేక్షకులకు వినిపించకుండా ఘటపటా పళ్ళు కొరుకుతో ''ఈలా కాళ్ళు చేతులూ ఎత్తుకు ఎంతసేపు నుంచోమంటాడు. ఈమాత్రం స్టేజీ సెన్సు లేనివాడేమని వేశాడు వేషం. ఎల్లాఉన్నవాడినాలా పడగొంటక చూస్తారేం'' అంటో పళ్ళసందునుంచి కోప్పడ్డాడు. అర్జునుడీఅనుభవపాట వాలుఎరగనివాడైన కారణంగా కాలూచేయీ మార్చుకొంటో శంకరుణ్ని రారాబాబూ చంపక అన్నటు సైడుకట్టెనువంకే చూస్తో నుంచున్నాడు శిశునేత్రాలతో.ఎట్లకేలకు రుద్రాక్షమాలావిభూషితసర్వాలంకృతగోశుహిష

శకృతభస్మ ధూసరిత శంకరస్వరూపం సైడుకర్టెనులోనుంచి కదలింది. మేము రోమాంచకంచుకితశరీరులమైనాం. కాని శంకరుని హావభావాలు రోషవిభీషణాకృతి అశాభంగం కల్గిస్తోన్నాయి. ఏకోశాన్ని సంధిచేయ వలెనన్న సత్సంకల్పం ఆతడి ముఖంలో స్ఫురించటంలేదు. క్రోధకషాయితాత్ముడై సమర సన్నద్ధుడై యుగాంతకాల సంహారోన్ముఖుడై వచ్చే కాలరుద్రుని తలపుకు తెస్తూన్నాడు, మా శంకరుడు. గయోపాఖ్యానంలో శంకరుడు సంధి పొసగింపవచ్చే శాంతిదూత అని మా శంకరునికి తెలియదు కాబోలు. యీ నాటకంలో త్రిశూలం విలాసార్థంగా ఊపుగొంటో వచ్చే చేదోడేగాని మారణాయుధం కాదని తెలియచేమో కర్మం. గయోపాఖ్యానాన్ని త్రిపురాసుర సంహారంఅని భ్రమించి కృష్ణార్జున గయులముగ్గురిని వరసని పొడిచేసి యింటికిపోడుగదా? ఏదో హత్యాకాండకు ఉద్యుక్తుడైనట్టు సైడుకర్టెనులో నుంచి అంగలుమీద వస్తున్నాడేం పాపం నిటలాక్షుండిపుడు ఎత్తివస్తోన్నాడాఅన్నట్టే. త్రిశూల ఆయుధభాగం కోసుగా నేలకు గ్రుచ్చేటట్టు, మిగతాకర్రభాగాన్ని దూరదూరంగాచేతులతో పట్టిస్టేజీమీదకుఏటవాలుగా వస్తోన్నాడు ఏందొర్లింది? కొంపత్రవ్వి పోలుజంపు విద్దెంచేసి వన్, టూ, త్రీ అని కృష్ణార్జునులమధ్యకురకడుగదా? వీడిపద్యం ముద్దుతీరడానికి ఎవరు బలిగానున్నారో దైవమా అని ప్రాణాలు అరిచేతులో పెట్టుకొనిఉన్నాం.

తద్రీతుగా త్రిశూలసహితం ఎంతో సంరంభంతో వస్తోన్న శంకరునిచూచి, కృష్ణుడర్జునునకేమి సంజ్ఞచేసాడో కృష్ణార్జునులుభయులు ఛట్టున వినయ వినమిత మస్తకులు, ముకుళితహస్తులై కూర్చున్నారు. కృష్ణార్జునులు శంకరుపట్ల సువిధేయత భక్తితాత్పర్యాలు అభినయిస్తోన్నారని ప్రేక్షకులనుకొన్నా నిజమది కాదు. ప్రధానేంద్రియాలకు ఉత్తమాంగానికి తగలకుండా, త్రిశూలం వీపుకుతగిలినా అంతచేటు ప్రమాదకరంకాదని, స్వప్రాణరక్షణార్థం కృష్ణుడట్లా ముడుచుకుని గుప్పెడై కూర్మావతారం దాల్చవలసివచ్చింది. నాటకరీత్యా అది సముచితాభినయం కాకపోవచ్చు. నిజానికి అస్త్రాలను సంధించి కృష్ణార్జునులు ప్రతినలను పల్కేతరుణంలోనే శంకరుడురికి, తనపద్యం చదివి వారిని ఆపుచేయాలి. శంకరుడు సకాలంలో

స్టేజిమీదకు రాలేక, సందర్భాన్ని చెడగొట్టినందున కృష్ణార్జునులిప్పుడిక ఏమిచేసినా విరుద్ధం కాదు, మొత్తమే విరుద్ధపంథాను పడింది కాబట్టి. శంకరుని సీను అంచేత విమర్శన కతీతం. శంకరలీలల్లో విమర్శావ్యాసంగానికి తావులేదు. కళ్ళు తప్పుచెప్పి కళాస్పందనాన్ని పొందడమే కాని మరి గత్యంతరంలేదు. తమంతటతామే పదిహేను, యిరవై నిమిషాలక్రితం యుద్ధం విరమించి ఊరక నిల్చియున్న వీరులను పట్టుకు ఆపవలసిన అవుసరం కాని పద్యాని కావశ్యకత కాని నిజానికిపుడు శంకరునికిలేదని, వ్యర్థవాదాభిలాషులైన విమర్శకులన్నా, అంతమాత్రంచేత వెనుదీసి విరమించే స్వభావం కాదు మా శంకరునిది. కృష్ణపక్షమంతా చదువుతో, మరుస్తో, ఎంతమందికో తప్పుచెప్తో పడవల్లించిన పద్యం, నేర్చుసింది తప్పుండా నాటకంరోజుకు రావాలిసుమా అని భార్యారత్నానికి పుట్టింటికి నిక్కచ్చిగా కబురుచేసిన పద్యం. శంకరుడి పద్యం అంటూ గ్రామం అంతా గుబాళించిన పద్యం, మూడు ఆరయ్యేది, ఆరు మూడయ్యేది, తాను ది గ్రేటు యిండియన్ బాలభాస్కర సంగీత నాటకసమాజపు స్టేజీమీద నిలబడి ఫుట్ లైట్ల కాంతిని చదివేసి యశఃకాయుడు కావడమే మా శంకరుని జీవితపరమావధి. అదే అతడికి యిష్టఫలసిద్ధి; యిష్టవస్తుపరిపూర్ణమనోరథసిద్ధి; అదే అతడి యావత్తు అభిమతార్థసిద్ధిన్నీ. ఆపద్యం బాగోగులతోగాని, సందర్భ ఔచిత్యాలతో కాని శంకరుడు నిమిత్తం పెట్టుకున్నవాడు కాదు. పనిచెడి ప్రేక్షకులుగాని, విమర్శకులుగాని ఆగోడవ పెట్టుకుంటే వాళ్ళ పాపాన్ని వాళ్ళే పోతారన్న సహృదయతతో ఆగ్రహించని అకలంక గుణాభిరాముడు మా శంకరుడు.

స్టేజీమీద శంకరప్రత్యక్షం అయ్యేసరికి అయ్యా మొదటితరగతి గేటులోనుంచి శోకాలే కావు, శాపాలే కావు, పెడబొబ్బలే కావు, పచ్చిబూతులే కావు, 'అవనితలంబు వ్రస్సనో, హిమాచలశృంగము వ్రయ్యలయ్యెనో, శ్రవణవిదారణమైన శబ్దము దానిది ఏమియొక్కొ' అని అందరం భయవిహ్వలులమయ్యేటట్టు, ఎంతో భయానకంగా ఒక్కపెట్టున ఎలుంగులు నింగిముట్టుతున్నాయి. దిక్కులు బీటలుతీస్తున్నాయి.

యింకా యీకాడికి అదృష్టవంతులమే. మా శూలిభార్య చూలాలు కాదు. అయిందేదో అయింది, నాటకాంత్యానికి వస్త్రాన్నానుని ఆశించే ఘడియల్లో యీ నూతనోత్పాతం ఏమో, ఎవరికీ తలాతోకా తెలియటంలేదు. అంతా పదిపదమూడేండ్లకన్న యుండదు వయస్సు ఎవడో బాలుడు, వచ్చి పడిపోతోన్నాడు. ఎక్కడా అద్యంతాలు లేకుండా, గుక్కతెగకుండా, అనిరామంగా మారాంపట్టేస్తో ఒక్కవరసని కాళ్ళు వేళ్ళు తన్నుకోంటో, ధరికెళ్ళినవాళ్ళను పీకుతో రక్కుతో, గేటు కలియ ద్రొక్కుతో, దొరబడుతోయున్న ఆ చిచ్చరపిడుగు. బాలుడేనావాడు, బాలరూపంలో వచ్చిన బ్రహ్మరక్షస్సా. అజ్ఞానశైశవంలోని ధూళిక్రీడలు, బాల్యంలోని చపలత్వ చిలిపితనాలు మేళవించి, ముద్దకట్టి చెక్కేస్తోన్నాడు. ఓర్ వీడెక్కడతయారండి, దుక్కల్లాంటివాళ్ళను ముగ్గురిని తన్నుకొచ్చి లోపలపడ్డాడు. చూచారా, ఏలా ఎడాపెడా కాల్చేసుకు వచ్చి పడిపోతున్నాడో. ఓరి వీడి అగడంకూలా! అడ్డం పడ్డవాళ్ళనందరను వీడూవాడూ లేకుండా తానే కుమ్మేస్తున్నాడూ, పైగా, పాకిస్తానా, తననే ఎవరో కొడ్తోన్నట్టు 'అమ్మోయి బాబోయి' అంటో ఎంతంత రావణా అడశోకాలు పెడ్తోన్నాడో! మన నాటు పెపకం కాదండి వీడిది. యింత పెంకిపట్టు, పట్టుదల, తల్తిక్క, అంద్రెబ్బ కనివిని ఎరగం, ఎక్కడా, ఏనాడూనూ. ఏమధ్యవయస్కుడికీ ఉండని కండపుష్టి వీడికెక్కడవచ్చింది. ఎక్కడో ఉక్కుకండలు యినపనరాల్లా ఉన్నాయి. వాడిముందర మా జయవిజయులు వట్టి పిండిబొమ్మలై యూరుకున్నారు. వేల్లుండి, వాళ్ళనుచూచి మల్లయుద్ధానికి తొడగొడ్తోన్నాడు. యీలా ఎక్కడచూచినా తానేఅయి, పరాక్రమనృత్యంచేస్తో, అడ్డంవచ్చిన కుర్చీలను విరుస్తో, బెంచీలను నుసుంచేస్తో, తన కర్తవ్యమైనవాటి మీదనుంచి దూకుతో, మెరపుమెరసినరీతుగా, ఎవరికి నిలువరింపడానికి వీల్లేకుండా, శక్తిశౌర్యాలు ప్రదర్శిస్తో, అవార్యపరాక్రమ విక్రమంతో స్టేజిమీద కురికాడా కుమారవర్యుడు

శంకరుడు కృష్ణార్జునుల మధ్యకురికిన, సరిగా అసమయానికే, యీ బాలుడు స్టేజిమీద కురికాడేమో, శంకరుడు "కృష్ణార్జునులారా, అగు

డాగుడు'' అన్నాడో లేదో, బాలుడు ''ముందు నువ్వాగు నా రబ్బరు పామునిచ్చి పరీకదలు'' అంటో చావుకు తెగించి మా గరళకంఠుని కంఠంపై కెగబడ్డాడు. తనకు యావజ్జీవ మహదాశయసిద్ధి చేకూరనున్న పద్యపఠనకాలంలో రెండవకాలునిపగిది దాపరించిన ఆ దుండగుణ్ని అప్పుడక్కడ భస్మీపటలం చేయపూని నిజంగా కల్పాంతపురాంతకుడైనాడు మా శంకరుడు. బొందిని ప్రాణంఉండగా, ముందు పద్యంఉండగా పామునువదలడు శంకరుడు. ప్రాణంపోయినా సరే, పామును పట్టాలన్కృతనిశ్చితుడై వచ్చాడు ఆసింహకిశోరం. ఇట్లుభయులు ఏకఫలాపేక్షితులై పరస్పర జయకాంక్షులై, ఎరకు పెనగు డేగలచందాన ఎగబడి, ఆ రబ్బరు పామును చెరోప్రక్కను యమపట్లు పట్టేసారు. 'ఎనిమిది యడుగుల కొలదిని వెనుక వెనుకకు బోయి, నిగిడి వేగంబున గిట్టిన తగళ్ళులకైవడి' అన్నారే తిక్కనగారు, అలా అత్యుగ్రదోర్బలంతో కలబడుతో, విడబడుతో, అరగంటకాలం పోరారా బహువిధసమరకర్కశులు. తప్పించుకొనుచు, దెబ్బకొట్టజూచుచు, వలయాకారముగా దిరుగుచు, పైకెగరుచు, గ్రిందికివంగుచు బ్రక్కలకు దాటుచు, మండలప్రచారగత ప్రత్యాగతాది వివిధగతుల్లోను రంగస్థలం కలియద్రొక్కుతూ, కరలాఘవప్రకారాలన్నిట తమ వీరత్వ విశారదత్వాలను ప్రదర్శిస్తూ, మా కృష్ణార్జునుల కృత్రిమ కదనరంగాన్కి వాస్తవికతనిచ్చారు. ఆ వీరులుభయులు అన్యోన్య దంత, నఖ, ముఖవిఖండిత శరీరులగుతోంటే ధరణి కంపించింది. మేము వెరగొందాం!

కృష్ణార్జునులను సమాధాన పరుప ప్రత్యక్షమైన శంకరున కోకింకరునితో ప్రత్యేక యుద్ధం ప్రాప్తించి ప్రాణంమీదికి వచ్చినపుడు, కృష్ణార్జునులా శంకరకింకరులకేల అడ్డుపడలేదో, తద్రహస్యం ప్రేక్షకులకు తెలియుటలేదు. కృష్ణార్జునుల విరుద్ధ ప్రవర్తనకు కారణం దాసరి కోటయ్య. కృష్ణార్జునుల చంకీదుస్తులు దాసరి కోటయ్య యిచ్చినవి. వాటిని జాగ్రత్తగా కోటయ్య కందీయవలసిన జవాబ్దారీ కృష్ణార్జునుల పైనేయుంది. శంకరునకీ అరగంట యుద్ధంతో, ముచ్చెమటలు పట్టి, అతడు తట్టెడి కచికలను

నురుంచేసి వంటికి పట్టించుకొన్న బూడిద, గుత్తంగా బెండడి అయింది. శంకరుని, వంటిబెండడి ముద్దలు బెల్లులు కోటయ్య చంకీ కోట్లను మలినం చేయగలవన్న భీతితో కృష్ణార్జునులు దూరదూరంగా తప్పుకొన్నారు. అంతే కాని శంకరుడేమైతేనేమి అని నిర్లిప్తతగాదు.

ఈ రహస్యం మాటటుంచి, సర్పవిష్టిక అంతర్నాటక రహస్యం అదేమో తెల్సింది కనకనా, ప్రేక్షకులకు గాని, మా సమాజ సభ్యులకు గాని. నిర్గుణుడు, నిష్కాముడు, అయిన శంకరునకో క్షుద్రునితో రబ్బరు పాముకై ఎందుకు కుస్తీ పట్టవలసి వచ్చిందో శంకరుడాచోకీ ఇచ్చియుండలేదు. జీవునకవిద్యామహిమం జేసి కర్మబంధ నాదికములు కాంక్షలు సంప్రాప్తమగుతాయని సర్వభూతాం తర్యామియైన యీశ్వరునకు సంప్రాప్తం కాదని జ్ఞానులు చెప్పగా వింటాం. అయితే, ఆ అనల్పునకీ అల్పవిషయేచ్ఛ ఏలకల్గింది, ఆ భక్తదురాశా పాశలవిత్రు'నకీ ఆశఎందుకు కల్గాలి, ఎవరికి బోరుకుపడలేదు. యిదేదైనా లీలావిగ్రహుడు, శంకరుని నిజయోగ మాయామహిమా జనితమా? ఏమో, కావచ్చు. శంకరునకీలాంటి మాయాప్రయోగాలు, మల్లసంగరాలు క్రొత్త కావట. కిరాతార్జునీయం యీ అంతర్నాటకానికి వరవడే. అక్కడ, తన్ని వెతుక్కుంటో వచ్చిన అర్జునుడి ముందుకు కృత్రిమ వరాహాన్ని పంపించి, అర్జునునకు పురికొల్పి, తాను కూడా ఆవరాహంకొరకు ఆశపడి చచ్చిపోతోన్నట్టు ఆర్భాటంచేసి, యిక నాది అంటే నాదని అతనితో సమానంగా పెనగులాడి అర్జునుణ్ని చావకొట్టాడు. తానూ చచ్చేదెబ్బలు తిన్నాడు అదేం సరదానో సర్వేశ్వరునికి. అంచేతనే 'మహేంద్రజాలకుని యట్లొకమాయ రచింప బూనుచున్' అని ధూర్జటి శంకరుని మనోవృత్తాన్ని నిరూపించాడు. తద్రీతుగానే యీనాడు తన్ని వెతుక్కుంటో వచ్చిన బాలునితో రబ్బరుపాము మిషమీద కుస్తీ పట్టాడు. యిక్కడ, మరే మూకాసురుణ్ని రబ్బరుపాముగా మార్చాడో. విషయం, యిదమిద్ధమని ఎవరు నిర్ణయం చేయలేకున్నారు. తద్రహస్యం శంకరకటాక్షకారణంగా నాకొకింత తెల్సును. శంకరుని అలంకార వర్ణనలో మీకు

మనవి చేసియున్నా. మీరు మరచి యుందురు. నాటకానికి తీసికొచ్చి ముందు కుర్చీమీద కూర్చో పెడ్తానని మాటయిచ్చి, జంగాల కుర్రాడు తీర్థంలో కొనుక్కున్న రబ్బరు పామును శంకరుడా మృత్యాహ్వం కొట్టుకొచ్చాడని మనవిచేసా. దాన్ని మెళ్ళో వేసుకొని, ఆబాకీ మాటే శంకరుడు మరచాడు. నాటక రంగానికి జంగమ బాలుడు రానభ్యంతర పెట్టవద్దని జయవిజయులకు కబురు పెట్ట మరచాడు. సంధ్యాసమయానికే బాలుడు గేట్లవద్దకు శంకరాహ్వానాశయంతో వచ్చాడు. జయవిజయులు నారాయణ పర భక్తులైన కారణంగా, శంకరనామం చెవిపెట్టక, తిరస్కార పరిహాసోక్తులతో ఆశంకర భక్తుని, జంగమబాలుని గేట్లలోనుంచి నెట్టేసారు. ప్రారంభంలో, పరిపరి విధాలుగా, బాలుడు, ప్రాధేయ పూర్వకంగా జయవిజయుల నర్థించాడు. సాధుజన హింస ఊరక పోదన్నాడు. కాని వారు, నీవెవడవో, నీ శంకరుడెవడో మాకవసరం లేదు. మాకొకరి ఆజ్ఞతో నిమిత్తం లేదని బాలుని కసిరికొట్టారు. బాలుడు తనను, తన యిష్టదైవాన్ని గేలిచేసిన యీ జయవిజయుల దుర్వినయానికి తగిన ప్రతీకారం చేయ బూనాడు. "ఇతర బాలురక్రియవాడ వీవు కావు" అనేటట్టి యీ బుడతడు, శ్రీశైలవాసి అనిన్ని, యీతని తలితండ్రులు పార్వతీపతి పదాబ్జధ్యాన పూజాపరతంత్రులని, శివుడే పరతత్వమని కత్తికట్టి కయ్యానికి కాలుదువ్వే కాపాలిక శాఖీయ వీరశైవులని, వీడు శివరాత్రి నాటి జాగర సమయంలో పుట్టిన కారణంగా, భావనాసులభుడైన పరమేశ్వరుని వరప్రసాదమని అతడి తలిదండ్రుల విశ్వాసమని యీబాలునికి వీరేశ శంభులింగం అని నామకరణం చేసికొని వాడి అంద్రడెబ్బ సంతమ శివలీలా మహాత్యంగా, భావించి ఎంతో గారాబంగా పెంచి వాడి పెంకితనాన్ని పెంచేసారనిన్ని ఆవాతావరణంలో, పరమశైవాచార పరాయణుడై, తీర్థసమయాల్లో తోడి బాలురు తినుబండ పదార్థాలు, ఆట వస్తువులు కొనుక్కుంటే, వీడు మాత్రం ఈ శివప్రీతికరమైన రబ్బరు పాములను కొని మెడనేసుకు తిరగడం, పక్కలో పెట్టుకు పడుండడం అభ్యాసం చేసాడని, తర్వాత వాకబులో తెల్సింది. సహజ వీరశైవుడయిన యీబా

లునకు వీరత్వం, ఉగ్రుపాలతో అలవడినదే కావచ్చు. కించిత్ కారణంతో పరవశుడయ్యే ప్రజ్ఞ పదకొండవ యేటే అలవర్చుకొన్న బిడ్డ. శివుని చిత్త మందు నిల్పి పచ్చిరక్తం తాగేసే వీరశైవ కిశోరం అయ్యాడు మా నాటకం నాటికి. ఎంత అగ్గిగుండమైనా ఉరికేస్తోన్నాడు కాని, అక్షరాభ్యాసం ఓం నమశ్శివాయ యెరగడు. శివలు తొక్కుతున్నాడు కాని, శివనామ సంకీర్తనం, శైవసాహిత్య సంస్కారాలు ఎరగడు.

సంస్కార రహితుడు అపరిపక్వమనస్కుడు అయిన బాలుడవడం చేత నిమిషాలభక్తి విరక్తి అయి ఊరుకుంది. లోపల అడుగిడడంతోనే, తన రబ్బరుపామును కంఠాభరణంగా వేసుకొని, తనమాటే మరచి స్టేజీ మీద లైట్లకాంతిలో తులుకుతోయున్న మా గరళకంఠుడు కన్పించాడు. యిచ్చినవరం పాలించని మా శంకరుని వంచకుని గా భావించాడు బాలుడు. స్టేజిమీదకురికి శంకరునితో కలబడ్డాడు. షరతుప్రకారం బాలుడు నాటకం చూడలేదు కాబట్టి వాడిపామును వానికి యిప్పించేయడం పచ్చిన్యాయం. ఎవరుచెప్పినా శంకరుడువినడు. వినే మనస్తత్వం కాదు. ఆపద్యం ఒక్కటీ చదివేసి నేనే పారేస్తాను. వీడి దరిద్రపుపాము ఎవరికి కావాలి. వచ్చే తీర్థంలో నేనేకొంటాను కోటిపడగల్ని అంటాడు శంకరుడు. నాగుమ్మం దగ్గిరికి ఓతూటనకొచ్చినా పామును పట్టుకెళ్ళినపుడు గొప్పదయిందా యివ్వవచ్చేసరికి దరిద్రపుపామయిందా. ఏమైనాసరే నాబొందెలో ప్రాణముండగా నారబ్బరుపాముతో పద్యం చదవనిస్తే వీరేశ శంభు లింగాన్ని కానని భూమ్యాకాశాలు సాక్షిగా చెయ్యెత్తి ఘోర ప్రతిన పట్టాడు జంగాలబ్బాయి. అదీ అంతర్నాటకం.

ఈ అంతర్నాటక పరిష్కారం అయితేగాని ప్రధాన నాటకానికి స్వస్థిచెప్పి తెరదించపలేకున్నాం. నిద్రలేమిని నటులు కరం నీరసపడి ఎక్కడివాళ్ళు అక్కడనే వరుగుతున్నారు. గత మూడురాత్రులనుంచి కంటికి నిదురలేదు. కాళ్ళు నిల్దొక్కలేకున్నాం. గత్యంతరం కానక కృష్ణుని ప్రార్థించాం. నర గంధర్వ సురాసురులను శాసింప సమర్థుడవు. ధర్మాధర్మ విచక్షణా దక్షుడవు, నీవిట్టు పేక్షిస్తే మే మెట్లువిపత్సముద్రాన్ని

దాటగలం. తెల్లవార్తోంది. తెరదింపేయోగం చూపుమేరలో కన్పించదు. వీరుభటులు ప్రాణాలొడ్డి పోరుతున్నారు. ఈ వీరమ్మన్యులలో ఒకరో కాక యిర్వురూనో బాలభాస్కర సంగీత నాటకసమాజ రంగస్థలంమీద, ధర్మజ కృష్ణార్జున సమక్షంలో తగువుతెగక ఒక రబ్బరుపాముకై ప్రాణ త్యాగం చేశారనే అపకీర్తి శాశ్వత బ్రహ్మకల్పంగా భూమిమీదనిల్చిపోయే దుష్కాలమాసన్నమైంది. నిమిషాల్లోఉంది. అనుగ్రహించవా, ఆపద్బాంధవా, నడుంకట్టవా శ్రీకృష్ణా, యదుభూషణాఅని మాకృష్ణుని నుతించాం. ఆపన్నా నీక శరణ్యుడు కృష్ణుడు దిగ్గునలేచి, గేట్లలోయున్న జయ విజయుల రప్పించి సాధుజనముల మనములు సంతసింప సమస్యా పరిష్కారం చేశాడు. కొండంత పాత్రనిర్వహణాభారం తొలిసారిగా తలనెట్టుకొన్న శంకరుడు బాలునికిచ్చినవరం మరచినా నిందాస్పదుడు కాడని, నాటకం దేవుళ్ళకీమాత్రం మరపు పనితొందర్ని సహజమేనని పెనకోపాదుకలో సకల కల్యాణ గుణుడు శ్రీరాముడే రంగస్థల దశరథాజ్ఞానుసారంగా అడవికిపోతో నిజజనకుని గేట్లో మరచిపోతే, ఆ రాముని వాటాఆస్తిని కోప్పిష్టితండ్రి ఒక సెట్టిబలిజాస్త్రీకి వ్రాసేవరకూ వచ్చిందనీ అంచేత శంకరుడు ఫణిసహితంగా పద్యం చదవవచ్చుననినీ, శంకరునే సంహరింప సమకట్టినా, బాలుని వాదం సహేతుకం, సాహసం స్తవనీయం అయిన కారణంగా ఆతడారాత్రి ప్రదర్శించిన వీరకృత్యాలను అభినందిస్తో ఆతణ్ని దీ గ్రేట్ యిండియన్ బాలభాస్కర సమాజ సభ్యునిగా స్వీకరించి తద నూన గౌరవసూచకంగా యీసుముహూర్తంలోనే స్టేజిమీద స్పెషల్ కుర్చీ వేయించి ఆతణ్ని కూర్చోపెట్టి సశేష నాటక ప్రదర్శనంచేస్తామని, అంచేత బాలుడు శంకరుని మెళ్ళో గంతులిడే తన రబ్బరుపామును ఓకంటితో చూచుకొంటో శంకరుని దివ్యనాదపూరితమగు విమల గాంధర్వం వింటో శంకరుడు పద్యం మానేసేసరికి ఆతని మెళ్ళోనుంచి బాలుడు పామును లాగేసుకోవచ్చుననిన్ని తగవుచెప్పాడు. తగవు చెప్పడమైంది అని మేమంతా లేచేసమయంలో దుష్టశిక్షణ, సిష్టరక్షణా సంకల్పంతో అవతరించిన మహాపురుషుడేమో కృష్ణుడు ద్వారపాలురనుద్దేశించి జంగమ

బాలుని తేజ్రాయమైనా పాటింపక, అతడి రాకకు కారణమైనా అరయక ద్వారపాలకాధికార మదోన్మత్తతో చాపల్యానికొడిగట్టిన మీరు శిక్షార్హులుకారు. మీరీక్షణంలోనే పదచ్యుతులయ్యారు. ఆ, యీలా లాకీ హార్మోనిష్టుకు తప్పచెప్పేయండి. అని శాసించాడు. జయవిజయులు మాంధరక్ష, మాంరక్ష అని ఆక్రందనం చేసారు. పశ్చాత్తాపచిత్తులై శ్లాఘించారు. కరుణాసాంద్రుడు, కృష్ణుడు వారల బుజ్జగించి వచ్చే వత్సరంలో మనం ప్రదర్శించబోయే ప్రహ్లాద నాటకంలో మీరు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు కాగలరు. తద్రీతుగా బాలభాస్కర నాటకసమాజం సేవ చేయగలరు, చింతింపకుడు అని వారల గ్రుచ్చిరొత్తేసరికి వారు ధన్యోస్మి ధన్యోస్మి అని సైడుకర్టెనులోనికి పోయారు. ఇక నిరంతరాయంగా పద్యంచదివి మానవకోటిని పరితోష సాగరాంతర్నిమగ్న మానసులను చేయవలసిందని కృష్ణుడు శంకరునికి ప్రణమిల్లాడు.

శంకరుడు ముదితహృదయుడై అమితోత్సాహంగా, స్త్రీలప్రత్యేక స్థలంలో వేచియున్న భార్యవంక క్రీగంటచూపు ప్రసరించి, తాను ప్రపంచానికి ప్రసాదింప ప్రతినబూనిన పద్యరత్నాన్ని అందుకొని ఆలపించాడు. తన కళాసేవాతత్పరతఫలిత ప్రయోజనాన్ని ప్రజలకందిస్తోన్న శుభసమయం. అన్నిబలాలు బాగున్న మహోత్కృష్ట ముహూర్తం యిప్పటికిలభించింది. కళోపాసకుడు యితివృత్తంలో మనసును లగ్నం చేసి తన్మయుడైతేనే, కళకుశోభ. మాశంకరునికి ప్రేక్షకులూ, నటులూ ఎవరూకన్పించటంలేదు. పద్యమేపూనేసింది. కొంటెకుర్రవాడెవడైనా ఎదటికొచ్చిగంతినా, గిల్లిపారిపోయినా, గ్రహించేస్థితిలోలేడు. అంచేత శంకరుని అవయవచాలనమూలంగా వర్షించే మసిమరకలకుబంకి కృష్ణార్జునులు చంకీదుస్తులను లోపలకుపోయి వదలేసి వచ్చికూర్చున్నారని ఎరగడు. శంకరుడు పద్యంమొదలిడినవెంటనే కృష్ణుడు శంకరునిచేతిలోని కూలంతీసి లోనివారికందిచ్చి మనఃస్తిమితం కల్గించుకొన్నట్టూ తెలియదు. పద్యం రెండటిపాదంలోనే రబ్బరుపాము వేలబడితే యమునావిటీషి జాగ్రత్తపెట్టుకొన్నట్టు తెలియదు. విధ్రపాతి[illegible] వి[illegible]

నటుమాత్రం చేసేదేముంది. చూచారా పద్యంవేళకు మాశంకరుడు శూలహస్తుడుకాకుండా, కాకోదరభూషణుడుకాకుండా, వళత్తూనంగ భస్మాంగుడు కాకుండా మావీధిచివర వఱివాడ్రేవారి అబ్బాయిఅయి ఊరుకున్నాడు జిడ్డోడుతో.

పద్యపఠనవిషయం. ఆపద్యం మొదటిమూడుపాదాల్లోను పాదాంత్యమందు తప్పుఅని ఉన్నదల్లా ఒప్పుఅనిన్నీ, ఆఖరిపాదాంత్యమందు "సంధిఒప్పు" అని ఉంటే, ఆ ఒక్కటీ మాత్రం, "సంధితప్పు" అనిన్నీ ఎంతోసుస్పష్టంగా, ఎక్కడా అఖాడాలోకూర్చున్నవాడికైనా అనుమానంలేకుండా చెడామడాచదివేసాడు. కృష్ణార్జునులు ఆఖూనీధరింపలేక ఖిన్నులై తలలువంచారు. పైగా 'ధరగలవారి చూడకరయె తానుమియన్ గయుతప్పు' అన్న పాదంలో తలవంచుకొనికూర్చున్న అర్జునునిభుజంమీద తోమించుకోవలసిన దెబ్బకొట్టాడు. వాడులిక్కిపడి చక్రగతుల్లో ప్రక్కకుతప్పుకొన్నాడు. కృష్ణునితప్పు నిర్ణయించేపాదంలో గయునికి కరచరణాద్యవయవ విశిష్టప్రయోగాలన్నీ చేస్తూ అభినయంపట్టాడు. అవయవచాలన, హస్తముద్రాభినయాలు భంగిమాలు చూపకురానాయినా అని కృష్ణుడు ఒక్కసారి అలమునుగుతోంటే వింటాడా, వినిపించుకొంటాడా. అసలా ఘట్టంలో మనలోఉన్నాడాఏమి, ఏంవినిపించుకోడానికి. తద్రీతుడా, ఒక్కమనిషి స్టేజిమీదఎక్కి ఎంతరసాభాసంచేయడానికి వీలుందో అంతా ఆఒక్కపద్యరూపేణా చేసుకుపోతున్నాడు. ఆపుచేయడం ఏలాగ, ఎవరితరం. మాప్రాంప్టరు ఓఅభస్మారకుడు. చెడ్డకాపురానికి ముప్పేమిటని ఊరుకోవచ్చునా, ఎంతోతాపత్రయపడిపోతో, అందించి అఘోరించిపోతున్నాడు. వాడో తిక్కశంకరాయి, అందియ్యకురానాయినా అంటే అగడు వాడు. మొత్తంమీద మాసాతుసంపత్తులకారాత్రి చేరినపైజనమంతా ఓ మిడిమేళం.

శంకర గానమాధురి-పైనబోర్లించుకొన్న కుండశంక మాతిపెట్టి, అటుచెయ్యిఊపులో ప్రతీపాదాంత్యమందు కేవలంకట్టెలు విరుస్తోన్నట్టు శనకర్రపిడిగాత్రంతో శంకరుడేదో శుద్ధసంకరగాడిద గత్తరరాగసంచా

రంచేస్తోన్నాడు. ఎక్కడా తణుకులో సుతిస్థాయీలతోనిమిత్తంలేకుండా పాట పైడూళ్ళకేసి పోతోందేమో, హార్మోనిస్టు మరిగత్యంతరం కానక, అన్నిమెట్లూకలిపివాక్కినా సుతికుదరక, హరహరా అని చేతులెత్తేసి, తనఅసమర్థతను ప్రకటించి, ఓడిపోయి, వాయించలేక కూర్చునిపోయాడు. పరమేశ్వరుడే తనప్రాణేశ్వరుడైనాడని పొంగిపోతో కూర్చోదగ్గ శంకరునిభార్య ఓదార్చేదిక్కైనా లేకుండా, ఒక్కతి దుఃఖసముద్రంలో మునిగి కూలబడిఉంది. పోనీ ఏవేళకైనా శంకరుడిరాగానికి అంతుంటుందని ఆశించగలమా? ఆదిమధ్యాంతరహితుడే, అందరిలాగా రాగాలాపనకు దొరబడితే, రాగసంచారవిహారాలకు ఆది అంతం, తల తోక, గతులు గమ్యస్థానం ఉంటాయా? అంచేత మాశంకరుడనంతుడు అనంతశక్తితో కంఠంఎత్తి విజృంభిస్తే, అల్పాయుష్కులు మానవులకు సాంతంగా వినుటకెలాసాధ్యం? మరోటి, వెన్నమీగడలుమింగే కృష్ణుని గాత్రంకనకనా, శంకరుడు కంఠంవిప్పితే రైగప్పేది హాలాహలం. జీవితేచ్ఛగలవారెవరు ధరినుండ సాహసింపలేరు. అంచేత కృష్ణుడు శంకరుణ్ని ఆతని పద్యాన్ని ద్వైతవనంలో వదలేసి, అర్జునుణ్నితోడ్కొని లోపలికివచ్చేసి మధురకు పైనమయ్యాడు. అర్జునుడు తీర్థయాత్రకు బయల్దేరి నీళ్ళబిందపైపుకువెళ్ళాడు. మేమెక్కడికివెళ్ళేది, వల్లకాటికి? అదీఅవజ్ఞతే. శంకరుడు స్మశానవాసిటగా. పద్యంతో అక్కడకు తయారైతే! ఒకొక్కక్కడు పద్యంపేరెట్టి అంతక్షోభపెట్టేస్తాడు. అందుకు చెప్పా. ఏలా ఉన్నతెరను అలా దింపేయమని ధర్మజుడు పురమాయించాడు.

యింకా మాకు కష్టాలు గట్టెక్కలేదుస్మండీ. తెరోప్రక్కను దిగులోన్నా. యీలోన ప్రాంప్టరు శంకరుని చెవిలోపెట్టిన రౌద ఘటించిందికాబోలు శంకరుని మనోనేత్రానికి సత్యజ్యోతి గోచరించియుండాలి. తప్పు తెల్సుకున్నాడు కామాలు ఖర్మం, కర్రను పడుతోంటే చాప్పునదాన్ని పడకుండా పట్టుకొని, కర్రెను స్తంభాన్ని బండికాడిలా లాఘవంగా మెడమీద నిల్పుకొని, వృషభారూఢుడు వెక్కిరిస్తోన్నాడేమోనని ప్రేక్షకులు సందియపడంద, ప్రేక్షకులకు చూపి నాలుక

కరమకొని తిరుగా ప్రారంభించాడు ఆ అమూల్యపద్యమావదం. కృష్ణార్జున గయులు స్టేజీమీద లేనందున స్టేజిమీద పాతిఉన్న మూడు పాకస్తంభాలకు అభినయంపట్టాడు. పద్యం పూర్తిచేసాడు. శంకరుడి పద్యంతో ఎక్కడెక్కడ ఏమి ఉత్పాతాలు పుట్టినాయోకాని మా పాక బయటమాత్రం:

" మొనసి కుక్కలు మొరిగెను మోరలెత్తి
నక్కలు వాపోయె, ఖగము లార్తరవములిచ్చె "

అం దసంభవం ఏమీలేదు. వీడి గాత్రం వాటి శృతిపుటాలకెంతో శ్రావ్యంగా ఉండి, వాడి శృతిమీద, అవి అందుకొనియుండాలి. అది సహజం. శంకరునికి తోసింది అరుపేకాని, పట్టు విడుపు ఉండే సంగీతం కాదుగా. చిన్నపుడు చిన్నయ్యసూరి మిత్రలాభంలో సంజీవకుడనే వృషభం అరణ్యం అంతా మారుమ్రోగిపోయేలా అంకెవేసిందని చదివాం. అలా ఒంకేస్తో, భావగ్రహణ అదిలోనే దుర్గ్యంకాబట్టి, తప్పు తెల్సుకొన్నాక చదవడంలో, మరో అఘాయిత్యానికి దారితీసాడు. పాదాల అంత్య మందున్న తప్పు వప్పు అన్న హ్రస్వాలను, సంగీతం వెలుగుగాబోలు తప్పా, వప్పా అంటో కొన్ని పర్యాయములు సుదీర్ఘ అకారసాధనమీద, తప్పో వప్పో అంటో దేవుడో అనే స్త్రీశోకాలాపసాదృశ్యంగా కొన్ని పర్యాయములు మొత్తంమీద ఆ పాదాలను కాకువ్యర్థప్రాయంగా చదివాడు. దాంతో పాదాలన్నిటికి శుద్ధవ్యతిరేకార్థాలు పరిణమిస్తో తప్పులన్ని వప్పులైనాయి. 'సందివప్పు' అన్నదొక్కటీ 'సంధితప్పు'గా అర్థమై ఊరుకొందని వేర చెప్పనక్కరలేదు. మొత్తంమీద పూర్వసంపాదిత పాపసంచయంలా, మాకూ, శంకరునికీ, యీతప్పు తిప్పలు ఆరాత్రి తప్పలేదు. వీడిగోల వినలేక గుట్టుకపడి, దురంతదుఃఖసంతప్తమానసులమై మేం కూర్చుంటే, పద్యం రైటుగా పూర్తిచేసిన్న వెర్రి ఉబలాటంతో ఏలాఉంది ఏలాఉంది అంటో లోనికి ఒక్కపరుగునొచ్చాడు. మాదుర్భర విపద్దశకు కార్యకారణాలు నిజానికి తానే అయినా ఏలాంటి చిదానంద మూర్తియో, తానుమాత్రమీశారీర మానస అనుషంగికవ్యథలను

తగులక, సంతత నిజానందానుభవోత్సాహంతో మా దగ్గరనుంచి హాలులో కురికి, సంశ్లేషసంభాషణలతో అర్ధాంగి నుక్కిరిబిక్కిరిచేసి, అత్యంత సంతోషతరంగితాంతరంగుడై, జాయాసహితుడై, విజయోత్సవ క్రియా రంభుడై, వేషంతోనే, మా అర్ధనారీశ్వరుడు దూరేగుతో యిల్లుచేరాడు. వీధులంట బాలురు ప్రమథగణాల్లా మా శంకరు వెంటబడ్డారు.

ఎంత ఉషారుగా సంధ్యాసమయాత్పూర్వమే, బొజ్జలు నింపుకొని, థియేటరులోకి వచ్చేసిన చంద్రబింబాల్ని 'రాహుకేతుల వతుగా యీ సుభద్రా) శంకరులు పట్టి పెట్టుకున్నార్రా అని హృదయంలో పొంగి పొరలు విషాద తరంగాలను మ్రింగుకొని గుండెను బండగావించుకొని లోలోన క్రుంగి కుమిలిపోతూన్నాము. చంద్రుడువతి బూడిదగుమ్మడి కాయవుతోన్నాడు పాపం. చుక్కలు నేలరాలిన పూలబోలె కళావిహీనము లగుతున్నై. దీపాలు వెలవెలబోతున్నాయి. కాకులు కావు కావు మంటో న్నాయి. పొలాలుపోతూన్న రైతుబిడ్డల కేకలు చెవికందుతున్నాయి. చుట్టుప్రక్కల కలాపు చల్లుకొంటోయున్న ముసలమ్మల నిత్యసరికొట్లాటలు జరుగుతున్నాయి. గయ్యాళీఅత్తలు బద్ధక పుకోడళ్ళ గది తలుపులమీద చీపురుకట్టవాయిద్యం వినిపిస్తున్నారు. యింతదనుక ఎంతో ఆకర్షణీయంగాఉన్న మాపాత్రధారుల కోటాముఖాలకు రంగుమాస్తోంది. పగటిభాగవతుల రూపొస్తోంది. పూసలు దాసరిపూసల పరిణామం పొందుతున్నాయి. మా ముఖ్యుల్లో ఒక్కడికీ ఊపిరీలేదు. మతీలేదు. మంగళం అనుమాయితికి కంఠమా లేవటంలేదు. అతతాయి కానికుడేమో, మంగళం పట్టింపు పెట్టుకున్నాడుకామాలు పోనీ అనుకొన్నాం కాని కొంటెతనం అనుకోలేదు. నారదుని ఒంటెతీగె తాంబురా మెడనేసుకొని నోట మీటుతో చిరుచిరతలుచేతపట్టి, దీపశ్శమ్మాల వతుగా మార్చుండిపోయిన మామట్టూ ప్రదక్షిణపూర్వకంగా ప్రాంతీయ జానపద నృత్యగతుల్లో గంతేస్తో శుద్ధ అమంగళంగా ఏదో తత్వం ప్రారంభించాడు మంగళం మద్దు.

"ఎవరుచేసినఖర్మ వారనుభవింపక తప్పదన్నా
ఏనాటిపాపమో యీరూపునొచ్చింది
నాతప్పు కాదంటె తప్పేది కాదన్నా
వద్దువద్దంటే వదలేది కాదన్నా
బ్రహ్మకైనను ప్రారబ్ధ కర్మఫలమనుభవింపకతీరదన్నా"

నాటకం వేసామని నాన్నగారు, దాన్ని తగలేసామని సోదర సోదరీలు తలవాచేట్లా పెట్టేస్తారన్న భీతిలో, యింటిగుమ్మం తొక్కడానికి ముఖంచెల్లక, కరచరణాలాడక పొకంట తచ్చాడ్తోన్నాం. బ్రహ్మ మానస పుత్రుడు నారదుడు మాయిక్కట్లు బాప సమకట్టి అయితేం, శంకర విజయం నిష్ఫలం అయిపోకుండా సమాజానికి సద్వినియోగం కావలెనని అయితేం వేడిలోనే శంకరుణ్ని వదుపేసి, పట్టేసి, ఏం పురక్కొల్పాడో, శంకర సహితం, "మనమున మోదము గదురగ, లేనగవులు వదన కమలము బొదువన్" మాధర్మజ కృష్ణ సమక్షానికి వచ్చాడు. త్రిలోక సంచారి ఏం వర్తమానం తెచ్చాడో ఏకొంచెం గ్రహించ గలిగిన స్థితిలో లేముకాని, శోకవ్యాకుల చిత్తులకేదో ఉపశమన శుభవర్తమానమే అయి యుండవచ్చునని తోచింది. శంకరనారదు లిద్దరు ఒకరినొకరు చూచుకొంటో నువ్వు చెప్పుఅంటే నువ్వుచెప్పు అనుకొంటోన్నారు. అసలు వాడివి నీవు చెప్పాలిగాని, పైవాడ్ని నేచెపితే బాగుంటుందా అన్నాడు నారదుడు. నాకు సిగ్గేస్తోందిరా అన్నాడు శంకరుడు, పరీక్షఫ్యాసయిన కుర్రాడు స్నేహితుల నాహ్వానింప వచ్చి సిగ్గుపడ్డట్టే. అయితే నువ్వు ఆనేని అటు తిరిగి కళ్ళుమూసుకు నుంచో, విషయం సవిస్తరంగా నే నేకరబెట్టేస్తా నన్నాడు నారదుడు. ఒకడు అనడానికి, యింకొకడు ఏకరబెట్టడానికి అంతగాథ ఏముంటుంది, యింత ఎప్పుడు పెరిగింది, అసలేమిటని పేమాలోచిస్తోన్నాం. మీరందరు మాయింటికి భోజనానికోయి అంటో శంకరుడో కేకేసి, కర్టెను చాటుకు పోయి నుంచున్నాడు. సశేషం నారదుడు చెప్పాడు. మన సామాజిక సభ్యులెవ్వరు యీపూట యిళ్ళకు పోరాదని, శంకరుడు నూతివద్దనే సంస్నాతలమై, అచ్చటే లింగార్చన

చేయవలసి యుండని, అన్నపూర్ణ విశాలాక్షీ మండిగలు గాడిపొయ్యల నెక్కించేసిందని, శాకాలు, పాకాలు, రసాలు, భక్ష్యాలు, భోజ్యాలు, లేహ్యాలు, పానకాలు ఎన్ని రకాల ఓగిరాలో తయారై పోతోన్నాయని, శంకరుని వాకట్లోనుంచుంటే పోపులఘాటు వాకట్లోకి గుబాళించిందని, తనకు నోరూరిందని చెప్పుతో ముందు మమ్మల్ని తడిపాడు. యీవర్ణన వింటో కాసికుడు వళ్ళెరుగడు, పద్యాలు మొదలెట్టాడు.

"అమృత దివ్యాన్నములు నుపహారమిచ్చి
సంఘటించు నశేషోపచారములు"

అంటో పాడుకుంటో అన్నీ నిమిషాల సద్దేసి, మాసమాజసభ్యుల నందరిని ఎక్కడెక్కడయున్నవాళ్ళని కొట్టుకొచ్చాడు. మేంస్నానాలు చేసి వచ్చేసరికి కాసికుడు నడుంకట్టి వడ్డించేస్తో, వేడిఅన్నం కరుళ్ళకు చేయికాల్తోందికాబోలు భోక్తలచేత చేతిమీదనీళ్ళోయించుకుంటూ చెమటలు కార్తో పంక్తులమ్మట అడిపోతున్నాడు. ఆనాడు రాజసూయాధ్వరంలో కృష్ణునికి సభాధిపత్యంయిచ్చి కూర్చోపెట్టినట్టు నేడు కృష్ణునికి పెద్దపీటవేయించారు. శ్రీకృష్ణసమక్షంలో శంకరుని కూర్చోపెట్టారు. జగన్మంగళస్వరూపధరుడు మాకృష్ణుడు వంగపండుఛాయతాపితాకట్టి కూర్చుంటే, నాహృదయం పున్నమినాటి సంద్రంలా ఉత్తుంగతరంగయుతమై పొంగింది. మాధర్మజానికి కాసికుడెక్కడ పద్యం మొదలెట్టాడో అన్న పక్కబెదురు. కాసికుడు ఔచిత్యం పాటించడు. నోటికొచ్చింది పాడేస్తాడు. శౌనకోన్నెహితుని వివాహపువిందులో,

"కాబోలు బ్రహ్మరక్షస్సమూహంబిది,
విగతజీవ బాంధవశ్రేణి పల్లంపు బువ్వంపు బంతిపోగ
చిట్లుచున్నవి కాబోలు చితులలోన్న ఎటుపెఠీలు పెఠీలు
అన్నరవముతో"

అంటో చదివేసరికి మాసమాజం అప్రదిష్టపాలయింది. అంచేత ధర్మజాడు నారదుణ్ని సంభావించి 'పరివాదాస్పదం' అంటో ఆదిరింతి పద్యాలు చదవమన్నాడు. ధర్మజానికి మనసొచ్చినపద్యాలు, శంకర కృష్ణుల

సమక్షాన మాంచిసందర్భశుద్ధికల్గింది, చక్కగా శంకరకృష్ణులను అభినయిస్తూ ఏంతోశ్రావ్యంగా నారదుడు చదివాడు. మహదానంద పరవశులమైనాం. మురవైరి, పురవైరుల నుభయులను తనవితోచూపుతో నాటతోఅందుకొని సురటతో అంత్యంచేసి, రాగమాలగా నారదుడు పాడిన హరిహరాద్వైతసిద్ధాంతపద్యం భోక్తలను తన్మయులనుచేసింది. మేము నాటకప్రదర్శనక్లేశాన్ని మరచినాం.

'పరివాదాస్పద వాదమోద మదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొందరీపొంగఱుంగరు
అభ్రంకషంబైన యూలపోతునితండు త్రుంచినాడీతండు పెంచినాడు
సాధుసమ్మతముగా సామజంబునితండు గాచినాడీతండు ద్రోచినాడు
వరములువడయంగ, శిరములుగెడయంగ, బంక్తికంఠుండు వీరిపాల
గనియె
గేహరక్షనటింప, దేహశిక్షఘటింప బాణాసురుడు వీరిపాలగనియె
చిత్రంబులకు వీరుగలసియుండి
మనుప జెఱుపంగ, జెఱుపంగ మనుపనేర్తు
రెల్లలోకంబులకు దైవమేకమగుట
హరిహరాత్మక మెఱిగితిమనిరి సురలు.'

సిష్టాచారవిధానాల్లో, మాధామ్యులనారికి పీసమెత్తయినా, వారపనికిరాదు. నారదుడు పద్యం పూర్తిచెయ్యగానే, భోజనకాలే, భగవన్నామస్మరణే, నమః పార్వతీపతే, శంభో, మహదేవ అని ధామ్యులు మేఘగర్జనచేసారు. మేమందరం, గోవిందలుకొట్టాం. భోజనాత్పరం, చేతులుకడుక్కొని చక్కారాకుండా, మాధర్మజుడు, హితమధురసత్య సంభాషణామృత రసప్రవాహసందోహంతో శంకరుని మామ్మగారిని, తక్కంగల పెద్దలను, పరమానందహృదయులనుచేసి, సెలవుచ్చుకున్నాడు. అకృత్రిమప్రేమదృక్కులతో శంకరుడు మాకు ఒక్కొక్కరికి వీడ్కోలిచ్చాడు. గడపయిావలయున్న శంకరుని, తలుపుధరినున్న శంకరుని నళినముఖిని ఉద్దేశించి, 'పోయివస్తాద, మనుపమ శోభవసమృద్ధులయ్యేదు

మీకున్' అని నారదుడు దీవిస్తో, కైలాసంనుంచి భూలోకసంచారానికి బయల్దేరినట్టుగానే, మెట్లుదిగివచ్చి కృష్ణుని కలుసుకొన్నాడు. పరదార ధనాదులనుకోరని ప్రఖ్యాతజపాగ్నిహోత్రి పరతంత్రుడు నారదుడు, యీశృంగారసాహిత్యం చిలకకొట్టు, ఎక్కడపట్టాడంటో, కృష్ణుడు నారదుని హేళనచేశాడు. నీవు నేర్పినవిద్యయే నీరజాక్ష. మహానుభావుడవు, ఎవరిని వదలిపెట్టావు. ఓఅప్పుడు నారదుణ్నీ సంసారకూపంలో పడద్రోసి, నారదగర్వభంగం కావించియున్నావుగా, మరిప్తివా' అని మా నూతబిరుదాంకితుడు పురాణంవారి అబ్బాయి, కృష్ణుని కీర్తించాడు.

సర్వేజనాః స్సుఖినోభవంతు.

మాతృశ్రీ తణుకు బోర్డుహైస్కూలుకి జై.



రాయల ముద్రణాలయము, తణుకు. మే 1950.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 3 | There was a Caesar once. | Here was a Caesar; |
| 6 | Baltille | Bastille |
| 16 | వింతనేర్పు | ఎంతనేర్పు |
| 19 | లాఘై | లాఘైతే |
| 20 | చేసారు. పదిహేనురోజుల పాటు | చేసారు పదిహేనురోజులపాటు. |
| 25 | కందలేదు. కాబట్టి | కాబట్టి. |
| 27 | గోళీల | గోరీల |
| 31 | ఫిలిప్‌లా | ఫిలిప్పైలా |
| 33 | peace | piece |
| • | Armur | Armour |
| 34 | పడ్డాడురాఅంటో | పడ్డాడురాఅంటే. |
| 36 | ప్రతిపాదిత్యాలు | ప్రతిభాపాండిత్యాలు. |
| | banishes | banished |
| 37 | యింకేముందిరా తర్వాతా | యింకేముందిరా పర్వతాలూ |
| 43 | చార్జీషైల్ | చార్జీషైర్ |
| 45 | పార్టీకట్టి | పార్టీకట్ట |
| 65 | వేలేసుకొని | వేలేసుకొని. |
| | అపూర్వప్రజ్ఞా | అపూర్వపజ్ఞా |
| 82 | Habits of speech | Habit of speech |
| 95 | చిన్నయ్యగారు | చిన్నయసూరి |
| | సంఘదృష్టి | సంఘదృష్ట్యా. |
| 97 | పిల్లలైపో | పిల్లులైపో |
| 99 | చేయించాలి. | చేయించాలి, |
| | చేయించాలన్నట్లు | చేయించాలన్నట్లు. |
| 100 | విగ్రహామెంత | విగ్రహారెంత |
| 110 | వార్షికంగా | వార్గికంగా |
| 112 | మనవిచేస్తా | మనవిచేసా. |

| | | |
|---|---|---|
| 119 | కొట్టేస్తారు | కొట్టేసారు |
| 132 | Arthamatic | Arithmetic |
| | జీవనంబు | జీవలవంబు |
| 136 | చూపకపోతే | చూపపోతే |
| 141 | A Vote of Thanks of Mr. Yates | A Vote of thanks to Mr. Yates. |
| 151 | ఆరెండు | ఆ రేడు |
| 155 | భారయుద్ధా | భారతయుద్ధా |
| 157 | విగ్రహముయొక్క స్వర్ణారుణ | విగ్రహ స్వర్ణారుణ |
| 163 | Brooker | Brookes |
| | Christs | Christ's |
| 168 | Anticidents | Antecedents. |
| 170 | గిరిపడ్డవాడు | ఎగిరిపడ్తవాడు. |
| 174 | అనుభవిస్తోందాం | అనుభవిస్తోంటాం. |
| 175 | కిరీటి | కిరీట |
| | Enchantrees | ఆ enchantress |
| | అమురిపెపుముక్కు | మురిపెపుముక్కు |
| 176 | కల్గేది ఆయనకు | కల్గేదిఆయనకు. |
| 179 | ఫాట్టునస్టాఫ్ | ఫట్టున స్నాప్ |
| 180 | వుండాలి నారదుని | వుండాలి. నారదుని |
| | బెంబేలుపడ్డారు కాదూ. | బెంబేలుపడ్డారు. కాదూ |
| 184 | యూరోమార్కు ఉంటాయి– | యూరోమార్కులుంటాయి. |
| 186 | విద్యాదర్శం | విద్యాదర్శ |
| | ఎద్దావా | ఎద్దేవా |
| 188 | మేరువురిగినానిశ్చయం | మేరువుదిరిగినా. నిశ్చయం |
| | వాసరములో | వాసరముల్ |
| 189 | సేక | సేయక |
| 190 | నారదునియుక్త | నారదనియుక్త |
| | పరమపుష | పరమపురుష |
| 191 | అర్తహారుడై | ఆర్తిహారుడై |
| | ద్వికేషోన్నతల్ | ద్వికేషోన్నతుల్ |

| | | |
|---|---|---|
| 192 | భళాభళీఅంటారు అన్నాడు కొస్తాడు— | భళాభళీఅంటారు కోస్తాడు అన్నాడు. |
| | కథకు | కథకుడు |
| 193 | P or N or R | P on N on R. |
| 202 | పడేసుకుంటా | పడేసుకుంటాం. |
| 204 | కృతులై— | కృతులైయున్నపుడు. |
| | తొడుక్కొని | తొక్కుకొని |
| 209 | చేసేదేమిటుందర్రా | చేసేదేమిటరోయ్. |
| 210 | శాపాలఅపర | శాపాలాప |
| 214 | తెరకు 9రోజులు | తెరకు 9 రోజులు. |
| 217 | లబ్ధి | లబ్ధం |
| 218 | కుటుంపడియున్న | కుంటుపడియున్న |
| | కళాస్వరూపాన్ని | కళాస్వరూపాన్నే |
| 219 | చిక్కటిపోయి | చిక్కడిపోయి |
| 220 | పులిహోర. ఎందుక్క | పులిహోర ఎందుకూ |
| 221 | గూబగుయ్యిమని | గూబగుయ్యిమంది. |
| | సుఖం | సఖం |
| | చక్కపెట్టికాని | చక్కపెట్టుకొని |
| 235 | gack | Jack |
| 236 | నాటకంలోకి | నాటకంలో |
| 239 | troup | Troupe |
| | joiting | jolting |
| 240 | పిక్వికి యను | పికివికియన్లు |
| | begging | abegging |
| 241 | తేలింది తర్వాతమాటల్లో | తేలిందితర్వాతమాటల్లో. |
| 248 | గూడానికీ | గూడానికి |
| 271 | జ్ఞప్తికివస్తారు | జ్ఞప్తికివస్తాడు. |
| 273 | వినికిల్ని | వినికిలి. |